

# రాయవాచకం-
# భాషా సాహిత్య పరిశీలన

డా॥ కె. రామాంజనేయులు



# రాయవాచకం
# భాషా సాహిత్య పరిశీలన

ఎమ్.ఫిల్ డి పట్టాకోసం
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి సమర్పించిన
సిద్ధాంత వ్యాసం

డా॥ కాపు రామాంజనేయులు

ఫణికృష్ణ పబ్లికేషన్స్
హైదరాబాద్
1993

Rayavachakam-Bhasha Sah ya Par see ana

—Dr K Ramanjaneyu u

---



F Pub hed 1993

Cop e 1000

T e See aav




Pr ce R 150-00



For Cop e

Sm R UMA DEV B A
W/o Dr K Raman aneyu u Ph D
Dep o Lex cography
Te ugu Un ver y
Te ugu Bhav n Hyd 7



P n ed a

Padmava h Ar Pr n ers
1 1 517/B/1 New Baka am
Gandh nagar Hyderabad 380

---

ఈ గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో ముద్రితం

# అంకితం

అతి గారాబంగా పెంచి

ప్రేమానురాగాలు పంచి

అహర్నిశలు నాకై శ్రమించి

చదువు సంస్కారాలు నేర్పించి

నా శ్రేయస్సే పరమావధిగా భావించిన

త్యాగశీలి సౌజన్యమూర్తి

శ్రీ హనుమంతప్ప తాతగారి

దివ్య స్మృతికి

"ఏకం ప్రధానమవలంబ్య గుణై ర్విహీన
మాద్యత్రయంచ జగతీ పరిపాలనాయ
కుర్యన్తురీయ మహిమాది గుణై ర్విహీనో
రాజాస్తి దిక్పతిసమ ఖలు కృష్ణరాజ "

—నంది దుర్గాలయ శాసనమ్



మాతృదేవోభవ

శ్రీమతి కె లక్ష్మీనరసమ్మగారు



పితృదేవోభవ

శ్రీ కె చౌడప్పగారు

# కృతజ్ఞతలు

ప్రస్తుత పరిశోధనా గ్రంథాన్ని సాంతంచూసి అమూల మైన సలహాలను ఇవ్వడమేకాక భాషా దృష్టితో రాయవాచకంపై పరిశోధన చేయమని ప్రోత్సహించి పర్యవేక్షక బాధ్యతను స్వీకరించి ఎం ఫిల్ పట్టా పొందడానికి అవకాశం కల్పించిన గురువర లు ఆచార కోరాడ మహాదేవశాస్త్రి గారికి

రాయవాచక భాషా సాహితాలపై పరిశోధించడానికి అన్ని విధాల సహకరించి పర వేక్షించి పిహెచ్ డి పట్టా పొందడానికి కారకులైన ఆచార్య హెచ్ ఎస్ బ్రహ్మానందగారి

పరిశోధన నిరాటంకంగా కొనసాగడానికి ప్రశాంత వాతావరణం కల్పించిన శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం నాటి ఆంధ్రభారతి అధ్యక్షులకూ తదితర అధ్యాపక వర్గాని

గ్రంథ సంపాదన ed ng లో నాకు కావలసిన మౌలికమైన కన్నడ గ్రంథాలను సమకూర్చి సిద్ధాంత గ్రంథ రూపకల్పనలో సముచితమైన సలహాలనిచ్చి సంపూర్ణ సహకారమందించిన సహృదయ మిత్రులు డా ఆర్ శేషశాస్త్రి కన్నడోపన్యాసకులు గారి

స్పష్టమైన చారిత్రక అవగాహనతో రాయవాచక కృష్ణరాయ విజయ ప్రతాప చరిత్ర గ్రంథాలకు అతి విలువైన పీఠికలు వెలయించి నాలో జిజ్ఞాస పెంచి పరిశోధనలో ఎక్కువ తోడ్పాటు నందించడమే కాక అడిగిన వెంటనే ఆముఖం ప్రాసిపంపిన సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు డా సి వి రామచంద్రరావు నెల్లూరు గారి

విషయసేకరణ నిమిత్తం మద్రాసు వె నపుడు సోదర భావం చూపి తగిన సౌకర్యాలు కల్పించిన డా ఎల్ బి శంకరరావు (ప్రెసిడెన్సీ కాలేజ్ గారికి

రాయవాచక తా పత్ర ప్రతులను కాపి చేసుకోడానికి ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ కు వె నపుడు దయతో అనుమతినిచ్చి కారాలయంలోనే వసతి కల్పించి ఎంతో ఆదరం చూపిన డా ఎస్ దాశరథి క్యురేటర్ అండ్ రిజిష్టరింగ్ ఆఫీసరు గారి

త్వరితగతిన ప శోధనాగ్రంథం సిద్ధం కావడానికి నిండుగుండెతో అండగా నిలిచిన శ్రీ బండ్లపల్లి ఓబుళరెడ్డి అనంతపురం) గారికి

రాయవాచకంలోని అనేక విశేషాంశాలను చర్చించి సరియైన మార్గం చూపించిన శ్రీ నే కృష్ణమూర్తి నెల్లూరు) గారికి

రాయవాచకానికి కన్నడానువాదమైన శ్రీకృష్ణదేవరాయన దినచరి గురించి సమాచారమందించి రాయవాచకంతో తులనాత్మక పరిశీలన చేయడానికి దోహదం చేసిన ఆచార ఎం చిదానందమూర్తి బెంగుళూరు గారికి కీ శే ఆచార్య ఎం వి సీతారామయ్య బి యం శ్రీ స్మారక ప్రతిష్ఠాన్ బెంగుళూరు గారికి

అనేక పనుల్లో తలమునకలై ఉన్నప్పటికి ప్రేమతో అభినందన' వ్రాసి యిచ్చిన జ్ఞానపీఠ పురస్కార గ్రహీత పద్మభూషణ్ డా సి నారాయణరెడ్డి గారికి

ఎంతో అభిమానంతో ప్రశంస వ్రాసి యిచ్చిన సుప్రసిద్ధ జర్నలిస్ట్ డా తిరుమల రామచంద్రగారికి అలాగే ప్రస్తావన వ్రాసియిచ్చిన ఆచార్య హెచ్ ఎస్ బ్రహ్మానందగారికి

విశేషానుభవంతో ముచ్చటగా ముద్రించి యిచ్చిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ  నివాస్ గౌడ్ గారి

ముఖపత్రాన్ని సార్థకంగా చిత్రించి యిచ్చిన కళాతపస్వి శ్రీ శీలా వీర్రాజు గారి

ఇంకా విషయసేకరణలో ఎంతగానో తోడ్పడిన వివిధ గ్రంథాలయ అధికారులకూ మిత్రులకూ అందరికీ

హృదయపూర్వక కృతజ్ఞతలు
కాపు రామాంజనేయులు

# సంకేతాలు

| | |
|---|---|
| అ | అరబిక్ |
| అ తె కో | అచ్చతెనుగుకోశము |
| అను | అనువాదం/అనువాదకుడు |
| ఆం వ వా | ఆంధ్రవచనవాఙ్మయము |
| ఉ | ఉర్దూ |
| ఉదా | ఉదాహరణ |
| ఏ వ | ఏకవచనం |
| క | కన్నడం |
| కాశీ | కాశీఖండం |
| కు ధూ | కుమార ధూర్జటి |
| కు సం | కుమార సంభవము |
| కృ రా వి | కృష్ణరాయవిజయము |
| చూ | చూడుడు |
| త | తమిళం |
| తె భా చ | తెలుగభాషా చరిత్ర |
| తె శా | తెలంగాణా శాసనములు |
| వ | వర్షియన్ |
| పరి | పరిష్కర్త లు |
| పు లు | పుట లు |
| ప్ర ఏ | ప్రథమైకవచనం |
| ప్రా | ప్రాకృతం |
| బ వ | బహువచనం |
| బస | బసవ పురాణం |
| భీమ | భీమ ఖండం |
| మ | మరాఠీ |
| రా వా | రాయవాచకము |
| రా సీ | రాయలసీమ |
| రుక్మాం | రుక్మాంగద చరిత్ర |
| విశ | విశేషణం |
| వ్యావ | వ్యావహారికం |
| శ్రీకృ దే ది చ | శ్రీకృష్ణదేవరాయన దినచరి |
| సం | సంస్కృతం/సంపాదకుడు లు |
| స క్రి | సహాయక క్రియ |
| సంక | సంకలనం |
| సూ | సూత్రం |
| సూ ని | సూర్యరాయాంధ్ర నిఘంటువు |
| హిం | హిందీ |
| | బ్రాకెట్లలోని సంఖ్యలు వరుసగా పుటలను పంక్తులను సూచిస్తాయి |
| > | గుర్తుకు మొనవైపు నున్నది అర్వాచీనం |
| < | మొనవైపుకు వెనకఉన్నది ప్రాచీనం |
| / | దీనికి ఇరువైపుల ఉన్నవి వికల్పంగా వాడుతున్న రూపాలు |
| 0 | లుప్తం |
| + | సంకలనం |
| AES | A on Educa ona Serv ce |
| Cf | Compa a ve orm |
| ed | ed or |
| E G | nd an Ep g aph ca G o sary |
| Op | O man a Papers n L ngu cs |
| P/PP | Page s |
| S | Sou h Ind an n cr p t ons |

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత
పద్మభూషణ్ డా॥ సి. నారాయణరెడ్డి
రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక భాషా సలహాదారు

కళాభవన్
19 2 93

# అభినందన

మన పూర్వీకులకు కావ్య రచనమీద వున్న మక్కువ చరిత్ర రచన మీద లేదు పద్యం పట్ల వున్న ఆకర్షణ వచనం పట్లలేదు అందుకే మన సాహిత్యం లోకి వచన రచనా ప్రక్రియ చాలా ఆలస్యంగా ప్రవేశించింది నిజానికి వచనం పద్యంతో పాటే ప్రాచీన కావ్యాల్లో చోటు చేసుకుంది నన్నయ ఆంధ్ర మహా భారతం మన మొదటి కావ్యం దాంట్లో మొదట వున్న సంస్కృత శ్లోకం మినహాయిస్తే ఆ తరువాత వున్నది వచనమే అయితే సాముదాయికంగా చూస్తే మన ప్రాచీన కావ్యాల్లో వచనం అతి స్వల్పంగా కనిపిస్తూ వుంటుంది ఉన్నది కాస్తా పద సహోదరంగా వుంటుంది

16 వ శతాబ్దిలో అప్పటి వ్యావహారిక వచనంలో వెలువడిన తొలి తెలుగు చరిత్ర గ్రంథం రాయవాచకం దీంట్లోని ప్రధాన వస్తువు శ్రీకృష్ణ దేవరాయ చరిత్ర అయినా అది చరిత్ర పునాదులమీద నిర్మించిన గ్రంథం కాదు ఈ గ్రంథంలో పౌరాణికాంశాలూ జానపద కల్పనలూ చోటు చేసుకున్నాయి రాయవాచక కర్తే అన్నాడు గదా సుజనుల చేత విన్న సూనృత వాక్యాలను వక్కాణిస్తానని

రచనా శిల్పాన్ని పక్కకు పెడితే రాయవాచకం చరిత్ర దృష్ట్యా విలువైన గ్రంథం సమకాలీన సామాజిక జీవనంతోపాటు భాషా ప్రయోగ విశేషాలు ఈ పుస్తకంలో పుష్కలంగా వున్నాయి దీంట్లోని వ్యావహారిక గ్రాంథిక మిశ్రభాష ముచ్చట గొలుపుతూ వుంటుంది నా చిన్ననాటి వరకు మా ప్రాంతాల్లో ఇలాంటి విలక్షణ భాషచే పట్వారీలూ పటేండ్లూ రాస్తుండే వారు

డా॥ రామాంజనేయులు రాయవాచకం మీద లోతైన పరిశీలన చేశాడు రాయవాకంతో కృష్ణరాయ విజయ కావ్యాన్ని కన్నడంలోని "శ్రీకృష్ణదేవ రాయ దినచరి"ని తులనాత్మకంగా పరిశీలించి చర్చించాడు ఈ గ్రంథంలోని భాషా ప్రయోగాలను వర్ణ పద వాక్య అర్థ విభాగాల పరిధిలో విశ్లేషించి చూపాడు తత్సమ తద్భవ దేశ్య అన దేశ్య పదాల స్వరూపాన్ని చాలా స్పష్టంగా విశదీకరించాడు తెలుగు భాషా పరిణామానికి అద్దం పట్టే ఈ గ్రంథాన్ని సాకల్యంగా పరిశీలించి చక్కని గ్రంథంగా రూపొందించిన డా॥ రామాంజనేయులుకు నా అభినందన

నం
సి. నారాయణరెడ్డి

డా సి వి రామచంద్రరావు ఎం ఏ ఎహెచ్ డి
రీడర్ చరిత్ర & రాజనీతి శాస్త్రం "మానస
వి ఆర్ కాలేజ్ 435/4 B పెక్కామిట్ట
నెల్లూరు నెల్లూరు 3

# ఆముఖం

రాయవాచకం ఆంధ్ర సాహిత్యంలో అరుదైన రచన అది చారిత్రక వచన గ్రంథం ప్రాచీన మధ్య యుగ ఆంధ్ర సాహిత్యంలో ఈ ప్రక్రియలో రచించిన గ్రంథాలు వేళ్ళ మీద లెక్కపెట్ట దగినన్ని కూడా లేవు రాయవాచకానికి ముందు ఇట్టి ప్రక్రియలో రచించిన గ్రంథం ఒకే ఒకటి కనబడుతుంది అది ఏకామ్ర నాథుని ప్రతాప రుద్ర చరిత్ర ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో మాత్రమే కాక భారతీయ వాఙ్మయ చరిత్రలోనే చారిత్రక రచన శాస్త్రీయ నిర్వచనానికి సరిపోయే చారిత్రక రచన అంటూ లేకపోయింది నేను మరొక సందర్భంలో చెప్పినట్లు ఖగోళశాస్త్రం మొదలు కామ శాస్త్రం వరకు అన్ని శాస్త్ర సాహిత్య ప్రక్రియలలో మౌలికమూ ప్రామాణికమూ అయిన రచనలు చేసిన భారతీయులు కారణ మేదైనా శాస్త్ర నిబద్ధమయిన ప్రామాణికమైన చారిత్రక రచన చేయలేదు ముస్లిములయిన అరబ్బులు క్రీ శ 712 లో సింధు దండయాత్రలో భారత దేశంలో అడుగు పెట్టేంతవరకు మనం తెలుసుకోగలిగిన ప్రాచీన భారతదేశ చరిత్ర మత వాఙ్మయమైన పురాణాలలో జైన బౌద్ధమత గ్రంథాలలో కవుల కావ్య ఎతికలలో ఇమిడి "గడ్డివామిలో సూది" వలె వెదకి బయటికి తీయవలసిన విషయమైపోయింది శాస్త్రీయ నిర్వచనానికి సరిపోయే చారిత్రక రచన అంటూ లేకపోయింది క్రీ శ పదకొండో శతాబ్దంలో మహావిజేత అయిన మహమ్మద్ ఘజ్నీ వెంట భారతదేశానికి వచ్చి సంస్కృత భాషాపాటవం సంపాదించి భారతీయశాస్త్ర

---

1 నేను సంపాదకుడుగా ఆం ప్ర సాహిత్య అకాడమీ ఏకామ్ర నాథుని "ప్రతాప రుద్ర చరిత్రము" ను 1984 లో ప్రకటించింది పీఠిక పు 1 30లు

సారస్వత గ్రంథాలను సంఘజీవనాన్ని అవలోకనం చేసి భారతీయ విజ్ఞాన సర్వస్వమనదగిన కితాబ్ ఉల్ హింద్" అనే గ్రంథాన్ని రచించిన అల్ బెరూని భారతీయుల చారిత్రక స్పృహ దా ద్ర్యాన్ని గూర్చి ఇట్లా అంటాడు

"The H ndu do not pay much a en on o he h o ca o de o h ng hey a e ve y ca e e n re a ng he ch ono og ca ucce on o h ng and when they a e pre ed or n orma on and are a a o no know ng wha o y hey nva ab y ake o a e e ng" Sachau Tr A be un nd a Vo P 10

ఈ అభిప్రాయానికి మినహాయింపుగా భారతీయ వాఙ్మయంలో రచించిన తొలి చారిత్రక పద కావ ం కల్హణుడు సంస్కృతంలో రచించిన "రాజ తరంగిణి " కల్హణునికి ముందు "చరిత్ర"లనే పేరుతో బాణుని "హర్షచరిత్ర" బిల్హణుని "విక్రమాంకదేవ చరిత్ర" మొ కొన్ని గద కావా లు వెలిశాయి ఈ గద (చారిత్రక కావా లను రచించినవారు ఆ కావ్య నాయకులకు సమ కాలీనులయినప్పటికీ కావ్య నాయకులు సుప్రసిద్ధ చారిత్రక వ క్తులయినప్పటికీ వీటిలో చారిత్రక కథనం అత ల్పం కావ్య కల్పన అనల్పం

కల్హణుని రాజతరంగిణి" తర్వాత చరిత్ర అని అన్నివిధాలా చెప్పుకో దగ్గ గ్రంథమేదీ సంస్కృత భాషలోగాని మరి దేశభాషలలో కాని రాయడం జరుగలేదు ఆధునిక యుగం వరకు చరిత్ర గ్రంథాలు రాయడాని కెవ్వరూ తలపెట్టలేదు కనుక మన పూర్వులకు కారణమేదైనా చారిత్రక స్పృహ దృష్టిలోపించాయనే సతా న్ని ఒప్పుకొన్నప్పుడు సంపూర్ణంగా చరిత్ర నిర్వచనా లక్షణాలకు సరిపడే రచన కాకపోయినా దాని దరిదాపులకు రాగల గ్రంథమేదైనా భారతీయ చరిత్ర రచనాకాశాన్ని ఆవరించిన గాఢాంధకారంలో వెలుగు రేఖై తోస్తుంది యావద్భారత దేశానికి రాజభాష పండిత భాషగా ఉన్న సంస్కృత భాషలోనే చరిత్ర రచన మృగ్యమైనప్పుడు దేశభాషలలో అట్టి ప్రయత్నమేమైనా జరిగి ఉంటే అది చరిత్ర రచనాకాశంలో వెలుగురేఖ గానేకాదు వెలుగు రేడై కూడా వెలయగలదు అట్టి ఒక చరిత్ర రచనా ప్రయ

ద్యాన్ని తెలుగభాషలో తొలిసారిగా చేసి కృతకృతు డయిన ప్రథమాంధ్ర చరిత్రకారుడు ఏకామ్రనాథుడు అతని ప్రయత్న ఫలితమే తొలి తెలుగు చక్రవర్తులు తెలుగు జాతి వెలుగులు అయిన కాకతీయ రాజుల కమనీయ "పుణ్య" చరిత్రగా రూపొందిన ప్రతాప రుద్ర చరిత్ర ద్వితీయ ఆంధ్ర చరిత్రకారుడు తనను తన నామధేయం చేతగాక వదివేచే తెలుపుకొన్న "శ్రీ మన్మహా మండలేశ్వర కా విశ్వనాథనాయనయ్యవారి స్థానాపతి ఇక మీదట "స్థానాపతి" "స్థానాపతి" ప్రయత్న ఫలితమే ఆంధ్రభోజుడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు విజయనగర చక్రవర్తి అయిన కృష్ణ రాయ శేఖరు చరిత ల్ " విజయనగర వృత్తాంతము" "ప్రజలకు దేట వడంగా" రూపొందిన రాయవాచకము

ఏకామ్రనాథుడు స్థానాపతి తమ గ్రంథాలు చదివినందు వల్ల పాఠ కునికి లభించే శృతి ఫలాన్ని పేర్కొన్నారు రాయవాచక కర్త రాయవాచ కాన్ని చదివినందువల్ల విన్నందువల్ల కలిగే శృతి ఫలాన్ని ఇలా తెలిపాడు "యీ రాయవాచకం చదివిన వాల్లకును విన్న వార్లకున్ను బుద్ధి వివేక విచక్షణ ములు గలిగి భాగ్యవంతులై యోగభాలులై ఆ చంద్రార్క స్థాయిగా సుఖాన వుంద్దురు " రాయవాచకాన్ని చదివిన వారు విన్నవారు భాగ్యవంతులు యోగ భాలులు అవుతారో లేదో కాని వారికి చరిత్ర వివేకం భాషా విచక్షణ ఏర్ప డడం మాత్రం తథ్యం

క్రీ శ 16 17 18 శతాబ్దాలలో విజయనగర సామ్రాజ్య క్షీణ యుగంలో నాయక రాజుల కాలంలో దక్షిణాంధ్ర వాఙ్మయంలో కవులు తమ కావ్యాలలో రచనలలో ఔచిత్యాన్ని విస్మరించి శృంగారాన్ని విచ్చల విడిగా వెర్రితలలు వేయించిన కాలంలో విజయనగర సామ్రాజ్యంలోని ద్రావిడ ప్రాంతంలో ప్రవాసాంధ్రుడుగా భావించదగిన "స్థానాపతి" శ్రీకృష్ణదేవరాయల దినచర ను గూర్చి విజయనగర సామ్రాజ్య రాజకీయ ఆర్థిక సామాజిక పరిపాలనా పరిస్థితులను గూర్చి అనేకానేక ఆసక్తికరమైన విషయాలు దక్షి

2 ఏకామ్రనాథుడు రచించిన "ప్రతాప రుద్ర చరిత్ర" "స్థానాపతి" ఎరుకలో ఉన్నట్లు రాయవాచకంలో అంత స్పష్టం ఉంది

ఆంధ్ర భాషలో విన్నపం" లేక "నివేదిక" Report రూపంలో రచించిన రాయవాచకం ఆంధ్ర సాహిత్యంలో నూతన ప్రక్రియగా వెలువడిన అరుదైన గ్రంథమని చెప్పడంలో విప్రతిపత్తి ఉండబోదు 1982 లో నా సంపాదకత్వంలో ఆంధ్ర సాహిత్య అకాడమీ రాయవాచకాన్ని వెలువరించింది దానికి నేను 53 పేజీల సుదీర్ఘమైన పీఠిక రాశాను ఆ పీఠికలో మొదటి వాక్యం "రాయవాచకము చరిత్రకారులకు బంగారు గని భాషావేత్తలకు నిక్షేపం అని"

అట్టి అరుదైన గ్రంథాన్ని వస్తువుగా తీసుకొని యువకుడు ఉత్సాహి జిజ్ఞాసువు భాషావేత్త Lingu అయిన డా కె రామాంజనేయులు సమగ్ర విశ్లేషణా రూపమయిన సిద్ధాంత వ్యాసాన్ని "రాయవాచకం భాషా సాహిత్య పరిశీలన" గా రచించి కృతార్థుడయినాడు ఈ సిద్ధాంత గ్రంథంలో రాయవాచకంలోని భాషను సమగ్రంగా విశ్లేషించి డా రామాంజనేయులు భాషావేత్తల మన్ననకు పాత్రుడయినాడు ఈ భాషా పరిశీలన భాషా శాస్త్రజ్ఞులకు ఉపయోగకరం ఆనందదాయకం అయిన విషయం రాయవాచకంలోని భాషను సమగ్రంగా పరిశీలించడంతో పాటు రాయవాచక రచనా వైశిష్ట్యాన్ని గూర్చి తెలిపినాడు రాయవాచకం నుండి తెలియ వచ్చే విజయనగర సామ్రాజ్య సామాజిక జీవితాన్ని అనేక కోణాల నుంచి పరిశీలించి మనకు చక్కగా ఎరుకపరచినాడు

రాయవాచకం గ్రంథ సంపాదన దృష్టి గ్రంథ పరిష్కరణ అనే అధ్యాయంలో జయంతి రామయ పంతులు 1933లో పరిష్కరించి ప్రచురించిన రాయవాచకంలో నా సంపాదకీయంలో 1982లో ఆంధ్ర సాహిత్య అకాడమీ ప్రచురించిన రాయవాచకంలో గ్రంథ సంపాదనా దృష్టితో చూచినపుడు గ్రంథ సంపాదనా కార కారంలో ఏర్పడిన కొన్ని లోపాలను డా రామాంజనేయులు సమంజసంగా ప్రస్తావించినాడు గ్రంథ పరిష్కరణను గూర్చి గ్రంథ సంపాదనా దృష్టిని గూర్చి ఆమోదయోగ్యములైన అనేక విషయాలు

---

3 అచ్చులో 304 పుటలు ఉన్న ఈ సిద్ధాంత గ్రంథంలో 165 పుటలు (పు 87 252 లు భాషా పరిశీలనకే అంకితమయినాయి

తెలిపినాడు ఈ విషయాలతోపాటు డా రామాంజనేయులు రాయవాచకాన్ని కుమార ధూర్జటి రచించిన కృష్ణరాయ విజయం"తోను రాయవాచకానికి కన్నడ అనువాదమైన "శ్రీకృష్ణదేవరాయనదినచరి తోను తులనాత్మక పరి లన గావించి రాయవాచకంలోని చారిత్రక విశేషాలను భాషను గూర్చిన అవగాహ నను సులభతరం చేసినాడు

ఆంధ్ర సాహిత్య అకాడమీ రాయవాచకాన్ని 1982లో ప్రకటించినా దాని ఎరికను నేను 1980లోనే రాశాను రాయవాచకానికి కన్నడంలో ఒక అనువాదం "శ్రీకృష్ణదేవరాయన దినచరి" అనే పేరుతో ఉన్నట్లు అనాటికి నాకు తెలియదు ఈ విషయాన్ని నా దృష్టికి మొదటగా తెచ్చినవాడు డా రామాంజ నేయులే

దినచరి" తాళపత్ర ప్రతి 1983 లో ఆచార్య ఎం వి సీతారామయ్య ~రి సంపాదకత్వంలో అచ్చయింది అయితే సీతారామయ గారికి 1933 లో మరలా 1982 లో ప్రచురించిన రాయవాచకాన్ని గూర్చి తెలియదు ఇవన్నీ గ్రంథ పరిష్కరణలో సంపాదకత్వంలో కొంత లోపంగానే భావించాలి "శ్రీకృష్ణదేవరాయన దినచరి"ని గూర్చి తెలుగువారికి తెలపడమే గాక దానిని రాయవాచకంతో తులనాత్మకంగా పరిలించి డా రామాంజనేయులు పరిశోధకులకు మిక్కిలి మేలు చేకూర్చినాడు

"స్థానాపతి రచించిన రాయవాచకానికి తర్వాతి కాలంలో కుమార ధూర్జటి "కృష్ణరాయ విజయ" మనే పేరుతో పద్యానువాదాన్ని సంతరించడం అటు తర్వాత "శ్రీకృష్ణ దేవరాయన దినచరి" అనే పేరుతో కన్నడ అనువాదం ఏర్పడడం నాడు రాయవాచకానికి గల ప్రాశస్త్యాన్ని ప్రచారాన్ని వ్యాప్తిని మనకు సూచిస్తాయి ఇట్టి ప్రశస్త చారిత్రక వచన గ్రంథమైన రాయవాచకం మీద సమగ్ర విశ్లేషణ జరిపి డా రామాంజనేయులు ఆంధ్రావళికి మోదం చేకూర్చినాడు

"మహాశివరాత్రి
19 2 1993

సం
—సి వి రామచంద్రరావు

ఆచార్య హెచ్ ఎస్ బ్రహ్మానంద
ఎం ఏ పిహెచ్ డి

ఆంధ్రభారతి
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం 3

28 493 A 7
విజనగర్ కాలని
అనంతపురం 1

# ప్రస్తావన

ఇటీవలి పరిశోధనల్ని గమనిస్తె రాయవాచకంలోని భాషను ఇతర కైఫియత్తులతోనూ శాసన భాషతోనూ పోల్చిచూస్తే ఒక ప్రామాణికత కనిపిస్తుంది ఆచార నాయని కృష్ణకుమారిగారు మెకంజీ కైఫియత్తులలోని భాష నాధారంగా ఈ అంశాన్ని ప్రతిపాదించారు కూడా అందుకే రాయవాచకంలో అనాటి రాయలసీమ మాండలిక పదాలే కాకుండా ఉత్తరాంధ్రకు సంబంధించిన పదాలు కూడా ఉన్నాయి అంతేకాదు తమిళ కన్నడ పదాలతో పాటు కన్నడభాష వాక్య నిర్మాణప్రభావం కూడా కనిపిస్తుంది ఇంకా పర్షో అరబిక్ పదాలు హిందీ ఉర్దూ పదాలు ఎక్కువగా చోటు చేసుకున్నాయి పత్రికలద్వారా ఈనాడు వ్యాపించిన ప్రామాణిక శైలిలాంటిది అనాడు కూడా ఒకటి ఏర్పడ్డదని రాయవాచకంలోని భాష నిరూపిస్తుంది ఆ శైలి ఈనాటికి రెవిన్యూ శాఖలోనూ రిజిస్ట్రేషన్ శాఖలోనూ ఠిక్కాలం దార్లు వాడుతూనే వున్నారు దీన్ని Ru a S anda d o m అని మనం పిలిచినా తప్పేమీలేదు

రాయవాచకం చరిత్ర పరిశోధకులకు చాలా ముఖ్యమైన ఆధారం ఈ విషయాన్ని పూర్వ పరిశోధకులందరూ గుర్తించారు ఇటీవల విద్యారణ్యుల చరిత్రకోసం రాయవాచకం చదువుతుండగా విజయనగర స్థాపన శాలివాహనశకం 1127 క్రి శ 120 లో జరిగింది అని ఒక కొత్త విషయం తెలిసింది రాయవాచకం పేర్కొన్న ప్రభవ చైత్ర పౌర్ణమి క్రి శ 1202 కాని లేదా 1262 కాని కావాలి తప్పా 36 కావడానికి వీలులేదని పంచాంగ పరిగణనం ఆధారంగా శ్రీ విష్ణుభొట్ల రామచంద్రగారు చెప్పిన వాక్యాలు నన్ను ఆకర్షించాయి చూ విజయనగర చరిత్రలో అప్రస్తుతాంశాలు భారతి జనవరి 988 25 29

తర్వాత దినచరితో పోల్చిచూస్తే విదా నగర స్థాపన సంవత్సరం శాలివాహన శకం 1125 క్రి శ 1203 అని తెలిసింది క్రి శ 1565 లో విజయనగర పతనం జరిగిందని చరిత్ర చెబుతున్నది రాయవాచకంలో ఇక మున్నూట అరవై సంవత్సరాలు సామ్రాజ్యం ఉంటుందని చెప్పినందువల్ల

రాయవాచక మూలరూపం క్రీ శ 1505 ప్రాంతంలో పుట్టిందని ఒక ప్రతిపాదన నేను చేశాను చూ విద్యారణ్యుల ఐతిహ్యం విద్యారణ్యభారతి వ్యాస సంకలనం 1990 4 15

రాయవాచకాన్ని దినచరితో పోల్చి చూసిన రామాంజనేయులు కూడా రాయలకు సమకాలికమైన ఒక ముసాయిదా కైఫియత్తులలోనే ఉండి ఉండాలి (చూ పు 85 అని ప్రతిపాదించాడు ఈ విషయాన్ని భవిష్యత్తులో ఇంకా స్పష్టంగా నిరూపించాల్సిన అవసరం వుంది రాయవాచకంలోని ఐతిహ్యాలను జానపదాంశాలను వేరుచేసి అందులో గర్భీకృతమైన చరిత్రను వెలికి తీయటం కూడా ఈనాడు అవసరంగా కనిపిస్తున్నది

రాయవాచకానికి అనువాదంగా శ్రీకృష్ణదేవరాయన దినచరి పుట్టడాన్ని గమనిస్తే ఆనాడు విజయనగర ప్రాంతంలో ద్విభాషా వ్యవహారం పండితుల స్థాయిలో ఎలా ఉండేదో తెలుస్తుంది అందుకే ముక్కుతిమ్మన మాదయ్యగారి మల్లన లు దినచరిని రాశారని చెప్పిన దినచరి సంపాదకుల మాటను మనం తోసివేయాల్సిన అవసరంలేదు ఆ దినచరి ఏ కాలంనాటి ప్రతి దొరికిందో మనకు తెలియడం లేదు కాశీ విశ్వనాథ నాయనయ గారి స్థానపతి పేరు ఇంతవరకూ తెలియలేదు ఆనాడు చరిత్రను My h తో కలిపే చూసే వారనటానికి రాయవాచకమే ప్రబలమైన నిదర్శనం

రాయవాచకం ఒక సంకలన గ్రంథంగా రూపొందింది అందులో ఆనాటి రాజనీతి గ్రంథాల నుండి స్మృతి శ్రుతులనుంచి చాలా పదా లు శ్లోకాలు ఉద్ధరింపబడ్డాయి అందువల్ల రాయవాచకం భాషా సాహిత్య చరిత్ర జానపదాంశా లన్నిటి కోసం విడివిడిగా చదవదగింది భాషా సాహిత్యాంశాలను డా రామాంజనేయులు ఈ పరిశోధనా గ్రంథంలో చాలా స్పష్టంగా చర్చించాడు ముఖ్యంగా నిర్మాణంలో కన్నడ ప్రభావాన్ని గురించి చెప్పినచోట్ల ఆసక్తిని కలిగిస్తాయి చూ పు 80 గ్రంథ సంపాదన దృష్టి అనే అధ్యాయంలో పరిష్కరణ విషయాలు మిక్కిలి ప్రశంసనీయాలు

డా రామాంజనేయులు రచించిన గ్రంథాన్ని పాఠకలోకం బాగా ఆదరిస్తుందనే విశ్వాసం వుంది

12 3 1993
అనంతపురం

సం
హెచ్ ఎస్ బ్రహ్మానంద

డా॥ తిరుమల రామచంద్ర
గాంధీనగర్ హైదరాబాదు 380

# ప్రశంస

రాయవాచకాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కోసం పరిష్కరించిన డాక్టర్ సి వి రామచంద్రరావు గారు దాని ఎరికలో "రాయవాచకం చరిత్రకారులకు బంగారు గని భాషావేత్తలకు వజ్రాల ఖని" అన్నారు రాయ వాచకం తెలుగులో మొట్టమొదటి పొలిటికల్ రిపోర్ట్" విజానికి మొట్టమొదటి రిపోర్ట్ గనుక నేటి పత్రికా రచయితలకూ కొంగు బంగారమని నేను భావిస్తున్నాను

మహామహోపాధ్యాయ బిరుదాంచితులు పత్రికలలో సంపాదకీయ" మనే రచనా సంప్రదాయాన్ని తొలిసారిగా ప్రవర్తింపజేసినవారూ అయిన కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు "ఆంధ్ర భాషా సంజీవని" పత్రికలో రిపోర్టర్‌కు ఉండవలసినవని చెప్పిన లక్షణాలు

"అదినే లేఖనీయాంశంబు సత్యంబు
ప్రమాణంబుగా జను నెరుంగ
సంగ్రహముగ వ్రాయ సమకట్టవలయు సం
తట వ్రాత దగు విశదముగనుండ
విషయ విన్యాసంబు విస్పష్టముగ నుండ
వలయు సందర్భార్థములు క్రమముగ
నొవ్వనాడగ గూడ దెవ్వరినేనియు
దబ్బర పొగడికల్ దగదు వ్రాయ
వాస్తవంబైన వ్రాతలే వలయుదెలుప"

ఉన్నీ ఈ రాయవాచక రచయితకు ఉన్నాయని నా విశ్వాసం దీనికి కన్నడంలో అనుకరణలూ తెలుగులో కృష్ణరాయ విజయం అనే కావ్య రూపం వెలిశాయంటే దీని ప్రాశస్త్య ప్రాచుర్యాలు స్పష్టమవుతాయి నేడూ పత్రికలలో ప్రచురితమయిన వార్తలు ఆధారంగా కథలు నవలలు నాటి కాలు కావ్యాలు పుడుతుండడం మనకు విదితమే

ఈ రాయవాచకాన్ని యువమిత్రులు డా రామాంజనేయులు గారు సిద్ధాంత వ్యాసానికి విషయంగా గ్రహించి శాస్త్రీయంగా పరిశోధన జరిపి సిద్ధాంత వా సాన్ని సంపన్నం చేయడం నాకెంతో సంతోషం కలిగించింది

ఈ సిద్ధాంత గ్రంథంలో 1 రాయవాచకం కర్తృత్వం దేశకాలాలు 2) రాయవాచకం సంకలన విధానం 3 రాయవాచకం రచనా వైశిష్ట్యం 4 రాయవాచకం కన్నడ శ్రీకృష్ణదేవరాయ దినచరి తులనాత్మక పరిశీలన 5 భాషా వ లన కన్నడ భాషా ప్రభావం 6 గ్రంథ సంపాదన దృష్టి 7 అనుబంధం మొ న ప్రకరణలు ఉన్నాయి వీటిలో భాషా పరిశీలన చాల పెద్దది

వ్యవహార భాషకు పట్టంకట్టిన దక్షిణాంధ్రదేశంవారు రాయవాచకం రచయిత శా విశ్వనాథనాయనయ్య వారి స్థానాపతి స్థానాపతి అంటే సమా చార శాఖాధిపతి ఉద్భారణకూ వ్రాతకూ సాన్నిహిత్యం సంపూర్ణంగా సాధించిన శైలికి దక్షిణాంధ్రం దన్నాలకోట అలాటి సహజ సుందర శైలి లోనే ఈ రిపోర్టంతా కొనసాగింది

డా॥ రామాంజనేయులుగారి పరిశోధన ప్రవణత సత్యైకపరాయణత నిశిత నిర్ణయ దృష్టి ఈ గ్రంథం ప్రతి ప్రకరణంలోను స్పష్టమవుతాయి ఈ యువ పరిశోధకుని నుంచి ఇంకా ఎన్నో మరెన్నో పరిశోధన గ్రంథాలు వెలువడాలని ఆశిస్తూ వెలువడుతాయని విశ్వసిస్తున్నాను

శ్రీముఖ ఉగాది
24 3 93

భాషా సేవకుడు
సం
తిరుమల రామచంద్ర

# ప్రవేశిక

తెలుగు సాహిత్యంలో క్రీశ 16వ శతాబ్దంలో వెలువడిన మొట్టమొదటి చారిత్రక వచన గ్రంథం ఏకామ్రనాథుని "ప్రతాప రుద్ర చరిత్ర" ఇది అచ్చటి గ్రాంథిక భాషలో ఉంది దీని తర్వాత సిద్ధేశ్వర చరిత్ర సోమ దేవ రాజీయం అనే పద్య కావ్యాలు వెలిశాయి ఆ తర్వాత అనాది వ్యావ హారిక భాషలో వెలువడిన గ్రంథమే రాయవాచకం ఇది విశ్వనాథ నాయకుని స్థానాపతిచే రచింపబడింది రాయవాచకంలో "స్థానాపతి" శ్రీకృష్ణదేవరాయల దినచర్యలను పరిపాలనా విశేషాలను మాత్రమే కాక విజయనగర వృత్తాంతం విద్యారణ్యుల ప్రాశస్త్యం అనాటి రాజకీయ ఆర్థిక సామాజిక సాంస్కృతిక విశేషాలు మొదలైన అంశాలనెన్నిటినో "నివేదిక" report రూపంలో పొందు పరిచారు అక్కడక్కడ సందర్భానుసారంగా పద్యాలను శ్లోకాలను ఉద్ధ రించారు చారిత్రకాంశాలకు ఉపపోషకంగా కొన్ని పౌరాణిక అంశాలన జానపద కల్పనలను కూడా కూర్చారు కాబట్టి రాయవాచకం వచన రచనా ప్రక్రియలో ఒక విశిష్టతను సంతరించుకుంది

రాయవాచకంలోని ఇతివృత్తాన్ని స్వీకరించి కుమార ధూర్జటి కృష్ణ రాయ విజయ మనే పద్య కావ్యాన్ని ప్రబంధ రూపంలో రచించాడు అంతేకాక రాయవాచకం శ్రీ కృష్ణదేవరాయన దినచరి అనే పేరుతో కన్నడ భాషలోకి కూడా అనువదింపబడటం వల్ల రాయవాచక వైశిష్ట్య మేమిటో అర్థమవుతుంది ఇంకా అనాడు తెలుగు కన్నడ భాషలకున్న అవినాభావ సంబంధం కూడా బోధపడుతుంది

రాయవాచక భాషమీద అందులోని చారిత్రకాంశాల మీద పరిశోధకులు తమ దృష్టిని ప్రసరింపజేసి వారి వారి మార్గాలలో కృషి సలిపి ఎన్నో గ్రంథా లను రచించారు అయినప్పటికి అవి రాయవాచకం యొక్క సమగ్రతను నిరూపించలేకపోయాయి కాబట్టి ఆ లక్ష్య సిద్ధికై చేసిన ప్రయత్నమే ప్రస్తుత పరిశోధనా గ్రంథం

పరిశోధనకు ఉపక్రమించే ముందు అంతవరకు జరిగినకృషి నేపథ్యంలో కొన్ని ప్రశ్నలు ఉదయించాయి అవి

1 రాయవాచక కర్త పేరు ఎందుకు తెలియడం లేదు
2. రాయవాచకం సాహిత్య ప్రకారమా ?
3 రాయవాచకం మూలపాఠమేది?
4 కుమార ధూర్జటి కృష్ణరాయ విజయ కావ్యానికి మూలమేది?
5 శ్రీకృష్ణదేవరాయలు కన్నడ ప్రభువు కూడా కాగా తెలుగులోనే రాయవాచకం ఎందుకు ఉంది? కన్నడ భాషలో దీనికి సమానమైన రచనలు లేవా?
6 రాయవాచక శైలి విశిష్టత ఏమిటి?

ఇలాంటి ప్రశ్నలతో పరిశోధనారంగంలో అడుగుపెట్టి వాటికి దొరికినంతవరకు సమాధానాలు సమకూర్చే ప్రయత్నం చేశాను

రాయవాచకం ఒక కైఫీయతు అంటే స్థానిక చరిత్ర పరంపరాగతంగా వచ్చిన ఐతిహాలు సమకాలీన సామాజిక జీవితం పాలక పాలిత చరిత్ర కలగాపులగంగా కలిసిపోయిన ఒకనాటి చరిత్ర రాయవాచకం దీన్ని ఎవరో ఒక కవి లేదా పండితుడు కవిత్వం లాగా అల్లాడని చెప్పడానికి అవకాశం లేదు రాయవాచకం ఒక తరం కథ కాదు అది మూడు తరాల కథ ఒకటి విద్యారణ్యుల తరం కథ రెండు శ్రీకృష్ణదేవరాయలకు ముందు పాలించిన వీరనరసింహ రాయలతరం కథ మూడు శ్రీకృష్ణదేవరాయల తరం కథ రాయవాచకంలో ఒకచోట భవిష త్కథను చెప్పినట్టుగా ఉండగా మరోచోట "గనుక స్వామివారికి యీ వరకు నడుచు సమాచారములకు వ్రాశి అంప్పించ్చినారు తర్వాత నడుచు సమాచారములకు వెబ్బండిగా విన్నవించ్చి అంవ్పుతున్నాను" రా వా పు 80 అని ఉంటటం ఎవరికైనా తికమక పట్టిస్తుంది దీని ఆధారంగా కొందరు రాయవాచకం ఎప్పుడో క్రి శ 16 వ శతాబ్దం చివర వ్రాయబడిందని భూతకాలిక విషయాలను భవిష్యత్తులో జరుగబోయేవిగా చెప్పే సంప్రదాయం మ^కుందని ఊహ చేశారు చూ ని వి రామచంద్రరావు రాయ వాచకము ఎరిక కాని ఈ ఊహ కన్నడ శ్రీ కృష్ణదేవరాయన దినచరిని చూసిన తర్వాత సరికాదేమోనని అనిపించింది కన్నడంలో కూడా రాయ

---

ప్రకారమా ప్రక్రియా

వాచకంలోని ఇతివృత్తమే ఉంది కాని రాయవాచక ప్రతిరూపం యథాతథ రూపం) మాత్రంకాదు కొన్నిచోట్ల తేడాలు కనిపిస్తాయి అలాగే కృష్ణరాయ విజయం కూడా యథాతథంగా రాయవాచకాన్ని అనుసరించింది కాదు దీన్ని బట్టి మనం రాయవాచకానికి ఇప్పుడు దొరుకుతున్న పాఠం Tex కంటె భిన్నమైనవి దినచరికారుడు కుమార ధూర్జటి అనుసరించి ఉండాలని భావించడంలో తప్పులేదు కవిగా కుమార ధూర్జటి మార్చుకున్నా దినచరికారుడు మార్చుకోవలసిన అవసరంలేదు

రాయవాచకంలో సాహిత్య కృతికి ఉండవలసిన లక్షణాల కంటె కైఫియతు లక్షణాలే ఎక్కువగా ఉన్నాయి అంటే విశ్వనాథనాయకుని స్థానాపతి ఈ రూపంలో సంకలనం చేయడానికి ముందే ఆయా కథలు రాజాస్థానంలో ఎప్పటికప్పుడు రాయసం వారిచేత రికార్డు అవుతూ ఉండేవని అర్థం అందుకే స్థానాపతి తన పేరు చెప్పుకోవడం ప్రధానమని అనుకోలేదు ఈ విధంగా గ్రంథంలో పేరు పెట్టుకోకపోవడం బఖైరు లేదా నామా సంప్రదాయం

ఈ పరిశోధనకు ఈ అవగాహనను మౌలికంగా గ్రహించి ముందు వేసుకున్న ప్రశ్నలకు సమాధానాలు సమకూర్చాను

రాయవాచకంలోని శైలి అందరికీ చాల ఇష్టమైన అంశం ఆ విశిష్టతను పరిశోధకులు మెచ్చుకున్నా విశ్లేషించడానికి చేసిన ప్రయత్నం మాత్రం సంతృప్తికరంగా లేదు కొందరు ఈ భాషను ఆనాటి తమిళ దేశంలోని తెలుగు వ వహార మన్నారు చూ జయంతి రామయ్య పంతులు సం రాయవాచకం పీఠిక మ కొందరు ఆనాటి ఔద్యోగిక భాష అన్నారు చూ నేలటూరు వెంకటరమణయ్య గారి వా సం భారతి 1954 ఫిబ్రవరి రాయవాచక పాఠాన్ని గిడుగువారు వ్యావహారిక భాషా పరిణామం కోసం గద్య చింతామణిలో ఉదాహరించుకొంటే విశ్వనాథవారు కావ్యభాషా పరిణామం కోసం గద్య చంద్రికలో ఉదాహరించుకొన్నారు

దీన్నిబట్టి చూస్తే రాయవాచకంలోని భాష గ్రాంథికమా? వ్యావహారికమా? లేదా మాండలికమా? అన్న ప్రశ్నలు పుడుతాయి కైఫియతుల్లోని భాషను గమనిస్తే అందులో గ్రాంథిక వ్యావహారికాల మిశ్రమం కనిపిస్తుంది వస్తువును బట్టి భాషా శైలి ఎప్పటికప్పుడు బఖైరులలో మారిపోతూ ఉంటుంది కావ్యంలో లాగా రచయిత వ్యక్తిత్వం దృక్పథం శైలిని నిర్దేశించవు అందుకే బఖైరు రచయిత తాను అదృశ్యమై సమకాలీన ప్రజల సజీవ భాషను

యథాతథంగా రికార్డు చేస్తారు అనాటి పండితుల శిష్ట భాషలో ఐతిహాసిక కావ భాషా ప్రభావం ఎంత నిబిడంగా ఉందో రాయవాచకంలోని పద్యాలు వర్ణనలు వచనం నిరూపిస్తాయి అంచేత ఈ మొత్తం కలిపి అనాటి వ్యావహారిక భాష అనాటి ఉద్యోగుల భాషకూడా అదే అంతేకాని తమిళదేశంలోని తెలుగువారి వ్యవహారమనడం సబబుకాదు ఇంకా స్పష్టంగా చెప్పాలంటే రాయవాచకంలోని శైలే నిన్నమొన్నటిదాకా యావదాంధ్రంలోను శిష్టవర్గాలలో లౌకిక వ్యవహారాల కోసం వాడుతూ ఉండిన శైలి

ఈ విధంగా రాయవాచకాన్ని భాషా సాహిత్య దృష్టితో పరిశీలించాను సమాన సౌందర్యంకోసం భాషాసాహిత్య పరిశీలన అని పేర్కొన్నా విషయ ప్రాధాన్యత దృష్ట్యా సాహిత్యాంశాలనే ముందు ప్రస్తావించి తర్వాత భాషాంశాలను విశ్లేషించాను

ఈ గ్రంథంలో మూడోభాగం రాయవాచక పరిష్కృత పాఠాన్ని తయారు చేయడానికి గ్రంథ సంపాదన శాస్త్ర నేపథ్యాన్ని వివరిస్తుంది గ్రంథ విస్తరణ భయంతో రాయవాచక పరిష్కృత పాఠాన్ని ఈ గ్రంథంతోపాటు పొందుపరచలేకపోయాను

రాయవాచకంలో వచ్చే కొన్ని పదాలకు అర్థ వివరణ ఇస్తే బాగుంటుం దన్న దృష్టితో ముఖ్య పదవివరణ ఇస్తూ దీంతోపాటు రాయవాచకంలో సూచించబడిన రాజోద్యోగాలు కూడా అనుబంధంగా చేర్చాను అలాగే రాయవాచక కర్త స్థానాపతి ఎవరి ఆస్థానంలోఉండేవాడో తెలియజెప్పడానికి మధుర నాయకరాజుల వంశవృక్షాన్ని చివరి అనుబంధంగా కూర్చాను

చారిత్రకాంశాల్లో ఎంత వాసినా తరిగిపోని లక్షణం ఏదో ఒకటి ఉంది దీనికి కారణం చరిత్ర అంటే ఏమిటి? అన్న ప్రశ్నకు మానవుడి మేధ ఇంకా కొత్త కొత్త సమాధానాలను వెతుకుతూనే ఉండటం అందువల్ల భాషాసాహిత్యాలకు మాత్రమే పరిమితం చేసుకొని ఈ పరిశోధన గ్రంథాన్ని రూపొందించాను

"ప్రమాణ సిద్ధాన్త విరుద్ధమత్ర
యత్కించిదుక్తం మతిమాంద్య దోషాత్
మాత్సర్యముత్సార్య తదార్య చిత్తా
ప్రసాద మాధాయ విశోధయన్తు"

కాపు రామాంజనేయులు

# విషయ సూచిక



## సాహిత్య పరిశీలన

### రాయవాచకం



## భాషా పరిశీలన



## గ్రంథ పరిష్కరణ



## అనుబంధం

# రాయవాచకం – కర్తృత్వం దేశకాలాలు

రాయవాచకం విశ్వనాథ నాయకుని స్థానాపతిచే రచింపబడింది కాని ఇతని పేరు గ్రంథంలో ఎక్కడా ప్రకటితం కాలేదు కథా ప్రారంభంలో మాత్రం "మహారాజరాజశ్రీ కాశీవిశ్వనాథనాయనయ్యవారి దివ్యశ్రీ పాదపద్మ ములకు దేవరవారి స్థానాపతి భక్తపరాధీనుండు సద్వినయ భయభక్తులనున్న కాయంగల విన్నపం అని పదవిచేత ప్రకటించుకొన్నాడు స్థానాపతి అంటే Fore gn Secre ary అని సత నాథ అయ్యర్‌గారు Agen a the Cour [3] అని జయంతి రామయ్య పంతులు గారు Po ca Agen [4] అని సి వి రామచంద్రరావుగారు పేర్కొన్నారు ఆ కాలంలో ప్రతి రాజ్యం లోను ఈ స్థానాపతులుండేవారు ఒక రాజ్యంవారు రాజకీయ విశేషాలను తెలుసుకోడానికి తమ స్థానాపతులను ఇరుగు పొరుగు రాజ్యాలలో నియమించే వారు విజయనగరంలో ఆయా రాజుల సామంతుల అమర నాయకుల స్థానా పతులు అనేకమంది ఉండేవారు అలాగే గజపతి రాజ్యంలో కర్నాటకం వారి స్థానాపతి కమలనాభయ్య తదితర స్థానాపతులు అనేకమంది ఉన్నట్లు రా వా పేర్కొంటుంది [5] మధుర పాలకుడయిన కాశీ విశ్వనాథ నాయనయ్య వారి తరపున విజయనగరంలో ఉన్న స్థానాపతి తన ప్రభువుకు వ్రాసి పంపిన నివేదిక ఈ రాయవాచకం

1 రాయవాచకము పు 2

2 Sa yana ha A yar R H ory of he Nayaks of Madura P 180

3 రామయ్య పంతులు జయంతి(సం) రాయవాచకము In reduct on P 2

4 రామచంద్రరావు సి వి రాయవాచక రచనాకాలము దాని చారిత్రకత భారతి ఏప్రిల్ 1983 పు 33

5 రాయవాచకము పు 68 49లు

రా వా రచయిత విశ్వనాథ నాయనయ్య వారి స్థానాపతి అని చెప్పుకొన్నందువల్ల ఈ విశ్వనాథ నాయకుడెవరో ఇతని కాలమేదో నిర్ణయించగలిగితే రా వా రచయిత కాలం రా వా రచనాకాలం నిర్ణయించి చెప్పడం సాధ్యం

జయంతి రామయ పంతులుగారు రాయవాచకం 1933 ఆంగ్లపీఠికలో Th Ka V wana hanayanayya s no doub he ame as V wana hanayaka the r o he Na k K ngs o Madhura" అని పేర్కొన్నారు

జయంతిగారు పేర్కొన్న విశ్వనాథనాయకుడు కొటికం నాగమనాయని పుత్రుడు ఇతని గురించి లోకంలో ప్రచారం పొందిన కథ ఇలా ఉంది శ్రీకృష్ణదేవరాయల 1509 1530 చివరి యేండ్లలో తంజావూరును పాలిస్తున్న వీరశేఖరచోళుడు మదుర రాజ్య పాలకుడైన చంద్రశేఖరపాండు నిపై దండెత్తి మదుర రాజ్యాన్ని ఆక్రమించుకొన్నాడు అప్పుడు చంద్రశేఖరపాండు డు రాయల వద్దకు వచ్చి తన రాజ్యాన్ని తనకు ఇప్పించవలసిందిగా ప్రాధేయపడ్డాడు రాయలు వీరశేఖరచోళుని దండించి పాండ్యునికి రాజ్య మిప్పించి రమ్మని నాగమనాయకుని ఆదేశించాడు నాగమనాయకుడు సర్వ సైన్యాలతో బయలుదేరి వెళ్ళి వీరశేఖరచోళుని తరిమి మదుర రాజ్యాన్ని కైవసం చేసుకొని రాయల ఆదేశం ప్రకారం ఆ రాజ్యాన్ని చంద్రశేఖరపాండ్యున కప్పగించక తానే చక్రవర్తిగా ప్రకటించుకొని రాయలకు ఎదురు తిరిగాడు రాయలు నిండుసభలో నాగమ నాయకుని శిక్షించగల సమర్థు డెవరు? అని ప్రశ్నించగా విశ్వనాథనాయకుడు లేచి రాయల అనుమతి గైకొని తన తండ్రిపై దండెత్తి అతనిని బంధించి తెచ్చి రాయల ఎదుట నిలబెట్టాడు రాయలు విశ్వనాథ నాయకుని అనన్య సామాన మైన ప్రభుభక్తికి మెచ్చి నాగమనాయకుని క్షమించి విశ్వనాథనాయకుని మదుర రాజధానిగా పాండ్య చోళ రాజ్యాలకు అధిపతిని

6 రామయ్య పంతులు జయంతి సం రాయవాచకము n roduc on P 2

చేశాడు ఈ వృత్తాంతం మనకు తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర లో కని ఎస్తుంది 7

ఈ వృత్తాంతం ప్రకారం విశ్వనాథనాయకుడు శ్రీకృష్ణదేవరాయల కాలంలో చివరి యేండ్లలో మదుర రాజ్యపాలకుడైనట్లు తెలుస్తుంది ఇతడే మదుర నాయక రాజ స్థాపకుడుగా మూలపురుషుడుగా ఎలువబడ్డాడు ఇతడు క్రీ శ 1560 దాకా పదవిలో ఉన్నట్లు శాసనాలనుబట్టి తెలుస్తుంది ఇతడే రా వా లో పేర్కొన్న విశ్వనాథనాయకుడని భావించి ఆనూరి రంగస్వామి సరస్వతి 8 యస్ కృష్ణస్వామి అయ ంగార్ అరుణకుమారి 0 మొదలైన వారు కొందరు రా వా న్ని విశ్వనాథనాయకుని స్థానాపతి 16 వ శతాబ్దం పూర్వార్ధంలో కృష్ణరాయల చివరికాలంలో వ్రాసి ఉండవచ్చని అభిప్రాయపడ్డారు కొందరు 16 వ శతాబ్దం ఉత్తరార్ధంలో వ్రాశాడని భావించారు

నేలటూరు వెంకటరమణయ్య గారు మొదట్లో శ్రీకృష్ణదేవరాయల కాలంలోనో చివరి ఏండ్లలో అచ్యుతదేవరాయల కాలంలోనో రా వా రచింపబడిందని అభిప్రాయపడి తర్వాత శాసనాలను చారిత్రక రచనలను సాహిత్య గ్రంథాలను బాగా అధ యనం చేసి ఆ అభిప్రాయాన్ని మార్చుకొన్నారు విశ్వనాథనాయకుడు శ్రీ కృష్ణదేవరాయల కాలంలో అడపం తాంబూల కరండ వాహకుడు గా మాత్రమే ఉండేవాడని ఆ తర్వాత అచ్యుత రాయల కాలంలో అమరనాయకుడుగా ఉన్నాడని అతనికి మహా మండలేశ్వరాది బిరు

---

7 Kr hnaswamy Ayanga Sou ce o V ayanagar H ory 1919 P 327

8 Kr hna Swam Ayangar Source of V ayanagar H ory 1919 P

9 రాయవాచకము Foreword P 2

10 అరుణ కుమారి బి ఆంధ్రవాఙ్మయమున చారిత్రక కావ్యములు పు 165

11 కులశేఖరరావు ఎమ్ ఆంధ్రవచన వాఙ్మయము పు 509 510లు.?1

దములు లేవని మధురనాయక రాజ్యం కృష్ణదేవరాయల కాలంలోగాని అచ్యుత దేవరాయల కాలంలోగాని విశ్వనాథనాయకుడు స్థాపించలేదని అది రక్కస తంగడి యుద్ధం క్రీ శ 1565 తర్వాత సదాశివరాయల కాలం క్రీ శ 1542 1576 లో అప్పటి అల్లకల్లోల పరిస్థితులను అదనుగా తీసుకొని అప్పటివరకు అమరనాయకుడుగా ఉన్న విశ్వనాథ నాయకుని కుమారుడు కృష్ణప్ప క్రీ శ 1564 1570 స్థాపించాడని నిర్ధారించారు [2] అంతేగాక రా వా లో పేర్కొన్న కాశీ విశ్వనాథినాయనయ్య మధురనాయక రాజ స్థాపకుడుగా తలచబడే నాగమనాయకుని పుత్రుడు విశ్వనాథనాయకుడు కాదని నిరూపించి రా వా గ్రంథకర్త మధురరాజ్య స్థాపకుడైన విశ్వనాథ నాయకుని స్థానాపతియుగాడు పదునారవ శతాబ్దమునందీ గ్రంథము వ్రాయబడనులే దని తీర్మానించారు [3]

సి వి రామచంద్రరావుగారు వెంకటరమణయ గారి అభిప్రాయాన్ని సమర్థించారు [4] వీరు రా వా లోని అంతస్సాక్షులు n e na ev den ces ఆధారంగా రా వా కాలాన్ని తీర్మానించారు వీరు క్రోడీకరించిన అంతస్సాక్షులు ఇలా ఉన్నాయి

1 రా వా కర్త అందలి విషయాలను తాను స్వయంగా చూసి వ్రాసినవి కావు సుజనులచే విని వ్రాసినట్లు అవతారికా పద్యంలో సూచించాడు [5] దీన్నిబట్టి ఇతడు శ్రీ కృష్ణదేవరాయల సమకాలికుడు కాదని స్పష్టమవుతుంది ఇతడు ఇతరులచేత విని వ్రాయడంచేత రా వా లో కాలవ్యతిరిక్తమయిన విషయాలు చోటుచేసుకొన్నాయి

---

12 Venka aramanayya N S ud e n he h rd Dyna y of V ayanagar PP 239 241

13 వెంకటరమణయ్య నేలటూరు మధుర తంజావూరు నాయకరాజుల నాటి ఆంధ్రవాఙ్మయము భారతి ఫిబ్రవరి 1954 పు 148

14 రామచంద్రరావు సి వి రాయవాచక రచనాకాలము దాని చారిత్రకత భారతి ఏప్రిల్ 1983 పు 34

15 రాయవాచకము అవతారికాపద్యం 1

2 రా వా లో సంకుసాల నృసింహకవి విరచిత కవికర్ణ రసాయనము నుండి ఐదు పద్యాలు ఉద్ధరించబడినవి సాహిత్య చరిత్రకారులు కవికర్ణ రసాయనము శ్రీ కృష్ణదేవరాయల అనంతరం - శ 1540) రచితమైనదిగా అభిప్రాయపడ్డారు కాబట్టి రా వా ఆ తర్వాతనే రచింపబడి ఉండాలి

3 రా వా బాహుబలేంద్ర ముకుంద గజపతిని కృష్ణరాయల సమకాలికుడుగా పేర్కొంటుంది కాని శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఉన్న వాడు ప్రతాపరుద్ర గజపతి క్రీ శ 1497 1538 బాహు బలేంద్ర గజపతి క్రీ శ 1560 నుండి క్రీ శ 1568 దాకా కళింగోత్కళాలను పరిపాలించాడు 7

4 విద్యారణ్యులు విద్యానగరానికి "శాలివాహన శకాబ్దములు లెక్క ౧౧౨౭ యేండ్లు వెయ్యింనూట యిరువై ఏడేండ్లమీద చెల్లే ప్రభవ నామ సంవత్సరం చైత్రశుద్ధ పౌర్ణమి స్థిరవారం శుభయోగ శుభ కరణములు గూడిన శుభ ముహూర్తమందు ముహూర్తముజేసి కృష్ణ పక్షం అమావాస్యనాటి రాత్రి నిశి సమయమందు శంకుస్థాపన చేసినట్లు రా వా చెప్తుంది 8 అంతేగాక వీరనృసింహరాయల కాలంనాటికి ఇరవైతొమ్మిది మంది రాజులు మున్నూరేండ్లు పాలించారని ఇంక అరవైయేండ్లు పట్టణమున్ను సింహాసనమున్ను నిలిచి యుండును" అని కూడా తెలుపుతుంది రా వా కర్త చెప్పిన శాలివాహన శక సంవత్సరానికి సరి అయిన క్రీస్తు సంవత్సరం 1127 + 78 = 1205 ఆదారశ్యం వీర నరసింహ రాయల కాలం నాటికి మున్నూరుయేండ్లు అయినట్లు రా వా పేర్కొంటుంది అనగా క్రీ శ

---

16 రాయవాచకము పు 62 71 లు

17 ముకుంద బాహుబలేంద్ర గజపతి తెలుగు శాసనం క్రీ శ 1560 ఏప్రిల్ 10

18 రాయవాచకము పు 10 7 12

19 పైదే పు 11 3 6

1205 + 300 = 1505 ఇది సం॥ కృష్ణరాయలకు ముందు పాలించిన అతని అన్న వీర నరసింహరాయలు పట్టాభిషిక్తుడైన కాలానికి సరిపోతుంది ఆ తర్వాత అరవై యేండ్లు అనగా క్రీ శ 1505 + 60 = 1565 దాకా పట్టణమున్ను సింహాసనమున్ను నిలిచియుండు" నని రా వా భవిష త్తును చెప్పింది ఇది రక్కస తంగడి యుద్ధం జరిగి విజయనగరం విధ్వంసమైన సంవత్సరం

చరిత్రకారులు విద్యానగర స్థాపన క్రీ శ 1336 లో జరిగిందని అంగీకరించారు రా వా 130 యేండ్ల తేడాతో చెప్పినా అప్పటి నుండి వీర నరసింహరాయల కాలానికి క్రీ శ 1505 1509 ఆ తర్వాత విజయనగరం విధ్వం మైన కాలానికి (క్రీ శ 1565 రా వా కర్త చెప్పిన కాలం లెక్కింపు సరిపోతుంది

5 రా వా లో ప్రతాపరుద్రుని వృత్తాంతం చెప్పబడింది[20] దీనిని ఇతడు 16 వ శతాబ్దం పూర్వార్ధంలో ఏకామ్రనాథుడు వ్రాసిన ప్రతాప చరిత్ర నుండి తీసుకొన్నాడు అలాగే 16 వ శతాబ్దం మధ్య కాలంలో రచించినట్లు చెప్పబడుతున్న సభాపతి వచనము నుండి రా వా కర్త చాలభాగం ఉద్ధృతమొనర్చాడు[2] ఈ రెంటిని చూసే రా వా కర్త వ్రాశాడు కాబట్టి రా వా ఆ తర్వాత రచితమై ఉంటుందని చెప్పవచ్చు

6 రా వా లో రాయలవారు వేగర్లను పంపించిన పట్టణాల జాబితాలో చెన్నపట్టణం మైసూరు పేర్కొనబడ్డాయి[2] అలాగే భాగానగరం కూడా పేర్కొనబడింది కాని ఇది క్రీ శ 1590 తర్వాత ఏర్పడినట్లు చరిత్రకారుల నిర్ణయం[4]

---

20 రాయవాచకము పు 45 46 లు

21 పైదే పు 13 15 లు

22 పు 21 9 & 17

23 పు 40 20

24 రామచంద్ర రావు సి వి రాయ వాచక రచనా కాలము దాని చారిత్రకత భారతి ఏప్రిల్ 1983 పుట 35

7 రా వా అనేకమంది చారిత్రక వ్యక్తులను పేర్కొంటుంది వీరిలో రాజా జగదేవుడు మట్ల అనంతరాజు వెలగోటి యాచమనాయుడు సాళువ మేకరాజు చెవ్వప్పనాయుడు కృష్ణప్పనాయుడు అయ్యనమలక రాయల తర్వాత ప్రసిద్ధి చెందిన వ్యక్తులు 5 వీరితో పాటు కొటికం విశ్వనాథనాయకుని కూడా కృష్ణరాయల దళనాయకులలో ఒకడుగా రా వా పేర్కొంటుంది 6 ఇతనిని మహామండలేశ్వరుడనిగాని మధుర రాజ్యపాలకుడని గాని ఎక్కడా చెప్పలేదు కాబట్టి విశ్వనాథ నాయకులు వేర్వేరు వ్యక్తులని చెప్పవచ్చు

ఈ పై ఉపపత్తులను బట్టి నేలటూరు వెంకటరమణయ్యగారు సి వి రామచంద్రరావు గారు రా వా లో పేర్కొన్న మహామండలేశ్వర విశ్వనాథ నాయనయ్యను క్రీ శ 1595 మొదలు 1602 దాకా మదురను పాలించిన రెండవ కృష్ణప్ప తమ్మునిగా భావించి రా వా రచయిత ఇతని స్థానాపతి అని రా వా ఈ కాలంలో వ్రాయబడిందని నిర్ణయించారు

రా వా నికి కన్నడానువాదమూ కావ్యానువాదమూ అయిన శ్రీకృష్ణ దేవరాయన దినచరి కృష్ణరాయ విజయాలలో మైసూరు బాగానగర ప్రసక్తులు లేవు కాబట్టి మూల రా వా ని అనంతర కాలంలో వచ్చిన ప్రతులలో ఈ అంశాలు ప్రక్షిప్తాలైనా కావచ్చు ఇంకా రా వా ప్రతులు భిన్న భిన్న సంప్రదాయాలకు చెందినవి దొరికేదాకా రా వా కాలాన్ని ఇదమిత్థంగా నిర్ణయించలేం కాని శ్రీకృష్ణదేవరాయన దినచరి కృష్ణరాయ విజయాలకంటె ముందు రచితమైందని మాత్రం నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు శ్రీకృష్ణదేరాయన దినచరి కృష్ణరాయ విజయాలు క్రీ శ 17 18 శతాబ్దాల్లో రచితమైనవని వాటి సంపాదకుల నిర్ణయాన్ని[2] బట్టి రా వా క్రీ శ 16 17 శతాబ్దాల్లో రచితమైందని మాత్రమే నిర్ధరింపవచ్చు రా వా లో వాడిన అన్యదేశ్యాలు కూడా ఈ అభిప్రాయాన్ని బలపరుస్తాయి

---

25 రాయవాచకము పు 36 37లు

26 పైదె పుట 44

27 కృష్ణరాయ విజయము ఎరిక xx శ్రీకృష్ణరాయన దినచరి ప్రస్తావనె xx

# రాయవాచకం – సంకలన విధానం

రాయవాచకంలో ప్రధాన వస్తువు శ్రీకృష్ణదేవరాయల చరిత్ర ఈ రాయల కథను చెప్పడానికి రాయవాచక కర్త ఆ కథతో సంబంధమున్న ఇతర చిన్న చిన్న కథలను సంకలనం చేశాడు వివిధ కథలను ప్రధాన కథతో అనుసంధించడంలో రచయిత నేర్పు ప్రదర్శితమవుతుంది ప్రధాన కథ చుట్టు ఇతర కథలు చోటు చేసుకోడానికి కొన్ని కారణాలుంటాయి ఆ కారణాలు తెలుసుకోవడం ఎంతైనా అవసరం

భారతీయ సాహిత్యాన్ని పరిశీలిస్తే పూర్వం మనవాళ్ళు వాఙ్మయాన్ని వేదాలు ఉపనిషత్తులు పురాణాలు ధర్మశాస్త్రాలు మొదలైనవిగా విభజించారు వేదాలు అపౌరుషేయాలు తక్కినవి మహాఋషుల రచనలు సాహిత్యంలో పురాణాలకు చరిత్రకు ఉన్న సూక్ష్మభేదాలను గమనిస్తే పురాణాలు జరిగిన సంఘటనలను వివరిస్తూ వచ్చినా చరిత్రలు కాలేదు అవి దేవతా మాహాత్మ్యాలకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చాయి చరిత్ర అనేది మాత్రం గతించిపోయిన సంఘటనలను నిరూపించే కథనంగా భావించబడింది కాల క్రమంలో చారిత్రక పురుషులు దైవాంశ సంభూతులనే కల్పన చరిత్రలోకి చొచ్చుకొని పోయింది అంతేగాక చారిత్రక వ్యక్తులు దైవస్వరూపులే అని కూడ భారతీయులు భావించారు వీరు చరిత్రను కాలక్రమంలో జరిగిన సంఘటనలుగా చూడక జీవనమౌల్యాలుగా గుర్తించారు కాబట్టి అవి చరిత్రలు కాక జీవనమౌల్యాలను ప్రతిబింబించే ఉత్తమ గ్రంథాలయినాయి ఇలా అనేకమంది వ్రాసినా ఒక్కొక్కటి ఒక్కొక్క దృష్టితో పునస్సృష్టి అయాయి మనవాళు చూసిన చారిత్రకదృష్టి ఇలాంటిది

---

చూ సీతాయాశ్చరితం మహత్ రామాయణం బాలకాండ ప్రారంభం

ఇతిహాసికులు ఇతిహాసమనియు భారతం ఆదిపర్వ ప్రారంభం

రాయవాచకం సంకలన విధానం

పురాణ యుగం తర్వాత రాజుల చరిత్రలను వ్రాసే సంప్రదాయం ఒకటి ఏర్పడింది సంస్కృతంలో కల్హణుని రాజతరంగిణి బిల్హణుని విక్రమాంకదేవ చరిత్ర తెలుగులో ప్రతాప చరిత్ర రాయవాచకం కన్నడంలో కంఠీరవ నరసరాజు విజయం కుమార రామన సాంగత్యం మొ వి ఈ కృతులన్నిటిని పరిశీలిస్తే ఇవి ఆయా రాజుల పరాక్రమాలను పరిపాలనను గుణగణాలను కీర్తించేవిగా మాత్రమే ఉన్నాయి ఇక్కడ జరిగిన సంఘటనలు కాలక్రమంలో ఉండవు

సాహిత్యంలో మరొక సంప్రదాయం కూడా చోటు చేసుకుంది అదేమిటంటే చారిత్రక వ్యక్తులను పురాణ వ్యక్తులతో పోల్చి ప్రశంసించడం ఈ విధమైన ప్రయత్నం తెలుగు కన్నడ భాషలు రెండింటిలోను జరిగింది బహుశ మిగతా భాషల్లోకూడా ఈ సం ప్రదాయం ఉండవచ్చు తెలుగులో యయాతి చరిత్ర కన్నడంలో విక్రమార్జున విజయం గదాయుద్ధం భువనైక రామాభ్యుదయం మొ వి ఇందుకు ప్రబల నిదర్శనాలు ఇక్కడ మనవారిదృష్టి చరిత్రకంటె జీవన మౌల్యాలైన వీరం ధర్మం మొదలైన వాటిపై ఎక్కువగా ప్రసరించింది

మహమ్మదీయుల ప్రభావంతో మన భాషల్లో చరిత్ర రచనలో కొంత మార్పు వచ్చింది ఫలితంగా నామా బఖైరులాంటి రచనలు వెలువడ్డాయి ఆంగ్లేయులు దేశ చరిత్రను వ్రాయడానికి ఇక్కడ ప్రచారంలో ఉన్న మౌఖిక సంప్రదాయంలోని ఐతిహ్యలను రికార్డు చేశారు వీటిని ఎత్తి వ్రాసిన వారు గ్రామ కరణాలు వీరు తమ రచనలో సమకాలీన పరిపాలనా భాషనే గ్రహించారు చారిత్రక దాఖలాల్లో ప్రాదేశికమైన ఐతిహ్యాలు నమ్మకాలు సంప్రదాయాలు అనుకరణలు ఎన్నో చోటు చేసుకున్నాయి వీటిలో సమాచార సామగ్రి ఉన్నా అవి చరిత్రలుగా పరిగణింపబడలేదు

---

2 చారిత్రక వ్యక్తియైన మహమ్మదీయ ప్రభువు అమీన్‌ఖాన్‌ను పురాణ పురుషుడైన యయాతితో పోల్చి పొన్నికంటి తెలగనార్యుడు క్రీ శ 16 వ శతాబ్దంలో యయాతి చరిత్ర ను ప్రబంధంగా రచించాడు

పాశ్చాత్యుల ప్రభావంతో మనకు చరిత్ర అనే ఒక రచనారీతి ప్రక్రియ ప్రారంభమైంది ఇందులో రాజుల రాజవంశాల చరిత్రలు చెప్ప బడ్డాయి ఈ శతాబ్దారంభంలో చరిత్ర అంటే రాజవంశం వారి వివరాలు పరిపాలన మొ న అంశాలే కాక సామాజిక ఆర్థిక సాంస్కృతిక విషయాలను కూడా అధ్యయనం చేయడం జరిగింది

ఈ నేపథ ంతో రా వా న్ని అధ యనం చేస్తే రా వా చరిత్ర దృష్టితో మూల సామగ్రిని అందించే గ్రంథం అయితే కావచ్చుగాని పూర్తిగా చారిత్రక కృతిమాత్రం కాదు రా వా లో వాస్తవిక విషయాలు అనేకం ఉన్నా వాటితో పాటు పౌరాణిక ప్రసక్తులు జానపద కల్పనలు కూడా ఉన్నాయి మనవారి దృష్టిలో చరిత్ర అంటే కేవలం విషయం కాదు అందులో సాహిత్య ధర్మాలైన అతిశయోక్తులు ఉత్ప్రేక్షలు కల్పనలు మొ॥న అంశాలు కూడా అంతర్భాగాలై ఉంటాయి కాబట్టి రా వా లో కూడా ఇలాంటి గుణాలుండడం అసంగతం కాదు

రా వా కర్త కేవలం సమాచార కర్త కథకుడు మాత్రమేకాదు ఇతనికి సమకాలీన రాజకీయాలతోను సాహిత ంతోను బాగా పరిచయం ఉంది ఇతడు సామాజిక పరిస్థితులను విశ ంచి చెప్పడానికి చారిత్రక సంఘటనల నడుమ కార కారణ సంబంధాన్ని కల్పించే ప్రయత్నం చేశాడు జరిగిన సంఘటనలను ఒకదానితో ఒకటి దండగా కూర్చాడు సమాజంలో చరిత్రకు సంబంధించిన వాస్తవాలు కల్తీలేకుండా ఎప్పుడూ అందవు వ్యక్తికి వ్యక్తికి మధ అవి పరి వర్తనం చెందుతూ వుంటాయి అలాంటప్పుడు సేకరణకర్త విషయాలను ఎన్నుకోవడంలో జాగ్రత్త వహించవలసి ఉంటుంది ఇక్కడ రా వా కర్త సుజనులచేత విన్న సూనృతవాకా లను వక్కాణిస్తానన్నాడు ఆ సూనృత వాకా లను ఒక క్రమంలో చేర్చి ప్రజలకు తేటపడేటట్టు వివరించాడు

రా వా కర్త తాను చెప్పదలచుకొన్నది శ్రీకృష్ణదేవరాయల చరిత్రే అయినా అతనికి పూర్వులైన వీరనృసింహరాయల దినచర్యలతో ప్రారంభించి విద్యానగర చరిత్రను కూడా అనుషంగికంగా వివరించాడు ఈ సందర్భంలోనే విద్యారణ్యుల సన్యాస జీవితం శింగిరిభట్ల వృత్తాంతం వ్యాస వృత్తాంతం చెప్పబడ్డాయి స్థల మాహాత్మ్యం చెప్పడానికి వాలి సుగ్రీవుల వృత్తాంతం

మతంగముని శాపం ప్రవేశపెట్టబడ్డాయి ఆ తర్వాత శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకం మొదలుకొని అతని దినచర్యలు పరిపాలన యుద్ధాలు తీర్థ యాత్రా విశేషాలు వివరించబడ్డాయి రాయలకు మంత్రులు రాజనీతి బోధించే టప్పుడు పరీక్షిత్తు ధర్మ దేవతల సంవాద ఘట్టం ధర్మపాలన కోసం దృష్టాంతంగా చెప్పబడింది రా వా లో ప్రతాపరుద్రుని వృత్తాంతం ప్రక్షిప్తంగా భాసిస్తుంది గజపతికి విరోధులు విషప్రయోగం చేయించిన ఘట్టం ఇతరత్ర ఎక్కడా కనిపించదు బహుశా ఇది అప్పటికి బాగా ప్రచారంలో ఉన్న జన శ్రుతి అయి ఉండవచ్చు ఈవిధంగా రా వా కర్త జనశ్రుతులను పౌరాణిక వృత్తాంతాలను చారిత్రక ఇతివృత్తమైన శ్రీకృష్ణదేవరాయల చరిత్రతో అను సంధించి ఆనాటి భాషలో తనదే అయిన ఒక విశిష్టమైన శైలిలో సంకలనం చేశాడు

చరిత్ర నిర్మాణంలో సత్యనిరూపితం కాని జనోక్తులెన్నో చోటుచేసు కుంటాయి గతించిన సంఘటనలు ఆధారంగా ఇవి వెలుగులోనికి వస్తాయి చారిత్రకుని నేపథ్యం ఆధారంగా అవి చారిత్రకాంశాలవుతాయి కొన్ని జాన పదాంశాలను చారిత్రక సూత్రాలాధారంగా కొట్టిపారవేయవచ్చు అందుకే హంస పాలను నీటిని వేరుచేసినట్లు చారిత్రకుడు కూడా జానపదాంశాలను చరిత్రను వేరుచేసే నైపుణ్యం కలవాడై ఉండాలి

పురాణాలతో బాగా పరిచయమున్నవాడు చరిత్రను చరిత్రగా చెప్పలేడు రమణీయంగా రసవంతంగా వ్రాయదలుస్తాడు

రా వా లో అనేక పద్యాలు శ్లోకాలు వివిధ గ్రంథాలనుండి ఉద్ధరింప బడ్డాయి రా వా కర్త వాటిని సందర్భానుసారంగా పేర్కొనడంలో తనకు గల సంకలన పాండిత్యాన్ని ప్రదరించుకొన్నాడు

చారిత్రక గ్రంథాల్లో ఎక్కడా మనకు మధ్య మధ్య పద్యాలుగాని శ్లోకాలుగాని కనిపించవు అలాంటిది మనకు రా వా లో అనేక పద్యాలు శ్లోకాలు కనిపిస్తున్నాయంటే రా వా కర్త ప్రజాశికే pan వేరని చెప్ప వచ్చు మీదుమిక్కిలి రా వా కర్త స్వయంగా పద్యాలు వ్రాసేంత పాండిత్యం ఉన్నవాడు రా వా నికి ముందున్న అవతారికాపద్యాలు రా వా కర్త స్వయంగా సృష్టించినవే

రా వా ముఖ్యంగా రాజైనవాడెలా ఉండాలనే విషయాన్ని బోధిస్తుంది అంతేకాక రాచమరా దల మంత్రులు నడుచుకొనే తీరు మొ న విషయాలను కూడా బోధిస్తుంది రాజును విష్ణువు అంశగా భావించారు సింహాసనాధిపతి అనంగా విష్ణు అంశగాని యితరంగాదు అది యేలాగంటేను నరాణాంచ నరాధిప" అని భగవద్వాక ం ఉన్నది [3] ఇక్కడ భగవద్వాక్యం" అంటే భగవద్గీతా వాక్యం మనవారు రాజును దైవాంశగా భావించేవారు[4] ఆ విధం గానే రా వా కర్తకూడా భావించడమే కాక ఆ విషయాన్ని సార్వకాలిక సార్వ జనీన సత ంగా చెప్పారు రాజు అంటే సభాపతి ఆ సభాపతి లక్షణాలను రా వా కర్త సభాపతి వచనము అనే గ్రంథం నుండి సేకరించి ఈ క్రింది విధంగా పేర్కొంటారు

క తరుణుండై నవరత్నా
తరణుండై గంధ పుష్ప పరిమళయుతు డై
నరనాయక పరివృతు డై
వర గినవా దమరు నిట సభాపతి యన గన్

క శ్రీరము డు విజయుండును
ధీరోదాత్తుండు సుగుణతేజోనిధియై
యారయ సింహాసనమున
నారూఢుండగుట యొప్పు నాసభ నడుమన్

ఈ పద్యాలు సభాపతి వచనము లో ఈ క్రమంలోలేవు రా వా కర్త ఔచిత్యాన్ని గుర్తించి మార్చినట్లు కనిపిస్తుంది రా వా లో పై పదా ల తర్వాత సప్త సంఖా త్మకమైన రాజనీతులతో ప్రారంభించబడింది కాని సభాపతి వచనము లో ఈ విధంగా లేదు త్రిసంఖ్యతో ప్రారంభించబడి

---

3 రాయవాచకము పు 13 భగవద్గీత విభూతియోగం శ్లోకం 27

4 రాజా ప్రత్యక్షదేవతా అనే భావన భారతీయుల్లోఉంది రాజు ఏ ధర్మా నికి చెందినవాడై ఉంటాడో ఆ ధర్మం యొక్క అధిపతి అయిన దేవుని అంశగా భావించినట్లు తెలుస్తుంది ఇక్కడ శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవుడైనందువల్ల విష్ణువు అంశగా చెప్పడం జరిగింది

వరుసగ రాజనీతులు చెప్పబడ్డాయి రా వా కర్త సప్త సంఖ్య ను శుభసూచకంగా భావించినట్లు తెలుస్తుంది [5] రా వా లో సభాపతి వచనంలోని అనేక విషయాలు విడిచిపెట్టాడు అదనంగా కొన్నిటిని చేర్చాడు

రా వా లో మొట్టమొదట రాజ సప్తాంగాలు ఉచిత సప్తాంగాలు సప్తో పాయాలు గురించి చెప్పి సప్త వ సనాలు రాజకుండకూడదని భారత పద్యాన్ని ఉద్ధరించాడు [6] తర్వాత సప్త సంతానాలు సభా సప్తాంగాలు సప్త ధాతువులు సప్త సాగరాలు సప్త ద్వీపాలు సప్త కులగిరులు సప్త మహాఋషీశ్వరులు సప్త త్యాగాలు చెప్పి పదునాలుగు రాజదోషాలను వివరించి ఆ తర్వాత త్రిసంఖ్య తో ప్రారంభించి రాజనీతుల్ని వివరించాడు

రాజుకు న్యాయభండారం సం భాండాగారమ్ అవసరమని చెప్పి

నా యము ప్రజ పెక్కువకు ను
పాయము ప్రజకలిమి సిరికుపాయంబగుటన్
న్యాయము భండారము నర
నాయకులకు సంద్రు కీర్తి నారాయణుడా" అనే నీతి పద్యం ఉద్ధరిం

చడం జరిగింది ఇది బద్దెన నీతిశాస్త్రము లోనిది

రాజు సాధువులైన వారిని సాధు జంతువులను బాధించే వారిని శిక్షించ కుండా వదాకుచేస్తే నిర్లక్ష్యం చేస్తే రాజధర్మత్వమూ ఐశ్వర్యమూ చేసిన పుణ్య మూ పోతుందని చెప్పే సందర్భంలో ఈ క్రింది పద్య ం చెప్పబడింది

క  సాధువులగు జంతువులకు
బాధలు కల్పించు ఖలుల భంజింపని రా
జాధము నాయు స్వర్గ
శ్రీధనములు విడిచిపోవు సిద్ధము తల్లీ

---

5 మన పురాణాల్లో కూడా ఏడు అనే సంఖ్య శుభసూచకంగా భావించ బడింది ఉత్సవాలను ఏడు రోజులు (సప్తాహం) జరుపుకోడం వివాహ సందర్భాల్లో వధూవరులను ఏడు అడుగులు నడిపించడం వెంకటేశ్వర స్వామి ఏడుకొండలలో అధివసించడం మొ వన్నీ శుభసూచకాలే

6 ఉద్యోగపర్వం I 44

ఈ పద్యం భారతంలోని పరీక్షిత్తు ధర్మదేవతల సంవాద ఘట్టంలోనిది పరీక్షిన్మహారాజు ప్రజలకు ధనధాన్యాదులను అపరిమితంగా సమకూర్చి వారికి తస్కరుల వలన మృత్యువు వలన అనావృష్టి దోషం వలన భయం లేకుండా రామరాజ్యం వలె నడిపించాడని అవిధంగానే శ్రీకృష్ణదేవరాయలు కూడా ధర్మ పరిపాలన చేయాలని మంత్రులు ఉపదేశించారు

రాయలు పట్టాభిషిక్తుడైన తర్వాత ఒక రోజు పద్యనీతి చంద్రయ్య కొడుకు నగరికి వచ్చి పద్య నీతి చదవగా ఆ పద్యాలలో

క బలవర్గము సామంతుల
బలమున కగ్గలముగల నృపాలునకొదవే
బలమె పెఱనృపతికాఙ్ఞా
బలసంపద కెంతదవ్వు బద్దెనరేంద్రా" అనే బద్దెన నీతి పద్యం రాయల మనస్సుకు బాగా నచ్చింది ఆ పద్యాన్నే రెండు మూడు సార్లు చదివించు కొన్నాడు హృదయంలో గాఢంగా హత్తుకొనిపోయింది సైన్యాన్ని సమ కూర్చుకోవాలనే తపన ఎక్కువైంది ఒకనాడు రాత్రి నగరు శోధనకు పోయి నట్టే పోయి పట్టణానికి రెండామడల దూరాన ఉన్న ప కొండ రంగనాథ స్వామి దేవాలయానికి వెళ్ళి అక్కడే కూర్చొని ఉన్నాడు అప్పుడు తిమ్మరుసు గూఢచారులను పంపించి రాయల జాడ తెలుసుకొని అక్కడికి వెళాడు రాయలను పట్టణానికి రమ్మని అడిగాడు కాని రాయలు సామంతబలం కంటె అధికమైన బలాన్ని సంతరించేదాక రానని పట్టుపట్టాడు తిమ్మరుసు ఆ క్షణం లోనే కావలసినంత సైన్యాన్ని సంతరించాడు ఆ సైన్యాన్ని తీసుకొని రాయలు పట్టణానికి విజయం చేశాడు ఇది జనశ్రుతి కావచ్చు కాని రాయలు పట్టాభి షిక్తుడైన తర్వాత సైనాన్ని ఎక్కువచేసి విజయాలు సాధించాడన్నది మాత్రం చారిత్రక సత్యం దీన్నిబట్టి రాజనీతి పద్యాలు ఆనాడు రాజుల్ని ఎలా ప్రభా వితం చేసేవో తెలుస్తుంది

రాయలు "అపూర్వమైన మనష్యులు దొరికితేను సకలమున్ను సంత రించ వచ్చును అని చెప్పగా అయ్యమరసుగారు సింహాసనస్థునకు శ్రీలున్ను రత్నములున్ను కలిగినది అయితే అంతకన్నా అధికం మహీపతు లకు" అని చెప్పి ఆ సందర్భంలోనే ఈ క్రింది పద్యాన్ని కూడా పేర్కొంటాడు

క వహ్ని ధరిత్రియు బిరుమలె
రత్నము లెప్పుడు బురంధ్రిరత్నములు శిలా
రత్నము లవనీపతులకు
బత్నులె రత్నములువగవ బద్దెనరేంద్రా

అంతేగాక రాజులైనవారలు అనువైన పురుషరత్నాన్ని సంతరిస్తే ఆయన నవరత్నాలను చతురంగ బలాలను సంతరించగలడు అప్పాజి సాధారణ నియోగి కాదు అసాధారణ నియ్యోగి అఘటనఘటనా సామర్థ్యం కలవాడని ఆయ మరసు తిమ్మరుసును ప్రశంసిస్తాడు 7

ధైర్యం వల్లనే జయం కలుగుతుందని చెప్తూ సంస్కృత శ్లోకాన్ని ఉదాహరించాడు ఆ సంస్కృత శ్లోకం ఇలా ఉంది

శ్లో యతో ధైర్యస్తతో లక్ష్మి యతో లక్ష్మి స్తతోహరి
యతో హరిస్తతో ధర్మ యతో ధర్మ స్తతో జయ

రాయలు తురకలమీద దండెత్తేటప్పుడు ధైర్యంవల్ల లక్ష్మికటాక్షం వల్ల దైవ సహాయంవల్ల జయం కలుగుతుందని సామాజికులతో చెప్పి అర్యోక్తిగా పైశ్లోకాన్ని పేర్కొన్నాడు

రాయలు వినయ పూర్వకంగా ఆనతిచ్చినా అందులో విపరీతార్థం దాగి ఉంటుందని అయ్యమరసు ఉపమాన పూర్వకంగా ఈ క్రింది పద్యంలో పేర్కొంటాడు

క ఘను డా వినయంబాడిన
వినయంబా మీ ద నదియు విపరీతమగుం
గొననుండి విల్లువంగుట
వినయంబా యెదుటివాని వేగమె త్రుంచున్

7 రాయవాచకము పు 31 32 లు

రాజుకు రాజనీతి కుశలుడైన మంత్రి యుద్ధంలో ధైర్యంతో పోరాడే బంటు చాల అవసరమనే ఉద్దేశంతో రాయలు అప్పాజీతో చెప్పిన వైనం ఈ క్రింది పద్యంలో పొడసూపుతుంది

క. ముట్టెడు కారము బుక్కం
బెట్టెడు మంత్రియును బోరబెదరని బంటుం
బుట్టరుగా దేవతలకు
బుట్టరె నానావిధైక భోగ సహాయుల్

రాయలు గజపతిపైదండెత్తినపుడు పర్యాక్రమవంతులైన షోడశపాత్రులు గజపతితో కూడ యుద్ధానికి వస్తున్నారని తెలిసినపుడు రాయలు సందిగ్ధావస్థలో పడ్డాడు ఇక చేసేదిలేక అపాయానికి తగిన ఉపాయం ఆలోచించమని తిమ్మరుసుకు చెప్పగా అప్పుడు తిమ్మరుసు భేదోపాయాన్ని గూర్చి ఉద్ధరించిన మంత్ర నీతి పద్యాలు ఎంతో సందర్భశుద్ధిని కలిగి ఉన్నాయి

గీ. దండ సాధనకృతుల సాధ్యుండుగాక
మ్రింగ బుజతెంచు శత్రువు మిత్రు జేయు
దానమున నాత్మవశగులు గానివార
లితరులెవ్వారలీ జగత్రితయమునను

క. శత్రుల మిత్రుల జేయును
మిత్రుల భృత్యులనుజేయు భృత్యుల నిజస
త్పుత్రులుగ జేయు నందఱ
ధాత్రీపతి కన్నియెడల దానమువలనే

క. ఆయాస దుర్లభమ్మన
నాయాసమునన్ ఘటించు నరయనభీష్టో
పాయంబు పతికి భేదో
పాయము కడునిష్టమగు నుపాయముగాదే

ఇవి కవికర్ణ రసాయనంలోనివి 8 వీటిని రా వా కర్త స్వీకరించి సందర్భాన్ని బట్టి ఉద్ధరించాడు.

షోడశపాత్రులు రాయలకు లేఖ వ్రాసినట్లు అప్పాజీ గజపతికి వ్రాసిన లేఖలో పేర్కొని ఈ క్రింది భారత పద్యాన్ని ఉదాహరిస్తాడు.

క తనువున నాటిన యలుగుల
ననువున బుచ్చంగవచ్చు నతి నిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె యధిపా

ఈ పద్యంలోని తీవ్రతను గమనించిన గజపతి పట్టణం విడిచి ఏడెనిమిది అమడలదూరం పారిపోయాడు- తర్వాత రాయలు గజపతిరాజ్యాన్ని అతి సులభంగా జయించాడు

ఈ పైన పేర్కొన్న వదా లన్నీ రాజనీతి. సంబంధించినవి ఇవికాక ఆయాసందర్భాలలో మరికొన్ని పద్యాలు శ్లోకాలు ఉద్ధరించబడ్డాయి

సాళువ తిమ్మరుసును ప్రశంసించే సందర్భంలో అయ్యమరసు చెప్పిన శ్లోకం

శతేషు జాయతే శూర సహస్రేషుచ పండిత
వక్తా శత సహస్రేషు దాతా భవతి వా నవ

లోకంలో నూటికి ఒక శూరుడును వెయ్యింటికి ఒక పండితుడును లక్షకు ఒక వక్తుండును ఉంటారు దాత అనేవాడు ఉంటాడో లేదో అని చెప్పబడింది తిమ్మరుసు లాంటివాడు ఉండటం చాలా అరుదని- దీని భావం

---

8 నృసింహకవి నంకుసాల కవికర్ణ రసాయనము 9 10 11

రాయలు ఉదయగిరి కొండవీడు వినుకొండ మొ న దుర్గాలపై సర్వ సైన్యంతో దండెత్తి పోయేటప్పుడు భేరిపూజ చేయించి జయధ్వని చేయించిన సందర్భంలో ఈ క్రింది పద్యాలు చెప్పబడ్డాయి

క ధాత్రీశ దంతదిగ్జయ
యాత్రాసంరంభ జృంభితాటోపగతిన్
శత్రువుల గుండెలవియ గ
జైత్రప్రస్థానభేరి సేయించుటయున్

ఉ భూకంపంబు జనింప రొప్ప గ మహాంభోరాసు లుప్పొంగ గా
లోకాలోకములెల్ల పెల్లగిల ముల్లోకంబు మూర్ఛిల్లన
స్తోకవా ప్త నజాండ గోళ దళనోద్భూత ధ్వనింబోలె వ
ర్షాకాలాంబుద గర్జిత ధ్వని సమారంభంబులై మీఱ గన్

ఈ పద్యాలు కూడా కవికర్ణ రసాయనం నుండి ఉద్ధరింపబడినవే 9 ఇవి కవికర్ణ రసాయనంలో మాంధాత దిగ్విజయ యాత్రకు బయలుదేరే సందర్భంలో ప్రయుక్తమయాయి రా వా కర్తకూడా అలాంటి సందర్భం లోనే ప్రయోగించి ఔచిత్యాన్ని పాటించాడు

రాయలు తురుష్కులను గెలిచిన తర్వాత ఆ విజయం ఏవిధంగా ఉందని ముక్కు తిమ్మనను అడుగగా ఆ కవి చెప్పిన పద్యం

క నరసింహ కృష్ణరాయా
దురమున నీ పేరుపేర దురకల ద్రుంచెన్
గరి రాజ వరదు డవనీ
కరి ఘటములు నిన్ను జూచి గ్రక్కున దిరిగెన్

ఇది కృష్ణదేవరాయల గొప్పతనాన్ని తెలియజేస్తుంది

---

9 నృసింహకవి సంకుసాల కవికర్ణరసాయనము 64 65

ఒకసారి గజపతి విరోధులు నంబివాని చేత విషప్రయోగం చేయించే టప్పుడు నంబివాని చేతులు వణకసాగాయి అప్పుడు గజపతి అది చూసి చేతులు వణకడానికి కారణమేమి అని అడుగగా ఆ నంబివాడు భయపడి జ గిన తెర మరగు సంగతి అంతా సవిస్తరంగా చెప్పాడు అయినా గజపతి ఆ విషోదకం తెప్పించి

అరిర్మిత్రతం విషం పథ్య మధర్మో ధర్మతాం వ్రజేత్
అనుకూలే జగన్నాథే విపర్యతే విపర య్యమ్" అనే శ్లోకం చదివి త్రాగగా ఆ విషం జీర్ణమైందట ఇది జనశ్రుతి అని చెప్పవచ్చు ఇలాంటిదే కన్నడంలో కంఠీరవ నరసరాజుకు సంబంధించిన జానపద కథ బాగా ప్రచారంలో ఉంది

గోలకొండ విజయాపురం అహమదానగరం యేలే ముగ్గురు దునే దారులు రాయలతో యుద్ధం చేయలేక చివరికి రాయలను శరణుజొచ్చి అపరి మితంగా కానుకలు సమర్పించి భయభక్తి గలిగి రాయల దాన క్షాత్ర గుణాలు తెలుసుకొని చెప్పిన నీతిపద్యం వారి నైజగుణాన్ని విస్పష్టం చేస్తుంది తురుష్కు లయిన ఆ దునేదారులు తమను గూర్చి

చ మలకలు మా ప్రచారములు మా ముఖముల్విషవహ్ని ఘోరముల్
ఖలులము రోషజాతులము గర్వుల మేమొక మంచివారమే
నలినదళాక్ష ప్రాణులకు నైజగుణంబులు మాన్పవచ్చునే
వెలయ గ మా వికారములు వేయును నెంచ గనేల భూవరా" అని చెప్పడంలో వారు చాల దుర్మార్గులని తెలుస్తుంది

---

10 మైసూరు రాజైన కంఠీరవ నరసరాజును కుట్రచేత చంపాలని శత్రువులు దేవాలయ అర్చకుని ద్వారా ప్రయత్నిస్తారు పూజారి అర్చకుడు విషాన్ని తీర్థంలో కలిపి ఇచ్చేటప్పుడు భయంతో చేతులు వణుకుతాయి అప్పుడు రాజు పోసిస్తున్నది తీర్థమా లేక విషమా అని ప్రశ్నిస్తాడు పూజారి తీర్థమే స్వామీ అని సమాధానమిస్తాడు కంఠీరవుడు నిర్మలమైన మనస్సుతో ఆ తీర్థాన్ని అరచేతిలో స్వీకరిస్తాడు విషం అరచేతిలో నిలిచిపోయి అరచేయి నల్లబడుతుంది

గజపతి ఓడిపోయిన తర్వాత రాయలతో

"నష్టం కులం భిన్నతటాక కూపాన్

విభ్రష్ట రాజ్యం శరణాగతంచ

గోబ్రాహ్మణాణా దేవగుణాలయాంశ్చ

యదుద్ధరే త్పూర్వ చతుర్గుణం తత్" అనే శ్లోకం 1 చదివి తన కూతురైన జగన్మోహిని అనే కనకను ధారపోసి బాంధవ్యాన్ని కలుపు కొన్నాడు అప్పుడు అల్లుని అడబిడ్డకు ఇవ్వవలసిన బహుమానోచిత క్రమ భూషణాదులను ఈ క్రింది పద్యంలో రా వా కర్త తెలియజేశాడు

క హాటక పేటి శాటీ పోటీ శకటీ మదేభకోటీ పీటి
పేటి భృచ్చేటీ మయూరికలు వేడ్కన్

దీన్నిబట్టి ఆనాటి సంప్రదాయాలు కూడా కొంతవరకు విశదమవుతాయి

ఈవిధంగా రా వా కర్త వివిధ వృత్తాంతాలను పద్యాలను శ్లోకాలను తన రచన కనుకూలంగా ఉపయోగించుకొని శ్రీకృష్ణదేవరాయల చరిత్రను వివరంగా చెప్పడానికి ప్రయత్నించాడు

---

11 కన్నడ శ్రీకృష్ణదేవరాయన దినచరి లోని ఈ శ్లోక పాదాంతం గమనించదగ్గది

# రాయవాచకం – రచనావైశిష్ట్యం

రాయవాచకాన్ని భాషా చారిత్రక దృష్టంలోనే కాకుండా కళాత్మక దృష్టితో కూడా పరిశీలించడం జరిగింది ఈ పరిశీలన చేయడానికి కొన్ని కారణాలు ఉన్నాయి ఇది కేవలం చారిత్రక సత్యాలను మాత్రమే వివరించే గ్రంథం కాదు దీని రచనలో కళాత్మకత కూడా గోచరిస్తుంది ఇందులో శ్రీకృష్ణదేవరాయలకు సంబంధించిన విశేషాలను తన ప్రభువుకు వ్రాసి పంపించడం రా వా కర్త ప్రధాన ఉద్దేశమైనా అభివ్యక్తిలో ఒక ప్రత్యేకమైన ఆకర్షణ ధర్మం ఉంది వస్తు స్వీకరణలో వైజ్ఞానిక దృష్టేకాక జానపద కాల్పనిక దృష్టి కూడా ఉంది రా వా లోని శబ్దమంతా వ్యావహారిక శబ్దం కాదు కావ్యశబ్దం కూడా ఉంది రా వా కర్తకు ఆ కాలంలోని వివిధ రాజకీయోద్యోగులతో ఉన్న సంబంధంవల్లను లోకులతో ఉన్న సాన్నిహిత్యం వల్లను తనకున్న శ్రుత పాండిత్యంవల్లను అతని భాషలో వ్యావహారికమూ గ్రాంథికమూ రెండూ కలిసిపోయాయి

రా వా చారిత్రక కృతి మాత్రమే కాదు ఇందులో చెప్పుకోదగ్గ సాహిత్యపు విలువలూ ఉన్నాయి ఇక్కడ సాహిత్యపు విలువలు అంటే విజయనగర రాజుల కాలంలో ప్రజలకున్న సామాజిక సాహిత్య సంబంధాల దృష్టి అని అర్థం సాహిత్యం ప్రజల జీవితంలో ప్రధాన భాగంగా ఉండేది రాజాస్థానాల్లో ప్రతిదినమూ అనేక పద నీతులు చదువబడేవి [1] శ్రీకృష్ణదేవరాయలకాలంలో పద్యనీతి చంద్రయ్య అనేవాడు ఈ పద్యనీతులు చదివేవాడు [2] కవులు కూడా రాజుతోపాటు యుద్ధభూమికి వెళ్ళేవారు వీరు ఆయా సందర్భాల్లో విసుగు జనించకుండా ఆశువుగా కొన్ని పద్యాలు చెప్పేవారు మంత్రులు సయితం ఆయా సందర్భాలను పురస్కరించుకొని వివిధ గ్రంథాల నుండి పద్యాలను శ్లోకాలను దృష్టాంతంగా ఉద్ధరించేవారు దీన్నిబట్టి చూస్తే ఆ కాలంలోని ప్రజలకూ వివిధ గ్రంథాలతో బాగా పరిచయముండేదని తెలుస్తుంది

---

1 రాయవాచకము పుట 2

2 పైదే పుట 23



రా వా నికి సాహిత్య ప్రాధాన్యత కలగడానికి అందలి అభివ్య క్తి (Expre on ప్రధానకారణమని చెప్పవచ్చు రా వా న్ని పద్యకావ్యంగా కూర్చిన కుమారధూర్జటి రా వా లోని అభివ క్తుల్ని కొన్నిటిని యథాతథంగా స్వీకరించడం విశేషం ఈ విషయాన్నే జయంతి రామయ్య పంతులుగారు The poem c o e y o ow he o der accoun no on y n rega d o he ub ec ma er bu ome me a o n he ma e o e a y exp e s on అని పేర్కొన్నారు [3]

రా వా లో కొన్ని కావ్యసంప్రదాయాలు చెప్పబడ్డాయి గ్రంథారంభంలో అవతారికా పద్యాలు కూర్చబడ్డాయి ఇందులో కథావస్తువు సూచింపబడింది విషయాన్ని సుజనులనుండి గ్రహించినట్లు చెప్పబడింది చివరిపదా ల్లో గ్రంథప్రయోజనం ఫలశ్రుతి ఉ క్తమయాయి

కథాకథనం కథను చెప్పే పద్ధతే కథా కథన పద్ధతి కథా కథనంలో వస్త్వైక ం ముఖ ం వస్త్వైక మంటే భిన్న సంఘటనలకు పొసగింపు [4] భిన్న సంఘటనలకు ప్రధాన కథతో సంబంధం కల్పించి వస్త్వైక ం సాధించడం చాలకష్టం

రా వా లో ప్రధానకథ శ్రీకృష్ణదేవరాయల వృత్తాంతం దీని చుట్టూ భిన్న సంఘటనలు అల్లుకొని ఉన్నాయి రా వా క ర్త నేర్పు ప్రదరి ంచి వాటి మధ్య సంబంధాన్ని బిగువును ఏర్పరిచాడు

కథా నిర్మాణాన్ని మూడు విధాలుగా పరి లించవచ్చు

1 కథకు ఆయువుపట్టులైన సన్నివేశాలు 2 భిన్న సంఘటనలమధ్య సంబంధం 3 అద ంతాలు

రా వా లో ఆయువు పట్టయిన ఘట్టం శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయ వృత్తాంతం దీనితో పరస్పర సంబంధం కలిగిన సంఘటనలు అనేకం ఉన్నాయి వాటిని ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు

---

3 రాయవాచకము 1933 పరిక 1

4 కోటీశ్వరరావు తుమ్మపూడి ఆముక్తమాల్యదా సౌందర ము పు 66

1 వీరనరసింహరాయల వృత్తాంతం 2 విద్యారణ్యుల వృత్తాంతం 3 శింగిభట్ల కథ 4 వేదవ్యాస సాక్షాత్కారం 5 వాలిసుగ్రీవుల యుద్ధ ఘట్టం 6 భూదేవి పరీక్షిత్తుల సంవాదం 7 ప్రతాపరుద్రుని వృత్తాంతం 8 ముకుంద గజపతి వృత్తాంతం

రా వా లో కొన్ని జానపదబలిహ లు కూడా చోటు చేసుకున్నాయి గజ పతికి విరోధులు విషప్రయోగం చేయించడం అనే ఘట్టం జానపద బలిహ్యమే పైన పేర్కొన్న అంశాల్లో కూడా జానపద కల్పనలు కలిసి ఉన్నాయి భారతీయుల కథనంలో కల్పనలు కలిసిపోయి ఉన్నందువల్ల అవి చరిత్రలోకి చొచ్చుకొనిపోయాయి

రా వా లోని ఆద్యంతాలను పరిశీలిస్తే కథ వీరనరసింహరాయలతో ప్రారంభమై శ్రీకృష్ణదేవరాయలు ముక్కుతిమ్మన అల్లసాని పెద్దన మాదన గారి మల్లనలకు పారిజాతాపహరణం మనుచరిత్రాది కావ్యాలను వ్రాయమని ఆనతివ్వడంతో ముగుస్తుంది

రా వా కర్త కథను వీరనరసింహరాయలతో ప్రారంభించడం ఔచిత్య మనిపిస్తుంది ఎందుకంటే రాయలకు ముందు అతడు రాజ్యపరిపాలన చేశాడు అతనినుండే రాయలకు వారసత్వం సంక్రమించాలి కాబట్టి అతనితో కథ ప్రారంభం కావడం సముచితం వీరనరసింహరాయల దినచర్యలు మొదలైనవి చెప్పిన తర్వాత ముల్లంద్ర పుంభావ సరస్వతి విద్యారణ్యుల గురించి విద్యా నగర స్థాపన గురించి వివరిస్తాడు

శ్రీ కృష్ణదేవరాయల కథ అతని పట్టాభిషేకంతో ప్రారంభమవుతుంది ఇతని పట్టాభిషేకం గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి [5] కాని రా వా కర్త వాటిని ప్రస్తావించకుండా వీరనరసింహరాయలే కృష్ణ రాయలకు పట్టం కట్టినట్టు చెప్పాడు తర్వాత మంత్రులు రాజనీతి బోధించడం నిత్యకృత్య వివరణ పరిపాలన దిగ్విజయ యాత్రలు తీర్థయాత్రలు వరు సగా చెప్పబడ్డాయి

5 వెంకటరమణయ్య నేలటూరు శ్రీకృష్ణదేవరాయలు పు 16 & 17 లు

కథా కథనంలో రా వా కర్త రెండు పద్ధతులను అనుసరించాడు
1 పాత్రలచేత చెప్పించడం 2 తాను స్వయంగా చెప్పడం

వీరనరసింహరాయల దినచర్య తర్వాత విద్యారణ్యుల జీవితం విద్యానగరస్థాపన గురించి ముల్లంద్ర డిండిమ పుంభావ సరస్వతిచేత చెప్పిస్తాడు తర్వాత కూడా అనేక చోట్ల పాత్రల ముఖాంతరంగానే కథను నడిపిస్తాడు అవసరమైన చోట్ల తాను చెప్పాడు

కథ పాత్రల ముఖాన నడిచేటప్పుడు సంభాషణ ప్రధాన స్థానమాక్ర మిస్తుంది రా వా కర్త ఆయా పాత్రలకు కూడా తన భాషనే ప్రయోగించాడు ఉదా సాళువ తిమ్మరుసు ప్రశంస

"అపూర్వమైన మనుష్యులు దొరికితేను సకలమున్ను సంతరించవచ్చును " అని రాయలదేవుండు పలకరించగా అయ్యమరసుగారు విన్నపం జేశినది సింహాసనస్థునకు స్త్రీలున్ను రత్నములున్న కలిగినది అయితే అంతకన్నా అధికం మహీపతులకనగా నీతి పద ం

క పత్నీ ధరిత్రియు బురుషులె
రత్నము లెప్పుడు బురంధ్రి రత్నములు శిలా
రత్నములనీ పతులకు
బత్నులెరత్నములు పగవ బద్దెనరేంద్రా" అని అన్నారు గనక రాజులైన వారలు అనువైన పురుష రత్నాన్ని సంతరిస్తే ఆయనా నవరత్నములున్ను చతురంగబలములున్న సంతరించగలడు అటు గనక అప్పాజీ సాధారణ నియోగిగా యెంచవద్దు. ఆయన అసాధారణ నియోగి అఘటనఘటనా సామర్థ్యం ఆయనకే గలదు అది యేలాగంటేను - అందరున్న మనుష్యులు అందరకిన్ని అవయవాలు సరి ఇందులో ఉత్తములు మధ్యములు అధములు అని యెరిగి యేర్పరచవలెను. అది యేలాగంటేను గుణాధిక్యము వల్లను యెక్కువ మరిన్ని పంచలోహములున్ను అన్నియు సరి అందున బంగారు హెచ్చింది యేంది అంటే వొరియకకురాంగా వన్నె హెచ్చించినట్లు గుణాధిక్యం వల్ల మనుష్యులలోనున్ను అప్పాజిని అధికుడని యెరుగవలెను అది యేలాగంటేను

శ్లో॥ శతేషు జాయతే శూర సహస్రేషు చ పండిత
వక్తా శతసహస్రేషు దాతాభవతి వా నవ॥ అనే నీతి ప్రకారానకు నూటికి వక బంటున్ను వెయి ంటికి వఖ పండితుడున్ను లక్షకు వఖడు వక్తుండై సభాస్థలిని మాటవలుకులాడును శిమలో వఖడు దాత అనేది కలండో లేదో అన్నట్టు-చౌ ఖరుగాక అందరికిన్ని ఆ గుణములు యాలవచ్చీని" అని అయ్య మరసు విన్నవంజేసి" పు 32 33లు

ఈ విధంగా రా వా లో సంభాషణలు పద్య శ్లోకాల సమ్మేళనంతో కొనసాగుతాయి

రా వా లో అక్కడక్కడ స్వగత సంభాషణలు వ్యాజస్తుత్యాత్మక సంభాషణలు నాటకీయ సంభాషణలుకూడా కనిపిస్తాయి

రాయలు గజపతి రాజ్యంపై దండెత్తి వెళ్ళినపుడు గజపతి షోడశ పాత్రులతోపాటు యుద్ధానికి వస్తున్నాడని తన స్థానాపతి కమలనాథయ్య కాకితము వ్రాసి పంపినపుడు అది చదివి చూసుకొని "కార్యంబిపతప్పె తబ్బిబ్బాయను అని చాల చింతనొందినవారై అప్పుడు అప్పాజి మాటలు వినక వచ్చినందులకు ఇంత కార్యం వచ్చెను అని తమలోతామే చింతచేసుక అంద్దరికిన్ని ప్రాణహానులు వచ్చెను షోడశపాత్రులు చెప్పేదొఖటిన్ని చేశేదొఖటిన్ని కాదు యెంత వెళ్ళనాడినా అంత్తా నడిపించ్చగలవారు వారల పరాక్రమానకు యెవరు నిలువలేరు అని నిలిచిన దిక్కున నిలువక వున్న దిక్కున వుంద్దక అరిజాలపడి అంద్దరిని యింతకార్యం వచ్చనని ప్రజలు చింతపడుతా వుండ్డంగ" పు 69

ఇందులో రాయల స్వగత సంభాషణ వ్యక్తమవుతుంది

రాయలు నగరశోధనకై వెళ్ళి తిరిగిరాకుండా పట్టణానికి రెండామడల దూరంలో ఉన్న పశి కొండ రంగనాథస్వామి దేవాలయానికి వెళ్ళి అక్కడే కూర్చొని ఉండగా ఉదయాన్నే తిమ్మరుసు గూఢచారులవల్ల తెలుసుకొని అక్కడికి వెళ్ళినపుడు వారిద్దరి మధ్య నడచిన సంభాషణ వ్యాజ స్తుత్యాత్మకంగా ఉంది

స్వామివారు యీరీతి రావచ్చునా? యీ వార్తలు లోకులకు తెలిసితేను వర్ణమున్ను కోలుపోవును దునేదారులు విన్నాన్ను అపకీర్తి గనక యింతటి

కార్యం జేశేది అనుచితము స్వామివారి చిత్తాన యింత్త కారమెంచి రా వచ్చునా" అని తిమ్మరుసు) తెలిపినందులకు రాయలవారు "సింహాసన భర భారకం వహించే మీవంటి పెద్దలు వుంటగా అర్థ కార్యములు యేలవచ్చీని మీరు తృణాన్ని బట్టితే మేరువు జేయగలరు ఆ మేరువునే తృణముగా నడి పించగలరు అఘటనఘటనా సామర్థ్యములు మీకే గలవు" అని వ్యంగ్యోక్తు లుగా ఆనతిచ్చినందులకు సాళువ తిమ్మరసయ్య పలికినది "ఆతీతే అవును అవి యేమియంటేను స్వామివారు సకల కార్యభారములున్ను మామీద వూనికె జేసి నడిపించగా ఆరీతున నడుస్తావున్నది చిత్తానకు రాకుంటేమేమనగా తృణమాత్రం తృణగ్రాహియైన యింద్రనీలము ఖ్యాతి బొందును తృణమని యెంచి గ్రహించక వున్నట్టాయెనా జాతినీలము గాదని వెంతరుగును అటుగనక యేలిన స్వామివారి ప్రతాపమువల్లనేగదా కొలిచిన వారు ఘనమౌట కొలచిన వార్లను ఘనముగా నడవగానే యేలినవారికి కీర్తిఖ్యాతులు గలుగుట అని ద్వంద్వార్థముగా విన్నవముచేశి" పు 27 28లు)

గజపతి షోడశపాత్రుల సంభాషణలో నాటకీయత గోచరిస్తుంది

గజపతి "వారిని జయించేటందులకు ఆయావజయం కనవలెనని షోడశ పాత్రులను పిలువనంపగా బలభద్రపాత్రుడు దుర్గాపాత్రుడు మొదలయిన వారు పదారుపాత్రులు వచ్చి గజపతివారి పొడగనగా వారలను కూర్చుండ నియమించి "వారలతో ఇదివరకున్ను నడచిన కార్యాలన్నింన్ని వింన్నారేకా కన్నాటకంవారు కసముండాంటి అహముదానగరానకు వచ్చి నిపాతంశే పొట్నూరి సింహాద్రి వద్ద శిబిరం దిగినారు యిక్కడికి నాలుగు క్రోశములమేర వచ్చివున్నారు రేపు మర్నాట దాటి మాగణంగా గుర్రంరాణావ వచ్చును అప్పుడైనా కనుఎంచుకోవలెగాని మొదటిస్థలం విడువరాదు ఆలోచనగా అడిగి నందులకు షోడశపాత్రులు యీ ఆలోచన మునుపు మూడు తెగల దునే దార్లున్ను కర్నాటకం వారిం వెముఖాపరించి నిలువలేక తమతమ స్థలాదులకు పోయినందువల్ల యెవ్వరినింన్ని యెంచ్చక తురకాణ్యం మలు దాంటి మన గడికనములున్ను జొచ్చి పట్టం సమీపానకు వచ్చినారు యీ సమయాన మనం ఆ మూడు తెగల వారి ంన్ని చెప్పి అంప్పించి వారు సరదులున్ను బలపంతముగా వుండ్రమని మనమున్ను యిక్కడను కనిపించ్చుకొంటే యెందు

లోనున్నారు కాళహస్తి అరణ్యం జగన్నాథం పర్యంతం మన శీమ అట్టి పట్ల యెదురు యెంచ్చక లేరు యెరుగరు గనక లోజొచ్చి వచ్చినారు మంత్రాలోచనమీద వచ్చిన కార్యం కాదు హామిక మీదికార్యం గనక వారికే ముప్పు మనకార్యం జయమౌను వారు యాయులు మహం స్థాయులు మన శీమ ప్రజలకు వారలం పింగతోలి స్థలాలున్ను నిలువవలెనని ఉత్సాహవృష్టి గనక ఇట్టి పట్ల మనం కనుపించుకొంట్టేను కన్నాటకంవారు నిలువలేక తమ మకు పోయ్యేమని లోదురు " పు 66 68 లు

ఇలాగే పరస్పర సంభాషణ నాటకీయ శైలిలో కొనసాగుతుంది ఇక్కడ పాత్రలు ఎదుట ఉండి మాట్లాడుతున్నట్టే పాఠకుడికి నాటకీయానుభూతి కలుగుతుంది

రా వా భాషలో అనేక జాతీయాలు పలుకుబళ్ళు వాడినందువల్ల సజీవత్వం గోచరిస్తుంది సంభాషణలు కూడా సహజంగా ఉన్నాయి "సంభాషణా శైలి వ్యావహారికమున కెంత దగ్గఱయిన నాటకీయత అంత చేవ కలిగి యుండును సందర్భశుద్ధియు గాంభీర్యము అర్థపుష్టిగల జాతీయములు లోకోక్తులు సంభాషణకు ఓజస్సును తెచ్చు"నని సర్దేశాయి తిరుమలరావుగారి అభిప్రాయం[6] ఇది రా వా ని కొంతవరకు వర్తిస్తుంది

పాత్రపోషణ పాత్రలు కథాగతికి ఆలంబనాలు రచయిత పాత్రలను కథాభిముఖంగా నడిపించి గ్రంథప్రయోజనాన్ని సాధిస్తాడు కథలో ప్రధాన పాత్ర శబ్దవాచ్యులు ఇద్దరికంటె ఎక్కువగా ఉండరు తక్కిన పాత్రలు సాధనాలు మాత్రమే రా వా లో శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసు ప్రధాన శబ్దవాచ్యు లని చెప్పవచ్చు

శ్రీకృష్ణదేవరాయలు దక్షిణ భారతదేశాన్ని పాలించిన హిందూ చక్రవర్తులలో ప్రఖ్యాతి గాంచినవాడు శ్రీకృష్ణదేవరాయలు ఇతడు క్రీ శ 1509 నుండి క్రీ శ 1530 వరకు విజయనగరం రాజధానిగా దాదాపు దక్షిణ

6 తిరుమలరావు సర్దేశాయి సాహిత్యతత్త్వము శివభారత దర్శనము పుట 225

భారత దేశాన్నంతటిని అఖండదీక్షతోను స్వయంకృషితోను ఏకఛత్రాధిపత్యం క్రిందికి తెచ్చి ప్రజానురంజకంగా పరిపాలించాడు ఇతడు గొప్ప రాజ నీతిజ్ఞుడు పరిపాలనాదక్షుడు మిక్కిలి ప్రతిభావంతుడు సత్యపాలనా సహ వ్రతుడు దీక్షతో సైన్యాన్ని సంతరించుకొని దక్షిణోత్తర దిగ్విజయయాత్రలు చేసి రామేశ్వరం నుండి కటకం దాకా రాజ్యాన్ని విస్తరించిన విజయశేఖరుడు

శ్రీకృష్ణదేవరాయల అధికారకాలం అవిచ్ఛిన్న యుద్ధాలకాలం తన పూర్వులు పోగొట్టుకొన్న రాజ్యాలను మరల వశం చేసుకొన్నాడు తనకు బహమనీ రాజ్యాలకు మధ్య నిరంతర కలహాలకు కారణమైన రాయచూరును స్వాధీనపరచుకొన్నాడు కటకాధీశుని గెలిచి అతని కూతురైన జగన్మోహిని అనే కన్యను వివాహమాడి స్నేహ సౌహార్ద్రతలను చూపాడు [7]

రాయలకు ధార్మికశ్రద్ధ ఔదార్యం చాల ఎక్కువ స్వయంగా వైష్ణవుడైనా హిందూధర్మ శాఖలన్నింటిని సమానంగా గౌరవించాడు పరాజితులైన వారిపై దయ స్వాధీనమైన నగరవాసులపై సానుభూతి చూపాడు కాని కక్ష గల తురకలపై దాడిచేసి వారి స్థలాలు ఆక్రమించి అముదాలు జిల్లేపు విత్తించాడు [8] సామంతరాజుల్లోను ఏకరీతిగా ఆదరాభిమానాలకు పాత్రమైన అతని యుద్ధకౌశలం ఉదాత్త జీవన ప్రతీకఅయిన ప్రసన్న చిత్తత మధుర సల్లాపాలు అతని ధర్మభక్తి సాహిత్యప్రీతి ప్రజాపరిపై హితచింతన అన్నిటిని మించి దేవాలయాలకూ బ్రాహ్మణులకూ అతడిచ్చిన దానాలు—ఈ లోకోత్తర గుణాలచేత కృష్ణదేవరాయలు దక్షిణాత సార్వభౌముల్లో అగ్రగణ్యుడుగా నిలిచాడు [9] నంది దుర్గాలయ శాసనం అతని యశః పతాక

7 రాయవాచకము పుట 75

8 పైదే పుట 64

9 కృష్ణరావు ఎం వి & కేశవభట్ట ఎం కర్నాటకద ఇతిహాస దర్శన పుట 385

కృష్ణదేవరాయలు తన పొరపాటును గుర్తించి సవరించుకోగల సహృదయుడు అప్పాజి మాట వినకుండా గజపతిపై దండెత్తిపోయినపుడు అపాయం సంభవించగా తానే స్వయంగా అప్పాజి వద్దకు వెళి గతాన మీ మాట వినక వచ్చినందువల్ల ఇంత అలోచనకు అస్పదమాయను మా గుణదోషములు యెంచేటందువల్ల అయే కారం యేమి వున్నది యీ యపాయానకు తగిన ఉపాయం యే రీతు [10] అని తన పొరపాటును ఒప్పుకొని అప్పాజిని సహాయం అర్థించాడు ఇది అతని నిజవర్తనకు వినయ స్వభావానికి ప్రబల నిదర్శనం

రాయలకు గల దైవభక్తి అపారం తిరుపతిని తన జీవితకాలంలో ఏడుసార్లు సందర్శించి అనేక కానుకలు సమర్పించి జీవితాంతం స్వామి ఎదుటే ఉండాలనే తలంపుతో తన దేవేరులతోపాటు తామ్ర విగ్రహాలు చేయించి నిలిపాడు ఇతడు తిరుపతినేకాక అనేక పుణ్యక్షేత్రాలను దర్శించి గోపురాలు కట్టించి చిత్రసభలు ఏర్పరచి సర్వమత సామరస్యాన్ని సాధించాడు [11]

కృష్ణదేవరాయలు రాజ్యమంతటా పర్యటించి అక్కడి పరిస్థితులను స్వయంగా తెలుసుకొనేవాడు రాత్రిపూట నగరశోధనకు బయలుదేరేవాడు తన పరిపాలన గురించి ప్రజాభిప్రాయాన్ని సేకరించేవాడు కావలికట్ల వారి పనులను పర్యవేక్షించేవాడు

రాయలు అరివీరభయంకరుడై సదా యుద్ధ నిరతుడైనా అదే జీవిత సర్వస్వమని భావించలేదు. కవులను పండితులను ఆదరించి సాహిత్య కళా పోషకుడయాడు రాజ్యవిషయాల్లో తలమునకలై ఉన్నప్పటికీ అతీంద్రియ విషయాలపై కూడా అతనికి మక్కువ ఎక్కువ ఇతడు కవులకు కవీశ్వరుడై యోగులకు యోగీశ్వరుడై చరిత్రపుటల్లో శాశ్వతంగా నిలిచిపోయాడు. రా వా ప్రారంభాంతాలే రాయలు సృష్టించిన మహా సాంస్కృతిక సంప్రదాయానికి ప్రత్యక్ష సాక్ష్యం

---

10 రాయవాచకము పుట 70

11 పైదే పు 77 78 లు

12 పు 22

తిమ్మరుసు ఇతడు శ్రీకృష్ణదేవరాయల కీర్తి చంద్రికలను దశదిశలా వ్యాపింపజేసిన ప్రముఖ రాజనీతిజ్ఞుడు ప్రధానమంత్రిగా తన కర్తవ్యాన్ని సమర్థవంతంగా నిర్వహించి ప్రజాపాలనను అత్యంత చాకచక్యంతో నడిపించిన అత్యంత మేధా సంపన్నుడు శ్రీకృష్ణదేవరాయలు ఆముక్త మాల్యద లో మంత్రి ఎలాంటి గుణాలను కలిగి ఉండాలో చెప్పిన పద్యం తిమ్మరుసుకు అక్షరాలా అన్వయిస్తుంది

"చదివి యధర్మభీతి నృపశాస్త్ర విధిజ్ఞతలన్వయస్సు డె
బ్బదిటికిలోను నే బదికి బాహ మునై యరుజ స్వపూర్వులై
మదమతి రాజ ప్రార్థన నమాత్యత గైకొని తీర్పపాఱువా
రౌదవిన సంగములిగుల నూర్జిత మౌటకు బూట సాలదే"

ఆ మా V 211

సకల విద్యలను నేర్చి ధర్మాధర్మాలను రాజనీతులను తెలుసుకొని యాభైకి పైన డెబ్బైకి లోపు వయసు కలిగి ఏ వ్యాధిలేక అహంకారాది గుణాలు వదలి రాజ ప్రార్థనచేత మంత్రి పదవిని నిర్వహించగల బ్రాహ్మణులు దొరికితే రాజ్యాంగాలు ఊర్జితం కావడానికి ఒక్కపూటే చాలని రాయల అభిప్రాయం

తిమ్మరుసుకు రాయలంపై పుత్రవాత్సల భావం ఉండేది ఉదయాన్నే కొలువులో హాజరుగా ఉండేవాడు రాజ్యపరిపాలనాది కార్యకలాపాల్లో ప్రముఖ పాత్ర వహించేవాడు రాయలకు ఏ చిక్కుసమస్య ఎదురైనా ఉపాయంతో పరిష్కరించేవాడు

తిమ్మరుసు అఘటనఘటనా సామర్థ్యం కలవాడు శ్రీకృష్ణదేవ రాయలు పట్టాభిషిక్తుడైన తర్వాత కొన్ని యేళ్ళుగా పేరుకొనిపోయిన అమర గార్లమీది రొక్క నిలువలకు క్షణాలమీద యేనూరు యేనుగులను పండ్రెండు వేల గుర్రాలను లక్ష ఎడ్లను నగరికి అప్పగించి రాయల ప్రశంసకు పాత్రుడయాడు అప్పాజీ సామర్థ్యాన్ని అయ్యమరసు ఇలా ప్రశంసించాడు "ఆయన అసాధారణ నియోగి అఘటనఘటనా సామర్థ్యం ఆయనకే గలదు గుణాధిక్యం వల్ల మనుమలలోనున్న అప్పాజీని అధికుడని యెరుగవలెను" (పు 32

తిమ్మరుసు రాజనీతి చతురత మిక్కిలి ప్రశంసనీయం రాయలు తురుష్కరాజుల్ని చిన్న చిన్న దుర్గాలవారిని జయించినతర్వాత గజపతి రాజ్యంపై దాడి జరపాలని ముందుకు నడిచాడు గజపతి రాజ్యాన్ని జయించడం కష్టసాధ్యమని తిమ్మరుసు ముందే సలహా ఇచ్చాడు కాని రాయలు వినలేదు గజపతి రాయలు దండెత్తి వస్తున్న వార్తను తెలుసుకొని షోడశ పాత్రులతో సిద్ధమయాడు ఆ వార్తను తన స్థానాపతి ద్వారా తెలుసుకొన్న రాయలు "అప్పాజీ మాటలు వినక వచ్చినందువల్ల అపాయం వచ్చె"నని అనుకొని అప్పాజీ గుడారానికి వెళి తగిన ఉపాయం ఆలోచించమని కోరాడు అప్పాజీ రాయల ఆభరణాలన్నీ పదారు పెట్టెల్లో పెట్టి షోడశ పాత్రుల పేర్లతో రాయలవారి ఆభరణాలను కానుకగా పంపుతున్నాం మీకు కావలసినవి గ్రహించి మాకు కావలసిన ప్రయోజనాన్ని చౌనగూర్చగలరు" అని విడి విడిగా వ్రాసిన ఆ లేఖలను ఆభరణాల పెట్టెల్తోపాటు పదార్గురు నియ్యోగులకు ఇచ్చి గజపతికి కనిపించేటట్టు పోవలెనని చెప్పి పంపించాడు

గజపతి సైనికులు ఆ నియ్యోగులను చూసి గజపతి సముఖానికి తీసుకొని పోయారు గజపతి ఆ లేఖలను ఆభరణాలను చూసి షోడశపాత్రులు తనకు నమ్మకద్రోహం చేయతలపెట్టారని మిక్కిలి భయపడి అప్పటికప్పుడే పట్టణం వదలి ఏడెనిమిది ఆమడల పొడవు ఉత్తర దిశగా పారిపోయాడు మరునాడు ఉదయాన్నే షోడశపాత్రులు ఆయత్తపడి వచ్చి గజపతినికానక తమ తమ దుర్గాలకు వెళి పోయారు తర్వాత రాయలు గజపతి రాజ్యాన్ని సునాయాసంగా హస్తగతం చేసుకొన్నాడు ఈ విధంగా తిమ్మరుసు భేదోపాయంతో విపత్తును తొలగించి విజయాన్ని చేకూర్చాడు

ఈ విధంగానే కృష్ణరాయల పట్టాభిషేకం మొదలుకొని యుద్ధాల్లోను రాజ్యపాలనలోను తిమ్మరుసు ప్రదరి ంచిన రాజనీతిని పురస్కరించుకొని

"అయ యనిపించుకొంటివి
నెయ ంబున గృష్ణరాయనృపపుంగవుచే
నయా నీసరియేరి

తియ్యని విలుకాడవయ్య తిమ్మరుసయ్య అని చెప్పిన చాటుపద్యం జనబాహుళ్యంలో నిలిచిపోయి అతని గొప్పతనాన్ని చాటి చెప్తుంది

13 ప్రభాకరశాస్త్రి వేటూరి చాటుపద్య మణిమంజరి పుట 105

సందర్భ కల్పనలు రా వా కర్త ప్రధాన ఇతివృత్తమైన శ్రీకృష్ణ దేవరాయల కథకు సందర్భానుసారంగా కొన్ని కల్పనలు చేశాడు 14

జ్ఞానేంద్ర సరస్వతులవారు విద్యారణ్యులకు ఆశ్రమ స్వీకారమిచ్చి జ్ఞానోపదేశం చేసి భాగీరథీయాత్ర చేసి అక్కడే జీవన్ముక్తిని పొందమని చెప్పాడు అలాగే విద్యారణ్యులు భాగీరథీయాత్రకు బయలుదేరాడు ఇక్కడ రా వా కర్త శింగిటిభట్ల కథను వేదవ్యాసుల వృత్తాంతాన్ని కల్పించాడు ఆ తర్వాత విదా రణ్యులు కాశ్మీరఖండంలో మండనమిశ్రులవద్ద సకల శాస్త్రాలు నేర్చి హంపికి తిరిగి వస్తున్నపుడు లక్ష్మీదేవిని గూర్చి ప్రార్థన చేయగా లక్ష్మీదేవి ప్రత్యక్షమై విద్యారణ్యులకు వరమిచ్చినట్లు చెప్పాడు హంపికి వచ్చిన తర్వాత విద్యానగర స్థాపనకు తగిన స్థలానికై నలుదిక్కులం చూశాడు అప్పుడు అక్కడ కుక్కను కుందేలు తరిమినదృశ్యం కనిపించింది ఆ సందర్భాన్ని పురస్కరించుకొని రా వా కర్త వాలిసుగ్రీవుల యుద్ధ ఘట్టాన్ని మతంగముని శాపవృత్తాంతాన్ని కూడా జోడించాడు ఇది స్థల మాహాత్మ్యానికై చెప్పబడింది విదా నగర శంకుస్థాపన జరిగేటప్పుడు ముహూర్త శంగం కలిగించిన జంగమువాడి ప్రస్తావన రా వా కర్త కల్పితమని చెప్ప వచ్చు ఎందుకంటే దీనికి చారిత్రకంగా బలమైన ఆధారాలు లేవు కాబట్టి.

రాయలకు మంత్రులు రాజనీతి ఉపదే ంచే సందర్భంలో భూదేవి పరి క్షిత్తుల సంవాద ఘట్టం చేర్చబడింది అలాగే యెదులశాహ నిజాంశాహ కుతుపనమలకలనుగూర్చి చెప్పేటప్పుడు ప్రతాపరుద్రుని వృత్తాంతాన్ని చేర్చాడు ఇది ప్రతాప చరిత్ర నుండి గ్రహింపబడింది

గజపతి గొప్పదనాన్ని చెప్పడానికి విరోధులు విషప్రయోగం చేయించిన ఘట్టం కూడా రా వా కర్త కల్పితమే

ఈ విధంగా రా వా కర్త ఆ కాలంలో ప్రజలలో అధిక ప్రచారం పొందిన జన్మశుతులను తన రచనకనుగుణంగా వాడుకొని రచనకు ఒక విశిష్ట తను చేకూర్చాడు

14 ఇక్కడ కల్పన అంటే జనవ్యవహారంలో ఉన్న కథలకు తన గ్రంథంలో చోటు కల్పించడం

అలంకార సామగ్రి రా వా లో ఎక్కువగా ఉపమాలంకారాలు ప్రయుక్తమైనాయి ఇందులోని వ్యక్తులను సంఘటనలను పౌరాణిక వ్యక్తుల తోను పౌరాణిక సంఘటలతోను పోల్చడం కనిపిస్తుంది

సింహాసనాధిపతిని విష్ణ్వంశతో పోల్చడం

"సింహాసనాధిపతి అనంగా విష్ణు అంశగాని యితరంగాదు " (13 8

అశ్వపతి గజపతి నరపతి సింహాసనాలను బ్రహ్మ విష్ణు మహేశ్వరుల అంశాలుగా పోలడం

యీ మూడు సింహాసనములనగా బ్రంహ్మవిష్ణు మహేశ్వరుల అంశలుగా వుండును అందున తారతమ్యములు యే రీతో ఆ రీతువలెనే అశ్వపతి గుర్రాలకున్ను గజపతి యేనుగులకున్ను నరపతి కర్నాటక సింహాసనానకున్ను గనక నరపతియే హెచ్చు " 33 5 18

విజయాపురం అహముదా నగరం గోలకొండలను త్రిపురాలతో పోల్చడం

"విజయాపురం అహముదానగరం గోలకొండ అనే త్రిపురాలకు మూడు సింహాసనాలవారున్ను యెప్పుడు కనిపెంచుకొంటా వున్నారు అప్పుడు అపాయం వచ్చేది నిశ్చయమని తార్క్షకమతి తెలువగా" 41 5 8

తురకలను కలియుగ రాక్షసులుగా పోల్చడం

"తురకలనగా మద్యపాయులు మందు తినేవారు లాలాతి పురుషులు గనక వార్లకు చాలా భీతి గలిగి యుండును పానము జేసినంత పొద్దున్ను తమ దేహములు తాము యెరుగరు గనుక ఆ సమయమందు స్మరణ యెరుగరు అప్పుడు యెవ్వరు అర్థమైన నరుకుదురు కలియుగ రాక్షసుల తీరై వుందురు" 36 11 15

తురకాణ్యాన్ని యముని రాజ్యంతోను అక్కడివారిని యమదూతల తోను పోల్చడం

"తురకాణ్యమనగా యెముని రాజ ము వంట్టిది ఆ పట్టము అటువంటిది ఆ వూరిలో వుండ్డేవారు యమదూతలు అనేటంద్దులకు సందేహం లేదు " 42 20 22

షోడశపాత్రుల పరాక్రమాన్ని అర్జునుని పరాక్రమంతో పోల్చడం

"మీరు పదార్గురున్ను పది దిక్కుల కనిఎంచ్చుక కార్యం శేస్తే మాలి వానాను వురుములున్ను ఎడుపులున్ను బడినట్లు భీభత్సుగా పోరుమరు యిది గాక పూర్వమందు అర్జునుండ్డు ఉత్తర గోగ్రహణమందు దురో ధనాదుల మీద నడచి యుద్ధం శేశి అవుల త్రిప్పక వచ్చేటప్పుడు అందరి పోగులున్ను శిరోవేష్ట నలున్ను వొదశివచ్చినట్టుగాగలరు " 68 1 6

జీవభాష రా వా భాషలో ఆనాటి పలుకుబళు సమృద్ధిగా చోటు చేసుకున్నాయి అందువల్ల ఈ భాషలో సజీవత్వం గోచరిస్తుంది ఆ కాలంలో వ్యవహారికమనీ గ్రాంథికమనీ తేడా ఉండేదికాదు ఆనాటి కైఫియతుల్లోను కథల్లోను ఇది సర్వత్ర కన్పిస్తుంది ప్రతి రచయిత శైలిని నిర్ధారించే కొన్ని పడికట్టు ప్రయోగాలు ఊతపదాలు అతని రచనలో స్పష్టంగా కనిఎస్తాయి అలాగే రా వా లో కూడా రచయిత శైలిని చూడవచ్చు

పలుకుబళ్ళు

| | |
|---|---|
| కాలు వేగం 21 6 | రేయుపగలు 24 5 |
| క్షణేక్షణే 22 13 | సత్కృభ్రమముగా (68 23 |
| ఇనుమారుముమ్మారు (23 16 | తిరిగి మరిగి 23 3 |
| నేటమర్నాట (24 7 | మరుచునాడు 24 8 |

పడికట్టు ప్రయోగాలు

| | |
|---|---|
| తోడట్టు (22 5 | దావకట్టుగా 53 7) |
| మునకలుగా 21 1 | పెడతల పోటుగా (61 1 |
| ఏకదేశాన 36 1 | దైవీకంగా (61 1 |
| నిండారుగా 26 26 | కంపోలం శేయంగా (64 14 |
| టోకించు (52 25 | యధాయధలుగా (59 13 |
| వేటారుతునకలుగా (53 5 | అవ్వారిగా (77 18 |

ఊతపదాలు రా వా లో గనక అనే ప్రయోగం యథేచ్ఛగా వాడ బడింది ఉదా " యీరీతి యానబెట్టి బాధలు చూస్తావుండి వెంబడినే ఆ యాధిపత్యము నగరి మహలుకు ముందర యెదురుగానే కట్టివుందురు గనక అందుండ్డి ఆయా దావిశ వారు సలాము శేయంగ్గా మొదటిదొర మిత పరిజనములతో మహలుమీద కొలువై యుండ్డి కొలువుదీరి నగరికి పోయ్యే టప్పుడు వున్నతమైన మార్గములుగానె కట్టి వుండ్డును గనక ఆ వున్నత స్థానమందు నిలిచి వెలిదావ లో వుండే వార్లఁను జూచి వార్రి వార్లఁకు నిత్య కట్టన బహుమానము సన్మానంబులు నడిపంచ్చే క్రమానికి నడిపంచ్చమని ఉత్తరువు ఇయ గానే ఆయా పనులవారు రొక్కంవుడుగరలు దట్టికబాయి తలపాగ పట్టీలు యివి అన్నింన్ని ఆయా దావిశ లోనే వుండ్డును గనక తోడు లోనె తెచ్చి మొదటిదొర ముంద్దుగానె వారి వార్లకు ఇయ్యగా సకలమైన వార్లన్ను కొలువు జేశివుండ్డురు గనక యెంద్దరు వచ్చినా వార్లఁకు గ్రాసం కట్టడజేసి వుండ్డును గనక వారలకు గ్రాసం యిప్పించ్చి మరి వెనక నగర్లోని పోదురు " 39 9 2

ఒకపోట చెప్పి అనేది ఊతపదంగా ప్రయోగింపబడింది

"దుష్ట నిగ్రహం శిష్ట పరిపాలనం శేయవలెనని చెప్పి తిరుగా అందుకు ప్రతిచింత కట్టి వచ్చేము 28 11

---

15 చెప్పి = అని చెప్పుధాతువు యొక్క క్త్వార్థక రూపం ఇత ర్థంలో వాడటం రాయలసీమలో ఎక్కువగా కనిపిస్తుంది

# రాయవాచకం – సామాజిక జీవితం

శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి సామాజిక జీవితం గురించి తెలుసుకో డానికి రా వా కొంతవరకు దోహదం చేస్తుంది అనాటి వరిపాలనావ్యవస్థ సైనికవ వస్థ ఆర్థికవ్యవస్థ మత సంబంధమైన విషయాలు ఆచార వ వహా రాలు సాంఘిక వరా దలు రాజుయొక్క దైనందిన జీవితం మొదలైన విష యాలు రా వా వల్ల తెలుస్తాయి

పరిపాలనా వ్యవస్థ వరిపాలనా సౌలభ్యంకోసం సామ్రాజ్యం రాజ్యాలు గాను రాజ్యాలు సీమలుగాను సీమలు స్థలాలుగాను స్థలాలు గ్రామాలుగాను విభజింపబడింది సామ్రాజా ధిపతి రాజు రాజ్యాలను వరిపాలించడానికి దళ నాయకులు నియమింపబడేవారు ఈ దళనాయకులే అమర నాయకులుగా ఉండేవారు వీరు రాజ్య వరిపాలన చూసుకుంటూ కొంత సైన్యాన్ని సామ్రా జ్యానికి సమకూర్చవలసి ఉండేది అందుకు ప్రతిఫలంగా రాజు వీరి కు కొంత భూమి ఇచ్చేవారు అదే అమరమాగాణి భూమి సంవత్సరానికొకసారి దళ నాయకులు కొంత మొత్తాన్ని సామ్రాజ్య కోశ భాండాగారానికి జమకట్టవలసి ఉండేది ఈ దళనాయకులు రాజ్యానికి రావలసినద్రవ్యాన్ని వసూలు చేయడం రాజ్యంలో శాంతి భద్రతలు వరిరక్షించడం ప్రజానీకాని కవసరమైన వను లను చక్కబెట్టడం ప్రజలమధ్య వచ్చే తగాదాలను విచారించి సామరస్యాన్ని నెలకొల్పడం మొ న విధులన్నీ నిర్వర్తించేవారు శ్రీకృష్ణదేవరాయలు ఈ దళ నాయకులందరిని బ్రాహ్మణ కులం నుండే ఏర్పాటు చేసుకొన్నట్లు ఆముక్త మాల్యద ను బట్టి తెలుస్తుంది [1] దీనికి కారణం బ్రాహ్మణులు విశ్వాసంతో వని చేస్తారని కష్ట సమయాల్లో సమస్యలను చతురతతో వరిష్కరించే శక్తి సామర్థ్యాలను కలిగి ఉంటారని రాయలు అభిప్రాయవడినట్లు స్పష్టమవుతుంది

---

1 సూర్యనారాయణ విష్ణుభొట్ల శ్రీకృష్ణదేవరాయల చరిత్రము పు 156

2 ఆముక్తమాల్యద V 207 210

సీమ నాడు పాలనాధికారిగా పారుబత్యగార్ ఉండేవాడు [3] ఇతనిని దుర్గనాయకుడో అతని ప్రతినిధో నియమించేవాడు

స్థలానికి స్థలకరణం ఉండేవాడు ఇతడు స్థలంలోని రెవిన్యూ లెక్కలను వ్రాయడమేగాక స్థానిక తగవులను కూడా తీర్చేవాడు

గ్రామం ప్రాథమిక విభాగం ఈ గ్రామాలు మూడు రకాలుగా ఉండేవి భండారవాడ గ్రామాలు అమరగ్రామాలు మాన్య గ్రామాలు భండారవాడ గ్రామాలు రాజు అధీనంలో ఉండేవి అమరగ్రామాలు దుర్గనాయకుల అధీనంలో ఉండేవి మాన్య గ్రామాలు దేవాలయాలకు మఠాలకు బ్రాహ్మణులకు చెంది ఉండేవి ప్రభుత్వం తన గ్రామాలను గుత్తదారులకు అమరకం ఇచ్చేది అమరనాయకులు కూడా అలాగే చేసేవారు గుత్తదారులు పన్ను వసూలుచేసి ఇచ్చేవారు ఇతర గ్రామాలు రెడ్డి గౌడ కరణం శానభోగ అధీనంలో ఉండేవి వీళ్ళు ప్రభుత్వోద్యోగులు

రాజు   రాజు సర్వతంత్ర స్వతంత్రుడు సార్వభౌమాధికారి జనుల స్థితిగతులు నైతికపరిణామాలు రాజు పరిపాలనపై ఆధారపడి ఉండేవి ఆచారవ్యవహారాలు విధినిషేధాలు మొదలైన సమస్త కర్మలు రాజాజ్ఞానుసారం నడిచేవి

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద లో యామున రాజు తన కొడుక్కి రాజెలా ఉండాలనే నీతిని బోధిస్తాడు [4] అంతేగాక రాజు యోగక్షేమాల కోసం చారగణాన్ని ఉపయోగించాలనీ సైన్యాన్ని సమృద్ధిగా సమకూర్చుకోవాలని కూడా చెప్తాడు ఇది రాయల రాజనీతిజ్ఞతను తెలియజేస్తుంది

రాజు ధర్మ పాలకుడుగా ఉండాలని చెప్తూ సాలెతూర్ "A Crowned K ng shou d a way ru e w h an eye owards dharma" అని పేర్కొంటాడు [5]

---

3 సత్యనారాయణ కంభంపాటి విజయనగర యుగం ఆంధ్రుల సంస్కృతి చరిత్ర I పు 30

4 ఆముక్తమాల ద v 204 - 284

5 Sa e ore B A Soc a and Po ca fe n he V ayanagara Emp re Vo P 245

శ్రీకృష్ణదేవరాయలు అన్ని గుణాలు మూర్తీభవించిన గొప్ప ప్రభువు అతడు ప్రజలను కన్నబిడ్డలవలె చూసేవాడు ఇతను ప్రతిరోజు రాత్రి కొలువు తీరిన తర్వాత నగరు శోధనచేసి అన్ని విషయాలు తెలుసుకొనేవాడు ఒక రోజు కరణీకులను కొలువునకు రప్పించి వారితో కర్నాటక సింహాసనమునకు ఎన్ని లక్షల రాజ్యములు? ఆ రాజ్యములో గిరిదుర్గ స్థలదుర్గ వనదుర్గ జల దుర్గములు యెన్ని కోటలు యెన్ని గరములు గ్రామభూములు యెన్ని యేయే దుర్గాలకు యెంత నగరి బొక్కసానవుండె రొక్కరూపాయలకున్ను నవరత్న భూషణములకున్ను స్థాపించి వుంచిన నిక్షేపములకున్ను శిఖమణియ గార్లమీద చెల్లు నిలువకున్ను నగరి కైజీతం యేనుగ గుర్రం పరిజనాలకున్ను వివరముగా లెక్కవ్రాసి తెచ్చిచదవమని" అనతిచ్చారు అలాగే వారు రాత్రింబవళ్ళు జాగ్రత్తగా లెక్కలు వ్రాసి రాయలకు విన్నవం చేశారు[6] ఈ విధంగా అన్ని విషయాలు స్వయంగా తెలుసుకొనేవాడు కావలసినంత సైన్యాన్ని సంతరించుకొని తన సామ్రాజ్యాన్ని కావేరి నుంచి సింహాద్రి పొట్నూరు దాకా విస్తరింప జేశాడు ఇతని కాలంలో అనేక దేవాలయాలు కట్టడాలు నిర్మించబడ్డాయి సర్వమతాలు సమానంగా సమాదరించబడ్డాయి ప్రజలు సుఖశాంతులతో జీవించారు కళలు బాగా పోషించబడ్డాయి కవులు పండితులు పోషింపబడ్డారు తెలుగు సాహిత్యం మూడు పువ్వులూ ఆరు కాయలుగా విలసిల్లిం అందుకే ఇతన్ని యుగాన్ని The Augu an Age o Te ugu L e a ure అని ప్రశంసించారు

మంత్రి సామ్రాజ్యం సప్తాంగ సమన్వితం ఇందులో ప్రధానాంగం రాజు మంత్రి ద్వితీయాంగం మిత్రసంపద ధనం రాజ్యం దుర్గం సైన్యం తక్కిన అంగాలు శ్రీకృష్ణదేవరాయలకు తిమ్మరుసు అయ్యమరుసు కొండమరసు బాచరసు తిప్పరసు మొ నవారు మంత్రులుగా ఉన్నట్లు తెలుస్తుంది[8] వీరు పరిపాలనలో రాజుకు సహాయకులుగాను సలహాదారులుగాను ఉండేవారు

---

6 రాయవాచకము పు 23 24 లు

7 V ayanag a S xcen ena y Commemorat on Vo ume P 181

8 రాయవాచకము పు 80

శక్తి సామర్థ్యాలను బట్టి ప్రధానమంత్రి పదవి ఒసంగబడేది ఇతడు రాజు తర్వాత రాజంతటివాడు రాజు మంత్రులతో ఆలోచించకుండా ఏ కార్య మూ తలపెట్టేవాడు కాడు ఏదైనా కార్యాన్ని గూర్చి ఆలోచించవలసివచ్చినపుడు రాజు మంత్రులందరిని సమావేశపరచి అందులోని సాధకబాధకాలను చర్చించే వాడు

తిమ్మరుసు రాయల ప్రధానమంత్రి అంతేకాదు రాయలకు తిమ్మరుసు యెడల పితృవాత్సల్యం ఉండేది అందుకే ఆ పూజ్యభావంతో అప్పాజీ అని పిలిచేవాడు ఒకనాటి రాత్రి రాయలు నగరుశోధనకై వెళ్లి సూర్యోదయమైనా తిరిగి రాకపోవడం చూసి అప్పాజి అష్టదిక్కులకు గూఢచారులను పంపి రాయలజాడ తెలుసుకొని ఆక్షణమే రాయలు వేటకు పోతున్నారని దొరమన్నీ లకు అమరనాయకులకు అందరికీ చీట్లు వ్రాసి పంపించి తన పరివారంతో ఆక్షణమే రాయలవద్దకు కదలిపోయాడు అప్పుడు రాయలు తనకు కావలసి నంత సైన్యం లేదని పట్టుపట్టగా అక్కడే ఉన్నచోటనే అయిదువందల ఏనుగులు పంద్రెండువేల గుర్రాలు లక్షబంట్లను సంతరించి పెట్టి రాయల ప్రశంసకు పాత్రుడయాడు [9] ఇలా రాయలకు తిమ్మరుసు కుడిభుజంలాగా ఉండి పరిపాలనకు సంబంధించిన అన్ని కార్యాల్లోనూ చాల శ్రద్ధ వహించి శాశ్వత కీర్తిని తెచ్చిపెట్టాడు

రాయల కొలువు ఇది ఏకాంతపు కొలువు నిండుకొలువు దీవటి కొలువు అని మూడు విధాలుగా ఉన్నట్లు రా వా న్ని బట్టి తెలుస్తుంది

ఏకాంతపు కొలువు ఇది చాల పరిమితమైనది ఇందులో రాజు ఏకాంతంగా కూర్చుండి ఆయా లెక్కలను కరణాల ద్వారా తెలుసుకొనేవాడు అలాగే వివిధ రాజ్యాలనుండి వచ్చిన కమ్మ కాగితాలనుకూడా తనే చూసేవాడు

నిండుకొలువు రాజు ఏకాంతపు కొలువు తీరిన తర్వాత నిండు కొలువుకు వచ్చేవాడు ఇది చాల విస్తృతమైనది ఇక్కడ సకల సామాజికులు

---

9 రాయవాచకము పు 26 28 లు

10 పైదే పు 4 69 లు

వచ్చి కూర్చుండేవారు ఇందులో నగరి అల్లుండ్లు కొమాళ్ళు దొరమన్నీలు ప్రభువులు పాళగాండ్లు అమరనాయకులు ఆప్తులు ఆశ్రితులు విద్వాంసులు పురోహితులు ఆచార్య పురుషులు జియ్యంగార్లు యతీశ్వరులు దైవజ్ఞులు భిషజులు రౌతులు మావుతులు వేశ్యగార్లు రాజులు వందివైతాళికులు పాటకులు పౌరాణికులు శాస్త్రజ్ఞులు నాటకాలంకారులు విద్యాధికులు వీణా ధరులు మొదలైనవారు ఇంకా విని యోగాలవారు వచ్చి కూర్చుండేవారని రా వా న్ని బట్టి తెలుస్తుంది 1

దీపటి కొలువు ఇది రాత్రిపూట తీర్చే కొలువు రాజు యుద్ధానికి వెళినప్పుడు మరుసటిరోజు చేయవలసిన కార్యక్రమాలను గూర్చి మంత్రులతో ఆలోచించడానికి రాత్రిపూట దివ్వెటీల వెలుగులో ఏర్పరచే కొలువు శ్రీకృష్ణ దేవరాయలు గజపతి రాజుపై దండెత్తిపోయినప్పుడు అక్కడ దీవటి కొలువు ఏర్పాటుచేసినట్లు రా వా తెలియజేస్తుంది

గూఢచారులు ఇరుగుపొరుగు రాజ్యాల స్థితిగతులను ఎప్పటికప్పుడు తెలుసుకోడానికి రాజులు గూఢచారులను నియమించేవారు వీరు చాల తెలివిగల వారుగను రాజుకు విశ్వాసం గలవారుగను ఉండేవారు రాజు ప్రతిదినం ఆచరించవలసిన విధ్యుక్త ధర్మాలలో గూఢచారులతో సంప్రదించడం కూడా ఒక విధిగా భావించేవాడు వీరు రహస్యాలను తెలుసుకోడానికి రకరకాల వేషాలను ధరించేవారు వివిధ భాషలను మాట్లాడేవారు రాయలు అన్ని రాజ్యాల్లోను వీరిని నియమించినట్లు తెలుస్తుంది

"గనక కృష్ణరాయలవారు ఆనందము బొంది భూవిస్తారమున్ను రాజ్యమున్ను జూడవలెను అని నిశ్చయించి మునకలుగా చారులవలన ఆయా దేశములున్ను ఆయా దిక్కులనుండే దొరలు మన్నెరికముల నడతలున్ను వారివారి కలిమిబలములున్ను గ్రామాదులున్ను వల్ల పట్టణములున్ను పండిత పామర జనులు ఆడుకొనే వార్తలున్ను కోట కొత్తళములయందలి నడవడి తెలు

---

11 రాయవాచకము పు 4

12 పైదే పు 69

తెలిశీ నానాటి ప్రవర్తములున్ను గోప్యముగా వచ్చి వలకరించేటట్టుగా కాలు వేగం గలిగి బుద్ధివిచక్షణులై బహు భాషాంతరములు దెలిసి బహురూపములుగా నున్ను సంచరించి అంతరంగ వార్తలరశీ వచ్చేటట్టుగా విజయాపురం అహ ముదా నగరం బెదదకోట రాజమహేంద్రం ఆరంగం చెన్నపట్టం శ్రీరంగ పట్టం చదరంగపట్టం శ్రీరంగం మదుర రామేశ్వరం పుమ్మత్తూరు శివ సముద్రం పెనుగొండ గోలకొండ గుర్రంకొండ మేల్నాడు మొరసునాడు పుట్టంశీమ అరవరాజం మళయాళం కొచ్చి కొంకణం కేరళం విరాటపురం వరాటదేశం మగధదేశం మత్స్యదేశం విదర్భదేశం కాంభోజనగరం కాశ్మీర ఖండం ఢిల్లీనగరం ఇవి మొదలయిన తావులకున్ను తులువహైమ మొదలయిన దక్షిణ రాజ ములకున్ను చంద్రగిరి గండికోట కడప నంద్యాల బెల్లంకొండ రాచూరు ముదుగల్లు నిడిగల్లు మైసూరు మొదలయిన స్థలములకున్ను వేగుర్లున్ను నియమించి అంపించి పట్టణముల సంచరించగా " పు 20 21 లు

నేడుకూడా ప్రతి దేశంలోను రహస్యంగా పనిచేసే గూఢచారి ఉంటోంది

స్థానాపతులు ఒక రాజం వారు తమ ఇరుగు పొరుగు రాజ్యాలలో స్థానపతులను నియమించే ఆచారం ఉండేది విజయనగర సామ్రాజ్య కాలంలో విజయనగర రాజుల సామంతులు అమర నాయకులు రాజధానీ నగరమైన విజయనగరంలో జరిగే రాజకీయ విశేషాలను తెలుసుకోడానికి స్థానాపతులను నియమించేవారు గజపతి రాజ్యంలో కర్నాటకం వారి స్థానాపతి కమల నాభయ్యను తదితర స్థానాపతులను రా వా పేర్కొంటుంది

"ఆ వివరం అదంత్తం కన్నాటకం వారి స్థానాపతి కమలనాభయ్య కృష్ణరాయలవారి సముఖమానకు సత్క్రమముగా కాకతము వ్రాయించి ముద్రబెడ జేశీ అతి గోప ముగా రాయలవారు అంత్త పురాన వున్నప్పటికిన్ని ఆయన చేతనే కాకితములు యిమ్మని చెప్ప అంప్పగా" [68 22 26]

"పరదనే దాల్లణ స్థానాపతులయిన అముపురం వారి అనంతోజ పంత్తులున్ను మానశింగ్గు వారి మాధవయ్యాను చాందువారి చెంన్నగిరయ్యాను కటకం

వారి కరుణాకరయ ను వోరగంట్టి వారి వోబళయ్యాను ఢిల్లి సురతాణి వారి ఢాకోజీ వంత్తులున్ను బెదదకోట వారి బేకోజీ వంత్తులున్ను గోలకొంండ్ల వారి గోపోజీ వంత్తులున్ను అహముదా నగరం పయ్యవ రాజున్ను విజయాపురం వీరమరాజున్ను పురాణపురం పురందరయా ను బాగానగరం బాబోజీ వంత్తులున్ను మొదలుగా గల ముఖాములైన స్థానాపతులు అంద్దరున్ను " పు 49

వేగరులు వీరు వార్తాహరులు ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి వార్తలు అందించేవారు వేగంగా వార్తలు అందించడంవల్ల వీరి వాయువేగి మనోవేగి అనే బిరుదులు కూడా ఉన్నట్లు రా వా వల్ల తెలుస్తుంది

గజపతివారల రాజ్యంబు పురుషోత్తమాన నుండ్డింద్ది వేగుల వాయు వేగి హనుమంతయ్యాను మనోవేగి పురుషామృగమయ్యానువచ్చి నిలిచి రాయల దేవునితో విన్నవం శేశినారు " పు 48

అహముదానగరం గోలకొలడలనుండి వేగుల అరవరాముడు వక్కి గోపోజి అనే ఇద్దరు రాయలకు వార్తలను అందచేసేవారు

"అహముదానగరం గోలకొంండ్లలో కన్న విన్న వాతలు వేగుల అరవ రాముడున్ను వక్కిరి గోపోజి యిద్దరు తెలియ విన్నవము శేయగా పు 42

ఈ వేగరులు అన్ని ప్రాంతాల్లోను సంచరించి వార్తలను తీసుకొచ్చే వారు

నగర రక్షణ నగర రక్షణార్థం తలార్లు నియమింపబడేవారు వీరు విదా నగర పట్టణంలోను వెలిపాళాలలోను జాగ్రత్తగా రాత్రింబవళు కావలి కాసేవారు ఈ తలార్లలో తలారి జంగమయ్య అనేవాడు అత్యంత బాధ్యతా యుత వ్యక్తిగా ఉన్నట్లు రా వా న్నిబట్టి తెలుస్తుంది

ఆ వెంబడిగా తలారి జంగమయ వచ్చి రాయలవారి సముఖానకు అడ్డబడి చేతులు కట్టుకొని నిలిచి దళనాయకులతోను విద్యానగర వట్టణములో నున్ను వెలిపాళములయందున్ను యాది హెచ్చరికలు గలిగి రాత్రి వగళు తలార్లు జతనమై జాగ్రత్తగా కాస్తావున్నారు గనక పట్టణములోగల అష్టాదశ వర్ణాదులవారున్ను అత్యంత సంతోషవరులై అతివైభవములతోవట్టు నిత కల్యాణములున్ను వచ్చతోరణములున్ను గల్గివున్నారని విన్నవం శేయంగా (పు 3

నగరశోధన నగరంలో గూఢచారులను నియమించడమేకాక కృష్ణదేవరాయలు తానే స్వయంగా రాత్రివేళల్లో నగర శోధన గావించి ప్రజల కష్టనష్టాలను తెలుసుకొనేవాడు నగరశోధన జరిపిన తర్వాత ఉదయాన్నే రాయలు తలారి జంగమయను పిలిచి "రాత్రి పట్టణములోని ప్రవర్తమానములేమి" అని అడిగేవాడు అతడు చెప్పిన సమాధానాలు తాను చూసిన వాటికి స గా ఉంటే విని ఊరకే ఉండేవారు లేకపోతే "యీ పాళాన యిటువంటి వీధిని యీ యీ శ్రేణిలో ఇంన్నో యింటివద్ద రాత్రి నడచిన నాయ ములు తెలిసినవాడవుగావు నిన్ననవేరములేమి నీవు తలారికంజె సేదిన్ని మేము రాజ పరిపాలనం జేశేదిన్ని లెస్సాయనని సున్నితంగా మందలించేవాడు అప్పుడు తలా జంగమయ భయపడి నిద్రాహారాలుకూడా లెక్కచేయకుండా కావలికట్లవారిని రాత్రింబవళు జాగ్రత్తగా కనిపెట్టి నడిచే కార్యాలు వచ్చి తెలిపేవాడు

సైనిక వ్యవస్థ శ్రీ కృష్ణదేవరాయల కాలంలో సైన్యం రెండు రకాలుగా ఉండేది 1 అమరనాయక సైన ం 2 కైజీతపు సైన్యం అమరనాయకులు తమ సొంత ఖర్చుతో రాజుకు అవసరమైనప్పుడు సమకూర్చే సైన ం అమరనాయక సైన్యం అమరనాయకులు పోషించే సైనానికయ్యే ఖర్చును భరించడానికి రాజు ధనానికి బదులుగా తగినంత భూమిని ఇచ్చేవాడు ఇట్లివ్వబడిన భూమికే అమరమని పేరు ఆ కాలంలో ఆ యకం అదవని చెయ్యేటి దుర్గం గుత్తి గండికోట చంద్రగిరి గుర్రంకొండ మద్దూరు సోమగిరి త్రిశిరపురం కున్నత్తూరు పెనుగొండ మున్నీదలైన దుర్గములున్ను నందాల శ్రీరంగపట్టం వుమ్మత్తూరు దళనాయకుల కోట్లావల్లంకోట మదుర పాళంకోట దిండి ల్లు సత వేదు కొట్టికల్లు దంకినీకోట నారణవనం మొదలైన వనదుర్గములు దేశములుగల రాజ ములున్ను" అమర నాయకుల అధీనంలో ఉండేవి

రాజు తన రాజభాండాగారంనుండి ఎప్పటికప్పుడు జీతమిచ్చి ఉంచుకొనే సైన్యం కైజీతపు సైన ం రాయలకు పూర్వం ఈ కైజీతపు సైన్యముండేది

---

13 రాయవాచకము పు 22

14 పైదే పు 25

కాదు ఈ కైజీతపు సైన్యంలో యుద్ధ నిపుణతగల కబ్బిలి తుళువ మొరసు జాతివారిని చేర్చుకొనేవారు

రాయలకు నూట ఇరవై పట్టాలు ఏనుగులు ఇరవైనాలుగు వేల గుర్రాలు రెండు లక్షల కాల్బలం గల అమరనాయక సైన్యమూ అయిదు వందల ఏనుగులు పన్నెండు వేల గుర్రాలు లక్ష కాల్బలంగల కైజీతపు సైన్యం ఉండేదని తెలుస్తుంది

ఆర్థిక వ్యవస్థ రాయలవారి రాజ్యంలో రెండు భాండాగారాలుండేవి ఒకటి చిన్న భాండాగారం ఇంకొకటి పెద్ద భాండాగారం చిన్న భాండాగారం బంగారు భాండాగారం పెద్ద భాండాగారం రొక్కరూపాయలకు సంబంధించినది ఇదే నిత్యమూ ఉపయోగంలో ఉండేది చిన్న భాండాగారానికి అల్లాల నాథుడనేవాడు బాధ్యత వహించినట్లు తెలుస్తుంది [6] పెద్ద భాండాగారంలో ముదుపు గొల్లలు ఉండేవారు వీరు వివిధ శాఖల్లో పనిచేసేవారికి సంబళం సారికెలు బట్వాడా చేసేవారు బొక్కసం గొల్ల కొమారస్వామి ఉన్నతాధికారిగా ఉన్నట్లు కనిపిస్తుంది [8]

కోశాధి వివరణ నగరి వివిధ లెక్కలు వ్రాయడానికి తొమ్మిది సంప్రతులు ఉండేవారు కృష్ణదేవరాయలు పట్టాభిషిక్తుడైన తర్వాత ఆయా లెక్కలను చూపించమని తొమ్మిది సంప్రతులకు అనతిచ్చాడు అప్పుడు వారు వివరంగా వ్రాసుకొని వచ్చి విన్నపం చేసినది విద్యారణ్యస్వాములవారు విజయనగరాన్ని నిర్మించినపుడు సింహాసనస్థునికి నిక్షేపించిన ధనం తొంభై తొమ్మిది కోట్ల యాభై ఆరు లక్షలు నగలు నాలుగుకోట్లు నవరత్నాలు ఆరు

---

15 రాయవాచకము పు 30

16 పైదే పు 24

17 మొన్న మొన్నటిదాకా కర్నాటక ప్రభుత్వ ఆర్థికశాఖలో గొల్లర్ అనే పదవి ఉండేది డబ్బును వివిధ శాఖలకు సమకూర్చడం వివిధ శాఖల నుండి ఖజానాకు చేకూర్చడం ఇతని విధి

18 రాయవాచకము పు 71

కోట్లు ఇవికాక అదివరకు సింహాసనస్థులు సింహాసనాన్ని నడుపుకొని సెలవు శిద్దాయాలు పోగా బొక్కసాన వుంచినది పందొమ్మిదికోట్ల యాభైయరు లక్షలు ఇదిగాక కర్నాటక రాజ్యం పదికోట్ల యెనభైనాలుగు లక్షల దేవాదాయం బ్రహ్మాదాయం సర్వమాన్యం మతవరమైనవానికి అరవై లక్షలు పోగా నిలిచినది పదికోట్ల ఇరవైనాలుగు లక్షలు పు 24

సైన్యానికయ్యే ఖర్చు జీరా సంజ్ఞోక గుర్రాలకు రోజు గుర్రం ఒకటింటికి నూరే ఘట్లలెక్క గుర్రాలు వెయి ంటి లక్షఘట్లు అలాగే ఇరవైనాలుగు వేల గుర్రాలకు ఇరవైనాలుగు లక్షలు ఏనుగు ఒక్కంటికి రోజు వెయేశి ఘట్లలెక్క ఏనుగులు నూట ఇరవైయింటికి లక్షా యిరవైవేలు అలాగే వెయ్యిన్ని ఇన్నూరు ఏనుగులకు పంద్రెండు లక్షలు ఒక్కొక్క బంటుకు నెలకు ఘట్టి రెండేసి వరాల లెక్క వెయ్యిమంది బంట్లకు రెండువేల వంతున రెండులక్షల బంట్లకు రోజు నాలుగు లక్షలు వ్యయం చేసేవారు (పు 24

మతం విజయనగర సామ్రాజ్యం ప్రధానంగా హిందూ ధర్మ పునరుద్ధరణకై స్థాపించబడింది క్రీశ 14 వ శతాబ్ది ఆరంభం నాటికే దక్షిణ భారతదేశంలో పెద్ద పెద్ద సామ్రాజ్యాలు అంతరంగిక కలహాలవల్ల క్షీణదశనొందాయి ప్రజలు వివిధ మతభేదాలతో భిన్నాభిన్న మయారు ఇది ఉత్తర భారతదేశంలో కాలుమోపిన ముసల్మానులకు మంచి అవకాశమైంది అదను చూసుకొని దక్షిణ భారత దేశంపై దాడి చేయనారంభించారు వారి దాడి నెదుర్కొని ధర్మాన్ని రక్షించడానికి విజయనగర సామ్రాజ్యం అన్ని మతాల వారిని సంఘటితపరచి ఒకే త్రాటిపైకి తెచ్చి నిలిపింది విజయనగర రాజులు తమ వైయక్తిక విశ్వాసం కొద్దీ తమకిష్టమైన మతాన్ని అవలంబించినా అన్ని మతాల వారిని సమానంగా ఆదరించేవారు

వీరనృసింహరాయలు వైష్ణవులను శైవులను సమానంగా చూసినట్లు రా వా వల్ల తెలుస్తుంది తానే స్వయంగా నామాలను, విభూతిని ధరించేవాడు నూటయెనిమిది తిరుపతులనుంచి వచ్చిన అయ్యంగార్లను డెబ్బైరెండు దేవస్థలాల శైవక్షేత్రాల నుండి వచ్చిన ఆరాధ్యబృందం వారిని సమాదరించి ఉచితాసనాలపై కూర్చుండబెట్టి వారిచ్చే తీర్థ ప్రసాదాలను విభూతి గంధ ప్రసాదాలను స్వీకరించేవాడు తర్వాత అష్టస్వయంవ్యక్తమైన శ్రీరంగం శ్రీముష్ణం

వెంకటాచలం సాలగ్రామం తోతాద్రి నైమిశారణం పుష్కర క్షేత్రం మొద లైన స్థలాలకు సురక్షితం గలవా? నూటయెనిమిది తిరుపతులున్న నిత్యోత్స వంగా నడుస్తావున్నవా అని అయ్యంగార్లను పృథివ్యాపస్తేజో వాయురాకా శాత్మకమైన యేకామ్రనాథ జంబునాథ అరుణాచలేశ్వర కాళహస్తీశ్వర చిదం బరం మొదలైన దెబ్బైరెండు దేవస్థలాలకు పదునెనిమిదిశక్తులకు నిండు పడి తరాలు గలవా అని ఆరాధులను అడిగి తెలుసుకొని సంతోషపడి వారికి వస్త్రాలు కూడా ఇచ్చేవాడు

శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా వైష్ణవ మత ప్రియుడైనప్పటికీ తన కులదైవమైన విరూపాక్ష స్వామిని ఎన్నడూ మరువలేదు 20 అతనికి వెంక టేశ్వరస్వామిపై అపారమైన భక్తి ఉండేది అందుకే తన జీవితకాలంలో వెంకటేశ్వరస్వామిని ఏడుసార్లు దరిశించి అనేక బహుమానాలు సమర్పించు కొన్నాడు షోడశ మహాదానాలు చేశాడు స్వామి ఎదుట శాశ్వతంగా ఉండ టానికి తన దేవేరులైన తిరుమలదేవి చిన్నాదేవి సమేతంగా తన విగ్రహాన్ని తామ్రంతో చేయించి నిలిపాడు ఇతడు శైవవైష్ణవమనే తేడా లేకుండా అన్ని క్షేత్రాలను దరిశించి కానుకలు సమర్పించాడు ఇతని ఆస్థానంలో శైవకవులు కూడా ఉండేవారు

యుద్ధసన్నాహాలు రాయలు యుద్ధం ప్రారంభించడానికి ముందు జోసులచేత ముహూర్తం పెట్టించేవాడు యుద్ధానికి వెళ్ళే ముందు రాజధాని నగరంలో ఒక బహిరంగ ప్రదేశంలో వెలిగుడారాలు వేయించి దొరమన్నీ లను రౌతులను మావుతులను సైన్యాధికారులను కరణాలను రాయసం వారిని అవసరం వారిని అందరినీ అక్కడకు రప్పించి తమతమ స్తోమాలతో ఆయత్తపాటుతో యుద్ధానికి రావాలని ఆనతిచ్చేవాడు దిగ్విజయయాత్రకు బయలుదేరేముందు నగరిలో విందు ఏర్పాటు చేసేవాడు లెక్కప్రకారం అమర నాయక సైన్యం కైజీతపు సైనం యుద్ధానికి సిద్ధమయేది కొంత గుర్రపు

19 రాయవాచకము పు 3

20 శ్రీకృష్ణదేవరాయన దినచరి పు 5 52 లు

21 రాయవాచకము పు 77 78 లు

నగరం రాజువ విజయనగర పట్టణానికి రక్షణగా ఉండేది దండయాత్రకు సిద్ధ్వనిగా దిక్కులు ఎక్కటిల్లేటట్టు భేరితాడనంచేసి ధమామి బోకించేవారు మూడో నగారా బోకించగానే అందరూ బయలుదేరి వెళేవారు సైన్యం వెంట కవులు కూడా యుద్ధానికి వెళినట్లు రా వా పేర్కొంటుంది [2] రాజులు యుద్ధానికి వెళినపుడు అతిసుందరమైన అతివిలువైన గుడారాలు వేసుకొనే వారు [2] వీటిలో అంతస్తు గుడారాలు కూడా ఉండేవి [4] శత్రు రాజులను జయించిన తర్వాత తనవారిని కొంత మందిని ఠాణంగా ఉంచి అక్కడ దొరకిన యుద్ధసామగ్రితో ముందుకు సాగిపోయేవారు శ్రీకృష్ణదేవరాయలు కొన్ని రాజ్యాల్లో ఆముదాలు జిల్లేళ్ళు కూడా విత్తించినట్లు తెలుస్తుంది యుద్ధం ముగిసిన తర్వాత రాజు తన ఖడ్గాన్ని పుణ్య నదిలో కడిగే ఆచారం ఉండేది ఈ సంప్రదాయాన్నే కన్నడ శాసనాల్లో బాళ్గఛ్చు అని సంస్కృత దాఖలాల్లో ఖడ్గదారాంటస్ అని తమిళ సంగమ సాహిత్య కృతుల్లో వాళ్ మంగళమ్ అని ఎలిచారు [2] శ్రీకృష్ణదేవరాయలు ఉత్తర దిగ్విజయ యాత్ర ముగించుకొని తన ఖడ్గాన్ని ధనుష్కోటిలోని పుణ్యనదిలో కడిగినట్లు రా వా చెప్తుంది [2]

ఆచారాలు ఒక సంఘంలోని ప్రజలు తరతరాలుగా పాటించే పద్ధతుల్ని ఆచారాలని నిర్వచించవచ్చు కాలప్రవాహంలో కొన్ని మారిపోయి కొన్ని కొత్తవి రావచ్చు ఆ కొత్త ఆచారాలు కాల నేపథ బలంతో తర్వాతి తరాల్లో స్థిరపడవచ్చు అంటే ప్రతి ఆచారానికి పుట్టుక ప్రాబల్యం క్షీణతలు ఉంటాయన్నమాట

రా వా లో చెప్పబడిన కొన్ని ఆచారాలు ఆనాటి సంఘజీవితాన్ని కొంత వరకు ప్రతిబింబిస్తాయి

22 రాయవాచకము పు 61
23 కృష్ణరాయవిజయము II 75
24 రాయవాచకము పు 69
25 శేషశాస్త్రి ఆర్ కర్నాటకద వీరగల్లుగళు పు 218 220లు
26 రాయవాచకము పు 78

పట్టాభిషేకం ఒకరాజు వారసత్వాన్ని తర్వాతివారికి సంక్రమింప చేసేటప్పుడు ముద్దుటుంగరాన్ని ఇచ్చి పట్టాభిషేకం చేయించే ఆచారం ఉన్నట్లు రా వా వల్ల తెలుస్తుంది ఇక్కడ వీరనరసింహరాయలు కృష్ణ రాయలకు ముద్దుటుంగరమిచ్చి పట్టంగట్టినట్లు చెప్పబడింది ఆ పట్టాభిషేక మహోత్సవం గురించి రా వా కర్త సంక్షిప్తంగా వివరించాడు

"యీ రాజ్యపట్టం కృష్ణరాయలవారికి కట్టవలెనని దళనాయకులతో పలకరించి నందు కృష్ణరాయలవారు తాము పెద్దలమైతిమి తమ మర్యాదాగా రాజ్యప పాలనం జేశేటందులకు పట్టాభిషేకం అధిష్టానకర్తలు శేయమని మంచివేళజూచి ముద్దుటుంగర మిచ్చినారు గనక దళనాయకులు అయ్యమరసు కొండమరసు బాచరసు యల్లమరసు అప్పాజి లక్కణ దళనాయకులు యెల్లిన దళనాయకులు అప్పరఎళ మున్నారుపిళ్ళ రాయసం రామచంద్రయ్య బొక్కసం బాస్కరయ్య అవసరం వెంకటయ్య త్రియంబకయ లక్ష్మీపతి ప్రధాని తిప్పరసు దళవాయి లింగరసు సాళువ నారా కాదు ఆర్వీటి బుక్కరాజు సాళువ మేకరాజు శ్రీపతివారు బూదహల్లీవారు నంద్యాలవారు అవుకువారు తొరగెంటివారు రాచూరి తిమ్మరాజు సంగరాజు వెలుకొంటి వారు పెద్దసాని అక్కప్ప నాయుడు కమ్మదొరలు తుళువదొరలు మొదలయిన వారలందరున్ను నగరి విద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషా క.త కృష్ణావధానులు శాబ్దికం పండిత ం వెంకట రామశాస్తుర్లు సహస్రావధాని ప్రభాకర శాస్తుర్లు జోసు లు కవీ శ్వరులు మరిన్ని గలిగిన పిన్న పెద్దలు అందరున్ను శాస్త్రోక్తముగ శుభ ముహూర్త మందలి కృష్ణ రాయలవారికి మంగళస్నానం శేయించి కల్యాణవేదిక యందు బంగారు పీఠమున కూర్చుండ నియమించి దశదానములు షోడశ మహా దానములున్ను శేయించి స్వర్ణతుల రజితతుల రత్నతుల మౌక్తికతుల మేరువులు కోటి గోదానాలు సహస్ర కుటుంబ ప్రతిష్ఠలు మొదలైన దానధర్మములు శేయించి చతుస్సముద్రముల నుంచిన్ని బంగారు కలశముల వుదకములు తెప్పించి మరిన్ని గంగా యమునా సరస్వతీ గోదావరీ నర్మదా సింధు కావేరీ తామ్రపర్ణి మొదలయిన మహానదుల వుదకములున్ను తెప్పించి అష్టాదశవాద్య

27 రాయవాచకము పు 11

ఘోషములున్ను మోయగా సుముహూర్తమందు బ్రాహ్మలచేత మంత్రోక్తముగ అభిషేకము శేయించి ఆ ఎమ్మటి కనకాభిషేకం నవరత్నాభిషేకం శేయించి చలువల తక్లత్తి ఎతాంబరం ధరియించి చందన అగరు కస్తూ తట్టుపునుగు మొదలైన సుగంధాదుల ధరియించి వారల నందరినిన్ని విడిదీల కంపించి ఆ ఎంమ్మట అల్లుండ్లు కొమాళు బంధు పరిజనులనున్ను స్నేహితులనున్ను పంక్తిని పెట్టుక ప్రసాపడి సుగంధ జలముల హస్త ప్రక్షాళనము చేశి అచమనీయ ముజేశి గిలుకు పావాలుమెట్టి సంక్షేప రామాయణం చదవుతాను శతపదా నడచి రత్నకంబళిమీద కూర్చుండుకొని అప్పాజీ మొదలైన వార్లనున్ను ధళనాయకులనున్ను ప్రధానలనున్ను ఎలువ నంపించి" పు 1 12లు రాజనీతులు చెప్పమని అనతిచ్చాడు

దీన్నిబట్టి ఆ కాలంలో రాజుల పట్టాభిషేకం ఎలా జరిగేదో కొంత వరకు స్పష్టమవుతుంది

వివాహం యుద్ధంలో ఓడిపోయిన గజపతి తన కూతురైన జగన్మోహిని అనే కన్యకను రాయలకు ధారపోసినపుడు రా వా లో కొన్ని సంప్రదాయాలు చెప్పబడ్డాయి గజపతి "తన కూతురుకు పటు పరిమెళ వసుపులకని కృష్ణవేణికి దక్షిణపు దిక్కున నడిచే రాజాలున్ను కోట కొత్తళములున్ను దుర్గాలున్ను ఇచ్చి యేనుగ గుఱ్ఱములు బంటుపరివారం దాసాను దాసులు అందోళికహాయలు బండ్లి పసలం ప్రాయలు పాత్ర సామగ్రిలు పగడపు కాళ మంచము హంసతూలికా యివి మొదలైనవిగా అరబిద్యేకు యియ్యతగ్గ పరుసలన్ని యిచ్చి అల్లుని ఎన్ని శాయతగ్గ పరికలు అన్నిన్ని తప్పకుండా పఖసారిగానె సకల పదార్థములున్ను యిప్పించి తమ నగరగల భూషణములలో అపూర్వమైన హెచ్చుబడిన నవరత్న భూషణాదులు అపరిమితముగా ఇచ్చి చీనిచీనాంబరమైన పట్టు పరావళ్ళు ఎతాంబరాదిగాగల సకలమైన కోకతాకలున్ను యిచ్చి యేనుగ గుఱ్ఱం కత్తికేదం మొదలుగాగల రాజోపచారమైన బహుమానములున్ను ఇచ్చి విందుపీడుకళ్ళు ప్రసాదర శేయించ్చి సుబుద్ధినింన్ని వెంబ్బడికూర్చి" పంపాడు

28 రాయవాచము పు 75 76లు

మాత్రం రాయలు ఉచితాసనాలపై కూర్చుండబెట్టి వారు చెప్పే విషయాలను సావధానంగా వినేవారు దళనాయకులు మొదలైనవారు నిలబడే నివేదించుకో వలసి ఉండేది

సాహిత్యం రాజాశ్రయం ప్రాచీన భారతీయ చరిత్రను తిరిగేస్తే రాజులైనవారు సాహిత్యాన్ని బాగా పోషించినట్లు తెలుస్తుంది రాజులే స్వయంగా కవులైనవారూ ఎంతోమంది ఉన్నారు కవులకు ఆశ్రయమిచ్చి వారిని ప్రోత్స హించడం గొప్ప విశేషంగా అనాటి రాజులు భావించేవారు ఈ దృష్టితో రా వా న్ని చూసినపుడు శ్రీ కృష్ణదేవరాయలు అనేక మంది కవులకు ఆశ్రయ మిచ్చి ప్రోత్సహించినట్లు కనిపిస్తుంది ఇతడు కవులను కూడా యుద్ధభూమికి తీసు కొనిపోయినట్లు మనకు రా వా సాక్ష్యమిస్తుంది [37] రా వా లో శ్రీకృష్ణదేవరాయలు అముక్త మాల్యద ను వ్రాసినట్లు ఎక్కడా కనిపించదు గ్రంథాంతంలో మంత్రులు పూర్వం రాజులు కృతులందుకొని కీర్తి గడించారని అలాగే రాయలు కూడా కృతులందుకొని శాశ్వత కీర్తి పొందాలని సూచన చేయగా రాయలు అల్లసాని పెద్దన నంది తిమ్మన మాదనగారి మల్లన మొదలైన కవీశ్వరులతో మను చరిత్ర పారిజాత పహరణం మొదలైన కృతులందుకో వలెనని చెప్పి వారికి కుళ్ళాయి కబాయి తాళి చౌకట్లు చేసరి పేరులు కోకతా కలు ఇచ్చినట్లు చెప్పబడింది [38] కాని ఈ కవులు కావ్యాలు వ్రాసినట్లుగాని రాయలకు అంకితమిచ్చినట్లుగాని రా వా తెలుపలేదు రా వా కర్త "స్వామివారికి యీ వరకు నడుచు సమాచారములకు వ్రాసి అంప్పించినాను తర్వాత నడుచు సమాచారములకు వెంబ్బడిగా విన్నవించి అంప్పుతున్నాను కనక స్వామివారి పాదార విండ్దములయండ్డు నిరంతర భక్తి యిచ్చి రక్షింపగలది" [9] అన్న వాక్యాలనుబట్టి తర్వాత మరియొక భాగాన్ని వ్రాసి పంపించే ఆలోచన రా వా కర్తకున్నట్లు తోస్తుంది కాబట్టి ఆ భాగంలో ఈ విషయాలుండవచ్చు కాని ఆ భాగం వెలువడింది లేనిది మనకు ఏమీ తెలీదు అనంతరం దీనిననుసరించి వ్రాయబడిన కృష్ణరాయ విజయంలో రాయలు కృతులందుకొన్నట్లు స్పష్టంగా ఉంది

---

36 రాయవాచకము పు 3

37 పైదే పు 61

38 అదే పు 80

39 ,, పు 80

40 కృష్ణరాయ విజయము V 142

# రాయవాచకం – కృష్ణరాయ విజయం తులనాత్మక పరిశీలన

చారిత్రక ప్రబంధ కావ్యాల్లో రా వా ఆధారంగా వ్రాసిన కుమార ధూర్జటి కృష్ణరాయ విజయ మనే కావ ం మొట్టమొదటిది తెలుగులో ఇలాంటి కావ్యాలు చాల తక్కువ దీనికిముందు కాసె సర్వప్ప ఏకామ్రనాథుని చారిత్రక వచన గ్రంథమైన ప్రతాప రుద్ర చరిత్ర ను సిద్దేశ్వర చరిత్ర మనే పేరుతో ద్విపద కావ్యంగా వ్రాశాడు కాని ఇది ప్రబంధ కావ్యం కాదు కృష్ణరాయ విజయానికి ఇంచుమించు సమకాలంలో అందుగుల వెంకయ్య రామ రాజీయ మనే కావ్యం వ్రాశాడు దీన్నే నరపతి విజయ మని కూడా పిలుస్తారు తర్వాత రఘునాథాభ్యుదయ మనే ద్విపద కావ్యం వెలువడింది దీన్ని విజయ రాఘవ నాయకుడు రచించాడు దిట్టకవి నారాయణకవి బొబ్బిలి కథను రంగ రాయ చరిత్ర మనే పేరుతో ప్రబంధంగా రూపొందించాడు గతశతాబ్దిలో వీరభద్ర కవి వలనాటి వీర చరిత్ర మనే కావ్యాన్ని వ్రాశాడు ఇది కూడా చారిత్రక ప్రబంధమే

చరిత్రకు అత్యవసరమైంది ప్రామాణికత విషయాన్ని ఉన్నదున్నట్లు చెప్పడం చరిత్ర ముఖ్యోద్దేశం కల్పనలకు ఇందులో చోటులేదు కవి చారిత్రక విషయాన్ని ఇతివృత్తంగా గ్రహించినా రక్తికట్టించడానికి కావ్యానుగుణంగా కొన్ని కల్పనలను వర్ణనలను ప్రవేశపెడ్తాడు విషయాన్ని రమణీయంగా రసోన్ముఖంగా చెప్పడం కవి ఉద్దేశం కావ ం అనుభూతి ప్రధానం అభివ్యక్తీకరణం సాధనం రసం శబ్దం అలంకారం భావం కల్పన ఇవి కావ్య సామగ్రి కవి చారిత్రక సత్యాన్ని వాస్తవంగా చెప్పక కావ్యసత్యంగా చెప్తాడు చరిత్ర వస్త్వాశ్రయ సత్యం (Ob ec ve ru h కావ్యం ఆత్మాశ్రయ

---

1 వెంకట నరసింహం కాకర్ల ఆంధ్ర ప్రబంధం అవతరణ వికాసములు పు 114

సత o Sub ec ve ru h చరిత్ర కథనాత్మకం కావ్యం వర్ణనాత్మకం కవి చ త్రను మొత్తంగా తీసుకోడు రసనిర్వహణకు అనుకూలమైన కథాంశాలను మాత్రమే స్వీకరిస్తాడు

కవి చరిత్రకారునివలె చారిత్రక సంఘటనలకు తన ప్రతిభా శక్తితో జీవంపోసి భావనా బలం చేత ఆ పూర్వకథ మరలా మన ఎదుట జరుగుతున్నట్లు చేసి కళా సౌందర్యాన్ని కల్పించి దాని మూలంగా తన హృదయాన్ని ఆవేశించి ఉన్న జీవిత పరమార్థమేదో దాన్ని సూచించడానికి ప్రయత్నం చేస్తాడు ఈ చేయడంలో కథ పూర్వప్రదైనా కవి తన అనుభవాలను తన దేశకాల పరిస్థితులను జీవిత విశేషాలను ఆచార వ్యవహారాలను జాతీయ ధర్మాలను కావ్యం ద్వారా ఆయా కాలపు చారిత్రకాంశాలనే గాక అప్పటి జీవిత పద్ధతులను కూడా వివరిస్తాడు

కుమార ధూర్జటి తన కావ్య రచనకు చరిత్రను ఆలంబనగా తీసుకొన్నాడు

కుమార ధూర్జటి అంతకుముందే రచితమై మిక్కిలి ప్రసిద్ధి పొందిన రాయవాచకాన్ని ఆధారం Sou ce గా గ్రహించాడు అయితే తన కావ ంలో ఎక్కడా రాయవాచకాన్ని ప్రస్తావించలేదు అంతేగాక కృష్ణరాయ విజయాన్ని ఎందుకు వ్రాయవలసి వచ్చిందో చెప్పడానికి ఒక కట్టు కథను సృష్టించాడు తాను ప్రబంధ మొకటి వ్రాయాలని అనుకుంటూ ఉండగా కలలో నిఖిల లోక కర్త అయిన శ్రీరామ చంద్రుడు కనిపించి—

"వత్సా నిను రక్షింప గ
వాత్సల్యంబొదవె నౌభవన్మధురిమరం
గత్సార వచన కృతి నం
దత్సరణిన్ మాకు నం తము సేయ దగున్ అని చెప్పి సందియము వలదు వేగ గృతిసేయు మొక కథ పింతదనర అని అభయమిచ్చి అంత ర్హితుడయాడు తర్వాత ఒకనాడు కుమార ధూర్జటి పేరోలగంలో తన

2 కృష్ణరాయ విజయము పీఠిక 15

ప్రభువైన ఆర్వీటి చిన వెంకటాద్రిని పొగడగనగా కరుణా కటాక్ష వీక్షణాలతో కు ధూ ని ఎలిచి అతని కవితాశక్తిని ప్రశంసించి ప్రాకట గతి బద్య కావ్య ఫణితిం జెపుమా శ్రీకృష్ణరాయ చరితము నీ కవితాబ్ధి సుకవి నికరము మెచ్చన్" అని చెప్పి బంగారు కడియాలు హారాలు తాళి చౌకట్లు జాళువా తలపాగ రంగలరు పట్టు వచ్చడాలు ఉంగరాలు తళుకు జిగిమేలిమి సరిపెణలు మొదలైన కానుకలతో పాటు సార ఖర్జూర కదళికా నారికేళ ఫలాలతో పాటు చందన కుంకుమ కస్తూరి సంకుమద సంయుత కర్పూర వీటికలిచ్చి సత్కరించి కుమార ధూర్జటిని కావ్యరచనకు ప్రోత్సహించాడు 4

కుమార ధూర్జటి శ్రీకృష్ణదేవరాయలచరిత్రను కృష్ణరాయ విజయ మనే పేరుతో కావ్యంగా రూపొందించి తర్వాత దాన్ని ఎవరికి అంకితమివ్వాలని చినవెంకటాద్రి నడుగగా తన ష్టదైవమైన శ్రీరామచంద్రునికే అంకితం చేయమన్నాడు అదే విధంగా ప్రభువు అనతి ప్రకారం శ్రీరామచంద్రునకు అం త మిచ్చాడు 5

రాయవాచకాన్ని చూడకుండా కుమారధూర్జటి కల్పించిన పై కథనాన్ని చదివితే కృష్ణరాయ విజయాన్ని స్వతంత్ర కావ ంగా భ్రమించడానికి అవకాశముంది అందులోను కృష్ణరాయ విజయమే రాయవాచకం కంటే ముందు అచ్చయి ప్రచారంలోకి వచ్చింది కృ రా వి మొదటిసారిగా 1902 లోనే అచ్చయింది 6 రా వా పుదుక్కోటలో దొరికిన రెండు తాళపత్ర ప్రతులాధారంగా 1914లో జయంతి రామయ పంతులు గారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించేదాకా వెలుగు చూడలేదు తర్వాత ఇది 1933 లో పుస్తక రూపంలో వెలువడింది

---

3 కుమార ధూర్జటి చిన్నపుడే సావిత్రీ చరిత్ర ఇందుమతీ వివాహమనే రెండు కావ్యాలను వ్రాసినట్లు చెప్పకొన్నాడు చూ కృష్ణరాయ విజయము పీఠిక 25

4 కృష్ణరాయ విజయము I 22 30 31

5 పైదే I 33 36 41

6 కృష్ణరాయ విజయము రాజా మంత్రిప్రగడ భుజంగరావు గారి మంజువాణి పత్రికలో మొదటగా ముద్రితమై వారిచేతనే 1902 లో ఏలూరు నుండి పుస్తకరూపంలో పునర్ముద్రింపబడింది

కృ రా వి లో నాలుగాశ్వాసాలున్నాయి ప్రథమాశ్వాసంలో విద్యానగర వర్ణన చాతుర్వర్ణ వర్ణన వీరనృసింహరాయల దినచర్యలు ద్వితీయాశ్వాసంలో స్థూలంగా విద్యానగర స్థాపన వృత్తాంతం శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకం కృష్ణదేవరాయలకు మంత్రులు రాజనీత్యుపదేశం రాయల నిత్యకృత్య వివరణ కోశాది వివరణ రాయలు నగరశోధనకు వెళ్ళడం తిమ్మరుసు రాయలను మందలించడం సేన వివరణ తిమ్మరుసును ప్రశంసించడం విజయాపుర అహమ్మదానగర గోలకొండ రాజుల వృత్తాంతం తురుష్కుల బలం రాయలు తురకలమీదికి యుద్ధానికి వెళ్ళడం తృతీయాశ్వాసంలో రాయల దిగ్విజయ యాత్రలు చతుర్థాశ్వాసంలో గజపతి కూతురుతో రాయల వివాహం మొదలైన అంశాలు చెప్పబడ్డాయి

కృ రా వి లో రా వా లోని జంగమవాని ప్రస్తావన శింగిరిభట్ల వృత్తాంతం వా సవృత్తాంతం విద్యానగర స్థాపన పరీక్షిత్తు–భూదేవి సంవాదం ప్రతాపరుద్రుని వృత్తాంతం గజపతికి విరోధులు విషప్రయోగం చేయించడం మొదలైన అంశాలు లేవు ఇంకా వివిధ రాజకీయ వ్యక్తుల పేర్లు స్థానావతుల పేర్లు ఇందులో లేవు

కు దూ పై పూర్వ ప్రబంధ కవుల ప్రభావం ఎక్కువగా ఉంది ఇతడు చిలుక రాయబారాన్ని అదనంగా ప్రవేశ పెట్టడం ఆ ప్రభావం వల్లనే అని తెలుస్తుంది అలాగే అష్టాదశవర్ణనలను ప్రవేశ పెట్టాడు

కు దూ రా వా లో నామ మాత్రంగా పేర్కొన్న గజపతి కూతురు వివాహాన్ని ఒక ఆశ్వాసందాకా పెంచాడు మరెక్కడా ఇతడు రా వా న్ని పెంచి వ్రాసినట్లు కనిపించదు

కు దూ రాయవాచకాన్ని సంక్షిప్తం చేశాడు అనేకచోట్ల వర్ణనలకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చాడు చరిత్రకారులకు అతి ముఖ్యమైన అంశాలను కూడా కొన్నిటిని మార్చాడు శ్రీకృష్ణదేవరాయల అన్న అయిన వీరనృసింహ రాయలను తండ్రిగా పేర్కొన్నాడు [7] రా వా విజయనగర స్థాపనాకాలం

7 కృష్ణరాయ విజయము 38 45 82 142

నుండి వీరనృసింహరాయల కాలం దాక ఇరవై తొమ్మిది మంది రాజులు పరిపాలించారంటే [8] కు దూ అది మొదలిర్వది పట్టము లిదివరకు"[9] అని ఇరవై తొమ్మిదిని ఇరవైగా మార్చాడు రా వా లో జగన్మోహిని [10] అని చెప్పిన గజపతి కుమార్తెను తుక్కా గా పేర్కొన్నాడు

ఈవిధంగా కు దూ తాను అనవసరమని భావించిన అంశాలను తీసివేసి అవసరమైనచోట్ల వర్ణనలతో పెంచి కథాంశాలను బాగా సంక్షిప్తీకరించి కొన్నిటిని మార్చి మరికొన్నిటిని చేర్చి ప్రబంధ కావ్యంగా తీర్చిదిద్దాడు

అనువాద విధానం కు దూ రాయవాచకంలోని ప్రధాన కథ అయిన శ్రీకృష్ణదేవరాయల చరిత్రను యథాతథంగా స్వీకరించి అనువాదం చేశాడు కొన్నిచోట్ల ఇతడు రా వా న్ని అతి సన్నిహితంగా అనువదించినట్లు కనిపిస్తుంది ఉదా రా వా లోని పాఠం

"రాయలవారు సింహాసన పరభారకం వహించే మీవంటి పెద్దలు వుండగా అట్టి కార ములు యేల వచ్చిని మీరు తృణాన్ని బట్టితే మేరువు కాయగలరు ఆ మేరువునే తృణముగా నడిపించగలరు అఘటన ఘటనా సామర్థ ములు మీకే గలవు" అని వ ంగ్యోక్తులుగా అనతిచ్చినందులకు సాళువ తిమ్మరుసయ్య పలికినది "ఆ రీతే అవును అవి యేమియంటేను స్వామివారు సకల కార్య భారములున్ను మా మీద వూనికె జేసి నడిపించగా ఆ రీతున నడుస్తా వున్నది చిత్తానకు రాకుంటే మేమనగా తృణ మాత్రం తృణ గ్రాహియయిన యింద్రనీలము ఖ్యాతి బొందును తృణమని యెంచి గ్రహించక వున్నట్టాయెనా జాతి నీలము గాదని వెలతరుగును అటు గనక యేలిన స్వామివారి ప్రతాపమువల్లనే గదా కొలిచినవారు ఘనమౌట కొలిచిన వార్లను ఘనముగా నడపగానే యేలినవారిం కీర్తి ఖ్యాతులు గలుగుట" పు 28

---

8 రాయవాచకము పుట 15

9 కృష్ణరాయ విజయము 35

10 రాయవాచకము పుట 75

1 కృష్ణరాయవిజయము IV 12 25

కు ధూ పద్యానుసరణ

వ అనిన నమ్మ హీశ్వరుఁడతనిం గనుంగొని

క క్షితి నఘటనఘటన సమ
ర్థత గల మీవంటి సత్ప్రధానులు గలుగన్
మతి మాకేమి విచారము
సతత మొనర్తుము యథేష్ట సంచారంబున్

తే తృణము మేరు వొనర్తురు క్షణములోన
మేరువైనను దృణమొను మీరు గాద
టన్న సామాజికులకు సామర్థ్య మధిక
మగుట వసుధా ప్రభువుల భాగ ంబు సుమ్ము

మ అను డా రాయల వారితో బలికె నయ్యప్పాజి యోస్వామిమే
మన గా నెంతటి వారమయ్య భవదీయాజ్ఞా విలాసంబులో
ననువొందన్నయ భక్తుల న్మెల గి నట్టైనం గృపంజూడు కొ
ల్చిన వారెచ్చటనైన భూపతులకుని శార్థు ల్గెంచన్ ధరన్

తే లలి దృణగ్రాహియైన నీలమున కరయ
విలువ యధికంబు తృణమని విడిచినంత
జాతి నీలంబు గాదన్న సరణి ధరణి
ప్రభువులు పరిగ్రహించిన ప్రజలు ఘనులు

ఉ కావున మీ ప్రతాపమున గాక సమర్థత వేఱెకల్గునా
దేవర వారలిట్లనిన దెల్పుకొనంగ సమర్థులెవ్వరో
భూవర మీరలే క్రియను బుద్ధిగ జెప్పిన నాక్రమంబునన్
దేవ సమస్త కార్యములు దీర్చెద రమ్ము పురమ్ము జేర గన్

I 87 92

రా వా లో ఉద్ధృతమైన కొన్ని పదా లను శ్లోకాలను కు ధూ తన సొంత పద్యాల్లోకి మార్చాడు

రా వా

గీ వెలది జూదంబు పానంబు వేట పలుకు
ప్రల్లదంబును దండంబు బరుసదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేత
యనెడు సప్త వ్యసనముల జనదు తగుల పు 13 14

కృ రా వి

బోటి జూదంబు పానంబు వేటజనుట
తిట్టుట యహేతువుగను దండించ దలచు
టొచితి దొఅంగి యనుచితంబైన వ్యయము
సేయుటయు నివి వ్యసనముల్వాయవలయు I 54

ఇక్కడ రా వా కర్త భారత పద్యాన్ని ఉద్ధరిస్తే కు ధూ దాన్ని తన పద్యంలోకి మార్చుకొన్నాడు

రాయలు ఉదయగిరి మొదలయిన దుర్గాలపై దండెత్తినపుడు టోంచిన జయధ్వనికి రా వా లో ఉద్ధృతమైన పదం

ఉ భూకంపంబు జనింప రొప్పగ మహాంభోరాసు లుప్పొంగ గా
లోకాలోకములెల్ల బెల్లగిల ముల్లోకంబు ఘూర్ణిల్లన
స్తోక వ్యాప్త నజాండ గోళ దళకోద్భూత ధ్వనింబోలె వ
ర్షా కాలాంబుద గర్జిత ధ్వని సమారంభంబులై మీఱ గన్ పు 62 63

దీనికి కుమార ధూర్జటి అనువాదం

మ జలధుల్ఘూర్ణిలె దిక్కరుల్బెదరె జాంచల్యంబు నొందెన్ ధరా
స్థలి ధాత్రీధర సంఘముల్గదలె పాతాళంబు స్వర్లోకమున్
గల గెన్ శత్రుభయంకర ప్రకటదోర్గర్వ స్ఫురత్కృష్ణ రా
యల నద్భేరి ధణంధణస్వనము లాశాంతంబులం బర్వ గన్

సంస్కృతశ్లోకాలు కృ రా వి లో పద్యాలుగా రూపొందాయి

రా వా

శతేషు జాయతే శూర సహస్రేషు చ పండిత
వక్తా శతసహస్రేషు దాతా భవతి వా నవా పు 32

నష్టం కులం భిన్న తటాక కూపాః
విభ్రష్ట రాజం శరణాగతంచ
గోబ్రాహ్మణాః దేవగణాలయాంశ్చ
యదుద్ధరే త్పూర్వ చతుర్గుణం తత్ పు 75

కృ రా వి

శత సహస్ర సంఖ్య జనులలో నొక్క శూ
రుండు బండితేంద్రు డుండుటరిది
వక్తయైనవా డు వర్ణింప వేవేల
గలుగుటరిది దాత గల డొలే డొ 107

గోవిప్రుల రక్షింపుచు
దేవగృహ తటాకముల ప్రతిష్ఠించి ధరన్
భూవర యపహృత రాజ్య
శ్రీ వెలయించిన యతండె శివిబు డెందున్ 11

కృ రా వి లో భాషలో గాని కథాకథనంలోగాని సంభాషణలలోగాని రా వా లో కనిపించినంత అర్థగ్రీత తీక్షణతలు కనిపించవు

ఉదా గజపతి షోడశ పాత్రులంతో కూడి రేపు యుద్ధానికి వస్తున్నాడన్న విషయాన్ని కర్నాటక స్థానాపతి కమలనాభయ్య వేగర్లచేత రాయలవారి సమక్షమానికి కాగితంబ్రాసి పంపగా రాయలవారు చదివి చూసుకొని చాలా బాధపడి అప్పాజీ గుడారానికి పోయినప్పుడు అక్కడ జరిగిన సంభాషణ రా వా లో ఇలా ఉంది

"అంతస్తు గుడారములో రాయలవారిని పిచ్చేశి కూర్చుండ్డమని రాయల వా తోను ఏకదేశాన పిచ్చేశేఎంత కార్యం యేంద్ధి అనిన్ని ఎలువనంఎస్తే నేను

వచ్చి విన్నవం శేయనా అని అందులకు రాయలవారు తాము ఏకదేశాన రాతగ్గ కార్యం గనక వస్తిమి అది యేమంట్టె గజపతి దగ్గరనున్న కమల నాభయ అంప్పించ్చిన కాకితం చదువు కొమ్మని చేతికి యియ్యగా అప్పాజి ఆ కా తం చదువుక రాయలవారితోను అది యేంద్ది స్వామివారి పాదపద్మము లకు కానంబడ విన్నవం చేస్తిని నా విన్నవము చిత్తానకు తేక కదలి వస్తిరి గజపతి శీమలో జొచ్చిరాగానే కనుపల్లో వచ్చిన అపకీర్తి చాలదా అవింన్ని విచారించుకోక ముప్పైయామడ దూరం గజపతి శీమలో చొచ్చి మొదటి స్థలం వద్ద దిగినందువల్ల వారికిన్ని ఆలోచనబుట్టి యింత్త కార్యాలకు తెగవేసినారు యీ రాత్రి అంద్దుకైన కార ం కంట్టే కంన్నట్టు కాననప్పటికి అందరికిన్ని యుగం త్ప్రంగ్గినట్టు అవును అని విన్నవం శేశినందులకు రాయలవారు వలుక రించ్చిన నీతి పద్యం

క ముట్టెడు కార్యము జక్కం
బెట్టెడు మంత్రియును లేర బెదరని బంటుం
బుట్టరుగా దేవతలకు
బుట్టరె నానావిధైక భోగసహాయుల్

అని నీతి చదివి మీరుండగా కొదవబడనీరే గదా గతాన మీమాట వినక విచ్చినందువల్ల ఇంత ఆలోచనకు ఆస్పదమాయను మా గుణదోషములు యెంచ్చేటందువల్ల అయ్యే కార్యం యేమి వున్నది యీ యపాయానకు తగిన ఉపాయం యేరీతు అని అడిగినందులకు అప్పాజి స్వామివారి హృదయమున్ను ఆలోచనాను యేతీరో అని అడిగినంద్దులకు రాయలవారు షోడశ పాత్రులుంన్ను గజపతివారు శేశిన ఆలోచనవల్ల తమకు ప్రాణహానింన్ని మానభంగ్గమున్ను అయిన అవని ప్రజలకు అవధింన్ని వచ్చును అనింన్ని అష్టైశ్వర ములున్ను అక్రమింత్తురు అనింన్ని మనస్సుకు నిశ్చయముగా తోంచివున్నవా అని అన తిచ్చి మరింన్ని అప్పాజీతోను యీ సమయమందు యేమి వెచ్చబెట్టినా ఉత్తరువు మాకు యీ తీరు బుద్ధి మార్గముగా జెప్పున ఆ తీరుననె విని నడిచేము [12] అని చెప్పగా అప్పాజి రాయల వారితో మంత్రనీతులుగా నీతిపద్యాలు చెప్పి భేదో పాయం కలిగించాడు

12 రాయవాచకము పు 70 71 లు

దీనికి కు దూ పద్యానుసరణ

క ఇల బదార్గురు రాజుల చెలువుగలిగి
యల చతుర్దశభువనముల్ గెలువ బూను
నట్టి ఘనులౌనెకా వారి నణ పవశమె
పదిరి వచ్చితి మప్పాజి పలుకు వినక

క అని యాలోచన జేయుచు
మనమున నారాత్రి యుబ్బుమఱుగున బాళెం
బున గల జనులవార్తలు
విని యుత్సాహంబులేని విధమెఱి గి వెసన్

ఆ అయ్యదంతమప్పడప్పాజితో దెల్ప
నాదు పల్కు వినక నరవరేణ్య
వచ్చినంత యింతవచ్చె గదా యింద
కేమి సేయువారమిచట జెపుమ

తే అనుడు రాయలు బల్కె నీ వనినమాట
లెక్కసేయమి నిచ్చోట జిక్కవలసె
దల వ నినువంటి మంత్రి యిద్దాతిగలదె
చూడు మిందుల కొకయుక్తి సూక్ష్మమతిని

మ అను దమ్మంత్రిరేణు డిట్లనియె నయ్యా భేదమార్గబునన్
వినుమప్పాత్రుల గెల్వగా వలయు నుర్వీన్ " 97 101

పై రాయవాచక కృష్ణరాయవిజయ పాఠాలను పరి లిస్తే రాయవాచకమే కృష్ణరాయవిజయం కంటె ఎక్కువ ఆకర్షణ . ర్మాన్ని కలిగి ఉందని తెలుస్తుంది కు దూ రా వా న్ని బాగా సంక్షిప్తీకరించాడని కూడా దీనివల్ల స్పష్టమవుతుంది

వర్ణనలు రా వా లో వర్ణనలకు తావులేదు కృ రా వి లో అనేక వర్ణనలున్నాయి వర్ణనలు చేయడంలో కు దూ పూర్వ కవులకెంత మాత్రమూ తీసిపోడు కథానాయిక అయిన తుఖ్ఖా సౌందర్యాన్ని అనేక పద్యాల్లో వర్ణించాడు అక్కడక్కడ ఇతని ప్రకృతి వర్ణనలు సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలు నాయికా నాయకుల విరహ వర్ణనలు మిక్కిలి రమ్యంగా

ఉన్నాయి ఇతడు వర్ణనల కోసం శృంగార రసపోషణ కోసం నాల్గవ ఆశ్వాసాన్ని సృష్టించాడు ప్రబంధ కవుల ప్రభావంతో చిలుక రాయబారం ప్రవేశ పెట్టి ఆ చిలుకకు మోహనవాణి అని పేరు పెట్టాడు

రా వా లో లక్ష్మీదేవి విద్యారణ్యులకు ప్రత్యక్షమైనట్లు మాత్రమే చెప్ప బడింది కాని కు ధూ ఆమె స్వరూపాన్ని చక్కని పదాల పొందికతో కన్నులకు కట్టినట్టు వర్ణించాడు

సీ కలువలు వెదజల్లు కలికి చూపుల తోడ
ముద్దు గుల్కు మెఱుంగు మోము తోడ
గుందంబు నణగించు మందహాసముతోడ
విలసిల్లు వాలారు వేణి తోడ
మించుల నలరించు మేల్మి సొమ్ముల తోడ
దమ్మి పూలమరు హస్తములతోడ
శ్రీహరి కొనగోటి చెక్కు నొక్కుల తోడ
దళుకుమించు కడాని వలువతోడ

తే గాము గన్నమ్మ నలమేని సామి కొమ్మ
కమ్మ పూరెమ్మ యపరంజి కళుకు బొమ్మ
కలిమి ముద్దుల గుమ్మ సత్కరుణ గ్రమ్మ
నమ్మనీంద్రుని మ్రోల బ్రత్యక్షమగుచు 21

కు ధూ తల్లి అంగాంగ సౌందర్యాన్ని ప్రకృతిలోని వస్తువులతో ఉపమిస్తూ చక్కగా వర్ణించాడు

సీ అచటి తుమ్మెదబాఱు లబ్జాస్యనెరులతో
సరిరాకనో బెట్టు మొఱయదొణగె
నచటి పల్లవ పంక్తి యబల పాదములతో
సమత గాంచకనొ చంచలత జెందె
నచటి కోయిల గుంపు హరిణాక్షి పలుకుల
కుదురంద నేరకో కూ తలిడియె
అచటి పెందీవియలలివేణి మేనిడా
లొనరకో య్యుబ్బూ త లా గ దొణగె

తే నచటి విరిగుత్తులా చెలి కుచయుగంబు
రహి వహింప గ లేకనో రాల గణ గె
నచటి పూ దేనె కనకాంగి యధరమధురి
మకు సమానంబు గాకనో మహిని జెందె V 56

కు దూ ప్రకృతిని అతిమనోహరంగా వర్ణించి ఆ దృశ్యాలు మన కళ్ళ ఎదుట ఉన్నట్టే భాసింపచేస్తాడు

ఉదా వసంతకాల వర్ణన

సీ తొలుదొల్త బండుటాకులు రాలె మహిమీ ద
విలసిల్లె మలయాద్రి మలయునీ ద
యొక్కొక్క కెందలి రుదయించె దరురాజి
దోరమై తనరె గంతునివరాళి
చెల గె దిక్తటుల గోయిల రావముల సౌరు
మెదలాడె గండు తుమ్మెదల బాబు
రహిమీజె నపుడు మరంద ధారల చెన్ను
పొలు పొందె మెఱు గ బుష్పోదులవనె

తే పొన్న గున్నలు సురపొన్నలన్ను వలగు
క్రొన్ననల చెన్ను లలరిన విన్న నెన గె
నెన్న నన్నన్న యా చైత్ర మెంత వింత
సంతస మొనర్చె రమ్యమై జనులకెల్ల V 42

ఇక్కడ ప్రకృతి పొందిన క్రమ పరిణామాన్ని కవి వర్ణించిన తీరు బాల సహజంగా ఉంది

అలాగే సూర్యోదయ సూరాస్తమయ చంద్రోదయాది వర్ణనలలో కవి యొక్క భావుకత నిశిత పరిశీలనాదృష్టి వ్యక్తమవుతాయి

రసపోషణ చారిత్రక కావ్యాల్లో సాధారణంగా వీర రసం ఉంటుంది ఈ వీరంలో యుద్ధవీరం దానవీరం దయావీరం మొదలుగా ఇరవై నాలుగు భేదాలు కనిపిస్తాయి కు దూ వీరరసాన్ని అంగిరసంగా తీసుకొని యుద్ధ దాన దయా ధర్మ వీరాలను పోషించాడు అంగరసం శృంగారం ఇతని యుద్ధ వర్ణనలలో వీర రసం పెల్లుబుకుతుంది

13 సుబ్రహ్మణ్యం జి వి. వీరరసము పు 69 103లు

శృంగార రస పోషణలో కూడా కు దూ ప్రబంధ కవులనే అనుస రించారు సాధారణంగా ప్రబంధ కవులు ఒడలు మరచి శృంగార వర్ణనలు చేస్తారు ఇతడుకూడా అదను చూసుకొని శృంగార రసాన్ని మనోజ్ఞంగా వర్ణించారు ఈ క్రింది తుళ్వా వర్ణన ఇందుకు తార్కాణం

సీ ఔరౌర శరదుజ్జ్వలాబ్జమో మారీశ్వ
    రాబ్జమో తరలాయతాక్షిమోము
పైసరే హృదయాపహారమో మౌక్తిక
    హారమో యెలనాగ యేఁ టి నవ్వు
దా గురే శృంగరసారమో నిమ్న కా
    సారమో తన్వంగి వరసనాభి
దాదాసు మేదినీ చక్రమో మరుతేరి
    చక్రమో పూబోడి జఘనసీమ

తే రంభలో హస్తికర జయారంభలేమొ
యురుతరస్తని వలుచని యూరు లౌర
రాజదేవేంద్ర యటువంటి రాజముఖిని
గంటిమే వింటిమే త్రాంటి కరలనైన IV 64)

పై పద్యంలోని చివరి పాదాలు తుళ్వా అతిలోకసౌందర్యాన్ని అనుమ డింపజేస్తాయి ఇది ఒక మచ్చుతునక మాత్రమే ఇలాంటి పద్యాలెన్నో మనకు కృ. రా వి లో కనిపిస్తాయి

భాష కృ రా వి లో ఉర్దూ పారశీక పదాలెక్కువగా కనిపిస్తాయి వీటిలో ఖాబు I 120), తుపాకి (I I 5 పౌజు III 23 ఖరా (II 21) మొదలైన పదాలు తప్ప మిగిలినవన్నీ రా.వా.లో ప్రయోగింపబడి నవే కు దూ అన్యదేశ్య పదాలనేకాక కొన్ని దేశీయ ప్రయోగాలను కూడా యథాతథంగా రా వా నుండి తీసుకున్నారు

| | | | |
|---|---|---|---|
| ఉదా | మద్యపానులు | II | 124 |
| | అహర్నిశము | | 10 |
| | వర ంతము | | 17 |
| | యథాయథలగుచు | | 46 |
| | రస్తు సామగ్రి | | 51) |
| | శ్రీమతు | II | 108) |
| | దిగ్గి | III | 61) |
| | నూదుద్రివ్య | II | 82 |
| | లెస్సగా | IV | 4 |

కొన్ని విలక్షణ క్రియా ప్రయోగాలు కృ రా వి లో కనిపిస్తాయి

| | | | |
|---|---|---|---|
| ఉదా | వదిరి వచ్చితిమి | II | 97) |
| | కన్నడ సేయకు | V | 69 |
| | రాయడించి | (IV | 91 |
| | హవుసుమీఱ | IV | 116 |

చారిత్రక ప్రాధాన్యత  రా వా చరిత్రకారులకు బంగారు గని [1] ఇది విజయనగర చరిత్ర గురించి కృష్ణదేవరాయల గురించి అతి విలువైన సమాచారాన్ని అందిస్తుంది రా వా లోని విషయాలు చాలవరకు చారిత్రకంగా ఋజువైనందువల్ల రా వా నికి హెచ్చు చారిత్రక ప్రాధాన త కలిగింది కృ రా వి లో చారిత్రక విరుద్ధమైన కొన్ని అంశాలున్నందువల్ల ఇది చరిత్రకు అంతగా తోడ్పడదు చాలమంది చరిత్రకారులు వీటి చారిత్రక ప్రాధాన్యతలను

---

14 ఇది శ్రీమత్ శబ్దం నుండి వచ్చింది ఈ రూపాలు శాసనాల్లో అనేక చోట్ల కనిపిస్తాయి రాయవాచకంలో ఇది శ్రీమంతు అని కథా ప్రారంభంలో వాడబడింది రాయవాచక కర్త బహుశా శ్రీమంతమ్ శబ్దం నుండి గ్రహించ ఉండవచ్చు సంస్కృత ద్వితీయైక ప్రాతిపదిక రూపాలు కొన్ని తెలుగులో ప్రథమాంత రూపాలుగా వాడబడుతాయి

15 రాయవాచకము 1982 పరిక

గుర్తించి తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు వారిలో కొంతమంది అభిప్రాయాలు ఈ క్రింద చెప్పబడ్డాయి

రా వా న్ని చారిత్రకాధారంగా గుర్తించిన వారిలో నేలటూరు వెంకటరమణయ్య గారు ప్రప్రథములు వీరు విజయనగర చరిత్రకు సంబంధించి కృష్ణరాయల పరిపాలనా కాలానికి ప్రత్యేకించి రా వా లోని అనేకానేక విషయాలను ముఖ్యంగా ఆనాటి పరిపాలనా యంత్రాంగానికి కృష్ణరాయల దిగ్విజయాలకు సంబంధించిన విశేషాలను శాసనాల్లోను సమకాలీన సారస్వతంలో చెప్పిన విషయాలతోను విదేశీయుల రచనలతోను సమన్వయ పరచి దాని గుణ దోషాలను నిగ్గుతేల్చారు

విజయనగర చరిత్రకు గల మౌలిక సారస్వతాధారాల సంకలనమైన Sou ce of V ayanagar H ory లో దాని సంకలన కర్త అయిన ఆనూరి రంగస్వామి సరస్వతిగారు The b her o no we expo ed Kr hna aya V ayam and Rayavachakam hrow much gh upon he ac ua cou e o Kr hna aya s cam pa gn aga n Or a" ? అని పేర్కొన్నారు యస్ కృష్ణస్వామి అయ్యంగార్ cer a n y s wor h pub ca on as a work of h or ca cha ac er bear ng upon he re gn of he grea V ayanagar emperor K hnaraya he de a s g ven are of va ue and h ow gh upon a few po n s upon wh ch gh s bad y needed the work a we come

---

16 రా వా లోని చారిత్రక విషయాలకు సంబంధించిన చర్చకై నేలటూరు వెంకటరమణయ్యగారి ఈ క్రింది గ్రంథాలను చూడవచ్చు
S ud es n he h ory o Third Dyna y of V a yanagar Fur her Sources o V ayanagar H ory
శ్రీ కృష్ణదేవరాయలు
విజయనగర చరిత్ర 1 2 భాగాలు

17 Sources of V ayanagar H s ory P II

addıt on to he ource o h s ory o an mpor ant per od [8] అని అభిప్రాయపడ్డారు జయంతి రామయ్య పంతులుగారు "Th s chron c e now repub hed n book orm or the u e o ho e engaged n h o ca re earch" అని n ome pa s rece ve remarkab e con rma on from the accoun o he po uge e wr er pae and Nun z" అని Be s des a ord ng v uab e n o ma on about a mo t notab e epoch n he h ory o Sou h Ind a he chron c e g ves u an ns ght nto the da y rou ne o e wh ch he k ngs n tho e days were expec ed to ve and wh ch they ve y probab y ved [9] అని వ్యక్తం చేశారు

అరుణకుమారిగారు రాయవాచకము చారిత్రక విషయముల పట్టిక Chron c e అగుటచే వర్ణనలేమియు లేవు కవి కేవలము చారిత్రకాంశములను వరుసక్రమమున చెప్పెను పెక్కు చారిత్రక విషయములను క్రమముగ తెలుపుటచే విజయనగర చరిత్రను తెలిసికొనగోరు చరిత్రకారులకిది మిక్కిలి తోడ్పడును వచన చారిత్రక గ్రంథమగు రాయవాచకము ఛందోబద్ధమగు చారిత్రక కావ్యమగు కృష్ణరాయ విజయము కృష్ణదేవరాయల చరిత్రను అంధులకు అందజేయు అపూర్వ గ్రంథములు" అని చెప్పారు కులశేఖర రావుగారు "చారిత్రక వచనైక గ్రంథములందు రాయవాచక మొకటి ఇది వరకు వెలువడిన చారిత్రక గ్రంథములైన ప్రతాప చరిత్ర సిద్దేశ్వర చరిత్రముల కన్న నిది విశిష్టమైనది ఇందలి చారిత్రక విశేషములు మరికొంత యథార్థములుగ నుండుటయే దీనికి కారణము ఇట్లే గ్రంథకర్త వ్రాసిన విశేషములు ప్రతాప చరిత్ర కన్నను చరిత్రకు సన్నిహితముగా నున్నవనుట సమంజసము జరిగిన సన్నివేశములపైని చారిత్రకాంశముల మీద నీతని

---

18 రాయవాచకము 1933), Foreword P

19 పైదే In roduc on P v

20 అరుణకుమారి బి ఆంధ్రవాఙ్మయమున చారిత్రక కావ్యములు పు 198

దృష్టియుండుటచే భాష శైలి మున్నగు వాని నీత దంత శ్రద్ధగా పాటించి యుండలేదు అందుచేత వా వహారిక ప్రయోగము లిందున్నవి సాహిత్యకమైన ప్రాధాన ము నాత డు పాటించియుండక పోవుట కూడ నీ కర్తకు చరిత్రపై గల యభినివేశమును స్పష్టపరచుచున్నది " అని పేర్కొన్నారు

నేలటూరు వెంకటరమణయ గారు "wha ever be he da e of compo on and he e o fac s - remarkab y we The genu nene of he Var ous ems of n orma on wh ch upp es can be proved by a compar on w h he n cr p ons and he con empo ary prabandhas and he po uge e record [2] అని చెప్తూ వేరొక చోట రాయవాచక మంతటి విశ్వాసపాత్రమైన యాధార గ్రంథం కాదు" అని వెల్లడించారు బహుశా రావా లోని ఒకటి రెండు చారిత్రక విరుద్ధాంశాలు వెంకట రమణయ్య గారు అలా భావించడానికి కారణం కావచ్చు కృష్ణరాయవిజయం గూర్చి చెప్తూ "కుమారదూర్జటి కృత కృష్ణరాయవిజయము పద్యకావ్యము కాని దీనినొక ప్రత్యేక స్వతంత్ర చరిత్రాధార గ్రంథముగ దలచుటకు వలను పడదు " [3] అని పేర్కొన్నారు

చాగంటి శేషయ గారు "ఈ గ్రంథము కృష్ణరాయవిజయము చరిత్రకారుల కంతగా నుపయోగపడదు ఇది ప్రబంధ దృష్టితో రచింపబడి నది కాని చారిత్రక దృష్టితో వ్రాయబడినది కాదు ఇతరాధారముల వలన నిశ్చయమైననే తప్ప కృష్ణరాయ విజయము నందలి యంశములు సత్యము లని చరిత్రకారులు భావించరాదని తలంచుచున్నాడను అని అన్నారు

---

21 కులశేఖరరావు ఎమ్ ఆంధ్ర వచన వాఙ్మయము పు 507 508 లు

22 Venka aramanayya N S ud es n he H ory of Th rd Dyna y of V ayanagar P xxv

23 వెంకటరమణయ్య నేలటూరు శ్రీకృష్ణదేవరాయలు పు 3

24 ·షయ్య చాగంటి ఆంధ్ర కవితరంగిణి X పు 86 87 లు

ఆరుద్రగారు దాగంటి శేషయ గారి అభిప్రాయంతో ఏకీభవిస్తూ "రాజకీయ చరిత్ర కిది తోడ్పడక పోవచ్చునుగాని సాంఘిక చరిత్రకు కొంత పనికి వస్తుంది" [25] అని చెప్పారు అరుణ కుమారిగారు శేషయ ఆరుద్ర గారల అభిప్రాయాలను ఖండిస్తూ "చరిత్రకు సైతం అంతంతమాత్రం కాక ఈ గ్రంథము విజయనగర చరిత్రను తెలిసికొనుటకు చరిత్రకారులకు మిక్కిలి తోడ్పడును" [26] అని ఉద్ఘాటించారు

విజయనగర చరిత్ర రచనకు కృష్ణరాయ విజయము కంటె రాయ వాచకమే ఎక్కువగా తోడ్పడుతుందని చరిత్రకారులందరూ అంగీకరించారు కాని సాంఘిక చరిత్ర రచనకు రా వా కంటె కృష్ణరాయ విజయమే చాల సహాయపడుతుంది కాబట్టి చరిత్రకారులకు రెండూ ఉపయుక్త గ్రంథాలే

---

25 ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం X పు 202

26 అరుణకుమారి బి ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు పు 197

# రాయవాచకం–కన్నడ శ్రీ కృష్ణదేవరాయన దినచరి–తులనాత్మక పరిశీలన

కన్నడ శ్రీకృష్ణదేవరాయన దినచరి 1983లో ఆచార్య ఎం వి సీతారామయ్యగారి సంపాదకత్వంలో బి యం శ్రీ స్మారక ప్రతిష్ఠాన్ బెంగుళూరు వారి తరఫున ప్రకటింపబడింది ఇది తెలుగులోని రాయవాచకానికి యథాతథానువాదం ఇది మైసూరులో దొరికిన ఒకే ఒక తాళపత్ర ప్రతి[1] ఆధారంగా రూపుదిద్దుకుంది

రా వా కన్నడ భాషలోనికి అనువాదమైందంటే అది ఆ కాలంలో చాల ప్రాచుర్యం పొంది ఉండవచ్చని చెప్పవచ్చు శ్రీకృష్ణదేవరాయల జీవితం ఆనాడు దక్షిణ భారతదేశమంతటికీ ఆదర ప్రాయమైంది కాబట్టి రా వా లోని విషయాలు ఆనాటి కైఫియతుల్లోను బఖైరుల్లోను ఎక్కువగా చోటు చేసుకున్నాయి

ది చ రా వా నికి యథాతథానువాదం అయినప్పటికీ రా వా లోని అనేక విషయాలు దినచరిలో లేవు దీనికి కారణం ది చ కర్త సంక్షిప్తీకరించి వ్రాసి ఉండవచ్చు అలాగే రా వా లోని అనేక పద్యాలు శ్లోకాలు కూడా ది చలో కనిపించవు వాటి భావానువాదం మాత్రమే కనిపిస్తుంది దీన్నిబట్టి చూస్తే ది చ కర్తకు పద్యాల్ని కన్నడంలోకి అనువాదం చేసే సామర్థ్యం లేకపోయి ఉండవచ్చని భావించవచ్చు సంస్కృత శ్లోకాలనైనా యథా

---

1 ప్రస్తుతం దినచరి తాళపత్రప్రతి బి యం శ్రీ స్మారక ప్రతిష్ఠాన్‌లో భద్రపరచబడి ఉంది ఇది 63 తాళపత్రాల్లో చివరి ఆకు తప్ప రెండువైపులా వ్రాయబడింది శ్రీకృష్ణదేవరాయనదినచరిని ప్రకటించేనాటి తెలుగులో రాయవాచకమున్నట్లు తెలీదని తత్సంపాదకులు చెప్పారు

తథంగా ఇచ్చి ఉండవచ్చు కాని ఇవ్వలేదు వాటికి కూడా భావానువాదం ఇస్తే బాలని భావించినట్లు తెలుస్తుంది.

శ్రీకృష్ణ దేవరాయన దినచరి అనే పేరు హస్తప్రతి ప్రారంభంలోనే చెప్పబడింది దినచరి అనే పదం సంస్కృతంలోని దినచర్య అనే పదం నుండి పరిణమించింది ఇది దినచర > దినచరియ > దినచరిగా మారింది శ్రీ కృష్ణదేవరాయన దినచరి అంటే శ్రీకృష్ణ దేవరాయలు తనగురించి స్వయంగా వ్రాసుకున్న దినచరి (diary) కాదు అతని గురించి విశ్వనాథ నాయకుని స్థానాపతి తెలుగులో రాయవాచకము వ్రాయగా తెలుగు కన్నడ భాషలు తెలిసిన ద్విభాషా వ్యవహర్త లెవరో కన్నడంలో అనువదించారు దినచరి అంటే ఒక దినానికి సంబంధించిన కార్యకలాపాల వివరణ అని మాత్రమే ఇక్కడ అర్థం కాదు ప్రతిదినమూ చేసిన పనులను దాఖలుపరిచే గ్రంథం అని కూడా అర్థం చెప్పుకోవాలి సాధారణంగా దినచరి గ్రంథాలు స్వీయకర్తృకాలై ఉంటాయి కాని ఇక్కడ రా వా శ్రీకృ దే ది చ అన్య కర్తృకాలు కావడం విశేషం

శ్రీకృ దే ది చ ని తత్సంపాదకులు ఒక బఖైరుగా పేర్కొన్నారు [2] బఖైరు అంటే ఒక అధికారి తన ప్రభువుకు వ్రాసుకునే ఒక సుదీర్ఘమైన పత్రం. ఇది నేడు నివేదిక అని వ్యవహరింపబడుతోంది కన్నడంలో రామ రాయన బఖైరు చిత్రదుర్గద బఖైరు మొదలైనవి లభ్యమవుతున్నాయి నామా అన్నా దాదాపు అదే అర్థం ఉదా హైదరునామా రాజేంద్రనామా మొ వి వీటిలో శ్రీకృ దే ది చ అతిప్రాచీనమైనదని సీతారామయ గారు అభిప్రాయ పడ్డారు [3]

శ్రీకృ దే ది చ విశిష్టాద్వైత మత సిద్ధాంత స్థాపకులైన శ్రీ రామానుజా చార్యుల నమస్కార వాక్యంతో ప్రారంభమవుతుంది శ్రీమతే రామానుజాయ నమః. తర్వాత ఈ క్రింది విషయాలు వరుసగా కూర్చబడ్డాయి

---

2 శ్రీకృష్ణ దేవరాయన దినచరి పీఠిక x

3 పైదే

వీరనృసింహరాయల శ్రీకృష్ణదేవరాయల ప్రాత కాల దినచర్య పు 1 3 విద్యానగర స్థాపన పు 3 5 కృష్ణదేవరాయల పట్టాభిషేకం పు 5 6 అప్పాజీ మొదలైన మంత్రులు రాయలకు రాజనీతి ఉపదేశించడం పు 7 9 వివిధ రాజ్యాలకు వేగర్లను పంపడం పు 10 కృష్ణదేవ రాయలు రాత్రివేళ నగరశోధన చేయడం పు 11 నగరి కోటాది వివరణ పు 12), చతురంగ బలాలను సంతరించడం (పు 13 17 తురుష్కుల రాజ్యంలో దండన విధానం పు 18 22 తురుష్కులపై దండెత్తిపోవడం పు 23–28), ఢిల్లీసుల్తాను ఓరుగల్లుపై దాడిచేయడం ఢిల్లీ సుల్తాను ప్రతాప రుద్రుల మహిమల వర్ణన పు 29 30 పురుషోత్తమ నగర వర్ణన పు 31 33 గోదావరి తీరంలో గజపతి జగన్నాథుల వివరం షోడశపాత్రులు తమ సాహస పరాక్రమాలను వ్యక్తం చేయడం పు 34 35 గజపతి రాజ్యంలో జగజెట్టి గారడి వర్ణన పు 36 కృష్ణరాయల దిగ్విజయాలు పు 37-41), కృష్ణరాయలు గజపతిపై దండెత్తి షోడశపాత్రులకు పదారు నగం బహుమానాలు పంపడం పు 42 51 గజపతి కుమార్తెతో కృష్ణ రాయల వివాహం పు 52 విద్యానగరానికి వచ్చేముందు కృష్ణరాయలు తీర్థక్షేత్రాలను దర్శించడం అనంతరం విద్యానగర ప్రవేశం మొదలైన విషయాల వర్ణన పు 52 53

ఈ శ్రీ క దే ది చ విషయాలను రా వా తో పోల్చిచూసినపుడు రా వా లోని శింగిరిభట్ల ప్రసక్తి వా సవృత్తాంతం విద్యారణ్యుల ప్రశంస మొదలైన అంశాలు ది చ లో లేవు ఆలాగే రా వా లో గ్రంథారంభంలో చెప్పిన అవతారికా పద్యాలుగాని గ్రంథాంతంలోని ఫలశ్రుతి వాక్యాలుగాని ది చ లో లేవు ఇంకా కొన్ని విషయాల్లో అక్కడక్కడ తేడాలు కనిపిస్తాయి

గ్రంథ కర్తృత్వం శ్రీకృష్ణదేవరాయనదినచరిని శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన కవులైన ముక్కుతిమ్మన మాదయ్యగారి మల్లనలు వ్రాశారని ఆ గ్రంథ సంపాదకులు పేర్కొన్నారు [4] వీరు గ్రంథాంత భాగంలోని వాక్యాలాధారంగా

4 శ్రీకృష్ణదేవరాయన దినచరి సంపాదకరనుడి v

అలా భావించి ఉండవచ్చు ది చ రా వా న్ని చాల సన్నిహితంగా అనుస రించి వ్రాసినదైనప్పటికి రా వా లోని గ్రంథాంత భాగం ది చ లో యథా తథంగా లేదు రా వా లో గ్రంథం చివర మంత్రులు కృష్ణరాయలతో పూర్వం అవనీపతులు కృతులందుకొని శాశ్వత కీర్తిని పొందినట్లే స్వామివారు కూడా కృతులందుకొని శాశ్వత కీర్తి పొందాలని చెప్పగా రాయలవారు చాల సంతోషపడి అల్లసాని పెద్దన ముక్కు తిమ్మన మాదయగారి మల్లన మొదలైన కవీశ్వరులతో కృతులందుకోవలెనని తగిన బహుమానాలిచ్చి మనుచరిత్ర పారిజాతాపహరణ కావ్యాలను చెప్పుమని ఆనతిచ్చి నట్లు ఉంది ది చ లో అల్లసానిపెద్దన ప్రస్తావనగాని కృతుల ప్రస్తావన గాని లేదు ముక్కు తిమ్మన మాదయగారి మల్లనల ప్రస్తావన మాత్రమే ఉంది అంతేగాక రా వా లో కథా ప్రారంభంలో ఇలా ఉంది "శ్రీమంతు సకల గుణ సంపన్నులయిన మహామేరు సమానధీరులైన అఖండిత లక్ష్మీ ప్రసన్నులైన శ్రీమన్మహామండలేశ్వర రాజమాన్య మహారాజ రాజశ్రీ కాశీ విశ్వనాథ నాయనయ వారి దివ్య శ్రీ పాద పద్మములకు దేవరవారి స్థానాపతి భక్తపరాధీనుండు సద్వినయ భయ భక్తుల నున్ను కాయంగల విన్నపం ఈ విన్నప వాకా లు ది చ లో లేవు దీన్నిబట్టి చూస్తే శ్రీకృష్ణదేవరాయలు ముక్కుతిమ్మన మాదయగారి మల్లనలకు కృతులు చెప్పుమని ఆనతిచ్చినట్లు చెప్పబడింది తప్ప తన దినచరిని వ్రాయమని ఎక్కడా చెప్పలేదు కాబట్టి ముక్కుతిమ్మన మాదయగారి మల్లనలు ది చ ని వ్రాయలేదు పైగా దినచరి గ్రంథ సంపాదకులు గ్రంథ కర్తృత్వ విషయంలో ఎలాంటి సాక్ష్యాధారాలూ చూపలేదు

మూలత రా వా న్ని తెలుగులో మధురనాయకుడైన విశ్వనాథ నాయకుని స్థానాపతి వ్రాయగా అనంతరం కన్నడభాష తెలిసిన వారెవరో కన్నడంలోకి అనువదించే ప్రయత్నం చేశారు అంతేగాని ది చ కర్తలు ముక్కు తిమ్మన మాదయ్యగారి మల్లనలుకారు రా వా కర్తృత్వం లాగే ది చ కర్తృత్వం కూడా ఇంతవరకూ తేలని సమస్య

అనువాద విధానం రా వా లోని అన్ని అంశాలు శ్రీ కృ దే ది చ లో లేవు కొన్నిచోట్ల రా వా లోని 3 4 పుటల విషయం ది చ లో

---

5 రాయవాచకము 1982 పు 80

వదలి వేయబడింది  మల్లంగ్ర  పుంభావ  సరస్వతి  చెప్పిన  విద్యారణ్యుల పూర్వాశ్రమ జీవితం ది చ లో లేదు  అలాగే రాయలకు రాజనీతి ఉపదేశించే సందర్భంలో దాదాపు 4 పుటల విషయం ది చ లో లేదు గ్రంథాంతంలో రాయలు దిగ్విజయ యాత్రలు ముగించుకొని పుణ్య తీర్థ క్షేత్రాలను దర్శిం చిన ఘట్టం ది చ లో చాల సంక్షిప్తంగా ఉంది

ది చ ని రా వా తో పోల్చి చూస్తే వాటిమధ్య ఉన్న పాఠభేదాలు స్పష్టమవుతాయి

రా వా లో కథా ప్రారంభంలో ఉన్న పాఠం

"విద్యానగరమందు వీరనృసింహ్మరాయలవారు బ్రాహ్మీ ముహూర్తాన లేచి అరాదు ల నామావళులున్ను అధ్యాత్మ సంకీర్తనలున్ను పాండవగీతలు భ్రమరగీతలు గజేంద్రమోక్షం భారతసావిత్రి దధి వామనస్తోత్రము గంగావ తరణమున్ను నదీస్తోత్రమున్ను భారతం భాగవతం రామాయణం ముచుకుంద స్తుతి అ కూరస్తుతి భీష్మస్తుతి సంజయుని నీతి విదురనీతి చాణూరనీతి వద్య నీతి ఇది మొదలైనవిన్ని నీతివైరాగ్య శతకం పురాణశ్రవణమున్ను రాజ నీతులన్నియు విని దర్పణావలోకానంతరం తన కామణుల కల్పకామధేనువను స్పర నంబుజేసి విప్రవరుల దర నంబు జేసిన ఎంమ్మట దంతధావన ముఖ మజ్జన నామతీర్థమై విభూతి ధరియించి పేరోలగంబై కూర్చుండగాను నూట యెనిమిది తిరుపతులనుంచిన్ని తీర్థప్రసాదములున్ను దెబ్బైరెండు దేవస్థలాల నుంచి విభూతి గంధప్రసాదములున్ను రాగా యెదురుకొని ప్రతు ద్ధానంజేసి అంజలిచేనందుకొని శిరసావహించి స్థలాంతరాల నుంచ్చిన్ని వచ్చిన అయ్యం గార్లనున్ను ఆరాధ్యపతంవారలనున్ను వుచితాసనములయందు కూర్చుండ నియమించి అష్టస్వయం వ్యక్తం శ్రీరంగం శ్రీ ముష్ణం వెంకటాచలం సాల గ్రామం తోతాద్రినైమిశారణ్యం పుష్కర క్షేత్రం ఇది మొదలయిన స్థలాలకు సురక్షితము గలవా అని అడిగినందులకు దేవరవారి ప్రతాపాతిశయమువల్ల ఆయాస్థలాంతరముల వున్న ముద్రకర్తలు వొకటికొకటి కొదవలేకుండ నడుపుతావున్నారు" పు 2 3

దీనికి శ్రీకృష్ణదేవరాయన దినచరి పాఠం ఈ క్రింది విధంగా ఉంది

"విద్యానగరదల్లి కృష్ణరాయరు విద్యానగరదల్లి వీరలినరసింహరాయ (ర) వరు బ్రాంహీ ముహూర్తదల్లి యెద్దు అద ర నామావళిగళన్ను అధ్యాత్మ సంకీర్తనెగళన్ను పాండవ వనితెయన్ను గజేంద్రమోక్షవన్ను భరతసావిత్రియన్ను భాగవతవన్ను ముచుకుంద స్తోత్ర మొదలాదువన్ను సంజయనీతి విదురనీతి చాణక్యనీతి వైరాగ్యశతక నీతిశతక వద నీతి మొదలాదంథా రాజనీతిగళన్ను కేళిదంథావరాగి కపిలధేనువన్ను స్పర మాడి జోడు బ్రాంహ్మరన్ను నోడి కళుహిసి ముఖ ఖ మజ్జన నామతీర్థవాగి కుళితుకొళలాగి నూరెంటు తిరుపతియింద తీర్థ ప్రసాదంగళ్ యెప్పత్తెళు శివస్థానగళింద గంధ ప్రసాదంగళ్ బరలాగి ప్రతు థానం మాడి తెగెదుకొండు శిరసావహిసికొండు స్థళాంతరదింద బందంథా అదాయ పురుషరన్నూ ఆరాధ్య ఎరదవరుగళన్నూ కుళితు కొళ హేళి నియామకవమాడి అష్టస్వయం వ క్తరాదంథా శ్రీరంగ శ్రీముష్ణ వెంకటాచల శేశాద్రి మొదలాదంథా స్థళగళిగె తుంబు పడితరవన్ను నిత్యోత్సవగళన్ను కడమె యిల్లదహాగె నడదు బహదె యెందు కేళలాగి అదక్కె అదాయ పురుషరు దేవరవర ప్రతాప దింద ఆ స్థలాంతరదల్లి యిద్ద ముద్రెకర్తరు కడమె బారదహాగె నడెసుత్తా యిద్దా రాగలాగి" పు 1

పై రా వా ది చ పాఠాలను పరిశీలిస్తే ఆ రెండింటి ఉన్న భేద సాదృశ్యాలు కొంతవరకు తెలియగలవు

ది చ పాఠంలో విద్యా నగరదల్లి కృష్ణరాయరు అనేది అదనంగా చేర్చబడింది ది చ లో భ్రమర గీతలు దధివామన స్తోత్రము గంగావతరణము నదీ స్తోత్రము భారతం రామాయణం అక్రూరస్తుతి భీష్మస్తుతి సాలగ్రామం నైమిశారణ్యం అనే మాటలు లేవు పాండవ గీతలు అనేదాన్ని పాండవ వనితె యని చాణూర నీతి ని చాణక్య నీతి అని విప్రవరుల అనేచోట జోడు బ్రాంహ్మరన్ను జంట బ్రాహ్మణులను అని అక్కడక్కడ కొద్దిగా మార్పులు చేయబడ్డాయి డెబ్బైరెండు దేవస్థలాలనుంచి అనడానికి యెప్పత్తెళు శివస్థానంగళిద (77 అని సంఖ్యా భేదం కూడా కనిపిస్తుంది

కొన్నిచోట్ల ఒక్కొక్క పదం ఏరుకొని అనువదించినట్లు కనపిస్తుంది ఉదాహరణకు ఈ క్రింది రా వా పాఠంతో ది చ పాఠాన్ని పోల్చిచూస్తే తెలుస్తుంది

రాయవాచకపాఠం

"విదా రణ్య లు ఉత్తరదేశాన కాశ్మీర ఖండమందు మండల మిత్రుల వద్దను సకలశాస్త్రములున్ను నేర్చి చింతామణి మంత్రోపదేశము చేత లక్ష్మీ దేవిని ప్రార్థనసేయంగా ఆ ఇందిరాదేవి ప్రత్యక్షమై నీకు కావలసిన వరము లడుగుమని ఆనతియ్యగా విద్యారణ్య లు తనపేరు వొక పట్టం గావించవలసి వున్నది మీరు అక్కడ యెన్నాళ్లు వాసముగా వుందురో అన్నాళ్లున్ను ఆ పట్టములోగల ప్రజలందరున్ను సుఖస్థితిని వుండవలెను అందునుంచిన్ని తన పేరు కీర్తిన్ని శాశ్వతముగా నిలుచును" పు 8

దీనికి శ్రీకృష్ణదేవరాయన దినచరి పాఠం ఈ క్రింది విధంగా ఉంది

"విద్యారణ్యరు ఉత్తరదేశదల్లి కా శ్మీరఖండదల్లి మిత్రరఖశియల్లి సకల శాస్త్రగళన్నూ కలితు చింతామణి మంత్రోపదేశదింద లక్ష్మీ ప్రార్థనెయం మాడలాగి శ్రీదేవి ప్రత్యక్షవాగి బేడిదవరవన్ను కేళికోయెందు అప్పణెయన్ను కొడలాగి విద్యారణ్యరు తన్న హెసరినల్లి వొందు పట్టణవ కట్టిసబేకుయెంబు దాగి యిద్దితు అల్లినీవు యెష్టుదివస యిద్దీరి అష్టు దివసవూనూ ఆ పట్టణదల్లి యిరు వ ంథ ప్రజెగళెల్లరూను సుఖదల్లి యిరువరు అద్దరింద తన్న హెసరు కీర్తియు శాశ్వతివాగి నిల్లు వు దు" పు 3

పై పాఠాలను పరి లిస్తే దాదాపు రెండూ ఒకేవిధంగా ఉన్నాయి తెలుగు వాక్యాలను ది చ కర్త కన్నడంలో పెట్టాడంతే

రా వా లో ఆయా సందర్భాల్లో వివిధ గ్రంథాలనుండి పద్యాలు శ్లోకాలు ఉద్ధరింపబడ్డాయి ది చ కర్త వాటిని ఉద్ధరించలేదు కేవలం భావాన్ని మాత్రమే కన్నడంలోకి అనువదించాడు ఒక పద్యాన్ని ఒక శ్లోకాన్ని ఉద్ధరించగా అవి అనేక తప్పులతో కూడుకొని ఉన్నాయి ఈ తప్పులు అక్షర సామ్యంవల్ల దొర్లినట్టుగా కనిపిస్తాయి

రాయవాచకంలోని పద్యం

నా యము ప్రజ పెక్కువకు ను
పాయము ప్రజ కలిమి సిరికుపాయంబగుటన్
న్యాయము భండారము నర
నాయకులకు నంద్రు కీర్తినారాయణుడా పు 18)

ఈ పద్యం శ్రీ కృ దే ది చ లో ఈ క్రింది విధంగా ఉంది

నా యము ప్రజా ఎతురతు ను
పాయము ప్రజాతవిమి సరితు పాయ్యంబగుటం
న్యాయము భండారము నర
నాయకల లినంద్రు కీర్తి నారాయణ పు 8

ఈ క్రింది శ్లోక విషయంలో కూడా ది చ కర్త చివరి రెండు పాదాలను మార్చాడు బహుశా ది చ వ్రాసేటప్పటికి ఆ రెండు పాదాలు వ్యవహారంలో మారిపోయి ఉండవచ్చు లేదా రెండు పాఠాలూ బాగా ప్రచారంలో ఉండగా ది చ కర్త తన కిష్టమైన దాన్ని గ్రహించి ఉండవచ్చు

రాయవాచకంలో ఉధృతమైన శ్లోకం

నష్టం కులం భిన్న తటాక కూపాన్
వి ్రష్ట రాజ ం శరణాగతంచ
గో బ్రాహ్మణాన్ దేవ గణాలయాంశ్చ
యదుద్ధరేత్పూర్వ చతుర్గుణంతత్ పు 75

ది చ లోని శ్లోకం

నష్టం కులం భిన్న తటాక కూపం
ప్రభ్రష్టరాజ ం శరణాగతంచ
దేవాలయం ధర్మ ప్రతిష్ఠాపనం
షడ్భిరివ లోకే సుకృతం భవంతి పుట 51

రా వా లో అర్థం స్పష్టంగా తెలియని కొన్ని పదాలను ది చ చూసి సరిచేయవచ్చు ఉదాహరణకు రా వా లో నల్ల ప్రజలు అన్న పదబంధం ఉంది ది చ ఈ పదబంధానికి కాలాళు పాయుదళం అని పేర్కొంటుంది నేలటూరు వెంకట రమణయ్యగారు కూడా దాదాపు ఈ అర్థాన్నే సూచించారు [6] వారి వివరణ ఈ క్రింది విధంగా ఉంది

6 వెంకటరమణయ్య నేలటూరు నల్లప్రజ భారతి డిశంబరు 1938

1 నల్లప్రజ అనగా బోయవారు దేహచ్ఛాయచే వారి కాపేరు వచ్చెను
2 వారు సైన్యమునందొక శాఖ అమరగాండ్రు కైజీతగాండ్రు పాశెగాండ్ర వలె నల్లప్రజలును నొక శాఖగా నేర్పడియుండిరి
3 వారి ముఖ్య కృత్యము దాడివెట్టినపుడు శత్రువుల గడిదేశములను కొల్లగొట్టి ప్రజాక్షోభము కల్గించుట

అర్థావగాహనకై కొన్ని ప్రయోగాలు ఈ క్రింద ఇవ్వబడాయి

| రా వా | ది చ |
|---|---|
| తొంమ్మిది సంవత్సరములనున్ను 24 1 | వొంబత్తుమంది కరణికరన్ను 12 21 |
| శిఖా 35 15 | ముద్రె 23 27 |
| సంబళిం సారికెలు 42 4 | సంబళం సారిగెగళు 27 15 |
| అర పేద కాలు పేద మనుష్యులయిన వారికి 42 26 | బడమనుష్యరాదంథ వరిగె 27 1 |
| ప్రసాబడి 46 14 | ఊటమాడి 29 29 |
| లాలాపు బిల్లలు 55 19 | లాళద బల్లెగళు 36 14 |
| కరమలవాండ్లు 55 20 | కమ్మారరు 36 15 |
| నిండు సంక్షోకం గుర్రాలు 60 4 | ముస్తదు కుదురెగళు 40 8 |
| సరాళ భ్రష్టులై 63 9 | స్థళభ్రష్టరాగి 42 17 |

ది చ లో కొన్ని ప్రయోగాలు తప్పుగా గ్రహింపబడ్డాయి వాటిని రా వా ఆధారంగా సరిదిద్దుకోవచ్చు

| ది చ | రా వా |
|---|---|
| త్రి హగలు 11 17 | రాత్రిహగలు 22 12 |
| ముగోవందితరు 20 5 | ముద్దో వందితులు 34 8 |
| దాబోజి వందితరు 20 5 | దాదో వందితులు 34 8 |
| తాత్తలకమత్తి 25 21) | తాత్కాలికమతి 40 17 |
| దలబలగళన్ను 33 11 | కలిమిబలములున్ను 51 19 |
| క్షిప్రకాలదల్లి 39 22 | గ్రీష్మకాలాన 59 14 |
| తమ్మకులదవరిగె (40 1 | కంమ్మకులంవారికి (59 23) |

ది.చ కర్త రా వా లోని కొన్ని ప్రయోగాలను యథాతథంగా అనువదించాడు

| రా వా | ది చ |
|---|---|
| అవధి ఆటంకములు లేక 3 2 | అవధి అతంక ఇల్లదె (2 2) |
| కావలికట్లు 3 18 | కావలు కట్టి (2 7 |
| అర్ధబడి 3 21 | అర్ధబిద్ద 2 10 |
| తొక్కచూడవలెను (20 18 | మెట్టినోడబేకు 10 5 |
| ప్రసాదవద్యారములు 26-2) | ప్రసాదవద్యారగళు 14 1 |
| కట్టడిజేసి 26 23 | కట్టళెమాడి 14 20 |
| యేకదేశాన 26 24 | ఏకదేశవాగి 14 21) |
| ప్రాశివచ్చెను 33 4) | బరెదు బందవు 19 12 |
| టోకించు 52 25 | టోకిసు 34 15 |
| చంక్కనిడుకొని 55-10 | కంకళల్లిక్కికొండు (36-3 |

రా వా లోని కొన్ని సమస్త పదాలు (జంట పదాలు ది చ లో తారుమారుగా ప్రయోగింపబడ్డాయి. ఇవి కన్నడ భాషా నిర్మాణానికి అనుగుణంగా ప్రయోగింపబడినట్లు తెలుస్తుంది

| రా వా | ది చ |
|---|---|
| చిన్న పెద్దలను 8 9 | హిరియకిరియరన్ను (4 4 |
| నిద్రాహారము లేక (22 15) | ఆహార నిద్రెయిల్లదె 11 17) |
| బహుమాన సన్మానములుగా 44-1) | సన్మాన బహుమానగళాగి 28 29 |
| ప్రసాద ప్రభావములున్ను 49 6 | ప్రభావ ప్రసాదవన్ను (31 23 |
| కాళు చేతులాడక 68 7 | కై కాలాడదె 45 30 |

ఇంకా అనేక విషయాల్లో రా వా నికి ది చ కి ఉన్న భేదాలు ఈ క్రింది పట్టికలో చూపబడ్డాయి

| రా. వా. | ది. చ. |
|---|---|
| పదునెనిమిది రేవుల లెఖ్ఖలున్ను (4.6 | హదినెంటుమంది దొరెగళ లెక్కవన్ను 2 22 |
| గోవుల మందలో (9.6 | కురిహిండినల్లి (గొర్రెల మందలో 3 28 |
| రాయసం రామచంద్రయ్య 11 14 | రాయసద విఠ్ఠమరుసు 5 15) |
| పద్యనీతి చంద్రయ్య 23 9 | పద్యనీతి భద్రయ్య 12 9 |
| వీరభద్రయ్య 45 4 | వీరప్ప 28 23 |
| దేవదానవులు 55 4 | దేవమానవరుగళు 35 25) |
| అవుం త్రివృక 68 4 | తురుగళ గుర్రాల తిరుగిని 45 28 |
| అష్టైశ్వర్యములు 70 20 | అష్టదిక్కుగళు 48 2 |

సంఖ్యా వివరాలు

| | |
|---|---|
| శాలివాహన శకాబ్దముల లెక్క ౧౧౨౭ 1127) యేండ్లు మీద 10 8 | శాలివాహన శకవర్షంగళు ౧౧౨౫ 1125 రమేలె 4 21 |
| విద్యారణ్య స్వాములవారు యీ పట్టం గావించేటప్పుడు సింహాసనస్థునికి నిక్షేపించినది తొంభై తొమ్మిది కోట్ల యాభై యారు లక్షల ద్రవ్యంగాక (24 11 | విద్యారణ్యరు పట్టణవ కట్టువాగ సింహాసనస్తరిగె నిక్షేపవాగి తొంబత్తారు 96) కోటి ద్రవ్య నిక్షేపిసిద్దల్లదె 12 6 7 |
| పండ్రెండ్లు యేండ్లకు వొకసారి మూడుం ముక్కాలు వడియ (40 21 | హన్నెరడు సావిర 12 వేల వరు వరుషక్కె వొందుసారి మూరు ముక్కాలు గళిగె 25 24 |
| పచ్చకత్తుల రవుతుం మీద నడిచి జగడమియ్యగా సరిదావులుగా ఆరు వేంలు నాలుగువేల రవుతులు పడిరి (60 17) | బిచ్చుగత్తి రవుతురమేలె జగళవ మాడలాగి సమాన వాగి నాల్కు (4 సావిరక్కెయెరడు 2 సావిరక్కె బిత్తు 40 16 |

| | |
|---|---|
| గజపతివారు వళ అంతస్తు దావళ్ళో నికివచ్చికూర్చుండి రెండ్డు వినియోగములవారున్ను ఎలుఎంచ్చి 50 23 | గజపతి వోలగద శృంగారవాగి వొందు అంతస్తు దావడిగె బందు కుళితుకొండు యెప్పతెరదు 72 వినియోగదవరన్ను కరెయ కెళుహి (31 21) |
| రెండు ఝాములు 52 3 | హొత్తు హన్నెరడు 12 ఘళిగె 33 21 |
| అరవైనాలుగు అడుగుల వెడల్పున అర్ధమై వుండ్గగా (54–24) | ఐవత్తు 50 హెజ్జె అర్ధగలదల్లి అర్ధలాగి యిరలాగి 35 20 |
| మూడు లక్షల పాయుదళమున్ను 63 20 | లక్షపాయిదళవకూడికొండు 42 20 |
| ఆ కనుమలో ముప్పైవేల స్తోమాన్ని | కళువెయల్లి యిప్పత్తు 20 |
| ఠాణం వుంచ్చి 65 20 | సావిరక్కె ఠాణ్యవిరిసి 43 23 |

ఇంకా సేన వివరణ కోశాది వివరణ మొదలైనచోట్ల రెండింటికీ మధ్య అనేక తేడాలు కనిపిస్తాయి[7]

రా వా లో పేర్కొన్న రాజ యవక్తుల పేర్లన్నీ ది చ లో లేవు అలాగే ఊర్ల పేర్లల్లో కూడా ది చ లో కొన్ని మాత్రమే నమోదు చేయబడ్డాయి

రాజకీయ వ్యక్తుల పేర్లు

| రా వా | ది చ |
|---|---|
| అప్పాజీ మొదలయిన వాలుగా అంప్పించుకో వచ్చిన తర్వాత అయ నమలక అంకుశఖానుండు రాణా జగదేవు గణితి తిమ్మప్ప నాయడు రాచూరి రామి నాయడు పెమ్మసాని | అప్పాజీ మొదలా దంథవరన్ను మనెగె కళుహి అయ్యనమలక అంకుశం ఖాన [?] రాణా జగదేవ గన్ని తిమ్మ నాయక పెమ్మసాని రామలింగ నాయక శంకళనాయక కాలినాయక |

7 రాయవాచకము పు 24 & 30 లు శ్రీకృష్ణదేవరాయన దినచరి పు 12 & 13 లు

రామలింగమ నాయడు హండ్డే మల్ల
రావు బోయి రామప్ప హరివాణం
కొమాళయిన వదునెనిమిది కప్ప
డాలవారున్ను దళనాయకులు అప్పర
పిళ్ళ కుప్పరపిళ్ళ సాళువ నాయడు
కొమార తిమ్మప్ప సంగ్గరాజు చెర్వ
ప్రధాని తిప్పరసు అయ్యప్పనాయడు
కొటికం విశ్వనాథనాయడు చెవ్వప్ప
నాయడు అక్కప్పనాయడు కృష్ణప్ప
నాయడు వెలిగోటి యాచమనాయడు
కన్నడ బసవప్ప నాయడు సాళువ
మేకరాజు మట్ల అనంతరాజు తిమ్మరాజు
వీరమరాజు మొదలయిన వారున్ను
బొమ్మిరెడ్డి నాగారెడ్డి బసువారెడ్డి
మొదలైన రెడ్డికొమాళ్ళున్ను కమ్మ
నాయకులు విఠలప్ప నాయడు అల్లుండ్లు
[44 14 25]

హండేదేవణ్ణ ప్రతాపరావు గుజ్జరి బస
వంతరావు పురుష నాయక కుమార
తిమ్మప్ప నంజప్ప హొచ్చు మల్ల
రావుత బేదర రామప్ప హరివాణద
కుమార రాద హదినెంటు మంది కంవణ
దవరు దళాయక అప్పరస పిళ్ళె
కుప్పరపిళ్ళె సాళువ నాయక ప్రధాని
తిప్పరస సుబ్బయ్య అప్పానాయక
విశ్వనాథ నాయకరు అరవ చవుప్ప
రెండ్లదరు[?] కమ్మ నాయకరు ఆళి
యందిరు [28 12 20]

వరదునేదార్లైన స్థానాపతులయిన
అముపురం వారి అనంత్తోటి పంత్తు
లున్ను మానశింగ్గు వారి మాధవ
య్యాను చాందువారి చెన్నగిర
య్యాను కటకం వారి కరుణాకర
య్యాను వోరగంట్టి వారి వోబళ
య్యాను ఢిల్లి సురధాణివారి ఢాకోటి
పంత్తులున్ను బెదదకోట వారి బేకోటి
పంత్తులున్ను గోలకొండ్డవారి గోపోటి
పంత్తులున్ను అహముదా నగరం
వయ్యవ రాజున్ను విజయాపురం

వరదునే దారర స్థానావతి గళన్ను
కర్నాటక సింహాసన దవర కమల
నాతయ్యను అక్కుబరి యవర
ఆనందోటి మానసింగ నవర మాధ
వయ్య ఢిళి సురతాళనవర ఢాకోటి
పండితరు పెన్ను) గొండెయ
గుండమరాజను అమదా నగర
విజయాపుర గోలకొండె బిరాజ
పురదవర ముఖామిగళు మొదలాద
వరు (32 1 4

వీరమరాజున్ను పురాణపురం పురం
ద్దరయ్యాను భాగానగరం బాబోజి
పంత్తులున్ను మొదలుగా గల
ముఖాములైన స్థానాపతులు 49
14-21

రా వా లోను ది చ లోను షోడశ పాత్రుల్లో 15 మంది పేర్లు మాత్రమే చెప్పబడ్డాయి రా వా లోని అఖండ పాత్రునికి బదులుగా ది చ లో ఖడ్గ పాత్రుడు పేర్కొనబడ్డాడు వీరిద్దరిని విష్ణుభొట్ల సూర్య నారాయణగారు ప్రత్యేకంగా పేర్కొన్నారు 8

ఊర్ల పేర్లు

| రా వా | ది చ |
|---|---|
| అష్టస్వయం వ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలం సాల్రగామం తోతాద్రి నైమిశారణ ం పుష్కర క్షేత్రం ఇది మొదలయిన స్థలాలకు 2 20 21 | అష్టస్వయం వ క్తరాదంథా శ్రీరంగ శ్రీముష్ణ వెంకటాచల తోతాద్రి మొదలాదంథా స్థళగళిగె 12 14 |
| అంతరంగ వార్తలరకి వచ్చేటట్టుగా విజయాపురం అహముదానగరం బెదదకోట రాజమహేంద్రం అరం గం చెన్నపట్ణం శ్రీరంగపట్ణం చదరంగపట్ణం శ్రీరంగం మధుర రామేశ్వరం వుమ్మత్తూరు శివ సము ద్రమ్, పెనుగొండ గోలకొండ గుర్రంకొండ మేల్నాడు మొరసు నాడు ఘట్టం మ అరవరాజ్యం మళయాళం కొచ్చి కొంకణం | అంతరంగ బహిరంగ వార్తె గళన్ను తిళిదు బాహాగే గోలకొండె అముదా నగర బెదదకోటె రాజమహేంద్ర యిక్కేరి అగర చెన్నపట్టణ శ్రీరంగపట్టణ ఉమ్మత్తూరు శివన సముద్ర పెనుగొండె మొరసు నాడు తిగుళాణ్య చోళదేశ మలె యాళ కొచ్చి కేరళం తుళువ హైరళ మొదలాద దక్షణరాజ్యవన్ను చంద్రగిరి తిరుపతి గండికోటె |

8 సూర్యనారాయణ విష్ణుభొట్ల శ్రీకృష్ణదేవరాయచరిత్రము (1960 పు 66

| | |
|---|---|
| కేరళం విరాటపురం వరాటదేశం మగధదేశం మత్స్యదేశం విదర్భ దేశం కాంభోజ నగరం కాశ్మీర ఖండం ఢిల్లీనగరం ఇవి మొదలయిన రావులకున్ను తుళువ హైమ మొదలయిన దక్షిణ రాజ్యముల కున్ను చంద్రగిరి గండికోట కడప నంద్యాల బెల్లంకొండ రాచూరు ముదుగల్లు నిడిగల్లు మైసూరు మొదలయిన స్థలముల కున్ను వేగుర్లున్ను నియమించి [21 7 17] | గుత్తి నంద్యాల రాయచూరు ముదుగల్లు మొదలాద స్థళగళిగె బేహి నవర నేమకమాడి కళుహి 10 15 21] |

రా వా యుద్ధాలను యుద్ధం తర్వాత రాయలు దరి ంచిన పుణ్యతీర్థ క్షేత్రాలను సవివరంగా పేర్కొంటే ది చ సంక్షిప్తంగా పేర్కొంటుంది 9

ఈ తులనాత్మక వరి లనవల్ల ఈ క్రింది విషయాలు బోధవడతాయి అవి

1 రాయలకు సమకాలికమైన ఒక ముస్సాయిదా F draf కైఫీయత్తుల్లోనే ఉండి ఉండాలి దాని అనువాదమే ది చ కావచ్చు లేదా భిన్న సంప్రదాయ మార్గానికి చెందిన వేరే రా వా ప్రతి అయినా ది చ కి మూలం కావచ్చు

2 రా వా ది చ గ్రంథాలు కొద్దికాలం తేడాతో పుట్టాయి అనాడు విజయనగరంలో ద్విభాషా వ్యవహారం [Bi ngua m] ఉన్నందువల్ల తెలుగు కన్నడ భాషలు వచ్చినవారే ఈ రెంటికీ మౌలిక కర్తలై ఉండవచ్చు ఇది ఒక ఊహ మాత్రమే

9 రాయవాచకము పు 77 79లు శ్రీకృష్ణదేవరాయన దినచరి పు 52

3 రా వా దిచ రెండూ ఒకే సాంస్కృతిక వ్యవస్థలో పుట్టాయి దక్షిణ భారతదేశంలో విద్యారణ్యస్వాములవారి అద్వైత మతదర్శనంతో మొదలైన ధార్మిక రాజ పాలనా దృష్టి మహాభారత సంస్కృతి రాయలలో రాయల తర్వాత ఎలా ఒక ఒరవడి ని సృష్టించిందో ఈ రెండు రచనలను పరిశీలిస్తే అవగతమవుతుంది తర్వాతి కాలంలో కూడా ఈ సంస్కృతే ఉంది కాబట్టి దిచ కర్త రా వా న్ని అనువదించవలసిన అవసరం ఏర్పడింది

—

"వాడుక భాషయందు వ్రాయబడిన వచన రచనలలో రాయవాచకము ప్రధానమైనది ఇది 16వ శతాబ్దాంతమున రాయ సామ్రాజ్యమున రాజ్య కార్య వ్యవహారములను నడుపు అధికార వర్గమునందు చెలామణి యందుండిన భాష యందు వ్రాయబడినది. పారశీ భాష సంపర్కము వలన నది సులభ గ్రాహ్యముగాక పాఠకులకు క్లేశము గలిగించుచున్నది అతి దీర్ఘ వాక్యములను ప్రాత వచన రచనా విధానమును అచటనచట భావ వైశద్యమునకు బంధకములై వృథా జనకములగుచున్నవి కాని మొత్తము మీద నిందలి భాష పొల్లు మాటలు గాని యనావశ్యక వర్ణనలుగాని లేక పటుత్వము గలిగి యున్నది"

—నేలటూరు వెంకట రమణయ్య

# వర్ణవిభాగం

## లేఖన పద్ధతులు

రాయవాచక భాషలోని వర్ణాలను వివరించేముందు ఆకాలంనాటి లేఖన పద్ధతుల్ని ప్రస్తావించడం ఎంతైనా అవసరం ఇవి సమాకాలీన వ్యవహారిక రచనల్లోను శాసనాల్లోను బాగా ప్రసిద్ధంగా కనిపిస్తాయి

లేఖనంలో రేఫసంయుక్తంలో రేఫకు వలపల గిలక ఁ వ్రాసి రేఫనే ముందు ఉచ్చరించేవారు కాలక్రమాన లేఖనంలో వలపం గిలక తొలగిపోయి దాని స్థానంలో రేఫ నిలిచిపోయింది రా వా లో తాళ వ త్తుల్లో కూడా వలపల గిలక ఒక్పుడు వ్రాయడం ఒకప్పుడు వ్రాయకపోవడం రేఫ వలపల గిలక రెండూ వ్రాయడం ఈ విధమైన అనియత స్థితి కనిపిస్తుంది

| | | | |
|---|---|---|---|
| కన్నాఁటకం | 40 1 | కర్నాటకం | 33 1 |
| వాతఁలు | 42 18 | వార్తలకు | 43 6 |
| వేగులఁను | 42-27 | వేగుర్లను | 35 12 |
| వాలఁను | 43 3 | వార్లను | 35 25 |
| కీతిఁ | 46 15 | కీర్తి | 80-1 |
| తూపుఁ | 53 15 | తూర్పున | (40 1 |
| | వార్లఁకు | 39 20 | |
| | దుర్గఁములు | 41 18 | |
| | వార్లఁను | 41 19 | |

రేఫకు వలపలగిలక వచ్చినపుడు రేఫమీది హల్లును ద్విరుక్తం చేసే వారు ఈ పద్ధతి ఆర్యభాషా సంప్రదాయం నుంచి ఎరువుగా వచ్చిందని భాషా వేత్తలు అభిప్రాయ పడ్డారు

---

1 రాధాకృష్ణ బూదరాజు ప్రాచీనాంధ్రం శాసన భాషా పరిణామం తెలుగుభాషా చరిత్ర పు 53

| | |
|---|---|
| వేగుల్లూ | 63 25 |
| మన్నాట | 64 11 |
| గిరిదుర్గం | (64 26 |
| కన్నాటకం | 65 12 |

అనునాసికాక్షరం ముందు అనుస్వారం ఒకప్పుడు రావడం ఒకప్పుడు రాకపోవడం

| | | | |
|---|---|---|---|
| పింమ్మట | 2 14 | ఎమ్మట | 50 9 |
| తొంమ్మిది | 4 5 | తొమ్మిది | 24 10 |
| వుంన్న దినాలకు | (41 9 | వున్న దుర్గములు | 41 18 |
| వింన్నవం | 43 3 | విన్నవం | 44 13 |
| అంమ్మ | 78 22 | అమ్మ | 78 13 |

అనుస్వారం వచ్చినపుడు ద్విత్వ అనునాసికం అద్విత్వం కావడం

వెలదంమి 17 26

ఇది లేఖన భేదమేకాని ఈ వ్రాత ఉచ్చారణ భేదాన్ని సూచించదు అనుస్వారాన్ని మకారానికి బదులుగా వాడే పద్ధతి వచ్చిన తర్వాత అనుస్వారం అనునాసికాలన్నిటికీ సమానమని భావించి అనునాసికాలన్నిటికి అనుస్వారం వ్రాస్తూ వచ్చారు [2] అనునాసికాలకు అనుస్వారం వ్రాయడం ప్రాకృత భాషా ప్రభావం [3] అనుస్వారం మీది హల్లును ఒత్తి పలికినప్పుడు ద్విత్వంగాను తేల్చి పలికినపుడు అద్విత్వంగాను వ్రాసేవారు ఇలాంటి స్థితి అనాటి శాసనాల్లో స్పష్టంగా కనిపిస్తుంది

| | | | |
|---|---|---|---|
| కూర్చుండ్డుక | 12 19 | కూర్చుండుకొని | 12 14 |
| సంవ్వత్సరములు | 45 23 | సంవత్సరములు | 29 17 |
| సేవించ్చి | 79 1 | సేవించి | 78 25) |

2 రామచంద్ర తిరుమల తెలుగు లిపి పరిణామం తె భా చ పు 352

3 పైదే పు 349

అనుస్వారం మీది స్వర వర్ణంతోపాటు ఆ వర్గానునాసికం కూడా వ్రాయడం

నుంణ్డి 42 15
వంజ్జి 50 11

కొన్ని పదాల్లో దీర్ఘంమీద అనుస్వారం వ్రాయడం వ్రాయకపోవడం

వాండు 10 25 బంగ్గారు ఎటమీద 49 26
మీంద 58 12 యేరుదాటి 51 18
దాంచి 59 3 కృష్ణదాటి 51 19
కృష్ణవేణిదాంటి 59 7

మూర్ధన్య హల్లుమీది ద్విత్వానికి మూర్ధనా నికి బదులుగా దంతమూలీయం వ్రాయడం

అన్నాళ్లు 8 22
అణ్ణగర్లు 26 6
కాళ్లు 68 7

ఇక్కడ దంతమూలీయం వ్రాసినా దానికి మూర్ధన ఉచ్చారణే ఉంటుంది

కొన్ని తత్సమ పదాల్లో విలోమ లేఖనం nve e Spe ng కనిపిస్తుంది

ఆశ్రుతులైన 49 27
పాత్రునికిన్ని 54 15

పదాది సంయుక్తంలో రేఫ కొన్ని చోట్ల వ్రాయడం కొన్నిచోట్ల వ్రాయకపోవడం

త్రవ్వి (11 17 తోవ 53 4 <త్రోవ
మ్రోయగా 12 6 తొక్కి 59 26 <త్రొక్కి
బ్రతుకలు 59 23 పొద్దు 68 26 <ప్రొద్దు
వ్రాయించ్చి 68 24 తొవ్వించి (78 1) <త్రవ్వించి

వ్యావహారిక భాషలో వ్రాయు అనే పదంలో వకారం లోపించి రేఫ అలాగే మిగిలి ఉంటుంది పదాది రేఫ సంయుక్తంలో రేఫ లోపించడానికిది

అపవాదం తెలుగు భాషలో పదాది సంయుక్తం వర్ణవ్యత్యయం Me a the s వల్ల ఏర్పడింది

మిత్ర శబ్దం శత్రు శబ్ద సామ్యంతో మిత్రువు గా మారింది
శత్రువుల మిత్రువులుగా జూచి 5 2

హ్మ అనే సంయుక్తం మ్హ గా ఉచ్చరించడం 12 వ శతాబ్దం నుంచే భాషలో కనిపిస్తుంది హకారానికి ముందు మకారం వాడడం మొట్టమొదట గిర్నార్ శాసనంలో కనిపిస్తుందని Bu ne పండితుడు పేర్కొన్నట్లు తిరుమల రామచంద్రగారు తెలిపారు [4]

రా వా భాషలో మకారానికి అనుస్వారం వ్రాసినా హకారంపై మరలా మకారం వ్రాయడం కనిపిస్తుంది

వీరనృసింహ్మ రాయలు 2 6
బ్రాంహ్మీముహూర్తాన 2 6
సింహ్మాసన వరభారకం 12 17
బ్రంహ్మ 33 15
బ్రాంహ్మలు 33 23

హకారం ముందు అనుస్వారం వ్రాయకపోవడం సహజస్థితి

బ్రాహ్మణుండు 5 23
బ్రాహ్మని 5 24

జిహ్వ శబ్దాన్ని జింహ్మ అని కూడా వ్యవహరిస్తున్నందువల్ల లేఖనంలో రెండు రూపాలూ కనిపిస్తాయి

జిహ్వ 16 1
జింహ్మలున్ను 49 8

థకారానికి దకారోచ్చారణ ప్రాఙ్నన్నయ యుగంలోనే ప్రారంభమైంది [5] రా వా లో ఇది అనియతంగా కనిపిస్తుంది

---

4 రామచంద్ర తిరుమల తెలుగు లిపి పరిణామము తె భా చ పు 352

5 రాధాకృష్ణ బూదరాజు ప్రాచీనాంధ్ర శాసనాలు 1971 పు 22

ఉదా నామ శీర్షమై 2 14
భాగీరథిలో 7 25)
ప్రత్యుద్దానము 2 17
భాగీరథీ స్నానము 6 18

ఉచ్చారణలో యి వర్ణ ఇ వర్ణాలకున్న సన్నిహితత్వాన్నిబట్టి అంతస్థ యి వర్ణాన్ని ఇ వర్ణంగా వ్రాయడం చాలచోట్ల కనిపిస్తుంది అలాగే వు వర్ణానికి ఉ వర్ణం వ్రాయడం కూడా ఆనాటి శాసనాల్లో ఎక్కువగా కనిపిస్తుంది

ఉదా అఇతే 7 15 అఇదు 60 21
కుల్లాఇ 55 26 పోఇనాట్లాయను 62 3
తెగకోఇంచ్చగా 60 18 వ్రాఇంచ్చి 73 4

## వర్ణాలు

రా వా భాషలోని వర్ణాలను రెండు విధాలుగా వర్గీకరించవచ్చు
1 దేశ్యవర్ణాలు 2 అన్యదేశ్యవర్ణాలు
దేశ్యవర్ణాలు రా వా భాషలోని దేశ వర్ణాలను ఈ క్రిందివిధంగా చూపవచ్చు
అచ్చులు

| | పురస్ | కేంద్ర | పశ్చాత్ |
|---|---|---|---|
| ఊర్ధ్వ | ఇ | | ఉ |
| మధ్య | ఎ | | ఒ |
| నిమ్న | | ౛ | |
| | | అ | |

హ్రస్వాచ్చులకు దీర్ఘాచ్చులకు మధ్య అర్థ భేదకత్వం ఉండడంవల్ల దీర్ఘం కూడా ప్రత్యేక వర్ణంగా పరిగణింపబడుతుంది ౛ అనే ధ్వని ఇటీవల తెలుగులో బయలుదేరిన నూతన ధ్వని దీనికి లిపి చిహ్నం ఏర్పడలేదు ఇది

నేడు వా వహారిక భాషలో ఇ+ఆ ల సంయోగంవల్ల ఏర్పడిన సంధి గతాచ్చుగా వాడుకలో ఉంది

ఉదా తాటాకు వచ్చాడు చేశాడు మొ

రా వా భాషలో ఏకపదంలోనే ఈ ధ్వని దీర్ఘంతోను యావత్తుతోను కనిపిస్తుంది ఇది ఉచ్చస్వరం నిమ్నస్వరం కావడంవల్ల ఏర్పడుతుంది

ఉదా విన్నపం శాయంగా 3 20 <శేయంగా<సేయంగా
<చేయంగా

వ్యాళ 54 5) <వేళ)
శాన (68 2 <సేన
దారుల దాత 75 3 (<చేత

హల్లులు

| | | ఓష్ఠ్య | దంత | దంత మూలీయ | మూర్ధన | తాలవ్య | కంఠ |
|---|---|---|---|---|---|---|---|
| స్పర | శ్వాస | ప | త | | ట | | క |
| | నాద | బ | ద | | డ | | గ |
| స్పృష్టోష్మ | శ్వాస | | | | | చ | |
| | నాద | | | | | జ | |
| ఊష్మ | | | స | | | | |
| అనునాసిక | | మ | | న | ణ | | |
| పార్శ్వక | | | | ల | ళ | | |
| కంపిత | | | | ఱ | | | |
| తాడిత | | | | ర | | | |
| అంతస్థ | | వ | | | | య | |

హల్వర్ణాల్లో స్పర స్పృష్టోష్మాలకు మాత్రమే శ్వాసనాదభేదం ఉంటుంది తక్కినవన్నీ నాదవర్ణాలే రా వా లో కొన్ని పదాల్లో కంపిత ధ్వని ఱ కూడా కనిపిస్తుంది

యేర్పఱచి 10 3
ఏర్పఱచి 10 4

**అన్యదేశ్య వర్ణాలు**

సంస్కృతం

అచ్చు ఋ

ఋషి 14 16

వృథివి 16 4

హల్లులు

| | | ఓష్ఠ్య | దంత | దంత మూలీయ | మూర్ధన్య | తాలవ్య | కంఠ్య | కంఠ మూలీయ |
|---|---|---|---|---|---|---|---|---|
| స్పర్శ | శ్వాస | ఫ | థ | | ఠ | | ఖ | |
| | నాద | భ | ధ | | ఢ | | ఘ | |
| స్పృష్టోష్మ | శ్వాస | | | | | ఛ | | |
| | నాద | | | | | ఝ | | |
| ఊష్మ | | | | శ | ష | | | హ |

మహాప్రాణాక్షరాలు అచ్చ తెలుగు మాటల్లో లేవు ఇవి ఆయా పదాలతో పాటు సంస్కృతం నుంచి తెలుగులోనికి వచ్చాయి

పర్షో అరబిక్ వర్ణాలు f x y z వీటికి తెలుగులో ప్రత్యేకమైన సంకేతాలు ఏర్పడలేదు ఇవి దేశ్యోచ్చారణకనుగుణంగా వరుసగా పఫ కఖ గ జ వర్ణాలుగా వాడబడుతాయి మూలభాషలో ఇవి ఊష్మ ధర్మాన్ని కలిగిఉండి తెలుగులో ప్రవేశించినపుడు స్పర్శ ధర్మాన్ని పొందాయి

| | | |
|---|---|---|
| ఉదా | పక్కీరు 42 2 | తాకీదు 72 4 |
| | ఎరంగ్గి 64 9 | కాగితములు 41 15 |
| | ఫరంగి 35 8 | హజారము 22 22 |
| | కబ్బాయి 80 6 | హురు మంజి 72 20 |
| | కుళ్లాయి 80 6 | హేజీబులు 32 24 |
| | ముఖాములు 41 12 | |

## వర్ణోచ్చారణ

**అచ్చులు** తెలుగులో ఇ ఈ ఎ ఏ లు తాలవ్యాచ్చులు ఉ ఊ ఒ ఓ లు కంఠ్యాచ్చులు అ ఆలు నిమ్నాచ్చులు ఐ ఔలు రెండు అచ్చుల

సంయోగంతో ఏర్పడిన సంయుక్తాచ్చులు నాలుక మూర్ధంవైపు లేచే ఎత్తును బట్టి ఉచ్చారణలో నాలుకముందు మధ్య వెనుక భాగాల ప్రాధాన్యతనుబట్టి పెదవుల వివృత సంవృత ఆకారాన్నిబట్టి అచ్చులను వింగడిస్తారు

సంయుక్తాచ్చులు ఐ ఔలు

అవ్యవహితంగా అఇ అఉ లను ఉచ్చరించినపుడు ఏకవర్ణ స్ఫూర్తి కలిగిన ఐ ఔలు ఏర్పడుతాయి ఇవి అయి అవు అన్న ఉచ్చారణను కలిగి ఉంటాయి

| | | | |
|---|---|---|---|
| మొదలైన | 12 14 | మొదలయిన | 23 11 |
| చౌకట్లు | 55 26 | అవుగాములు | (73 9 |

ఋ ఇది సంస్కృతంనుండి ఆయా పదాలతోపాటు తెలుగులో వచ్చి చేరింది ప్రాచీన శాసనాల్లో ఋకారానికి రికారోచ్చారణ ఉన్నట్లు కనిపిస్తుంది

రిషభ S I 4 9902 1158

ప్రథివి S 10 604

ఋకారానికి అనంతర కాలంలో రుకారోచ్చారణ కూడా ఏర్పడింది

ఎత్రు స్థానము [S I 4 1248 9 1112

ప్రుదివి [తె శా 52 9 1258 1255]

చ జ లు తెలుగులో దేశ్య శబ్దాల్లో చ జ లకు ఉచ్చారణలో దంత్య తాలవ్య భేదం కనిపిస్తుంది

తాలవ్యాచ్చుతో కూడిన చ జలు తాలవ్య స్పృష్టోష్మాలుగాను కంఠ్యాచ్చులతో కూడిన చ జలు దంత్య స్పృష్టోష్మాలుగాను ఉచ్చరింపబడు తాయి రా వా భాషలో దంత్య చ జలను ప్రత్యేకమైన సంకేతాలతో సూచించక పోయినా వ్యవహారంలో ఇప్పటిలాగే ఉండేవని భావించవచ్చు చకారానికి దంత్యోచ్చారణ ఉన్నట్లు రా వా లో ఆధారాలున్నాయి త సల సంయోగం గాను చకారంగాను రెండు రకాలుగా దంత్య చకారం వ్రాయబడింది

పుచ్చుకొని 56 7

విత్సుకత్తులు 60 3

విచ్చుకత్తులు 60 3)

పదాది య వలు  య వలకు కొంత అజ్లక్షణం  కొంత హల్లక్షణం ఉన్నందువల్ల వీటిని  అంతస్థాలు గా వ్యవహరించారు

పదాదిలో తాలవ్యాచ్చులు ఇఈ ఎఏల ముందు య ఓష్ఠ్యాచ్చులు ఉఊ ఒఓల ముందు వ అ౹గాగమాలు g des గా వస్తాయి

| | | | |
|---|---|---|---|
| —ఇ | యిరవై 11 4 | —ఉ | వుండగా 27-20 |
| | యింటి వద్ద 22 10 | | వున్నది 28 1 |
| —ఈ | యీవరకు 11 4 | —ఊ | వూడెము (58 12 |
| | యీశ్వరాంశమై 46 7 | | వూళు (59 4 |
| —ఎ | యెవరు 9 12 | —ఒ | వొళ 10-20 |
| | యెన్ని 23 22 | | వొంటిగా 26 25 |
| —ఏ | యేనుగ 26 22 | —ఓ | వోరగంటికి 46 17 |
| | యేలినవారికి 28 5 | | వోబళయ్య (49 17 |

యకారం వచ్చినపుడు కొన్నిచోట్ల ఊర్ధ్వాచ్చు నిమ్నాచ్చుగా మారుతుంది

యాల 27 3 < ఏల

యల్లా 55 1 < ఎల్లా

ర ఱ లు ర వర్ణాని సాదురేఫ అని ఱ వర్ణాని6 శకట రేఫ అని వ వహారం సాధురేఫ దంతమూలీయ తాడితం a veo ar f ap శకట రేఫ దంతమూలీయ కంపితం a veo ar t చారిత్రక కాలంలో ఱవర్ణం తన విలక్షణోచ్చారణను కోల్పోయి సాదురేఫగా వలుకబడుతూ వచ్చింది ఇది ప్రాఙ్నన్నయ యుగంలోనే ప్రారంభమై క్రమంగా ఎక్కువైంది 6 వ్యవహారంలో ఉచ్చారణలో ర ఱల భేదం తొలగిపోయినా లేఖనంలో కొంత కాలం వాటిని విడివిడిగా వ్రాసేవారు ఉచ్చారణలో ప్రత్యేకత ఎప్పుడైతే తొలగిపోయిందో లిపికారులు ఎప్పుడు ఏ రేఫ వ్రాయాలో తెలియక తికమక పడ్డారు పండితులైన వారికి ఈ సందిగ్ధత తప్పలేదు అందుకే రేఫ ఱకార

6 Mahadeva Sa r Korada H or ca Grammar of Te ugu P 42

నిర్ణయ పట్టికలు వెలువడ్డాయి సాధురేఫకు వ వహార ప్రాబల్యం ఎక్కువైనందువల్ల ఱకారం భాషనుండి తొలగిపోయింది

ఆ శ ఉ ల దంత మూలీయ పార్శ్వికం ళ మూర్ధన పార్శ్వికం రా వాలో కొన్ని పదాల్లో ఈ వర్ణాలమధ్య వినిమయం కనిపిస్తుంది ళకారంతో కూడిన రూపాల్లో కన్నడ భాషా ప్రభావాన్ని చూడవచ్చు

స్థలం 63 17 స్థళం 43 21
కంబ్బలి 79 6 కంబళి 12 13

విసర్గ ( ) ఇది సంస్కృతం నుండి తత్సమ పదాల ద్వారా వచ్చిన ఊష్మధ్వని శ్వాసహకారం ఇది నియత సన్నివేశంలో వస్తుంది కాబట్టి హకారానికి సవర్ణంగా చెప్పవచ్చు ఇది పద మధ్యంలోను సమస్త పదాల్లోను వస్తుంది

ఉదా దు ఖియగుట 17 20
వయం పరిపాకంబు 15 24

## వర్ణవ్యాప్తి

పదాదిలో హ్రస్వాచ్చుగాని దీర్ఘాచ్చుగాని వస్తుంది పదాంతంలో దీర్ఘాచ్చు రాదు అయితే ఎరువు మాటలు కొన్నిటిలో దీర్ఘాచ్చులు కనిపిస్తాయి కాని రా వా లో ముక్కరా 77 25 శబ్దం లోని రా బహుశా రాయి శబ్దంలోని యి లోపించగా నిలిచిన సంక్షిప్తరూపం కావచ్చు వాక్యాంతంలో సందేహార్థంలో ఓ అనే ప్రత యం ప్రశ్నార్థకంలో ఆ అనే ప్రత్యయం వస్తాయి ఓ తప్ప పదాంతంలో హ్రస్వాచ్చులన్నీవస్తాయి ఒ ఓలు పదాదిలో మాత్రమే వస్తాయి రా వా లో పదమధ్యంలో చౌడోలు 76-11 అన్న పదంలో మాత్రమే ఓ కనిపిస్తుంది అలాగే ఏ కూడా పదమధ్యంలో చాల అరుదుగా కనిపిస్తుంది ఉదా కుందేలు 9 7 సాధారణంగా దీర్ఘాచ్చు తర్వాత ద్విరుక్త వ్యంజనం ఉండదు

పదాదిన ణ శ అనే వ్యంజనాలు రావు ట వర్ణం టోకించు 62 19 అన్న క్రియాపదంలో మాత్రమే పదాదిన వస్తుంది డ ల వర్ణాలు కొన్ని దేశ్యపదాల్లోను అన్యదేశ పదాల్లోను కనిపిస్తాయి

| | |
|---|---|
| దబ్బై 2 16 | లయం 40 21 |
| డిండిమ 4 22 | లకికరితనాన 33 9 |
| డిగ్గి 26 22 | లాలాపు బిల్లలు 55 21 |
| డెరిజా 59 8 | లాలారి పురుషులు 36 12 |
| డాలు[7] 52 25 | లియ్యమైన 43 23 |
| దన్నిన 60 24 | లీలావతారముగా 22.23 |
| ధమామి 62 18 | |
| ఢిల్లి 21 14 | |

పదాదిన ద్విరుక్త వ్యంజనాలుండవు ఏకపదంలో స ఱ వర్ణాలకు ద్విత్వం రాదు అణ్నగర్లు 26 6 అణ్నగకులు 27 7 అనే పదాల్లోని ణకారద్విత్వం కన్నడభాషా ప్రభావంతో వచ్చింది లెస్స 22 12 అనే పదం రా వా లో అనేక చోట్ల సకారద్విత్వంగా వస్తుంది ఇది సంస్కృత లేశ్య అనే పదం నుండి ఏర్పడింది శకార ద్విత్వం కూడా చాల అరుదుగా కని ఎస్తుంది వశె రము 50 14 కొశ బెట్టేదిం్ని 59 1 ద్విత్వ హల్లులు సహజంగా హ్రస్వాచ్చులపైనే కనిపిస్తాయి

## వర్ణవినిమయం

రా వా భాషలో కొన్ని వర్ణాల మధ్య వర్ణవినిమయం కనిపిస్తుంది వ్యవహారంలో ఒకే పదం ఒకే కాలంలోనే భిన్న వర్ణాలతో అనియతంగా వాడడాన్ని వర్ణవినిమయం అంటారు ఈ మార్పు సకారణమూ కావచ్చు కారణం తెలియనిది కావచ్చు

అచ్చులు

అ/ఇ  అయత్రపాటు 57 21 / అయిత్రపాటు 57 5

అ/ఎ  గట్టు (61 8 / గెట్టు 61 11

---

7 ఇది బహుశా డోలు శబ్దరూపాంతరం కావచ్చు

| | |
|---|---|
| | ఘట్లు (24 19 / ఘెట్లు 24 18 |
| | ఘడియ 52 11 / ఘెడియ 52 4 |
| | చలనము 10 26 / చెలనం 10 1 |
| | పరిమళం 16 23 / పరిమెళం 75 22 |
| ఆ/అ | కర్తారు 40 9 / కర్తరు 51 17 |
| | నగారా 61 16 / నగరా (58 10 |
| ఆ/ఉ | అహముదానగరము 38 6 / అహముదునగరం (51 9 |
| ఇ/ఉ | ఎలింంచి 29 5) / ఎలువంచి 24 1 |
| | రీతి 69 10 / రీతు (65 25 |
| ఈ/ఇ | సామాగ్రీలు 61 2) / సామాగ్రిలు 75 25 |
| ఈ/ఉ | బరీదు (47 4 / బరుదు 46 19 |
| ఉ/అ | అరుసు 11 15 / అరసు 11 16 |
| | యిరువై 24 21 / యిరవై 1 4 |
| | కనుమ 65 16 / కనమ 65 1 |
| | నాయుడు 60 7 / నాయడు 59 17 |
| | పొదువు 65 13 / పొదవు 74 8 |
| | యేనుగు 25 12 / యేనుగ 24 20 |
| | వెనుక 28 27 / వెనక 47 17 |
| | ముందుర 47 12 / ముంద్దర 25 14) |
| ఉ/ఇ | పరుసలు 76 1 / పరిశలు 76 2 |
| | వినుకొండ 63 21 / వినికొండ 64 7 |
| ఎ/అ | దెబ్బై 4 16 / దబ్బై 2 16 |
| | పెట్టె 73 6 / పెట్ట 73 22 |
| | యీాటె 60 2 / యీాట 60 12 |
| ఎ/ఏ/అ | యెదులశాహా 51 7 / యేదులశాహా 65 23 / యదులశాహా 35 21 |
| ఏ/ఎ | యేంది 28 7 / యెంద్ది 43 7 |
| ఒ/అ | వొఖ 10 20 / వఖ 23 19 |
| ఓ/ఒ | వోరగంటి 45 23 / వొరగంటి 46 4 |
| అ/య | ఆమిదాలు 64 22 / ఆమిద్యాలు (64 25 |
| ఎ/య | పెట్టె 73 6 / పెట్య (53 25) |

హల్లులు

క/గ  కా తములు 41 12 / కాగితములు 39 22
సంజ్ఞోకం 60 4 / సంజ్ఞోగం 60 3
క/ఖ  వక 38 13 / వఖ 30 15
గ/వ  పొదుగు 55 7 / పొదువు 65 13
ఠ/త  రాజ్యము 41 16 / తాణ ము 64 10
త్స/చ  విత్సుకత్తులు 60 3 / విచ్చుకత్తులు 60 16
థ/ధ  భాగీరథిలో 7 25 / భాగీరధీయాత్ర 5 19
మ/ంబ  తామ్ర 78 10 / తాంబ్ర 77 13
ల/ళ  స్థలం 58 21 / స్థళం 41 20
స/శ  సేవించి 78 25 / శేవించి 78 13

ద్విత్వం / అద్విత్వం

వాక్కు పాదము 19 5 / వాఖ పాదం 19 8
సంవ్వత్సరము 45 23 / సంవత్సరము 29 17

అల్పప్రాణం/మహాప్రాణం

| | | | |
|---|---|---|---|
| ముప్పై | 70 4 / | ముప్పై | 7 22 |
| యాభై | 24 14 / | యాభై | 31 10 |
| రొక్క రూపాయలు | 18 18 / | రొఖ్ఖ రూపాయలు | 43 22 |
| దమామి | 70 21 / | థమామి | 62 18 |

రేఫ/వలపల గిలక

| | | | |
|---|---|---|---|
| వార్తలు | 43 6 / | వార్తాలు | 42 18 |
| దుర్గం | 64 5 / | దుగ్గాం | 64 6 |

పానునాసికం/విరమనాసికం

| | | | |
|---|---|---|---|
| బ్రాంహ్మ ముహూర్తాన | 2 6 / | బ్రాహ్మ ముహూర్తాన | (49 8 |
| పింద | 58 16 / | పిద | (61-10) |
| కంపోలం | 64 14 / | కపోలం | (64 24 |
| పింగళోలి | 67 13 / | పిగళ లి | (66-10 |

## ధ్వనిమార్పులు

రా వా లో అకారం ఎకారంగా మారిన రూపాలు ఎక్కువగా కనిప స్తాయి రాయలసీమ శిష్టేతర వ వహారంలో నేటి ఈ రూపాలు వినిపస్తాయి

అ–> ఎ– బెలనం (10 1 <చలనం)

మెట్లు 24 18 <మట్లు)

యెముని రాజ్యం 42 20 <యముని రాజ్యం

గెంప్ప (55 19 <గంప

గెట్టు 61 11 <గట్టు

–అ—>—ఎ— పరిమెళము 75 22 <పరిమళము

–అ>—ఎ పూనికె[8] 27 25 <పూనిక

బానిశె 50 16 <బానిస

ఎ—>అ— యదల 42 2 <యెదల

–న>—ల మండల మిత్రుల 8 15 <మండన మిత్రుల

వ—>ఏ+య యేయు 18 5 <ఏయు<వేయు

స–>శ— శేవ 77 12 <సేవ

రా వా భాషలో శకారధ్వని మార్పులో మూడు దశల్ని గు ర్తించవచ్చు

చ— > స– చేయు > సేయు ప్రార్థన సేయంగా 9 15

స– > శ– సేయు > శేయు దర నం శేశి 77 20

ఇక్కడ స తాలవా చ్యుతో కూడినప్పుడు శ గా మారుతుంది

ఏ– > ఇ– శేయు > శాయు మేరువుశాయ (27 21 గంకు

8 ఇక్కడ ఇకె ప్రత్యాయాన్ని కన్నడ ప్రత్యయంగా గు ర్తించవచ్చు చూడు K e F A Grammar o he Kannada Langu age 1982 P 200

పదమధ్యాక్షరలోపం Syncope

వేగోచ్చారణ కారణంగా పదంలో మధ్యనున్న అచ్చు లోపించడం అప్పుడు హల్లులు రెండూ కలిసిపోయి సంయుక్త హల్లుగా ఏర్పడడం తరచుగా కావ భాషలో కూడా కనిపిస్తుంది వ వహార భాషలో ఇలాంటి రూపాలకు ప్రాచుర్యం ఎక్కువ వీటిని కావ్యభాషలో నన్నయకాలం నుంచి చూడవచ్చు

నన్నయ తొడ్గు ఆది 114 < తొడుగు
ఉన్కి ఆది V 182 < ఉనికి
పొల్తి సభా 214 < పొలితి
నన్నెచోడుడు కుడ్చి కు సం V 965 < కుడిచి
మర్గి కు సం X 604 (< మరిగి
పాల్కురికి సోమన కస్వు బస 532 < కసువు
రా వా భాషలో అన్యదేశ్య పదాలుకూడా ఈ మార్పుకు లోనయాయి
దేశ్యం పాన్పు 16 20 < పానుపు
గుడ్కి 77 20 < గుడికి
వార్కి 77 24 < వారికి
అన్యదేశ్యం బంట్లు 24 23 < సం భట
చీట్లు 26 18 < హిం చిట్ఠీ

స్వరభక్తి Anaptyx

పదమధ్య లోపానికి ఇది వ్యతిరేకం ఇందులో పదమధ్యంలో ఒక అచ్చు చేరడంవల్ల సంయుక్త హల్లులు రెండుగా విడగొట్టబడుతాయి

దరిశనం 6 10 <దర్శనం
నిదుర 27 2 <నిద్ర
పాతరలు 59 2 <పాత్రలు

లోపదీర్ఘత Compen a ory Leng hen ng

భాషలో కొన్ని పదాల్లో ఒక వర్ణం లోపించినందువల్ల ఏర్పడిన లోటు పూరించడానికి దానికి ముందున్న అచ్చు దీర్ఘమవుతుంది

అర 65 10 <అక్కడ
సమయాన 67 5 <సమయమున
కొత్తళాలు 71 18 <కొత్తళములు
నడిపించేము 74 25 <నడిపించెదము

వర్ణసమీకరణం A m a on

రెండచ్చులుగాని రెండు హల్లులుగాని ఒకదాని ప్రక్కన ఒకటి ఉన్నప్పుడు సమీప వర్ణప్రభావంతో ఏకరూపతను పొందే ప్రవృత్తిని "వర్ణ సమీకరణ మని వ్యవహరిస్తారు 9

ఇది మూడు రకాలు

1 పురోగమన వర్ణసమీకరణం Progre ve A m a on
2 తిరోగమన వర్ణసమీకరణం Regre ve A m a on
3 పరస్పర వర్ణసమీకరణం Rec proca A m a on

1 పురోగమన వర్ణసమీకరణం Progre ve A m a on

ఎడమ ప్రక్కన ఉన్న వర్ణం యొక్క ప్రభావం కుడి ప్రక్కన ఉన్న వర్ణంపై పడడం

వలన > వల్న > వల్ల 5 6
అంబు / అమ్బు > అమ్మ 65 8

2 తిరోగమన వర్ణసమీకరణం Regr ve A m a on

కుడి ప్రక్కన ఉన్న వర్ణం యొక్క ప్రభావం ఎడమ ప్రక్కన ఉన్న వర్ణంపై పడడం

కలదా > కల్దా > కద్దా 30.14
తిర్దు > తిద్దు > దిద్దు 31 3

9 లక్ష్మీరంజనం ఖండవల్లి తెలుగులో స్వరసామ్యం తెలుగు అక్టో డిశం 1976

వలదు > వల్దు > వద్దు 32 2
మార్జన > మజ్జన 2 14
సన్మానములు > సమ్మానములు 43 21
మార్జర > గుజ్జర 77 8

3 పరస్పర వర్ణసమీకరణం Rec proca A m a on

పూర్వ పర వర్ణాలు రెండూ తమ గుణాలను సమానంగా పరస్పరం పంచుకోవడం

వాడిని > వాణ్ని 26 1 ఇక్కడ లేఖనంలో దంతమూలీయం వ్రాసినా ఉచ్చారణలో మూర్ధన్యమే ఉచ్చరింపబడుతుంది

తడి + లు > తళ్లు 12 8
పూరు + లు > పూళ్ళు 59 4

స్వరసామ్యం Vowe harmony

అచ్చుల్లో జరిగే మార్పుకు స్వరసామ్య మని పేరు
ఇది రెండు రకాలు
1 పూర్వస్వరసామ ం
2 పరస్వరసామ ం

1 పూర్వస్వరసామ్యం

పూర్వాచ్చు ప్రభావం పరాచ్చుమీద పడడం

కట్టడి > కట్టడ 21 19
అయెను > అయను 31 5

2 పరస్వరసామ్యం

పరాచ్చు ప్రభావం పూర్వాచ్చు మీద పడడం

నది + లు > నదులు 2 12
వద్ద + కి > వద్దికి 15 2
యెదల > యదల (42 2)

వర్ణలోపం (Lo s o a Phoneme

రా వా భాషలో కొన్ని ఊర్ల పేర్లలో య వర్ణం లోపించింది

వుజ్జని (9 2 < ఉజ్జయిని)
రాచూరు 21 16 < రాయచూరు
నారాణవనం 25 5 < నారాయణవనం

వర్ణ వ్యత్యయం Me a he

అచ్చు లేదా హల్లుల స్థానం తారుమారు కావడం తెలుగు ప్రాథమిక దశలో ప్రథమ పురుష మహద్వాచక సర్వనామాలన్నీ వర్ణ వ్యత్యయం వల్ల ఏర్పడినవే

వాండు 10 25 < త క అవన్
వారు 28 7 < త క అవర్
వీరు 52 9 < త క ఇవర్

ఇంకా కొన్ని పదాల్లో వర్ణ వ త యాన్ని చూడవచ్చు

డిగ్గి 26 22 < త క ఇ?
డెబ్బై 29 4 < త మ ఎబువత్తు క ఎళ్వత్తు
ఒలో 22 9 < త మ ఉళ్ క ఒళ్

కృతక రూపాలు

ఒత్తి చెప్పడం empha కోసం కొన్ని పదాల్లో స్వర హల్లులకు మహాప్రాణత్వం రావడం ఉంది ఈ పద్ధతి సర్వేసర్వత్రా ఉన్నదే కాని కొన్ని పదాల్లో ఈ వివరణ సరిపోదు అలాంటప్పుడు ఉచ్చారణలో ఇవి ఇలా పలుకబడేవి అని మాత్రమే మనం చెప్పగలం

ఘట్టిగా 7 5 < గట్టిగా
హెచ్చరిక 0 22 20 < క ఎచ్చరిక
ఘాలి 68 2 < గాలి
ధొరతనం 28 7 < దొరతనం

10 C f హారతి < క ఆరతి)

## సంధి

సంధి అంటే అవ్యవహితోచ్చారణలో రెండు పదాల మధ్య ధ్వనుల్లో కలిగే మార్పు అని అర్థం ఏ భాషలోనైనా సంధిలో దే యత గోచరిస్తుంది

సంధి రెండు రకాలు

1 పదమధ్య సంధి n erna Sandh 2 పదాంత సంధి Ex erna Sandh

ప్రాతిపదికకు ప్రత్యయానికి మధ్య జరిగే సంధిని పదమధ్య సంధి అని అంటారు

ఉదా వాడి + ని > వాణ్ని 26 1
యేరు + లో > యేట్లో 61 6

రెండు స్వతంత్ర పదాల మధ జరిగే సంధిని పదాంత సంధి అని అంటారు

ఉదా వారు + ఎవ్వరు > వారెవ్వరు 12 24
నాలుగు + ఆరు > నాలుగారు 27 12

సంధిలో పాల్గొనే వర్ణాలనుబట్టి అచ్సంధి హల్సంధి అని రెండు ప్రధాన భేదాలను గుర్తించవచ్చు

## అచ్సంధి

సంధిలో పూర్వ పదాంతాచ్చునుబట్టి ఉకార సంధి ఇకార సంధి అకార సంధి అని వైయాకరణులు పేర్కొంటారు వీరు ఉకారసంధి నిత్యమని ఇకారసంధి వైకల్పికమని అకారసంధి బహుళమని చెప్పారు ఈ లక్షణాలు కావ్యభాషకు వర్తిస్తాయి వ్యావహారిక భాషలో ప్రాచీనకాలంనుంచి సంధి ఐచ్ఛికం కాబట్టి పై లక్షణాలు వ్యావహారిక భాషకు పూర్తిగా వర్తించవు రా వా భాషలో కావ్యభాషలోలాగా అనేకచోట్ల సంధి జరిగిన రూపాలు కనిపిస్తాయి వాటితోపాటు విసంధి రూపాలు యడాగమ రూపాలు కూడా అక్కడక్కడ కనిపిస్తాయి

---

11 చిన్నయసూరి పరవస్తు బాలవ్యాకరణము సంధి సూ 1 4 & 5

ఉకార సంధి ఉదా వార్తలు + అరశి > వార్తలరశి (21 7
శాపము + ఇచ్చినాడు > శాపమిచ్చినాడు 9 18
యెండు + ఉండిరి > యెండుండిరి 4 20

విసంధి యేర్పాటు + ఆయెను > యేర్పాటు ఆయెను 31 5
సింహ్మాసనమువకు + ఎన్ని లక్షల రాజ్యములు > సింహ్మాసనము
నకు ఎన్ని లక్షల రాజ్యములు (23 20
ప్రారబ్దానకు + ఏమిశేతును > ప్రారబ్దానకు ఏమి శేతును
5 13

యడాగమం వట్టెలు + ఇచ్చి > వట్టెలు యిచ్చి 3 8
కోటలు + ఎన్ని > కోటలు యెన్ని 23 22

వడాగమం పెద్దలు + ఉండగా > పెద్దలు వుండగా 27 20
ఇలాగే ఇకార అకార సంధులుకూడా ప్రవర్తిస్తాయి

సాధారణంగా ఇ ఈ ఎ ఏలముందు యడాగమం ఉ ఊ ఒ ఓల ముందు వడాగమం వస్తాయి కాని రా వా లో క్త్వార్థకే కార సంధి విషయంలో కొన్నిచోట్ల వడాగమానికి యడాగమం వచ్చిన రూపాలుకూడా కనిపిస్తాయి

వచ్చి + ఉండేమని > వచ్చియుండేమని 8 26 వచ్చి వుండేమని

కాచి + ఉండేమని > కాచియుండేమని 26 5 కాచి వుండేమని

ఒక చోట క్త్వార్థకేకారానికి సంధి చేసిన రూపంకూడా కనిపిస్తుంది

నిలిచి + ఉండి > నిలిచుండి > 27 1

## హల్సంధి

పూర్వపదాంతంలో గాని పరపదాదిలో గాని రెండింటిలోగాని హల్లులున్నప్పుడు హల్లుల మధ్య జరిగే సంధిని హల్సంధి అని వ్యవహరిస్తారు తెలుగులో వర్ణాగమ వర్ణాదేశ వర్ణలోపాది సంధికార్యాలను హల్సంధి కార్యాలుగా పరిగణించడం సాంప్రదాయికం

నగాగమం కు ప్రత్యయం చేరినపుడు ము వర్ణాంత నామవాచకాలపై నిత్యంగాను ఉదంత నామవాచకాలపై వైకల్పికంగాను ఈ నగాగమం వస్తుంది వ్యావహారిక భాషలో ఈ నగాగమం వచ్చినపుడు ము వర్ణాంత నామవాచకాలలోని ము వర్ణం లోపించి తత్పూర్వస్వరం దీర్ఘమవుతుంది

ఉదా వట్టము + కు > వట్టానకు 30 15
కార్యముఖానకు 37 3
సముఖానకు 30 18
వెద్యానకు 31 2
విదా నగరానకు 41 24)

| | |
|---|---|
| తావునకు 8 1 | తావుకు 74 14 |
| మనస్సునకు 23 19 | మనస్సుకు 22 5 |

టుగాగమం

వ్యావహారిక భాషలో ఏకారాంత తద్ధర్మార్థక క్రియాధాతువుకు అప్పుడు అట్టు అందులకు అనే పదాలు చేరినపుడు ట అనేది ఆగమంగా వస్తుంది

అప్పుడు సాగిపోయేటప్పుడు 27 13 కాలం కూడేటప్పుడు 40 24
వచ్చేటప్పుడు 38 18 యిచ్చేటప్పుడు 31 6

అట్టు బారులుదీరివుండేటట్టు 26 23
చెప్పేటట్టు 26 9
వచ్చేటట్టు 28 26

అందులకు జయించేటందులకు 60 17

ఇంచు ప్రత్యయం చేరినప్పుడు క్రియాధాతువులలో కొన్ని వర్ణాలు ఆగమంగా వస్తాయి

ర్ ఆగమం పలుకు + ఇంచు > పలుకరించు 26 11

గ్ ఆగమం కోప + ఇంచు > కోపగించు (5 11

సరళాదేశం రా వా లో గసడదవాదేశం రావలసి ఉండగా సరళాదేశం వచ్చిన రూపాలు కూడా కనిఎస్తాయి

ఉదా కట్టడ + చేసి > కట్టడ సేసి అని కావలసి ఉండగా కట్టడజేసి 26 23 అని సరళాదేశం వచ్చింది అలాగే స్నానముజేసి యుద్ధముజేసి మొదలైన రూపాల్లో కూడా సరళాదేశం కనిఎస్తుంది అంతేకాకుండా క్త్వార్థక క్రియలపైన ప్రశ్నార్థకపదాల Ques on word పైన భావార్థక నామాలపైన శబ్దపల్లవ క్రియల్లోనూ ఈ సరళాదేశం రావడం ఈ భాషా వైలక్షణ మని చెప్పవచ్చు

| | |
|---|---|
| క్త్వార్థక క్రియలపై | ఉదా తిరిగిజూడక 9 1 |
| | తరలిబోయినారు 26 19 |
| వ్యతిరేక క్త్వార్థకంపై | విడువకబట్టుకొంటే 7 8 |
| ప్రశ్నార్థక పదాలపై | యెక్కడ జూడము 9 9 |
| | యేమిజెప్పేము 28 9 |
| భావార్థక నామాలపై | తరిమేదిగని 9 8 |
| | వచ్చేది గని 26 26 |
| | వచ్చేది జూచి 69 20 |
| శబ్దపల్లవ క్రియల్లో | కట్టబెట్టి 5 1 |
| | సంతోషబడి 8 3 |
| | ఆశ్చర్యబడి 9 7 |

ఈ విధంగా అనేకచోట్ల రా వా భాషలో సరళాదేశం ప్రయుక్త మవుతుంది నేటి రాయలసీమలో మాండలికంగా దీని వాడుకను గమనిస్తే రా వా భాష రాయలసీమ భాషకు ప్రారంభ దశ అని గుర్తించడంలో తోడ్పడుతుంది

పుంప్వాదేశం రా వా భాషలో పుంప్వాదేశం రావడం రాకపోవడం ఈ రెండురీతులూ కనిపిస్తాయి ఇవి భాషలో మొదటినుండి కనిపిస్తున్నవే నన్నయలో పుంప్వాదేశం రాని రూపాలే ఎక్కువ కాలక్రమాన విశేషణత్వ ద్యోతకంగా పుంప్వాదేశానికి ప్రాచుర్యం హెచ్చినా ఈ ఆదేశం రాని రూపాలు కూడా భాషలో నిలిచి ఉన్నాయి

ఉదా అమరవు దొరతనము 43 20 పట్టణము దిక్కు (26 15
బెత్తపు కోల 50 17 అమరం యేనుగులు 29 14)
దక్షిణపుగట్టు 61 7

పద సహజ ము వర్ణానికి వ అనేది ఆదేశంగా వస్తుంది
ఇనువ గుదియలు (39 1 ఇనుము

ఇంకా దీవము + కొలువు>దీవపు కొలువు అని పుంప్వాదేశం రావలసి ఉండగా వ్యావహారిక రీతినిబట్టి పు వర్ణానికి బదులు ట వర్ణం ఆదేశంగా వచ్చి దీవటి కొలువు 69 10 అని రా వా లో ప్రయోగింపబడింది

వర్ణలోపం వ్యావహారిక భాషలో వేగోచ్చారణలో కొన్ని వర్ణాలు లుప్తమవుతాయి రా వా లో నోటి మాటకు చేతి వ్రాతకు పొత్తు కుదిర్చే ప్రయత్నంగా లిపి ఏర్పడింది అందే పదాల వ్రాతలో అనాటి ఉచ్చారణకు విధేయమైన లేఖనమన్న మాట

అమ్రేడితం పరమైనపుడు పూర్వ పదాంతాక్షరం లోపిస్తుంది
నాటి + నాటి >నానాటి వర్తమానములు 35 24
నానాటి సమాచారములు 35 11

అమ్రేడితం పరమైనపుడు విభక్తిప్రత్యయానికి లోపం వస్తుంది
మాటికి + మాటికి>మాటిమాటికి 30 23
నెలకు + నెలకు>నెలనెలకు 31 3

## సంస్కృత సంధులు

రా వా లో కొన్ని సంస్కృత సంధుల్లో కూడా నియత ప్రవృత్తి లేదు సంధి తప్పనిసరిగా చేయవలసిన చోట్లకూడా విసంధి రూపాలు కనిపిస్తాయి

నిద్ర + ఆహారము>నిద్రాహారములు అని సవర్ణదీర్ఘ సంధి జరుగవలసిన చోట నిద్రాఆహారములు 7 17 అని సంధిలో పరపదాద్యచ్చును లోపింప జేయకుండా ప్రయోగించడం జరిగింది మరోచోట నిద్రాహారములు అని ఉండవలసినచోట వ్యవహార పరిపాటినిబట్టి నిద్రాహారము (22 13 అని సమాహార ద్వంద్వంగా ప్రయోగింపబడింది

యణాదేశ సంధి ప్రవర్తించవలసి ఉండగా ఒకచోట సవర్ణదీర్ఘ సంధి చేయడం ఒకచోట విసంధిగా వ్రాయడం కనిపిస్తుంది

అది + అరణ్యం > ఆదారణ్యం 9 18 అద్యారణ్యం కావాలి

విష్ణు + అంశ > విష్ణు అంశ 13 18 విష్ణ్వంశ కావాలి

జస్త్వసంధి రావలసిన చోట కూడా మార్పురాని రూపం కనిపిస్తుంది

కించిత్ + విన్నపం > కించిత్విన్నపం 18 7 కించిద్విన్నపం కావాలి

మిశ్రమ రూపాల్లో కొన్ని ప్రయోగాలు వ్యవహారాన్ని బట్టి వాడినట్లు తెలుస్తుంది ఉదా జగజెట్లు (55 4)

ఈ ప్రయోగం శ్రీనాథుని భాషలో కూడా కనిపిస్తుంది

జగజెట్టి పావజేని యాదల భీమ 5 9

జగ శబ్దం వ స్తంగా జగము జగత్తు అన్నరూపాలు పొందుతుంది కొన్ని సమాసాల్లో పూర్వపదాంతాచ్చు దీర్ఘంకావచ్చు

బసవా పట్టం 35 4

అహముదానగరం 47 2

ఇది సంస్కృత భాషా ప్రభావమని చెప్పవచ్చు

— o —

# పదవిభాగం

తెలుగు భాషలోని పదాలను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు

1 స్వతంత్ర పదాలు Free orm

2 అస్వతంత్ర పదాలు Bound form

స్వతంత్ర ప్రయోగార్హతగల పదాలు స్వతంత్ర పదాలు ఇవి స్వతంత్రంగా గాని ఒకటి రెండు ప్రత్యయాలను చేర్చుకొనిగాని ప్రయోగింపబడుతాయి ప్రత యాలన్నీ అస్వతంత్ర పదాలే ఇవి ఎక్కువగా ఏకాచ్కాలై ఉంటాయి ఇవి స్వతంత్ర పదాలతో కలిసి మాత్రమే ప్రయుక్తమవుతాయి వీటికి స్వతంత్ర ప్రయోగార్హతలేదు

స్వతంత్ర పదాలను అవి పొందే ప్రత్యయ నిష్పత్తి ననుసరించి మూడు తరగతులుగా వింగడించవచ్చు

1 నామవాచకాలు Nouns

2 క్రియలు Verb )

3 అవ యాలు ndec nab es

నామవాచక ప్రత్యయాలతో వ్యవహరించగలిగే పదాలు నామవాచకాలు కాలబోధక ప్రత్యయాలతో ఏర్పడేవి క్రియలు లింగవచనవిభక్తులుగాని కాలబోధక ప్రత యాలుగాని పొందే అర్హతలేనివి అవ్యయాలు

తెలుగులో నామ వాచక పద నిర్మాణం Morpho og ca S ru c ure ఈ క్రింది విధంగా ఉంటుంది [2]

ప్రాతిపదిక + బహువచన ప్రత్యయం + ఔప విభక్తిక ప్రత్యయం + విభక్తి ప్రత్యయం/విభక్త్యర్థక శబ్దం)

---

1 శివరామమూర్తి ఎస్ ఆధునిక తెలుగు వ్యాకరణం (1981 పు 33

2 సుబ్రహ్మణ్యం పి యస్ ద్రావిడ భాషలు 1979 పు 168

కేవలం ప్రాతిపదికే స్వతంత్ర ప్రయోగార్హతను కలిగి ఉంటుంది బ్రాకెట్లలోని ప్రత యాలు వైభాషికంగా ప్రాతిపదికకు చేరుతాయి

నామవాచకాలను రెండు వర్గాలుగా విభజించవచ్చు

1 సహజ నామవాచకాలు Pr mary Nouns

2 నిష్పన్న నామవాచకాలు Der ved Noun )

భాషకు సహజ సిద్ధమైనవి సహజ నామవాచకాలు క్రియా ధాతువుల నుండి గాని నామ ప్రాతిపదికల నుండి గాని కొన్ని ప్రత్యయాలు చేరగా ఏర్పడేవి నిష్పన్న నామవాచకాలు వీటికి కృదంతాలు తద్ధితాంతాలు అని పేరు

## సహజ నామవాచకాలు

సాధారణంగా సహజ నామ ప్రాతిపదికలకు లింగ బోధక ప్రత యాలు చేరవు ప్రాతిపదికలే ప్రథమాంతాలుగా ప్రవర్తిస్తాయి అందువల్ల ఇక్కడ ప్రకృతి ప్రత య విభాగం ఉండదు

| | | |
|---|---|---|
| ఉదా | కుందేలు 9 7 | మేక 57 15 |
| | కాలు 39 4 | గొర్రె 57 15 |
| | వేయి 39 4 | పెట్టె 73 3 |
| | తల్లి 46 1 | |

అయితే కొన్ని సహజ నామవాచక పదాల్లో లింగబోధక ప్రత యాలు చేరి ఉంటాయి ఉదా చెల్లెలు కోడలు మరదలు ఈ రూపాల్లోని అలు అనేది స్త్రీలింగ బోధకం ఇది అలు స్త్రీ అనే పదం నుంచి ఏర్పడింది అల్లుడు తమ్ముడు అనే పదాల్లోని డు పురుష బోధక ప్రత్యయం

## నిష్పన్న నామవాచకాలు

### కృదంతాలు

క్రియా ధాతువుల నుండి నిష్పన్నమైన నామవాచకాల్ని వ్యాకరణ సంప్రదాయంలో కృదాంతాలని అంటారు ఇవి క్రియా ధాతువులకు ప్రత్యయాలు చేరడం వల్ల ఏర్పడుతాయి అప్పుడు కొన్ని మార్పులు గోచరిస్తాయి

| | | | |
|---|---|---|---|
| —అక | మునుగు | మునక | 64 8 |
| | తునియు | తునక | 67 23 |
| —అటు | పడు | పాటు | 57 21 |
| —అమి | చేయు | చాయమి | 14 24 |
| | నేర్చు | నేరమి | 47 11 |
| —అలి | కాచు | కావలి | 22 17 |
| —ఇక | అమర్చు | అమ-క | 29 2 |
| | యేలు | యేలిక | 30 9 |
| —ఇకె | పూను | పూనికె | 27 25 |
| —ఇమి | బలియు | బలిమి | 40 6 |
| | కలుగు | కలిమి | 51 19 |
| —క | యెరుగు - | యెరుక | 34 19 |
| | మూగు | మూక | 64 2 |
| —ఓటు | పొడుచు | పోటు | 65 13 |
| —త | నడచు | నడత | 2 2 |
| | చేయు | చేత | 64 12 |
| | కూయు | కూత | 77 3 |
| —వ | నిలుచు | నిలువ | 23 25 |
| —వు | కొలుచు | కొలువు | 4 9 |
| | చచ్చు | చావు | 60 16 |
| —బడి | ఏలు | ఏలుబడి | 40 5 |

భావార్థక ప్రత్యయాలు

| | | | |
|---|---|---|---|
| —ఏది | వచ్చు | వచ్చేది | 26 26 |
| | వ్రాయు | వ్రాసేది | 44 10 |
| | అంపు | అంపేది | 56 1 |
| | నిలుచు | నిలిచేది | 61 12 |

—ట మీటు మీటుట 16 7
ఊదు ఊదుట 16 7
చూచు చూచుట 17 16

తద్ధితాంతాలు

ఇవి కొన్ని విశేషార్థాల్లో నామ ప్రాతిపదికలకు తద్ధిత ప్రత్యయాలు చేరగా ఏర్పడుతాయి

—అడి/అడ కట్టడి 20 8
కట్టడ (39 21
—ఇకం తలారికం 22 11
—ఇకె నడవడికె 21 5
—తనం దొరతనం 48 7
—అది వెండి 14 3
—కత్తె బోనకత్తెలు 26-6
హెగ్గడి కత్తెలు 26 6
—కాడు పారుపత్యగాడు (38 18

కొన్ని సంస్కృత నామ ప్రాతిపదికలకు తెలుగు ప్రత్యయాలు చేరగా నిష్పన్నమైన నామవాచకాలు

—అకం కారకం 12 17
—అమి పౌర్ణమి 10 9
—ఇమి బలిమి 55 14
—ఈకం కర్ణికం 31 4
ద్వైపీకం 61 1
—త అనుకూలత 72 25

నిర్దేశ సూచక ప్రత్యయాలనుండి ఏర్పడిన నామవాచకాలు

యివ్వాడు 42 9 యెవ్వాడు 43 2
అన్ని 8 19 యెన్ని 8 19)

అంత 51 6 యెంత 45 2
ఇంత 27 18 యేలాగు 32 3

అనిశ్చిత సర్వనామాల నుండి ఏర్పడిన నామవాచకాలు

కొంత 27 1
కొందరు (69 9

ఈ విధంగా భాషలో అనేక విధాలుగా నామవాచక రూపాలు ఏర్పడి భావస్ఫోరక శక్తిని పెంచుతాయి

## తత్సమాలు

సంస్కృతంలో శబ్దాన్ననుసరించి లింగ విభజన రూపొందగా తెలుగులో అర్థాన్ని ఆశ్రయించి లింగ విభాగ మేర్పడింది సంస్కృత ప్రాతిపదికలకు తెలుగు లింగబోధక ప్రత్యయాలు చేరి తత్సమా లేర్పడుతాయి సంస్కృత శబ్దాలు తెలుగులో ప్రవేశించినపుడు పాతిపదికల్లో కొన్ని మార్పులు జరుగుతాయి

**అజంత ప్రాతిపదికలు**

**అకారాంత మహద్వాచకాలు**

సంస్కృతంలోని పుంలింగ ప్రాతిపదికలు సాధారణంగా తెలుగులో మహద్వాచకాలై ండు / డు అనే లింగ బోధక పత్యయాలను గ్రహిస్తాయి అప్పుడు స్వరసామ్యం Vowe harmony వల్ల ప్రాతిపదికాంతమైన అకారం ఉకారంగా మారుతుంది

ఉదా బ్రాహ్మణ బ్రాహ్మణుడు (5 25
సుగ్రీవ సుగ్రీవుడు (9 15

రా వా లో నాయక శబ్దం తత్సమమైనపుడు నాయకుడు అన్న రూపం మాత్రమేకాక ప్రాతిపదికాంత క వర్ణం లోపించి నాయుడు/నాయడు అన్న రూపం కూడా ఏర్పడింది క్రమంగా ఇది జాతివాచకం అయింది

ఉదా విశ్వనాథ నాయకుండు 44 20
అక్కవ్పనాయుడు 11 19
కృష్ణప్పనాయడు 44 21

ఇకారాంత మహద్వాచకాలు

సంస్కృత ఇకారాంత పుంలింగ ప్రాతిపదికలు తత్సమాలైనపుడు ఎలాంటి మార్పును పొందవు వీటిపై లింగబోధక ప్రత్యయాలు చేరవు

హరి 6.12 ఋషి 33 18
సనాని 713 పతి 33 8
ముని 9 26 యతి 33 23

పై ఉదాహరణాల్లో హరి శబ్దం ఉత్త్వడుజ్ఞులను చేర్చుకొని హరుడు అని కూడా ప్రయోగింపబడవచ్చు

హరిహరులపేరిట 6 12 < హరిహరుడు
అలాగే గూఢచారుడు 26 13

ఉకారాంత మహద్వాచకాలు

సంస్కృత ఉకారాంత పుంలింగ ప్రాతిపదికలు తత్సమాలైనపుడు వు అనే ప్రత్యయాన్ని పొందుతాయి

ప్రభువు 4 11 గురువు 5 8

ఋకారాంత మహద్వాచకాలు

ఋకారాంత పుంలింగ సంస్కృత ప్రాతిపదికలు తత్సమాలైనపుడు ప్రథమైక వచనంలోని దీర్ఘం హ్రస్వమవుతుంది

కర్తృ > కర్తా పు ఏ > కర్త 1 11
దాతృ > దాతా పు ఏ > దాత 32 14
వక్తృ > వక్తా పు ఏ > వక్త రా వా లో దీనికి ఉత్త్వడుజ్ఞులు చేరి వక్తుండు 32 13) అయింది

**మహతీవాచకాలు**

సంస్కృతంలోని ఆకారాంత ఈకారాంత స్త్రీలింగ ప్రాతిపదికలోని దీర్ఘాచ్చులు తత్సమాలైనపుడు హ్రస్వాచ్చులుగా మారుతాయి

మూకాంబికా > మూకాంబిక 4 23
అన్నపూర్ణా > అన్నపూర్ణ 6 10
లక్ష్మీ > లక్ష్మి 7 19

నదీవాచక శబ్దాలన్నీ సంస్కృతంలో స్త్రీలింగ శబ్దాలుగా వ్యవహరింప బడుతాయి

మణికర్ణికా > మణికర్ణక (7 3
తుంగభద్రా > తుంగభద్ర 9 3
కావేరీ > కావేరి 12 4
తామ్రవర్ణీ > తామ్రవర్ణి (12 5

ఏకాచ్క దీర్ఘ ఈకారాంత స్త్రీలింగ ప్రాతిపదికలు తత్సమాలైనపుడు ఎలాంటి మార్పు పొందవు

శ్రీ > శ్రీ 2 1
స్త్రీ > స్త్రీ 14 3

**మహతీతరామహద్వాచకం**

**అకారాంతాలు**

అకారాంత సంస్కృత ప్రాతిపదికలు ఏ లింగంలో ఉన్నా తెలుగులో అమహద్వాచకాలను తెలియజేసేటప్పుడు ంబు / ము/ం అనే ప్రత్యయాలు చేరుతాయి

ంబు దర నంబు 2 13 < దృశ్
స్పర్శనంబు 2 3 (< స్పృశ్
ము/ం స్నానము 7 5 మోక్షం 2 8
పాదము (7 5 భిక్షం 5 16)

అకారాంత నగర శబ్దం ము/ం ప్రత్యయాన్ని స్వీకరించనప్పుడు ప్రాతి పదికాంతంలోని అకారం ఉకారంగా మారుతుంది

నగరు 10 3 నగరు శోధన 14 3

అకారాంత సంస్కృత నపుంసక శబ్దాలు తెలుగులో మహద్వాచకాలై నపుడు తుది అకారం ఇకారంగా మారుతుంది

ప్రధాన ప్రధాని 11 15
అవధాన అవధాని 11 20
వేద వేది 11 20
వేగ వేగి 48 6

అకారాంత సంస్కృత నపుంసక లింగమైన మిత్ర శబ్దం శత్రు శబ్దసామ్యంతో వు ప్రత యాన్ని పొందుతుంది

మిత్ర మిత్రువు 5 2

అలాగే హిత శబ్దం కూడా వు ప్రత్యయాన్ని స్వీకరిస్తుంది

హిత హితవు 74 17

సంస్కృత అకారాంత ప్రాతిపదికలోని దీర్ఘాచ్చు తెలుగులో హ్రస్వ మవుతుంది

జిహ్వా జిహ్వ 17 24
నిశా నిశ 8 13

రా వా లో నిశా శబ్దం స ప్తమ్యంతంలో నిశి గా మారుతుంది

రాత్రి నిశి సమయమందు 10 11

ఇది బహుశా భువి దివి పదాల సామ్యంతో వచ్చి ఉండవచ్చు

ఇకారాంతాలు

ఇకారాంత సంస్కృత ప్రాతిపదికలు తెలుగులో మహతీతరామహ ద్వాచకా లైనపుడు ఎలాంటి మార్పు పొందవు

శక్తి 2 4 శుచి 49 23
నీతి 2 10) రుచి 49 23)

**ఉకారాంతాలు**

ఉకారాంత సంస్కృత ప్రాతిపదికలు తెలుగులో మహతీతరామహ ద్వాచకాలైనపుడు వు ప్రత్యయం చేరుతుంది

| | | | |
|---|---|---|---|
| మధువు | 6 26 | ధేనువు | 19 12 |
| మృత్యువు | 20 7 | హేతువు | 6 23 |
| వాయువు | 18 2 | మేరువు | (27 20 |

**ఓకారాంతాలు**

ఓకారాంత గో శబ్దానికి తత్సమంలో వు ప్రత్యయం చేరుతుంది

గోవు 9 6

**హలంత ప్రాతిపదికలు**

సాధారణంగా సంస్కృత ప్రథమైక వచనరూపం నుండి తత్సమ ప్రాతిపదిక లేర్పడుతాయి కొన్ని సందర్భాల్లో ద్వితీయైక వచనంలోని తుది మ వర్ణం లోపించి తత్సమ ప్రాతిపదికగా వ్యవహృతమవుతుంది

నకారాంత ప్రాతిపదికల ప్రథమైక వచనరూపంలోని తుదిదీర్ఘం హ్రస్వమవుతుంది

మహిమన్ > మహిమా > మహిమ 9 23

ఆత్మన్ > ఆత్మా > ఆత్మ 12 24

రాజన్ శబ్దం యొక్క తుది దీర్ఘం హ్రస్వమై ఉత్వాన్ని పొందుతుంది

రాజన్ > రాజా > రాజు 19 6

శకారాంత దిక్ శబ్దం ఉత్వ ద్విత్వాలను పొందుతుంది

దిక్ > దిక్కు 4 7

సకారాంత ప్రాతిపదికలు కూడా ఉత్వ ద్విత్వాలను పొందుతాయి

శ్రేయస్ > శ్రేయస్సు (18 7

మనస్ > మనస్సు 22 5

కాని ఆయుశ్శబ్దంలోని తుది సకారం లోపించి వు ప్రత్యయం చేరుతుంది

ఆయుస్ > ఆయువు 20 9

ఇకారాంత భిషక శబ్దం తద్ధితంలో ఆది వృద్ధిని పొందుతుంది

భిషక్ > భేషజాలు 4 14

దకారాంత ప్రాతిపదిక ద్వితీయైక వచనంలోని మకారం లోపిస్తుంది

సంపదమ్ > సంపద 6 13

కొన్ని పదాల్లో సంయుక్తం ద్విత్వమవుతుంది

బ్రధ్న > బ్రొద్దు > పొద్దు 68 26

కట శబ్దంలో మహాప్రాణం అల్పప్రాణంగా మారి అనుస్వారం ఆగమంగా వస్తుంది

కట > బంటు 26-22

పరీక్షిత్ శబ్దం రా వా లో రెండు విధాలుగా వ్రాయబడింది

పరీక్షిత్తు 19 2 పరీక్షిత్తుండు 19 24

బీభత్స శబ్దం కూడా ఉత్వాన్ని పొందింది

బీభత్సు 68 1

ఇక్కడ పదాదక్షరంలోని మహాప్రాణత్వం లేఖక దోషమని చెప్పవచ్చు

## తద్భవాలు

తద్భవ పదాల మూల మాతృక నిర్ణయంలో మన వైయాకరణుల్లో రెండు మత భేదాలున్నాయి కేతన విన్నకోట పెద్దన కూచిమంచి తిమ్మన మొదలైనవారు తద్భవాలకు మూల మాతృకగా సంస్కృతాన్ని పేర్కొన్నారు చింతామణి కర్త బాలసరస్వతి చిన్నయసూరి అప్పకవి మొదలైన వారు సంస్కృత ప్రాకృతాలను రెండింటిని స్వీకరించారు దీనికి సంస్కృత ప్రాకృతాలకు నడుమ ఉన్న సామీప్యత కారణం కావచ్చు ఇక్కడ ఆద్య ప్రకృతిగా సంస్కృతం ద్వితీయ ప్రకృతిగా ప్రాకృతం గ్రహించబడ్డాయి ద్వితీయ ప్రకృతి తెలుగునకు సమీప మాతృక అవుతుంది

పదాది అకారం తెలుగులో ఉకారంగా మారుతుంది

అంగులీయక > అంగులీయ > ఉంగరము 11 1

కొన్ని పదాల్లోని దీర్ఘం తెలుగులోనికి వచ్చినపుడు హ్రస్వమవుతుంది సంయుక్తం ద్విత్వమవుతుంది

లేశ్యా > లెస్సా > లెస్స 13 0

సమీప మాత్రకలో ద్విత్వముంటే తెలుగులో అద్వ్యంత్యమై తత్పూర్వ స్వరం దీర్ఘమవుతుంది

ఋష్టి > ఇట్టి > యీటె 60 10

అపదాది ద్విత్వం లోపస్తుంది ఆద్య ప్రకృతిలోని సంయుక్తాక్షరం స్వర విభక్తి చేత విడగొట్టబడుతుంది

నిద్రా > నిద్దా > నిదుర 27 2

కొన్ని పదాల్లో మహా ప్రాణం నిలిచి ఉంటుంది కొన్నింటిలో లోపస్తుంది

ఘటికా > ఘడియా > ఘడియ 29 15

భండాగార > భండార / భండాఆర > భండారము 67 20

స్తంభ > కంభో > కంభము 10 6

ఝకట > ఝగడ > జగడము 65 11

తకారాది రూపాలు తకారంగా మారుతాయి

స్తావ > రావ > తావు 9 26

స్థానమ్ > ఠాణం > ఠాణం 64 4

ఠాణము 41 16

సకారాది రూపాలు కొన్ని జకారంగా మారుతాయి

శణ > సణ > జన 63 10

కొన్ని యకారాది ఆద ప్రకృతులు ద్వితీయ ప్రకృతిలోను తెలుగు లోను జ/ఝ లుగా మారుతాయి

యత్న > జయణ > జతనము 3 19

ధ్యామ > ఝూమో > ఝూము (52 3

కొన్ని పదాల్లో పదమధ్య ణకారం నకారంగా మారుతుంగి

అజ్ఞప్త > అణత్తి > ఆఁతి 24 1
భోజనమ్ > భోణం > బోనము బోఁకత్తెలు 26 5
భోయాణం

ప్రయాణమ్ > పయాణం > పయనం 58 1

కొన్ని చకారాది రూపాలు సకారంగా మారుతాయి

చంపక > చంపగ > సంపెంగ్గి 77 27

పదమధ లకారం ళకారంగా మారుతుంది

దేవకులమ్ > దేవఉలం > దేవళము 25 25

శంబలమ్ > సంబలం > సంబళము 59 19

కొన్ని పదాల్లో హకారం లోపిస్తుంది

సాధనీ > సాహిణీ > సాని c f అల్లసాని

కొన్ని పదాల్లో పదాంత అనుస్వారం లోపిస్తుంది

వ్యాఖ్యానమ్ > వక్ఖాణం > వక్కాణ 74 1

చవు/చఉ చౌ గా మారుతుంది

చతు > చవు/చఉ > చౌ 18 5

## అన్యదేశ్యాలు

ఏ భాషలోనైనా పదజాలాన్ని దేశ్యం అన్యదేశ్యమని రెండు విధాలుగా వర్గీకరించవచ్చు మూలమాతృక నుంచి సంక్రమించినవి దేశ్యాలు ఇతర భాషల నుండి వచ్చి చేరినవి అన్యదేశ్యాలు అయా భాషల చారిత్రక వికాస దశలలో సమీపవర్తి సజాతీయ భాషల నుంచి గాని పరిసరస్థ విజాతీయ భాషల నుంచి గాని మత సాంఘిక వాణిజ రాజకీయ సాంస్కృతికాది సంబంధాల మూలంగా దూరవర్తి భాషల నుంచిగాని ప్రత్యక్షంగానో పరోక్షంగానో వచ్చి చేరుతాయి [3]

---

3 దొణప్ప తూమాటి తెలుగులోని వైకృత పదాలు తెలుగు భాషా చరిత్ర 1979 పు 30

భాషలో అన్యదేశ్యాలు చేరడానికి అనేక కారణాలుంటాయి వీటిలో అధికార భాషా ప్రభావం సరిహద్దు ప్రాంతంలోని ప్రజలపై ఇరుగు పొరుగు భాషల ప్రభావం వర్తక వాణిజ్యాల కారణంగా విదే య భాషలతో పరిచయ మేర్పడడం మతోద్యమాల ప్రభావం స్వభాషలో నూతన భావ ప్రకటనకై తగిన పదజాలం లేకపోవడం మొదలైనవి ప్రధాన కారణాలుగా చెప్పవచ్చు [4]

ఒక భాష మరో భాషలో నుంచి గౌరవం కోసం Pre ge mo ve గాని అవసర నిమిత్తం Need ng mo ve గాని ఎరువు తెచ్చుకోడం జరుగుతుంది

బ్లూ ఫీల్డు భాషలో పదాదానం మూడు విధాలుగా జరుగుతుందని చెప్పారు [6]

1 సాంస్కృతికం Cu ura

2 పరస్పరం Mu ua

3 మాండలికం D a ec a

ఏ భాష అయినా అవసరాలను బట్టి అన దేశ్య పదాలను యథాతథంగా గాని లేదా ధాతుప్రత్యయసామగ్రితో జన పదాలను సృష్టించుకొనిగాని ఎరువు తెచ్చుకొంటుంది

సమాజంలో అనునిత్యం పెరుగుతున్న అవసరాల దృష్ట్యా అనుక్షణం మారుతున్న విలువల దృష్ట్యా భాష పెరుగుతుంది ఏ భాష అయినా తన చుట్టూ వలయా లేర్పరచుకొని బయటికి తొంగి చూడకుండా ఉండదు

---

4 జగన్నాథం పేర్వారం తెలుగుపై ఉర్దూ భాషా ప్రభావం సాహిత్యావలోకనం పు 34

5 Hocke C F A cou e n modern Ling ust cs 1958 P 403

6 B oomf e d L Language (1935 PP 444 495

Je pe on No anguage en e y ree f om borrowed wo d becau e no n on ha ever been comp e e y o a ted Con ac w h o her na on nev ab y ead o borro w ng hough he r number may va y very con derab y అని పేర్కొన్నాడు 7

అంతేగాకుండ No anguage en re y ree rom who e anguage hey a e borrowed hough h uper o y may be o d fe en k nd " అని వివరించాడు 8

ఏ భాష వివిధ భాషలపై వివిధ రంగాల్లో తన ప్రభావాన్ని ప్రసరింప జేస్తుందో ఆ భాష బలీయమైన భాష dom nan anguage గా గుర్తింప బడుతుంది ఆంగ్లభాషను దీనికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు అలాగే భారతీయ భాషల్లో సంస్కృతాన్ని చెప్పుకోవచ్చు

తెలుగుభాష ప్రత్యేక భాషగా రూపొందినప్పటినుండి ఆయాకాలాల్లో అనేక రంగాల్లో వివిధ భాషల ప్రభావం తెలుగు భాషపై ప్రసరిస్తూ వచ్చింది తెలుగుపై మొట్టమొదట ప్రభావం చూపిన భాష ప్రాకృతం తెలుగుదేశంలో శాతవాహనుల కాలంనుంచి ప్రాకృతమే రాజభాషగా చెలామణిలో ఉండేది అదే ఇక్ష్వాకుల శాలంకాయనుల ఆనందగోత్రులదాకా కొనసాగింది విష్ణుకుండినుల కాలంలో ప్రాకృతభాష వెనుకబడి సంస్కృత భాషా ప్రాబల్యం పెరిగింది అప్పటినుండి తెలుగుపై సంస్కృత ప్రభావం పెరుగుతూ వచ్చింది

తెలుగుభాషకు సోదరభాషలైన తమిళ కన్నడ భాషలు భౌగోళికంగా అతి సన్నిహితంగా ఉన్నందువల్ల వివిధ మతోద మాల ప్రభావం తెలుగుపై ఉంది వైష్ణవమతం ద్వారా తమిళం వ్యాపించినట్లే వీరశైవం ద్వారా కన్నడం తెలుగుదేశంలో వా పించింది దాంతో అనేకపదాలు తెలుగు వ్యవహారంలోకి వచ్చాయి

---

7 Je pe on O o Language na ure deve opmen and or g n 1923 P 208

8 P 209

శాతవాహనుల కాలంనుంచి మరర్వాడా తెలుగు నాడులు భౌగోళికంగా కలిసిపోయినందువల్ల ఈ రెండు ప్రాంతాల్లోని వ్యవహృత భాషలు పరస్పరం ప్రభావితమై ఉండుట నిర్వివాద విషయం[9] తెలుగు భాషలో మరాఠి భాషా పదాలు సుమారు ఎనిమిది వందలదాకా ప్రవేశించాయని అంచనా [10]

క్రీ శ 10 వ శతాబ్దం నుండి భారతదేశంపై మహమ్మదీయుల దండయాత్రలు ప్రారంభమై ప్రబలమైనతర్వాత భారతీయ జాతీయ జీవనంలో అనేక రంగాల్లో మార్పులు వచ్చాయి క్రీ శ 15 వ శతాబ్దం నాటి బహమనీ రాజ్యం వెలసింది కుతుబ్‌షాహీల గోల్కొండను రాజధానిగా చేసుకొని తెలుగు దేశాన్ని పాలించారు ఈ సమయంలో ఉర్దూ భాషా ప్రభావం తెలుగుపైన పడింది ఆ తర్వాత ఆసఫ్‌జాహి వంశంవారు హైదరాబాదు భాగ్యనగరం ను రాజధానిగా చేసుకొని తెలంగాణాను పాలించారు వీళ్ళ కాలంలో ఉర్దూ రాజభాషగా అవతరించింది

ఉర్దూ అన్నపదానికి సైనిక కూట మని అర్థం ఇది టర్కీ భాష నుండి గ్రహింపబడింది సైనిక స్థావరాల్లో అవత రించినందువల్ల దీనికి పేరు వచ్చింది దీన్నే లష్కర్ జబాన్ అనికూడా వ్యవహరించేవారు లష్కర్" అన్నా సైనిక కూటమనే అర్థం

క్రీ శ 12 వ శతాబ్దం నాటికి విదేశీయులైన అనేక మహమ్మదీయజాతి జనులు సైనికులుగా ఉత్తర భారతదేశంలో అంటే ఢిల్లీ పరిసర ప్రదేశాల్లో స్థిరపడ్డారు వీరు అంతకుముందు భిన్న భాషలు మాట్లాడేవారు ఢిల్లీలో నివసించడం తటస్థించిన తర్వాత వీళ్ళ వ్యవహారానికై మొదట్లో ఏర్పడిందే ఈ ఉర్దూభాష ఆ తర్వాతనే దీనికి పేరు స్థిరపడింది అంతకు ముందు

---

9 దొణప్ప తూమాటి భాషా చారిత్రక వ్యాసావళి 1972) పు 147

10 తెలుగునందలి దేశ్యేతర పదజాలం అముద్రిత వ్యాసం పు 5

11 జగన్నాథం పేర్వారం తెలుగుపై ఉర్దూ భాషా ప్రభావం సాహిత్యావలోకనం పు 27

దీన్ని రేఖ్తా భాష అని పిలుస్తుండేవారు క్రీ శ 12 వ శతాబ్దంలో ఢిల్లీ పరిసర ప్రాంతంలో ఒకానొక ఖడీబోలీ అనే మాండలిక భాషలో అరబ్బీ పారసీ టర్కీ పదాలు కలిపి వ్యవహారం జరుపుకునేవాళు ఆ మాండలిక భాషే హిందీ భాషకు మూలమైన ఒకానొక ప్రాకృత భాష అందువల్ల హిందీ ఉర్దూ భాషలు చాలకాలం ఒకే భాషగా వర్ధిల్లాయి తర్వాత అవి పూర్తిగా విడిపోయి స్వతంత్ర భాషలుగా వృద్ధిపొందాయి

గోల్కొండ సుల్తానులు తెలుగుదేశాన్ని ప పాలిస్తూ తెలుగు ఉర్దూ భాషలను పోషించారు అప్పటినుంచి తెలుగు ఉర్దూ భాషలకు పరస్పర సంబంధ మేర్పడింది అప్పుడు అనేక ఉర్దూ పదాలు తెలుగు వ్యవహార భాషలో కలిసిపోయాయి రాజకీయంగా ఉత్తరభారతం దక్షిణభారతం విడిపోయిన తర్వాత ఉత్తరభారతంలోని ఉర్దూ ఒకవిధంగాను దక్షిణ భారతంలోని ఉర్దూ మరొక విధంగాను రూపొందాయి ఆ విధంగా దక్షిణాన రూపొందిన ఉర్దూ భాషకే దఖినీ భాష అనే పేరు వచ్చింది

విజయనగర సామ్రాజ్య కాలంలో విజయనగర రాజులకు అరబ్బుల తోను పారశీకులతోను వర్తక సంబంధాలు బాగా ఉండేవి అంతేగాక మహ మ్మదీయ సైనికులను మంచి శిక్షణ కలవారని తమ సైన్యంలో చేర్చుకొనే వారు వారు హిందువులతో కలిసి మెలగటంవల్ల అనేక ఉర్దూ పదాలు సైనిక వ్యవస్థలోకి రావడం జరిగింది తర్వాత క్రమక్రమంగా సాంఘిక రాజకీయ పరిపాలనా రంగాలలో అనేక పదాలు వచ్చి చేరాయి

రా వా లోని అన దేశ్య పదాల్లో కొన్ని ప్రత్యక్షంగాను కొన్ని పరో క్షంగాను వచ్చిచేరాయి అరబ్బీ పారసీ పదాలనేకం ఉర్దూ హిందీ మరాఠీ భాషల నుంచి తెలుగులో ప్రవేశించాయి అలాగే కొన్ని సంస్కృత ప్రాకృత భాషా పదాలు కూడా తమిళ కన్నడ భాషల నుంచి పరోక్షంగా తెలుగులో ప్రవేశించాయి

తమిళ పదాలు

తిరుపతి

తిరు= పవిత్రమైన దైవత్వంగల పతి = స్థలం నిలయం నివాసం తిరుపతి అంటే పవిత్రమైన స్థలం దేవుడు నివసించే చోటు అని అర్థం తమిళంలో తిరు అనేది సంస్కృతం శ్రీ నుంచి వచ్చింది ఇది శ్రీ>త్రీ >తిరుగా మారింది

తమిళంలో తిరు శబ్దపూర్వకమైన పదాలనేకం వైష్ణవ వారమ్య సూచకాలుగా తెలుగు సాహిత్యంపై చెరగని ముద్ర వేశాయి సంస్కృత శ్రీ శబ్ద జన మైన ప్రాకృత సిరీ శబ్దం తమిళంలో తిరు గా మారిందని చెప్ప వచ్చు రా వా లో తిరు శబ్దపూర్వక పదాలు రెండు మాత్రమే కనిపిస్తాయి

నూట యెనిమిది తిరుపతుల నుంచిన్ని 2 15

తిరుముక్కు 77 27 ఇది బహుశా దేవతాభరణం కావచ్చు

అణ్నగర్లు/అణ్నగళులు

వీరిని నపుంసకులు ఖొజ్జాలు అని కూడా పిలిచేవారు పూర్వకాలంలో రాజాంత పురాల్లో ఈ నపుంసకుల నుంచుకొనే ఆచారముండేది వీరు రాజ కుటుంబీకులకు అంతరంగిక పరిచారకులు

అణ్నగర్లు నిన్నరాత్రి రాయలవారు నగరశోధనకు పోయినట్టే యింకా రాలేదు" అని పలి నారు 26 6

అణ్నగళులున్ను రాయలవారు నగరు శోధనకు పోయినట్టే వచ్చినవారు గారని చెప్పగా" 27 7

అణగర్లు రూపంలో గార్ పర్షియన్ గౌరవ బ వ ప్రత్యయం దీనికి మరలా లు చేరి గార్లు అయింది రా వా లో ఈ ప్రత యంలోని అది దీర్ఘం హ్రస్వమై గర్లు అయి అణ్నగర్లు అని వాడబడింది

12 Anavara anayakam S ed The San k n he Vocabu ar e of he Drav d an Languages Drav d c S ud e 1974 P 122

RBP 9

అణ్ణగళులు రూపంలో కళ్ అనేది తమిళంలోను కన్నడం లోను ఉన్న బహువచన ప్రత యం దీనిపై మరలా తెలుగు బహువచన ప్రత యం లు చేరింది అప్పుడు అణ్ణగళులు అన్న రూప మేర్పడింది

**అలుమేలుమంగ**

ఇది అలర్‌మేల్‌మంగై అన్న తమిళరూపం నుండి సిద్ధించిన రూపం అలర్=తామర పద్మం మేల్ = పైన మంగై = పూజ స్త్రీమూర్తి దేవత తామర పద్మం పై నివసించే స్త్రీ దేవత అని అన్వయార్థం

అలుమేలుమంగా సమేతులైన కలా బ వెంకటేశ్వరుల దర నంబు శేశి"
(77 9

**అయ్యంగార్లు**

శ్రీవైష్ణవ మతానుయాయులు పీరు ఆయా వైష్ణవ దేవాలయాలను నిర్వహించడానికి రాజుచేత నియమింపబడేవారు

ఆర్యా > అయ్య + గార్ > అయ్యంగార్ గార్ అనే పక్షియన్ గౌరవ వాచక ప్రత్యయం చేరినపుడు దానికి ముందు అనుస్వారం వచ్చి అయ్యంగార్ అనే రూపమేర్పడింది అనుస్వారం అర్థదారుఢ ం కోసం చేరింది ఈ అయ ంగార్ అనే పదం తర్వాత ప్రతే కార్థంలో స్థిరపడింది

స్థలాంతరాలనుంచ్చిన్ని వచ్చిన అయ్యంగార్లనున్ను" 2 18

చూడు కొడుత్తునాచ్యారు అముక్తమాల్యద చూడి = ధరించి కొడుత్త=ఇచ్చిన నాచారు=పవిత్ర స్త్రీ ప్రతి రోజు మొదట తాను ధరించిన పూలమాలను శ్రీరంగేశ్వరునకు అర్పిస్తున్నందువల్ల గోదాదేవికి ఆ పేరు వచ్చింది అముక్తమాల ద అన్నది సంస్కృత రూపం తమిళంలో నాచ్చియార్ అంటే దేవతా స్త్రీ అనే అర్థం కూడా ఉంది దీని వ్యావహారిక రూపమే నాచ్యారు పదమధ్యాక్లోపం వల్ల ద్విత్వాక్షరం అద్విత్వం అయింది ఇంకా నాంచారు నా చారు అనే రూపాలు వాడుకలో ప్రసిద్ధంగా ఉన్నాయి

"చూడు కొడుత్తునాచ్యారు సమేతముగా సంపెంగ్గి మంన్నారు స్వామిని సేవించ్చి" 77 26)

పిళ /ఎళ్ల ఇది తమిళంలోని ఎళ్ళై అన్న రూపం నుండి ఏర్ప డింది దీనికి అరవ నాల్గవ జాతివా దని శాసన శబ్దకోశంలో అర్థం ఇవ్వ బడింది ఇది రా వా లో నామవాచకానుబంధ ప్రత్యయంగా వాడబడింది

అప్పరపిళ 11 13
మన్నారుపిళ 11 14
కుప్పరపిళ 44 19

పాళ్యం సేనానివేశం చిన్న గ్రామం గ్రామాంత్య పేదం <త పాళయం దీని నుంచి ఏర్పడిందే పాళ గార్ శబ్దం

"యీ పాళ్యాన యిటువంటి వీధిని యీ యీ శ్రేణిలో ఇంన్నో యింటి వద్ద రాత్రి నడచిన న్యాయములు 22 9

"మూడు తెగల తురకలున్ను తమ తమ పాళ్యములో ఆయత్తపాటుతో జాగ్రత్త గలిగి యుండగా" 60 6

"గజపతివారి సీమాద్యంత్తం నిపాతం శేసుకపోయి పొట్లూరి సింహాద్రి వద్ద పాళ్యందిగిరి" 65 22

ఇక్కడ సైన ంతో దిగిరి అన్న అర్థంలో వాడబడింది

పడి దేవతారాధన కుపయోగించే నిత్యనియమిత సంబారం పూర్వం దేవాలయాల్లో నిత్యమూ పూజలు జరగడానికి కావలసిన వస్తు సంబారాన్ని సమకూర్చడానికి రాజులు దేవాలయాధికారులను నియమించేవారు వీరు ఎప్పటి కప్పుడు అక్కడి విశేషాలను రాజుకు తెలియజేసేవారు

"పృథివ్యావస్తేజోవాయురాకాశాత్మకమైన యేకామ్రనాథ జంబునాథ అరుణాచలేశ్వర కాళహస్తీశ్వర చిదంబరం మొదలైన డెబ్బైరెండు దేవస్థలాల కున్ను పదునెనిమిది శక్తులకున్ను నిండు పడితరములు గలిగి నిత్యోత్సవములు గలిగి వున్నదనేటట్టుగా ఆరాధ్యులు దెలువంగా" 3 6)

నాడు ప్రాంతం పూర్వం పరిపాలనా సౌలభ ం కోసం సామ్రా జ్యాన్ని రాజ్యాలుగాను సీమలుగాను నాడులుగాను విభజించి పాలిస్తుండేవారు

13 ఈశ్వరదత్తు కుందూరి శాసన శబ్దకోశము 1967) పు 190

రా వా లో నాడు అనే పదం ప్రదేశవాచకంగా కొన్ని ఊర్ల పేర్లకు అను బంధంగా చేర్చబడింది

మొరసునాడు 3 10 మల్నాడు 3 10
మేల్నాడు 21 11

నంబి దీనికి భగవంతుడు విష్ణు పూజకుడు దేవుని భక్తుడు అనే అర్థాలున్నాయి ఈ అర్థాల్లోనే రా వా లో ప్రయుక్తమైంది

"ఒకనాటి రాత్రి నగరు పరిశోధనకు బయలుదేరినట్టు నగరు వెదలి పట్టానకు రెండామడ దూరాన ఉత్తరపు దిక్కున వొక దేవళము ఉండగా అక్కడికి పోయి నిలిచి నంబివాణ్ని నీళ్ళు తెమ్మని" 26 1

"కురుంగుడికి పోయి పంచ్చనంబ్బులనుంన్ని శేవించ్చి" 78 13

మంన్నారు పాండ్య మండలంలోని విల్లుపుత్తూరిలో వేంచేసి యుండే దేవుడు

"శ్రీవిల్లిపుత్తూరికి వచ్చి చూడుకొడుత్తునాచ్చారు సమేతముగా నంప్పెంగ్గి మన్నారు స్వామిని సేవించ్చి" 77 57

ప్రసాపాటు అహారం భోజనం ఇది ప్రసాదపడు అనే క్రియ నుండి ఏర్పడిన భావార్థకనామం రా వా లో ఇది ప్రసాబడు అని క్రియగా కూడా ప్రయోగించబడింది దీనికి తిను అని అర్థం ఇక్కడ ప్ర అనేది ఉపసర్గ పూర్వసర్గ

"తర్వాత తాము పాదప్రక్షాళనం చేసుకొని ఆచమనం శేశినవారై బందు జనులతోడట్టు బంగ్గారు వళెరములు వుంచ్చమని ప్రసాపాటుకు కూర్చుంన్న తావున పక పదార్థమున్ను కొదవబడకుండ్గా సకలమున్ను వడ్డించమని" 50 9

"స్వామివారి సొమ్ము ఇన్నాళ్ళు ప్రసాబడ్డందుకు" 45 13

"వళెరములో వడ్డించ్చి ప్రసావడేవట్ల" (50 14

---

14 కర్నాటకలో మలెనాడు అని ఎలువబడుతున్న ప్రాంతమే మల్నాడు మేల్నాడు అయి ఉండవచ్చు

"యిన్నాళ్ళున్ను రాయలవారి సంబ్బళములు ప్రసాబడి బ్రతికితిమి" 59 19

కన్నడ పదాలు

అరసు కన్నడంలో దీనికి రాజు అనే అర్థముంది రాజు కన్నడంలో పదాదిని అ ఆగమం కాగా అరసు అయ్యింది రా వా లో ఇది నామాంత్య పదంగా ప్రయుక్తమయింది

అయ్యమరసు 11 12 కొండమరసు 11 12
బాచరసు 11 12 యల్లమరసు 11 13
వీరమరసు 11 13 తిమ్మరుసు 11 15
లింగరసు 11 16 తిమ్మరసు 25 15

తరవు ఇది కాలసూచకం < క తర తెలుగులో ప్రవేశించి నపుడు దీనికి వు ప్రత్యయం చేరుతుంది ఇది రా వా లో సేపు/సమయం అన్న అర్థంలో వాడబడింది

"కొంతదరవు యేకాంతపు కొలువుగా నుండి ఆ ఎమ్మట నిందు కొలువుకు వచ్చినవారై సకల సామాజికులను రప్పించుక " 4 8

అరుణోదయానికి నగరికివచ్చి కొంత తరవు పవ్వళించి " 22 2

సంబళం జీతం < క సంబళ

కన్నడ తెలుగు సరిహద్దు ప్రాంతంలో నేటికీ ఈ పదం బాగా వ్యాప్తిలో ఉంది

"ఆయా గుర్రాల రౌతులకు మూవటీలకున్ను సంబళం సారికెలు కట్టద జేశి" 30 25

"నల్లప్రజలు లక్షకున్ను నెలనెలకు తప్పక సంబళ ం దిద్దుమని" (31 3

కైజీతం ఇది సమస్తపదం కై = చేయి జీతం = ప్రతిఫలం వేతనం < క కయ్ > కై సం జీవితమ్ > జీతం

శ్రమకు తగిన ప్రతిఫలంగా ఇచ్చే డబ్బుకు జీతం అనే వాడుక బాగా ప్రచారంలో ఉంది విజయనగర రాజుల సైన్యంలో అమరనాయక సైన్యం కైజీతపు సైన్యమని రెండు తెగలుండేవి వీరిలో ఎవ్వరికప్పుడు

డబ్బు ఇచ్చి చేర్చుకొనే సైనాన్ని కైజీతపు సైన్య మని వ వహరించేవారు ఈ పదం రా వా లో అనేకచోట్ల ప్రయుక్తమయింది

"నగరికైజీతం యేనుగు గుర్రం రాణువకు లెఖ్ఖయేమిన్ని చదువ లేదని" 25 12

"ఆ సమయాన కర్నాటకం కైజీతం రౌతులు చితాపుఖానునికి పెడతల పోటుగా యిరుపారా వ్యల కనుమల పొదపున నెక్కి" 65 12

ఆరభ్యం మొదలు <క ఆరభ

"వారు విజయనగరమున నుండిన్ని తరలినదారభ్యం అహముదానగరం గోలకొండ ప్రవేశమయ్యే పర్యంత ం " 38 6

"కాళహస్తి ఆరభ ం జగన్నాధం పర ంత్రం " 67 9

ళ్థళం ప్రదేశం <క స్థళ < సం స్థలమ్

కన్నడంలో ళకారంతో కూడిన ఈ రూపం సంస్కృత జన మైనప్పటికి తెలుగులో కనిపించే ళకారయుక్త రూపం కన్నడ ప్రభావం వల్ల వచ్చి ఉండ వచ్చు

" అప్పుడైనా కనిపించుకోవలెగాని మొదటి స్థళం విడువరాదు" 67 2

ఇంకా ళకారంతో కూడిన రూపాలు కన్నడ భాషకు సహజంగా ఉండి తెలుగుపై ప్రభావాన్ని చూపాయి

"రత్న కంబళి మీద కూర్చుండుకొని " 12 14

"యిదిగాక గ్రీష్మ కాలాన దగదప్పులకు తాళి వాండ్లు నిలువలేరు" 59 15

"నవరత్నపు చిలుక తాళి వైదూర్య తాళి 72 19

దొడ్డ పెద్ద <క దొడ్డ ఇది విశేషణం తెలుగులో యథా తథంగా ప్రయోగింపబడుతుంది

"దొండ్డో పండితులు ముద్దో పండితులు దాదో పండితులు ముగ్గురున్ను దొడ్డ నియ్యోగులు " 34 8

దొడ్డ ముత్యాల అడ్డకత్తి " 72 22

కుంద్దకం  అడ్డు ఆటంకం లోపం  <క కుందక త కుందకమ్

"సామివారు కైజీతం కట్టిన వెనక అమరపు మలకు నగరి లెఖ్ఖల ప్రకారానకు కుంద్దకం లేకుండా వాల్లుఁ యేనుగ గుఱ్ఱాలు రావుత్తులు మావుత్తులు బంట్లు పరిజనములున్ను సంత్తరించ్చినారు" 45 6

హెగ్గడి  కత్యలు  అంత పురంలోని కావలికత్తెలు  కన్నడంలో మొదట  హెగ్గడె  అంటే  ముఖ్యమైనవాడు  ప్రధాని  అనే  అర్థంలో ఉండేది తర్వాత ఇది నామాంత పదంగా ప్రయుక్తమైంది ఉదా  రామకృష్ణ హెగ్డే  జి ఎం హెగ్డే  తెలుగులో దీనికి సమానార్థకంగా  ప్రెగ్గడ  అన్న రూపం ఉంది ఉదా  ఎఱ్ఱాప్రెగ్గడ  రా వా లో ఇకారంతో కూడిన రూపంపై స్త్రీలింగ బోధక ప్రత యం  కత /కత్తె చేరుతుంది.

"సాళువ తిమ్మరుసుగారు నగరికి వచ్చి రాయలవారు పుష్పోదయమైనారా అని పరామర్శించగా అచ్చట కాచియుండే దాదులు  హెగ్గడి కత్యలు లోన కత్తెలు అణ్నిగర్లు నిన్నరాత్రి రాయలవారు నగర శోధనకు పోయినట్టే యింకా రాలేదు అని పలికినారు" 26 5

హెచ్చరిక  జాగరూకత  <క ఎచ్చరికె

తెలుగులో ఈ రూపం కృతక ప్రామాణికత్వంవల్ల హకారంతో ప్రయుక్తమైంది

"రాయల దేవునివారు రాత్రి నగరు శోధనకు వెళుదునని ఎవ్వరిని అడుగక వీధులలో దుడుకులు రానియ్యక హెచ్చరికతో నుండుమని పలికి" 22 20

ఇది చాలచోట్ల యాద్ అనే పారశీకపదంతో కలిసి జంటపదంగా కూర్చబడింది

"విద్యానగర  పట్టణములోనున్ను  వెలిపాళముల  యందున్ను యాది హెచ్చరికలు గలిగి రాత్రి పగళ్ళు తలార్లు జతనమై జాగ్రత్తగా కాస్తా వున్నారు" (3 23

హరువు(కాయు) దీని విధం ఏర్పాటు అని నైఘంటికార్థాలు (సూ రా ని <క అరువు త అరివు బుద్ధి జ్ఞానం

రా వా లో ఇది వివరించు విశదపరచు అనే అర్థంలో చేయు అనే సహాయక క్రియతో కూడి ప్రయుక్తమైంది

"వారివారి మీది రొక్క నిలువలు లెఖ్ఖజూచి తోడుతోనె నిలువరూకలు హరువు కాయమని నిరుత్తరువుగా అనతిచ్చిరి" (29 18

హెచ్చు ఎక్కువ ఇది రా వా లో హెచ్చింది <క హెచ్చినదు హెచ్చించు క హెచ్చిసు అని కూడా క్రియాత్మకంగా ప్రయోగింపబడింది

"వదివన్నె బంగ్గారున నూరు శేరుల శేయించ్చిన వశెరమున్ను ఆ వశెరం మధ వెల హెచ్చు గోమేధికముంచ్చి వశ్యెరములో వడ్డించ్చి" 50 13

"మరిన్ని వంచ లోహములున్ను అన్నియు సరి అందున బంగారు హెచ్చిందియేంది అంటే వారియకకు రాంగా వన్నె హెచ్చించినట్లు" 32 7

"వన్నె హెచ్చినట్లు" అనడానికి "వన్నె హెచ్చించినట్లు" అని ప్రయుక్తమైంది

కొత్తళము కోట బురుజు <క కొత్తళ త కొత్తళమ్

ఇది కోట కొత్తళములు అని జంటపదంగా అనేక చోట్ల ప్రయుక్తమయింది

"కోట కొత్తళముల యందలి నడవడికెలు తెలిశి 21 4

"విజయా పురానకు బోయి పట్టం వెళిపాళములు కోట కొత్తళములు రవుతులు మావుతులు యేనుగ గుర్రాలు " 32 19

మరాఠీ పదాలు

కొత్తవాలు పోలీసు అధికారి <మ కొత్వాల్ నగర రక్షణకై నియమింపబడినవాడు

"కొత్తవాలు అనే తలారికి ముద్రజూపి పట్టణములో సంచరించవలెను" 38 6

దావడి మంటపం కార్యస్థానం కొలువు కూటం మ దావడీ<దాహ వడీ

"దేవపూజాగృహం ముందర లక్ష్మి దావడిలో కూర్చుండగాను" 49 25

"గజపతివారు వఖ అంతస్తు దావణో నికి వచ్చి కూర్చుండి" 50 22

ధమామి / దమామి డిండిమం <మ ధమామి

"నాలుగు దొరతనాల వారున్ను డాల దమామి దోకించ్చగా" 52 25

"దండు యాత్రకు జయధ్వనిగా దిక్కులు ఎక్కటిల్లేటందుకు భేరి తాడనము శేశి దమామి దోకించమని ఉత్తరవు శేశి 58 7

"భేరీ ధమామి కాహళాల వారిని రప్పించ్చి" 62 18

పరాకు ఉపేక్ష నిర్లక్ష్యం <మ పరాఖ్ ఇది తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనలలో కూడా పరాకు సేయు పరాకై వుండు అని చాలచోట్ల ప్రయోగింపబడింది

సాధువులైనవార్లకున్ను సాధుజంతువులకున్ను బాధ జేశేవారిని శిక్షింపక పరాకుజేస్తేను రాజధర్మత్వమున్ను ఐశ్వర్యమున్ను జేశిన పుణ్యమున్ను క్షీణమై పోవునని సిద్ధాంతం 18 25

"వొకసారి శిక్షించినది రెండోతేప శిక్షించకుండా బానిశెలు హెచ్చరికలుగా చూస్తావుండ్డి పరాకున ముట్టినప్పటి ఒన్ని " 50 17

ఇక్కడ పరాకున అంటే పొరపాటున అని అర్థం కాబట్టి ఇక్కడ అర్థపరిణామాన్ని గమనించవచ్చు

రౌతు గుర్రపుస్వారి చేసేవాడు ఇది సంస్కృత రావుత్త శబ్దంనుండి పరోక్షంగా మరాఠి భాషద్వారా తెలుగులోకి వచ్చింది

"కైతీతం గుర్రాలకు కట్పిలి రౌతులున్ను మొరస రౌతులునున్ను కుశువ రౌతులనున్ను యేలికబంట్లను వ్రాయించి" 30 8

అయా ప్రాంతాలనుబట్టి వీరు వివిధ తెగలుగా ఉండేవారని తెలుస్తుంది

మావుతులు ఏనుగులను నడిపించేవారు <మ మాహుత <ప మహావత్

"ముందర తురకాణ్యం మీద కార్యం శేశేవారమై కర్నాటక రౌతుల మావుతుల సంతరించవలెనని" 30 20

ఇది మావటీలు అనే రూపంగా కూడా వాడబడింది వ వహారంలో నేడు బాగా వ్యా ప్తిలో ఉంది

"మరి వెనక గుర్రాలు పన్నెండు వేలున్ను యేనుగులు యేనూరు రౌతులు మావటీలు వెచ్చబెట్టి ఆయా గుర్రాల రౌతులకు మావటీలకున్ను సంబళం సారికెలు కట్టడజేసి " 30 25

డెరిజా పటకుటీరం గుడారం మ దేరా

తురకలు కృష్ణవేణి దాంటివచ్చి డెరిజావేశి దిగేట్టా అని అగ్రహించు కొని" 59 8

"దేవరవారి ప్రతాపంవల్ల డెరిజా తాకు తెగకోశను 59 10

దీనికి "జిరీజా" అనే మరో రూపం కూడా రా వా లో ప్రయోగింప బడింది

"అంతట రామలింగమనాయుడు జిరీజా తాళ్ళు తెగకోశించ్చగా 60 18

రావు నామాంత్యపదం ఇది క్రమంగా అధిక విస్తృతిని పొందింది

"అంక్కుశరావు జగదేవరావు పలకరించినది సరే అని మలకరావు జెప్పనది " 47 13

పంతులు ఇది కూడా నామాంత్య పదంగా ప్రయుక్త మవుతుంది మ పంత్

పంత్ అనేదానికి తెలుగులో గౌరవ బహువచన ప్రత్యయం లు చేరి పంతులు అయింది

అనంత్రోజి పంత్తులు 49 15 ధాకోజి పంత్తులు 49 17
గోపోజి పంతులు 49 19 బాబోజీ పంతులు 49 20
బేకోజి పంతులు 49 18 సీలాద్రి పంత్తులు 50 26

తెలుగులో ఇది నేడు ఉపాధ్యాయుడు అనే అర్థాన్ని కూడా సంతరించుకుంది

జీ/జి ఇది గౌరవవాచక ప్రత్యయం < మ జీ

ఇది సంస్కృత ఉపాధ్యాయ శబ్దం నుండి కూడా ఏర్పడి ఉండవచ్చు

సం ఉపాధ్యాయ > ప్రా ఉవజ్ఝాఅ తె > ఒజ్జ > ఓజ > ఓజీ > జీ

వేగుల గోపోజి 38 4 అప్పాజి 61 26

వక్కిరి గోపోజి 42 19 గుజ్జరి గర్జోజి 42 25

ఇక్కడ ప్రత్యయంలోని దీర్ఘం హ్రస్వమయింది

ఠాణ్యము/ఠాణ్యము/ఠాణ్యం సైనిక నివేశం

< మ ఠాణా < హిం ఠాణా < సం స్థానమ్

రా వా లో రక్షణ అన్న అర్థంలో వాడినట్లు కన్పిస్తుంది

"సరదు స్థలాలకు రస్తు సామగ్రిలు అంప్పించి గడి స్థలాలకు బలవంతముగా వుండేటట్టుగా ఠాణ్యములకు నామజాదులు అంప్పించి" 4 16

"గనక అందుండ్డి రాచూరి ముదికల్లు అద్దంకి ఆదవని ఇవి మొదలైన స్థలాదులకు ఠాణ ములు వుంచ్చి 58 19

గనక సాధించ్చిన స్థలములకు ఠాణ్యము వుంచ్చి" 58 22

"ఆరీతి గాకుండా ముసకలుగా ఆయాస్థలాలు సాధించి ఆయా దుర్గాలను మన తెగ ఠాంణ్యములు వుంస్తే రస్తు సామగ్రిలు నడుచును" 62 14

"కంపన్నను దుర్గమందు ఠాణ్యం వుంచ్చి కందూర్కిపోగా" 63 12

"పిరతిద్రయ్యను ఠాణ్యముంచ్చి నాగార్జునం కొండకై నడవగా" 64 9

గనక ఆ కనుమల్లో మున్నైవేల స్తోమాన్ని ఠాణ్యం వుంచ్చి 65 20

ఉర్దూ పదాలు

కౌలు ఒడంబడిక ఒప్పందం < ఉ ఖౌల్ < అ ఖౌల్

ఈ పదం అరబిక్ భాషనుంచి ఉర్దూద్వారా తెలుగులో ప్రవేశించింది

"రాయలవారు బయలు మెరకి గుర్రం యెక్కి సకల సన్నాహముల తోనట్టు సకల దళ సమేతుడై గుత్తి కంఢ్డికోట మార్గముగా ఉదయగిరికి వచ్చిన హార్మత్తు అనే దుర్గముపై లగ్గయెక్కగా దుర్గములలోనివారు తమ చేత

నైనట్టు సమరంశేశి మంద్దు గుండ్దు శలవై నిర్వహించ్చలేక కొలిచ్చినారు (63 9)

"శత్రుజనాలు వెళి పోయిన తర్వాత రాయలవారు దుర్గంపై నెక్కి జూచి యింతరస్తువుండ్దగా యేమని కొలిచ్చి వెళి పోయిరి" (63 11)

ఇక్కడ అప్పగించు" అన్న అర్థం చెప్పుకోవచ్చు

చీట్లు <చీట్టీ+లు జాబు లేఖ ఆజ్ఞాపత్రం (హిం చిట్టీ

"మీ స్తోమముల తోదట్టు శీఘ్రగతిగా రమ్మని అందరికి చీట్లు వ్రాయించి అంపించి" 26 18

"సరుదుల ఉండేవార్లు యీ వార్త విని చీటి పాటి చిక్కు చిల్లానములు విజయాపురానకు అంపుతావున్నారు" 35 15

ఇది తెలుగులో ప్రవేశించినపుడు హ్రస్వమైంది తెలుగు బహువచన ప్రత్యయం లు చేరినపుడు పదాంతాచ్చులోపించి హల్లులు సంయుక్తం అవుతాయి ఇతర భాషలనుంచి వచ్చే హలంత పదాలు అజంతాలుగాను దీర్ఘాంతాలు హ్రస్వాంతాలుగాను మారిపోతాయి

ఖానుండు/ఖానుడు ఇది నామాంత్యపదం (< ఉ ఖాన్ < ప ఖాన్ ప్రభువు

ఇది తెలుగులో ప్రవేశించినపుడు ఉత్వదుజ్జులు చేరాయి

అంకుశ ఖానుండ్డు 44 16

చితావు ఖానుడు (65 6)

తురకలు మహమ్మదీయులు < ఉ తుర్క < ప తుర్క

"తురకలు మూడు తెగలవారున్న పటాపంచ్చలై విరిగి" 59 13

"మ్లేచ్ఛులయిన తురకలను పీగతోలి మన మలోనికి వచ్చి" (66 10

వీరి గుంపును తురకాణం అని రా వా లో వ్యవహరింపబడింది

బ్రాహ్మణ్యం

"తురకాణ్యం పీద దళమెత్తేటప్పుడు బోయదొరలందరినిన్ని రప్పించి" (57 12)

"హరిబాణం కొమాళతోను కార ముఖానకు తురకాణం మలోను మునకలుగా బోయి దిగి" 57 14

ముల్లా మహమ్మదీయుల స్తోత్రపారం <ఉ ముల్లా <అ ముల్లా దీనికి Theo og an Mahamadan Jur Schoo Ma er అనే అర్థాలుకూడా ఉన్నాయి [5] కాని రా వాలో ఈ అర్థాల్లో వాడలేదు ఒక శాస్త్ర విషయంగా మాత్రమే చెప్పబడింది

ముల్లా శాస్త్ర ప్రవీణులయిన పక్కీరులనున్ను భూత భవిష ద్వర్త మానములు తెలి న శకునజ్ఞులనున్ను పిలుపించి 42 1

ము స్తీపు అలంకరణ <ఉ ముస్తాబ్ <అ ముస్తాబ్

రా వా లి ఇది ము స్తీపు అని వాడబడింది ఇది నేడు ముస్తాబు అనే వ్యవహరింపబడుతోంది

"రాయలవారు బంగారు చౌడోలు ము స్తీపు అయిన మా స్తి మదహ స్తి యనే యేనుగును ఎక్కకొని" (30 10

రొఖ్ఖము/రొక్కం డబ్బు మొత్తం <ఉ రఖమ్<అ రఖమ్

"అమరగార్లమీది నిలువ రొఖ్ఖమునకు ఆ క్షణమందే వొవ్వుజెప్ప మనగా" 29 22

ఇంకా జంట పదంగా ఈ క్రింది రూపాలతో వస్తుంది

"అందునుంచి బొక్కస బొండారములకు రొక్కరూపాయిలు బహావుగా వచ్చును" 18 18

నగరి నియ్యోగులకు పరస్థళం నియోగులకు బహుమాన సంమ్మానము లున్ను ఉచితముగా రొఖ్ఖ రూపాయిలున్ను యిచ్చి" 43 22

---

15 A Mu a s a ached o every mosque o ead he Serv ces h mu a appo n ed by he congrega on though a a ru e the kaz nom nates h m Turs on Edgar Ca tes and Tr bes of South nd a Vo 4 1909 P 461

"శాక్కం వుడుగరలు దట్టికబాయి శలపాగ పట్టీలు యివి అన్నింన్ని ఆయా దావిశ లోనే వుండ్డును" 39 17

"శాక్కరోజనాలు మథూములు మొదలుగా గల భాగ్యం పీదిన్ని (68 10

జగడం కలహం <ఉ ఝుగడా <హిం ఝుగడా <ప్రా ఝుగడ<సం ఝుకట

"యిక్కడి జగడాల నేపుణ ఆ దేశమువారు యెరుగరు" 47 10

"తురకలు యెదురుబలమున్ను తన బలమున్ను జూచుక జగడం శేశేది లేదు" 47 15

"వాకిటి పిన్నపెద్దలు నియ్యోగులు జగడం శేశేది కార్యంగాదు 47 19

"వారు విచక్షణులై కార్యాకార ములు తెలిశి జగడమిచ్చి పోరాని కార మైతే" 47 23

"ముందు వెనుకలు జగడాలు జంక్కెలు శేశి 47 27

హిందీ పదాలు

కర్తారు/కర్తరు దేవుడు < హిం కర్తార్ < సం కర్తార

తాము జేసిన అదృష్టము వల్లనున్ను తమ దొరలపాలిటి కర్తారు వల్లనున్ను అంతరమస్నీలమై అరువైయేండ్లుబట్టిన్ని" 40 9

"షీకు జగన్నాయకులున్ను తమ దొరలకు కర్తరున్ను వున్నారుకా 51 17

ఢిల్లి భారతదేశ రాజధానినగరం < హిం దిల్లీ<సం దేహలి

"అశ్వపతి గజపతి నరపతి యీ మూడు సింహాసనాలకు గల రాజములో ఢిల్లి సురధాణికిన్ని" 45 22

"ప్రతాపరుద్రుండ్డు ప్రజలను పూరకే చంపేది ధర్మంకాదని వెలుబడి సమరం శేయగా దైవగతిని ఢిల్లి సురధాణి దాతను ప్రతాపరుద్రుండ్డు తగిలెను" (45 26

బేటి (చేసుకొని)   కలుసుకొని   < హిం భేంట్

ఇది తెలుగులో సహాయక క్రియను చేర్చుకొని శబ్ద పల్లవంగా ప్రయోగింపబడుతుంది

"రాయలవారి భేటి చేసుకొని కానుక నదురుదెచ్చి అపరిమితముగా పాదముల సమర్పించి" 76 16

యిటను మనం రాయలదేవునితో యెదిరించ్చి కత్తికట్టేది కార్యం కాదు అని యోచనచేసి భేటిచేసుకోవలెనని నిశ్చయించి 76 14

దునేదారు(లు)   ప్రభువు   < హిం దునియా హిం దార్

"సామివారు యీ రీతిని రావచ్చునా? యీ వార్తలు లోకులకు తెలిసితేను పట్టమున్ను కోలుపోవును దునేదారులు విన్నాన్ను అపకీర్తి" 27 16

"గోలకొండ్ల విజయాపురం అహముదానగరం యేలే ముగ్గురు దునేదార్లున్ను విని" 76 13

రూపాయిలు/రూపాయలు   డబ్బు   < హిం రుప్యా

ఇది రా వా లో జంటపదంలో రెండోపదంగా మాత్రమే వస్తుంది

"అందునుంచి బొక్కస భండారములకు రొక్క రూపాయలు బహువుగా వచ్చును" 18 18

"ఆ రీతిగ స్వామివారు పట్టాభిషిక్తులైన దారభ్యం నిలిచినవారికేమి రౌతురాణువకేమి బొక్కసాననే రొక్క రూపాయలు ఇమ్మని కట్టడజేసి" 43 19

రోజు   దినం   < హిం రోజ్ < ప రోజ్

"రోజు గుర్రం వొక్కంటికి నూరేసి పెట్లలెక్క గుర్రములు వెయ్యింటికి లక్ష పుట్లవంతున" 24 15

"యేనుగ వక్కంటికి రోజు వెయేసి పెట్లలెక్క యేనుగులు నూట యిరువై యింటికి పండ్రెండు లక్షలున్ను" 24 21

"బంట్లు వెయ్యింటికి రెండువేల వంతున రెండు లక్షల బంట్లకు రోజు నాలుగు లక్షలున్ను" 24 24

"అమర నాయకం గుర్రాలు ఏనుగులున్ను పండ్రెండు వేలున్ను కాల్బలములు రెండు లక్షలున్ను ఇందుకు రోజుకున్ను ఆయకం" (24 26)

సురతాణి/సురథాణి ప్రభువు <హింది సుల్తాన్ ప సుల్తాన్

"ఢిల్లీ సురతాణివారు ఢాకోజీ పంత్తులున్ను" 49 17

"వీరగండ్డి ప్రతాపరుద్రుండ్డు మనుష శక్తిగాదు రుద్రాంశ త్రిశూల డమరులతో దట్టు వుంన్నాడు అటువంట్టి రాజును నీవు పట్టుక రావచ్చునా అని అన్నండ్దులకు సురధాణినవ్వి" 46 6

**అరబిక్ పదాలు**

అహముదా నగరం స్థల నామం (<అ అహ్మద్ సం నగరమ్

"యెదులశాహు అనే ఆయన విజయాపురమున్ను నిజాంశాహు అనే ఆయన అహముదా నగరమున్ను కుతుపనమలక అనే ఆయన గోలకొండ్డా నున్ను యీ మూడు సంస్థానాలున్ను యేలుతావుండ్దురు" 47 2

"గోలకొండవారి గోపోజీ పంతులున్ను అహముదానగరం పయ ప రాజున్ను విజయాపురం వీరమ రాజున్ను" 49 19

తాకీతు ఆజ్ఞ < అ తాకీద్

"గజపతివారి తెగ సుబుద్ధి మొదలయిన నియ్యోగులు యెవరువచ్చినా యేకాంతమని చెప్పి లోనికి రానియ్యక తిరుగా వెలివెళ్ళ పోనియ్యక నిలువక వుండ్డమని తాకీతుగా పలకరించ్చి" 72 4

దాదిమహలు నాయస్థాన భవనం < ప దాద్ అ మహల్

"దాదిమహలు ముందుగా ముందర దివాణంలో ముందర ఆయా పజీర్లు" 32 21

మొదటి దొర మితపరిజనములతో మహలుమీద కొలువై యుండ్డి కొలువు దీరి" 39 12

కబాయి/కబ్బాయి వస్త్రవిశేషం <అ ఖబా

గజపతివారి యెవ్వరికి త్యాగమిచ్చినా యేనుగ గుర్రం తాళ చౌకట్లు దట్టీ కుళ్లాఇ కబాయి పక్కలాకులు యిచ్చేదింత్తేగాని యీ దేశం వలె వుడుగరలు పక్కలాకులు మాత్రం యిచ్చేఅంపేదిలేదు" (55 26

"ముక్కుతింమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదనగారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతులండ్దుకోవలెనని కవితా నాయకులతో పలుకరించ్చి

ఆ తీరున అయ్యాని అనంగా కుళ్ళాయి కబ్బాయి తాశి చౌకట్లు చేసరి పేరులు కోకతాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను మనుచరిత్రాను చెప్పమని అన తిచ్చినారు " 80 6

నగరా/నగారా యుద్ధభేరి అ నఖార

"రౌతులకు మావుత్తులకు అమరనాయకంవార్లను అళ్లుండ్లు కొమాళ కు రాజాలకు జట్లకు కంమ్మనాయకులకు అందరికిన్ని వయనం జెప్పి రంమ్మని కటికాలవారికి వుత్తరవు యిచ్చి తాముంన్ను భోజనం జేసుకొని మూడో నగరా టోకించమని" 58 10

"మూడు తెగల తురకల యేనుగ గుర్రాలున్ను నగర కట్టిపెట్టమనింన్ని గుడారాలు నిశానులు నగారా మొదలైనది మొదట జగడాన దొరి ంద్ది గనక అదంత్రా నగర కట్టమని" 61 16

"కాబట్టి రాయలవారు రవుతు రాణువదొర మన్నీలకు అందరికిన్నీ వయనం చెప్పించి భేరి ధమామి కాహళాల వారిని రప్పించి నగారా కూచి శేయించ్చమని" 62 18

నదురు కానుక అ నజర్

ఇక్కడ జ > దగా మారింది

"రాయలవారి భేటి శేసుకొని కానుక నదురుదెచ్చి అపరిమితముగా పాద ముల సమర్పించ్చి భయబుద్ధి గలిగి" 76 16

నిజాంశాహు ఒకానొక మహమ్మదీయ ప్రభువు (వ్యక్తిపేరు (< అ నిజామ్ మ శహ < ప షాహ్

"నిజాం రవుతులు మావుత్తులు లశి రీ తనాన సరిగదా" 33 9

"అవనికి అధిపతులు లేకుండగ యెదులశాహు కుతుపనములక నిజాం శాహు అనే పేరు గలిగి వుంన్నది" 40 11

ముఖాము(లు) స్థానాపతి <అ మొఖామ్

"యిప్పుడు కర్నాటక సింహాసనానకు కృష్ణరాయలవారిని అధిష్టాన కర్తల జేశిన దారఖ్యం తురకల మీద కార్యంజేశే ఆలోచన అక్కడవుండే ముఖాములు కాకితములు అంప్పనారు " (41 12

ముస్తీదు సిద్ధం ( ead ne <అ ముస్తయిద్

"యివ్వుడు కైజితము యేనుగు గుర్రము బంటు బయదలు సహితముగా గట్టి అముస్తీదు తోడట్టు పట్ట ప్రవేశం గావలెనని ఆనతిచ్చి నారు " 28 23

సలాము నమస్కారం <అ సలామ్

"అయా దాఖీల వారు సలాము శేయంగా మొదటిదొర మితవరి జనము లతో మహలు మీద కొలువైయుండి కొలువుదీరి సగుకి పొయే టప్పుడు" 39 11

యెదులశాహు/యదులశాహు వ్యక్తిపేరు <అ అదిల్ వ షా హ్) చక్రవర్తి

"బెదదకోట బరుదు అనే ఆయన కొంత్త రాజ మున్ను కొంత్త దుర్గా లున్ను అక్రమించుక బలవంతుండై రాజ ం శేస్తా వుండ్డును ఆయన వద్ద గింద్ది బెట్టుకవుండగా అతగానికి యెదులశాహు అనే పేరు వచ్చెను " 46 21

"విజయాపురం అహముదానగరం గోలకొండవాుు యిక్కడ వుండే వారి స్థానాపతులు "దిచిన ప్రవర్తమానములకు వ్రాశి అంప్పిన కార్యానికి యాది హెచ్చరికలు కలిగి యింత అలోచన జేశి యదుల శాహుకున్ను తెలిప ఆయనాను సడదు స్థలాలకు రస్తు సామ్మగీలు అంప్పించినారు గనక వారి యాది హెచ్చరికలున్ను ‿లిమి బలుములకున్ను సరివున్నదా అని" 35 21

బరీదు / బరుదు మహమ్మదీయులలో ఒక తెగకు చెందినవాడు అ బరీద్

బెదదకోట బరీదువారు వీరల దొరతనములనంగా నూరేండ్లదనిన్ని" 47 4

బెదద ోట బరుదు అనే ఆయన కొంత్త రాజ్యమున్ను కొంత్త దుర్గా లున్ను అక్రమించుక బలవంతుండై రాజ్యం శేస్తావుండును" 46 19

శిఖా ముద్ర ›ea అ శిఖా

కోటలోనికి పొయే టప్పుడు యెరుకగలవారు వచ్చి వీరు తమ వారున్ని వీరినుండి ఎక తార ములు వస్తే మేమే నేడుస్తుంమునిన్ని తరవస ముగా చెప్పిన తర్వాత శిఖామీద శిఖావేసి కోటలోపలికి అంపుదురు" 38 15

"కోటలోవుండే దినాలెల్లా తిరిగి తమ శివకు వచ్చేటప్పుడు మొదటి పారుబత్యగానితో యెరుకజేసి పారుబత్యగాని శిఖా చేతికిచ్చి శిఖా వేయించు కొని" 38 19

వజీర్లు యోధులు మంత్రులు అని నైఘంటికార్థాలు సూ రా ని < అ వజీర్

దాది మహలు ముందుగా ముందర దివాణంలో ముందర ఆయా వజీర్లు దొరలు దొండో పండితులు మొదలయినవారు 32 22

పర్షియన్ పదాలు

కస్తి కష్టం శ్రమ వ ఖస్త్ < సఖ్త్

"విద్యారణ్యులు జూచి చాల కస్తిబడి శిష్యులు జేసిన దోషమువల్ల" 10 26

కాకితము / కాగితము ఇది పత్రం / జాబు అనే అర్థంలో వాడ బడింది (వ కాఘజ్ కాగితం

అన్ని వివరాలకు విజయనగరాన నుండిన్ని కా తములు వ్రాశి వచ్చెను" 33 4

"నియ్యోగులు ఓక్కు లనుండ్డి వచ్చిన కమ్మ కాగితములు చదివించ్చక" 39 22

కన్నా కాటకంవారు దళము కూర్చుకొని స్థళము తర్లి సరుదులకు వచ్చే వారై వక్క ప్రదేశాన దిగినారని కమ్మకాగితములువస్తే యప్పుడు" 41 21

కుతుపన మలక వ్యక్తిపేరు < వ కుతుబ్‌ముల్క్

"వారివద్ద కుతుపనమలక వారి హేజీబులు ముకుంద పండితులు మొద లయినవారు కూర్చుండి ఆలోచన జేసినది" 32 33

"కుతుపనమలకవారున్ను విజయనగరాన నుండి కాకితములు వ్రాసి వచ్చినది విని" 34 25

కుర్నిసు(లు) సాష్టాంగ నమస్కారం (< వ కోర్నిష్

"గోలకొండ్ధ విజయాపురం అహముదా నగరం యేలే ముగ్గురు దునే దార్లున్ను విని యిఖను మనం రాయల దేవునితో యెదిరించ్చి కత్తి కట్టేది

కార్యం కాదు అని యోచన చేసి భేటి శేసుకోవలెనని నిశ్చయించి అంద్దుకు అయిన సంవిధాన పురస్సరముగా వచ్చి నిలిచి సవినయంబ్బుగా కుర్నీసులు శేశి రాయలవారి భేటి శేసుకొని" 76 16

కుళా యి/కుళ్లాఇ వస్త్రంతో చేసిన టోపి < వ కులాహ్

పూర్వకాలంలో అసాధార ణ వ క్తులకు రాజులు బహుమతులను ఇచ్చే వారు అలాగే ఒక కార ం చేపట్టడానికి ముందు ఆ కార్యం చేయవలసిన వ క్తులకు తాశి చౌకట్లు డట్టీ కుళ్లాయి కబాయి వక్కలాకులు ఇచ్చే సంప్రదాయముండేది దీన్ని రా వా లో అనేకచోట్ల చూడవచ్చు నేటికీ శుభ కార వివాహ నిశ్చయానికి తాంబూలాలు స్వీకరించే ఆచారం నిలిచి ఉంది

"అదిగాక గజపతివారి యెవ్వరికి తా గమిచ్చినా యేనుగ గుఱ్ఱం తా చౌకట్లు దట్టీ కుళ్లాఇ కబాయి వక్కలాకులు యిచ్చేదింత్తేగాని 55 26

"కవీశ్వరులతో కృతులందుకోవలెనని కవితానాయకులతో పలుకరించ్చి ఆ తీరున అయీ ని అనంగా కుళా యి కబ్బాయి తాశి చౌకట్లు చేసరి పేరులు కోకతాకలు యిచ్చి" 80 6

కూచి దండువెడలు < వ కూచ్ ముందుకు సాగు march

"రాయలవారు రవుతు రాణువ దొరవన్నిలకు అంద్దరికిన్నీ వయనం చెప్పించి భేటి ధమామి కాహళాలవారిని రప్పించి నగారా కూచి శేయించ్చమని వారలా భేరిపూజ సేయించ్చి" 62 18

గారు ఇది నేటి తెలుగులో గౌరవవాచక ప్రత్యయంగా స్థిరపడింది ఇది వ గార్ నుండి పరిణమించింది పర్షియన్ భాషలో దీనికి చేసేవాడు doer / కర్త agen అని అర్థం

సురధాణి తల్లిగారు 46 1 అయ్యంగార్లు 2 18

పాళ్యగార్లు 4 12 జియ్యంగార్లు 4 13

చబుకు కొరడా చల్లకోల wh p < వ చాబుక్

"పఖ గుఱ్ఱం పాత్రునికి బహుమానం లేక వుండగా గోదావరి గెట్టున పఖ కాలువ రెండు మనిషి నిలువున అరువైనాలుగు అడుగుల వెడల్పున అడ్డమై వుండగా తన గుఱ్ఱాంన్ని చబుకునవేశి కాలువ దాటించ్చగా" (54 25

జవురుజంపు (లు)  ఆయుధ విశేషం  < ప జపర్‌జంగ్

"వాకిటి పారుపత్యగార్లు యెనిమిది దినాలనుండిన్ని ఓరంగి జవురు జంగులు గుంట్లు కోవులు దంతెనరాళ్ళు యెత్తురాళు గళికల పులితలలు కోట వెలుపట గుర్రాలు జొచ్చి రాకండా గుర్రపు నిలుపురాళు వేయించేదిన్ని" 35 8

జీరాసంజ్జోగం  కవచం ధరించినది  < ప జిరహ్

"దెరిజా వద్ద జీరాసంజ్జోగంతో విత్సుకత్తుల రౌతులు అరవై వేలున్ను వారిని చుట్టుక నిండు సంజ్జోకం గుర్రాలు పదివేలకన్ను వార్లకాను అనుభ వించ్చుక యుండ్డె 60 3

దివాణం  రాజభవనం  < క దివాణ < ప దివాన్

"దాదిమహలు ముందుగా ముందర దివాణంలో ముందర అయా వజీర్లు దొరలు దొండోపండితులు మొదలయినవారు" 32 22

నామజాదు(లు)  అజ్ఞాపత్రం  < ప నామ్జద్

"వాకిటి పారుపత్యమంతా వారినే శేయమని తమ అజ్ఞలో నడుచుక వారి మాటమీద నామజాదులు అంపుతా వారు తీశివచ్చేటట్టు యేర్పాటు చేసి" 36 19

"విజయాపురం అహముదానగరం గోలకొండ్లమీద కార ంశేయమని మూడులక్షల గుర్రాలున్ను వెయి యేనుగులున్ను కొంత్ర పాయదళమున్ను నామజాదులు జేశినారు" 39 2o

తమ తమ సరదులపుండ్డెవార్లకాను కనిపించ్చుకొమ్మని నామజాదులు అప్పంతే" 40 8

"గడి స్థలాలకు బలవంతముగా వుండేటట్టుగా ఠాణ ములకు నామ జాదులు అంపించ్చి" 41 16

నిశాను(లు)  చిహ్నం గుర్తు  < హిం నిశాని< ప నిశాన్

"మూడు తెగల తురకల యేనుగ గుర్రాలున్ను నగరకట్టి పెట్టమనిన్ని గఢారాలు నిశానులు నగారా మొదలైనది మొదట జగడాన దొరికింద్ది గనక అదంత్తా నగరకట్టమని అప్పాజి మొదలయిన నియోగులతోనున్ను" (61 16

పక్కీరు సాధువు < ప పకీర్ ఇది నేడు దివాళాకోరు ధనహీనుడు అన్న అర్థంలో స్థిరపడింది

కృష్ణరాయలవారు తురకాణంమీద దళమెత్తి వచ్చి అని మొనల కార్యం పూని నడిపించే యడల జయాపజయములు యెవరికని దైవజ్ఞులయిన బ్రాంహ్మలనున్ను ముల్లా శాస్త్రప్రవీణులయిన వ్కీరులనున్ను భూత భవిష్య ద్వర్తమానములు తెలిసిన శకునజ్ఞులనున్ను పిలుపించ్చి అడుగగా" 42 2

"నగరువెడలి వ్కీరులతో కూడా పట్టము వెళి వచ్చి" 42 15

ఇది ఇంటిపేరు u name గా కూడా స్థిరపడినట్లు కనిపిస్తుంది

"అహముదానగరం గోలకొండ్లలో కన్న విన్నవార్తలు వేగుల అరవ రాముడున్ను వ క్రీరి గోపాళి యిద్దరు తెలియ విన్నవము శేయగా" 42 19

ఫరంగి/పిరంగ్గి శతఘ్ని < ప ఫరంగీ

"యెనిమిది దినాలనుండి ఫరంగి జపురుజంగులు 35 8

"బెల్లం కొండ్లకై నడవగా వారు ఎరంగ్గినాదం విని బెల్లంకొండ్లవారు పారిపోయిరి" 64 9

బయద బంటు < ప పా దా

ఇది బంటు < సం భట అనే పదాన్ని పూర్వపదంగా గ్రహించి జంటపదంగా ప్రయోగింపబడుతుంది ఈ జంట పదానికి అర్థం ఒక్కటే ఇలాంటి ఏకార్థబోధక జంట పదాలు రా వా లో ఎక్కువగా ఉన్నాయి చూడు అర్థ విభాగం

లెఖ్క కమానికి శిమలుకొని యేనుగు గుర్రములు బంటు బయదలు ఆ బర్దలికి కొలువక వున్నారు" 25 8

రాయలవారు కరణాలతోను అమరనాయకానకు నగరికవలె కావలి ప్రకారానకు యేనుగు గుర్రం బంటు బయదలకు వివరముగా లెఖ్క వ్రాసి తెమ్మని" 25 11

యివ్పుడు కైజీతము యేనుగు గుర్రము బంటు బయదలు సహితముగా గట్టి 28 23

భరవసము నమ్మకం < హిం భరవసా < ప భరోసహ్

కోటలోని పొయే టప్పుడు యెరుక గలవారు వచ్చి పీరు తమ వార నిన్ని వీటినుండి వక కార ములు వస్తే మేమే నేరస్తులమనిన్ని ఖరవసముగా చెప్పిన తర్వాత 38 14

మాస్తి మత్తు n ox cat on మదం Pr de < ప మాస్త్

రాణులవారు బంగారు చౌడోలు ముస్తవు అయిన మాస్తీమదహస్తి యనే యేనుగను ఎక్కుకొని 30 11

మొగలాయి 6 మొగల్ సంబంధమైనది < ప మొఘల్

మొఘల్ అనే పదం తెలుగులో ప్రవేశించినపుడు అల్పప్రాణత్వం ఘ>గ పొంది చివర ఆ యి అనేది నామ ప్రత యంలాగా చేర్చబడి మొగలాయి అని ప్రయోగింపబడుతుంది

అంతలో ఆ మొగలాయి గుర్రాలు ఆ మట్టున నిలువక వెంబడించుక రాంగా 53 17

మోర్చావేయు వ్యూహరచనవేయు <ప మోర్చా

"సాధించ్చిన స్థలములకు ఠాణ ము వుంచ్చి గోలకొండ్డవారి సరదు స్థలాలకై నడవంగా అక్కడ మూడు తెగల రౌతులున్ను యెదిరించ్చి యేరు దాటివచ్చి మోర్చావేశి పాళ్ళము దిగినాడు" 58 23

యాదిహెచ్చరిక(లు) జాగరూకత <ప యాద్ జ్ఞాపకం క ఎచ్చరికె జాగ్రత్త

ఇది రా వా లో సర్వత్ర జంటపదంగానే ప్రయుక్తమైంది

"విదా నగర పట్టణములోనున్ను వెలిపాళ ముల యందున్ను యాది హెచ్చరికలు గలిగి రాత్రి పగళ్ళు తలార్లు జతనమై జాగ్రత్తగా కాస్తా వున్నారు" 3 23

---

16 The e m Muga s a orm o he name Mongo he race ha nvaded nd a er he Campa gn o Cheng z Khan" Thu on Edgar Ca e and r bes o Sou h nd a Vo 4 1909 P 282

"నిజాం శాహువారున్ను కుతుపనమలక వారున్ను విజయనగరాననుండి కాకితములు వ్రాసి వచ్చినది విని ఆలోచన పరులై యిక్కడికి కాకితములు అంప్పి తమ తమ సరుదుస్థలములు పదిలపరుచుకొని యాదిహెచ్చరికలతో వున్నారు " 34 21

రస్తుసామగ్రి(లు) వస్తు సంబారం <ప రసద్ సం సామగ్రి

ఇది కూడా జంటపదంగానే ప్రయుక్తమవుతుంది

"సరుదు దుర్గాలకు రస్తు సామగ్రీలు వేయించి బలవంతముగా యేనుగ గుర్రాలు కాల్బలములు వుంచ్చవలెను" 34 16

లశికిరీ సైనిక స్థావరం < హిం లష్కర్ < ప లష్కర్

"నిజాం రవుతులు మావుత్తులు లశికిరీ తనాన సరిగదా ద్రవ్యసామాగ్రి యందు దుర్గములయందు కొదవ" 33 9

సరదు పొలిమేర < ప సర్‌హద్

తమతమ సరుదు స్థలములు పదిలపరుచుకొని యాది హెచ్చరికలతో వున్నారు" 34 27

"మన రెండు తెగలవారున్ను శీమ సరుదులువున్న దుర్గాములు కోట స్థలములకు అంప్పతగిన వార్తాను అంప్పించి" 41 18

హజారము ఆస్థానం కొలువు కూటం < ప హజ్రా

రాయలదేవునివారు కొలువుదీరి నగరి లోపలికి పోయిన క్షణమే హజారమువద్ద కాచివుండి" 22 22

"గనక వారలతోను యికను యెవరువచ్చి అడిగినాగాని రాయలవారు శిరోభారమై ఇంకా పుష్పోదయం కాయలేదు అనిచెప్పేటట్టు యనిమిచి హజారముఖానకు వచ్చి కూర్చుండి" 26 9

హురుమంజి పారసీక దేశంలో ముఖ్యమైన రేవుపట్టణం (< ప హూర్మజ్ ఇది మంచి ముత్యాల ఎగుమతికి చాల ప్రసిద్ధి చెందిన జలసంధి

"హురుమంజి ముత్యాల వచ్చసరం ఇంద్రనీల మకుటం " 72 20

ఇక్కడ హురుమంజి అనే దేశానికి సంబంధించిన ముత్యాల వచ్చ సరం అని అర్థం

హేజీబు దౌత వ వహర్త < వ హాజిబ్

"దాదిమహలు ముందుగా ముందర దివాణంలో ముందర ఆయా వజీర్లు దొరలు దొండో పండితుఌ మొదలయినవారు నియ్యోగులు వారివద్ద కుతువనములకవారి హేజీబులు ముకుంద పండితులు మొదలయినవారు కూర్చుండి ఆలోచన జేశినది" 32 24

అన దేశా లు తెలుగులోనికి వచ్చినపుడు స్వభాషా నిర్మాణాని కనుగుణంగా అనేక ధ్వని పరిణామాలను పొందుతాయి వాటిని ఈ క్రింద చూడవచ్చు

**అజంతత** తెలుగు అజంతమైన భాష కాబట్టి హలంతాలైన అన్యదేశ్య పదాలు అజంతాలుగా మారి తెలుగులో ప్రవేశించాయి

ఉదా కర్తారు <హిం కర్తార్
చబుకు <ప చాబుక్
తాకీతు <అ తాకీద్
మహలు <అ మహల్
రోజు <హిం రోజ్
వజీరు <అ వజీర్

దీర్ఘం హ్రస్వం కావడం
బయద <ప ప్యాదా
రూపాయి <హిం రుపయా
దావిడి <మ దావడి

ద్విరుక్తత
పక్కీరు <ప ఫకీర్
కుళ్లాయి <ప కులాహ్
రొక్కం <అ రఖమ్

**వర్ణాధిక్యత** అన్యదేశ్యపదాల్లో కొన్ని తెలుగులో ప్రవేశించినపుడు వర్ణాధిక్యతను పొందుతాయి

కబాయి<అ ఖబా
మొగలాయి<ప మొఘల్

లోపదీర్ఘత  ఒక వర్ణం లోపించగా ఏర్పడిన లోటును పూరించడానికి ముందున్న వర్ణం దీర్ఘం కావడం ఉదా జరా<ప జిరహ్

వర్ణచ్యుతి  ఉచ్చారణ సౌలభ్యం కోసం కొన్ని వర్ణాలు లోపిస్తాయి

సరుదు<ప సర్హద్

దునేదారు<హిం దునియాదార్

వర్ణవ్యత్యయం  కొన్ని పదాల్లో వర్ణాలు పరస్పరం స్థానాల్ని మార్చుకొంటాయి

కస్తి<ప ఖస్త్<సఖ్త్

స్వరభక్తి  కొన్ని పదాల్లో సంయుక్తహల్లుల మధ్య అచ్చుచేరి రెండు హల్లుల్ని విభక్తం చేస్తుంది

లశ్కరి<ప లష్కర్

పియద<ప ప్యాదా

హారుమంజి<ప హార్మజ్

తురక<ప తుర్క్

హజారము<ప హ్జారా

మహాప్రాణం అల్పప్రాణంగా మారడం

కస్తి<ప ఖస్త్

ఠాణము<మ ఠాణా

నగారా<అ నఖార

జగడము<హిం ఝగడా<సం ఝకట

కబాయి > అ ఖబా

కాగితము < ప కాఘజ్

మూర్ధన్యీకరణం  కొన్ని పదాల్లో దంతమూలీయ ధ్వనులు మూర్ధన్యాలుగా మారుతాయి

సురధాణి < హిం సుల్తాన్ < ప సుల్తాన్

దివాణము < క దివాణ < ప దివాన్

ఇంకా కొన్ని ధ్వనుల్లో ఈ క్రింది మార్పులు గోచరిస్తాయి

అచ్చులు ఏ < ఆ హేజీబు < ప హాజిబ్
ఒ < అ రొఖ్ఖము < అ రఖమ్
అ < ఉ హజారము < ప హజ్రా
ఉ < ఒ / ఒ ముఖాములు < ప మొఖామ్
కుర్నీసులు < ప కోర్నిష్
హల్లులు ద < జ నదురు < అ నజర్
ళ < ల కుళాయి < ప కులాహ్
ప < ఫ పక్కీరు < ప ఫ ర్
ఫరంగి / < ప ఫరంగీ
పరంగి
శ < ష లశ్కరి < ప లష్కర్
స < ష కుర్నీసులు < ప కోర్నిష్
ద < హ సరదు / < ప సర్హద్
సరుదు

## సర్వనామాలు

వాక్యంలో నామవాచకాల పునరుక్తిని పరిహరించడాని నామవాచకాలకు బదులుగా ప్రయోగించబడే పదాలు సర్వనామాలు నామవాచకాలకు లాగానే వీటికి లింగ వచన విభక్తులు చేరుతాయి

సర్వనామాలను నాలుగు విధాలుగా వింగడించవచ్చు

1 పురుషవాచక సర్వనామాలు Pe ona p onoun
2 ఆత్మార్థక సర్వనామాలు Re ex ve pronoun
3 నిర్దేశాత్మక సర్వనామాలు Demon a ve pronoun
4 ప్రశ్నార్థక సర్వనామాలు n e rog ve pronoun

ఉత్తమ మధ్యమ పురుష సర్వనామాల్లోనూ ఆత్మార్థక సర్వనామాల్లోనూ ఏకవచన బహువచన భేదముంది కాని లింగ భేదముండదు నిర్దేశాత్మక ప్రశ్నార్థక సర్వనామాల్లో లింగ భేదమూ వచన భేదమూ ఉంటాయి సర్వనామాల ద్వితీయాది విభక్త్యంగ రూపాలు ఇతర నామవాచకాల విభక్త్యంగ రూపాలకంటె భిన్నంగా ఉంటాయి

పురుషవాచక సర్వనామలు

| | ఏకవచనం | బహువచనం |
|---|---|---|
| ఉత్తమ పురుష | నేను | మేము Exc u ve |
| | | మనము nc u ve |
| ద్వితీయావిభక్తిరూపం | నన్ను | మమ్ము |
| తృతీయాది విభక ంగం | నా | మా/మన |
| మధ్యమ పురుష | నీవు | మీరు |
| ద్వితీయావిభక్తిరూపం | నిన్ను | మిమ్ము |
| తృఠయాది విభక్త ంగం | నీ | మీ |

నే ను మే ము నీ వు మీ రు అనే సర్వనామాల ప్రథమా విభక్తిలో అంత్యవర్ణాలు లోపించి పరిణతి పొందగా నా మా నీ మీ అనే తృతీయాది విభక్త్యంగ రూపాలేర్పడుతాయి

తెలుగుభాషలో నకారం ద్రుతం కాబట్టి అది లోపించినా అర్థభంగం కలుగదు కాబట్టి ఉత్తమ పురుష ఏకవచనంలో ను వర్ణం లోపించిన రూపాలు కూడా కనిపిస్తాయి

"నే జెప్పినట్టు నడిపిస్తిరాయనా నాయభీష్ట కార్యములున్ను నెరవేరును" 6 17

తెలుగులో ఉత్తమపురుష బహువచనంలో రెండు రూపాలున్నాయి

మేము వ్రిశ్రోతృకం Exc u ve

మనము సశ్రోతృకం nc u ve

మేము నీ వెంబడిగా వస్తా వున్నారమని అనతిచ్చిపంపగా" 9 1

"ఉదయ న్నే మేమున్ను అయ త్తపడి వస్తున్నారము" 68 20

మనం కోటలో నిలిచి ఉన్నట్టయితే చేపట్టుగా పట్టుకబోదురు" 64 18

మనమున్ను ఇక్కడను కనిపించ్చుకొంటే" 67 8

మధ్యమ పురుష సర్వనామాలు

నీవు మమ్మ తిరిగి జూడక పొమ్ము" 8 26

"నీవు నన్నడుగ కారణమేమి? 19 13

మీరు అక్కడ యెన్నాళు వాసముగా వుందురో అన్నాళు న్ను" 8 18

"మీరు శాశ్వతముగవుండేటట్టు అనతీయవలెనని ప్రార్థన శేయంగా" 8 23

రా వా భాషలో పురుషవాచక సర్వనామ ప్రయోగాల్లో ఈ క్రింది విలక్షణరూపాలు కనిఎస్తాయి

ఉత్తమ పురుష బ వ ద్వితీయావిభక్తి రూపం మమ్ము ఇది ఏ వ లో పూజార్థంలో కూడా వస్తుంది రా వా లో ద్వితీయా విభక్తి రూపంపై మరలా న అనే ప్రత్యయం చేరుతుంది

"యిప్పుడు మమ్మున రాజ పరభారకం వహించమన్నారు" 12 19

ఉత్తమ పురుష బ వ తృతీయా విభక్త్యంగ రూపం మా రా వా లో పంచమీ విభక్తి ప్రత్యయం నుంచి వచ్చినపుడు ద్వితీయా విభక్త్యంగ రూపమే తృతీయా విభక్త్యంగ రూపంగా ప్రయోగింపబడుతుంది

మమ్మునుంచి నీకు అయే ప్రయోజనమున్ను శ్రేయసున్ను పరామ ంచక వున్నట్టయితే హానికద్దా 19 16

అలాగే మధ్యమపురుషలోను ఇలాంటి రూపాలు కనిఎస్తాయి

"నిమ్నుంచి కర్నాటకాన పఖ నగరం కానున్నది 7 18

"నిమ్నుంచి అయే ప్రయోజనము లేమియున్నది" (19 13

"యీ బహుమానం మీది గనక మిమ్మున మండ్లి మానుషములున్ను ముందరికి కంమ్మకులం వారిం బ్రతుకలున్ను" 59 22

| ఆత్మార్థక సర్వనామాలు | ఏ వ | బ వ |
|---|---|---|
| ప్రథమా విభక్తి | తాను | తాము |
| | | తమరు |
| ద్వితీయా విభక్తి | తన్ను | |
| తృతీయాది విభక్త్యంగం | తన | తమ |

రా వా లో ప్రత్యక్ష సంభాషణలో అనేక చోట్ల నేను కి తాను మేము కి తాము అనే ఆత్మార్థక సర్వనామాలు ప్రయుక్తమవుతున్నాయి

(పరీక్షిత్తు తాను అర్జున పౌత్రుడు అభిమన్యు పుత్రుండు పరీక్షిత్తుండనువాడను అభిదానం చెప్పగా అప్పుడు కామధేనువు తాను ధర్మ దేవతను అని తన నిజ స్వరూపము కనిపించి 19 23 24

"విదా రణ్య లు శింగిరి భట్లకొ తాము ఎదా నగరానకు వచ్చి అందుండి రాయలకు అహర్నిశమున్ను తాము ఆ ర్వాదము జేసుక ఉంచవలెను 8 12

విదా రణ్య లు తాము కాశిం బోయిన పూర్వోత్తరములున్ను వేద వ్యాసులు ఆనతిచ్చిన వృత్తాంతములున్ను శింగిరి భట్లకు దెలుపంగా" 8 1

"కృష్ణరాయలవారు తాము పెద్దలమైతిమి తమ మరా దాగా రాజ పరి పాలనం జేశేటందులకు పట్టాభిషేకం అధిష్ఠాన కర్తలు శేయమని మంచివేళ జూచి ముద్దుటుంగర మిచ్చినారు 11 9

ఇంకా నిన్ను అన్న అర్థంలో తన్ను వాడబడింది

"కలిదోషంబు తన్ను బొరయకుండా నీవు రాజ్యము చేసేదినాయున్ను నాలుగు పాదముల తోడట్టు సంచరించేటందుకు ధర్మం పరిపాలనం శేయ వలెను " (20 2

**నిర్దేశాత్మక సర్వనామాలు**

ఇవి నిర్దేశ సర్వనామ ప్రాతిపదికలకు లింగ వచన ప్రత్యయాలు చేరడంవల్ల ఏర్పడుతాయి

ఇవి రెండు విధాలు

1 అ /ఆ దూరవర్తి ( emo e 2 ఇ /ఈ సమీపవర్తి P ox ma e

| | | |
|---|---|---|
| మహద్వాచకాలు | ఏవ | బవ |
| సమీపవర్తి | ఈతండు | వీరు / వీరలు |
| ద్వితీయాది విభక్త్యంగ రూపం | — | వీరల |
| దూరవర్తి పూజ్యార్థంలో | ఆయన | వారు / వారలు |
| | అతగాడు | వార్లు / వాళ్లూ |
| | వాడు/వాండు | వాండ్లు |
| ద్వితీయాది విభక్త్యంగ రూపం | వాడి / వాని | వార్ల / వారల / వాళ్లూ |

రా వా భాషలో నిర్దేశ మహద్వాచక సర్వనామాలు ఈ క్రింది విధంగా ఏర్పడుతాయి

సమీపవర్తి ఈ అనే నిర్దేశ ప్రాతిపదికకు ండు అనే పురుష బోధక ప్రత్యయానికి ముందు త వర్ణం చేరడంవల్ల ఈతండు అనే సమీపవర్తి ఏకవచన నిర్దేశ మహద్వాచక సర్వనామ రూపం ఏర్పడుతుంది

యీతండు మా స్వరూపం తెలిసినది యెట్టు అని జ్ఞానదృష్టిని జూచి" 7 13

దూరవర్తి ఆ అనే నిర్దేశ ప్రాతిపదికకు అన < అన్న ప్రత్యయం చేరడంవల్ల ఆయన అనే దూరవర్తి ఏకవచన నిర్దేశ మహద్వాచక సర్వనామ రూపం ఏర్పడుతుంది

ధర్మాసనం ధర్మయను ఎలువనంపగా ఆయన వచ్చి నిలిచి 3 8

రా వా లో వాండు వాండ్లు అనే ప్రాచీన రూపాలు కూడా కనిపిస్తాయి

జ్ఞానదృష్టిని జూచి జంగము వాండు శంఖనాదం చేసినట్టుగా దెలిసి 10 25

"నాలుగు అయిదు తాళాలు వకటిగా మెలిపెట్టివేస్తే కరణల వాండ్లు వాటిని విడిపించ్చలేక 55 20

"గ్రీష్మకాలాన దగదవ్వులకు తాళి వాండ్లు నిలువలేరు 59 15

ద్వితీయా విభక్తిలో వాడు రూపంపై ని ప్రత్యయం చేరగా ఏర్పడిన వాడిని అనే ఆధునిక రూపం కూడా రా వా లో కనిపిస్తుంది ఇది ఆధునికభాషా ప్రారంభదశకు సూచకం

"తొమ్మిది పద్దెల గోతాం మానిసి చెయెత్తు పొడుగు వాడిని యెత్తే దిన్ని" 55 7

వీరు వారు అనేవి బహువచనాలైనప్పటికీ వాటిం మరలా పూజార్థంలో లు అనే బహువచన ప్రత్యయం చేరుతుంది అప్పుడు తుది ఉకారం అకారంగా మారుతుంది కొన్నిచోట్ల లోపిస్తుంది

"వీరలకు దొరతనం వచ్చేదేరీతు అని అడిగినందులకు (45 20

పీరల దొరతనములనంగా నూరేండ్లదనిం్ని" (47 4

"అమరనాయకం వారలు అంద్దరున్ను ఆ తీరున్నె అవునని విన్నవం శేశినారు" 47 25

"అమరనాయకం వారలలో పెంమ్మసాని రామలింగమనాయణ్ణి బిలిచి" 59 8

"కనుక అవి మొదలు సమమైన వార్లున్ను భయస్థులై" 21 22

"యిదిగాక వాలుఖా నీతి ప్రబంధములు చదివివుంద్దురు" (43 25

నన్నయాది ప్రాచీన కవుల్లోను ఈ రూపాలు కనిపిస్తాయి ఆధునిక భాషలో వారలు పీరలు వంటి రూపాలు లోపించిపోయాయి

మహతీవాచకం అయమ్మ

"శంకచక్రగదాయుధములతో లక్ష్మీసమేతుడై శ్రీవత్స కౌస్తుభము తోడట్టు ఒష్టు స్వరూపమై కనుపట్టెగాబట్టి ఆయమ్మ జూచి" 46 11

| | | |
|---|---|---|
| మహతీతరామహద్వాచకాలు | ఏ వ | బ వ |
| సమీపవర్తి | ఇది | ఇవి |
| దూరవర్తి | అది | అవి |
| ద్వితీయాది విభక్త్యంగం | | వాటి |

రా వా లో మహతీతర అమహద్వాచక ఆధునిక ద్వితీయా విభక్త్యంగ రూపం వాటిని అన్నది ఈ ప్రయోగంలో కనిపిస్తుంది

"నాలుగు అయిదు తాళాలు వకటిగా మెలిపెట్టి వేస్తే కరమలవాండ్లు వాటిని విడిపించ్చలేక సమ్మెటతో గట్టి విడిపించి చక్కగా కొట్టి " 55 20

రా వా లో విభక్త్యంగ రూపాలుగా ఇందు అంపు అనే రూపాలు కనిపిస్తాయి

ఇందు / యిందు ఇందులో 32 4
యిందులలో (33 12
యింద్దుకు (28 21)

| | | | | |
|---|---|---|---|---|
| అందు | అందులకు | 25 15 | అందునుండి | 58 14 |
| | అందున | 33 16 | అందునుంచ్చి | 64 19 |
| | అందునకైన | 34 16 | అంద్దుకు | 74 17) |

ప్రశ్నార్థక సర్వనామాలు

నిర్దేశ సర్వనామాలేర్పడిన విధంగానే ప్రశ్నార్థక సర్వనామాలు కూడా ఏర్పడుతాయి ఇవి ఏ అనే ప్రశ్నార్థక ప్రాతిపదిక నుంచి ఏర్పడుతాయి గౌరవార్థంలోను బహు వచనంలోను పుం స్త్రీ లింగాలకు భేదముండదు అవధారణ Empha లో మనుష వాచకాలకు ద్విత్వం వస్తుంది (ఏ + వారు > ఎవ్వారు > ఎవ్వరు > ఎవరు

"సాదువులైన వార్లను యెవపు బాధజేశికో" 19 12

"తులాపురుషదానానకు యెవ్వరున్ను పూనేవారు లేరు" 6 1

రా వా లో మహతీతరామహద్వాచకంలో ఏ అనే ప్రశ్నార్థక ప్రాతిపదికకు - అది చేరి ప్రశ్నార్థక మహతీతరామహద్వాచక సర్వనామ మేర్పడుతుంది

ఏ + అది > ఏది రా వా లోని ఏంది అనే రూపం నేడు మాండలికంగా నిలిచిఉంది

"తన ధొరతనమేమి అనంగా యేంది తన అంక్క వంక్కలకు యెవరు వచ్చేరు రానివారిని మేము యేమి జెప్పేము" (28 8

"పంచలోహములున్ను అన్నియు సరి అందున బంగారు హెచ్చింది యేంది" 32 7

౦ (౦ ౦

# సంఖ్యావాచకాలు

సంఖ్యా వాచకాలకు విశేష్య విశేషణ రూపాలు రెండూ ఉన్నాయి వీటిలో సంగ్రహ విశేషణ రూపాలే ప్రాచీనం వాటి నుండి ప్రత్యయాదుల చేరికతో విశేష రూపాలు ఏర్పడ్డాయి సంఖ్యావాచకాల్లో లింగభేదం ఉంటుంది

సంఖ్యా వాచకాల్లో ఒకటినుంచి పదిదాకా ఉన్న సంఖ్యా వాచకాలు నూరు వేయి అనేవి మూల రూపాలు తొమ్మిది అన్న రూపం తొల్ పది నుంచి ఏర్పడింది తొల్ + పది > తొన్ + పది > తొమ్మిది ఈ తొమ్మిది రూపసామ్యం చేత ఎనిమిది రూపం ఏర్పడింది సహస్ర లక్ష కోటి అనేవి సంస్కృత పదాలు

ఏ భాషలోనైనా స్వతంత్ర సంఖ్యావాచక మూల రూపాలు పరిమితం గానే ఉంటాయి

సంఖ్యా వాచక పదాలను మూడు రకాలుగా వర్గీకరించవచ్చు

1 అమనుష్య సంఖ్యా వాచక పదాలు

2 మనుష సంఖ్యా వాచక పదాలు

3 పూరణార్థక సంఖ్యా వాచక పదాలు

1 అమనుష్య సంఖ్యా వాచక పదాలు

వీటిలో ప్రాథమిక సంఖ్యావాచక పదాలు నిష్పన్న సంఖ్యావాచక పదాలని రెండుగా వింగడించవచ్చు ఇక్కడ రా వా లోని సంఖ్యావాచక పదాలు అతిదేయాలు

ప్రాథమిక సంఖ్యావాచక పదాలు

| | |
|---|---|
| వొకటి 3 1 /వకటి 64 5 | యెనిమిది 42 6 |
| రెండు 19 5 | తొమ్మిది 11 4 |
| మూడు 19 4 | పది 24 15 |
| నాలుగు 9 4 | నూరు 55 16 |
| అయిదు 55 19 | వెయ్యి 39 26 |
| ఆరు 24 15 | లక్ష 47 8 |
| యేడు 14 5 | కోటి 78 21) |

17 ఇది ఒకటి > వొకటి > వొకటి > వకటిగా మారింది

**నిష్పన్న సంఖ్యావాచక పదాలు**

సంకలనం add on తో గాని గుణకారం mu p ca on తో గాని నిష్పన్న సంఖ్యావాచక పదాలేర్పడుతాయి

సున్న ఉన్న అంకె తర్వాత ఒకటి నుండి తొమ్మిది వరకు గల సంఖ లను కలిపితే సంకలన సంఖ్యావాచకాలు నిష్పన్న మవుతాయి

రెండు మొదలయిన సంఖ లకు పది నూరు వేయి అనే సంఖ్యలు రెండో అవయవిగా ఉండి గుణకారాన్ని పొందితే గుణకార సంఖ్యావాచకాలు నిష్పన్న మవుతాయి

**సంకలనం**

పం(డెండు 24 22 / పం(డెండ్డు 40 21
పన్నెండు (37 8 $10+2$
పదునాలుగు 14 23 $10+4$
పదిహేను 45 23 $10+5$
పదహారు 52 19 / $10+6$
పదారు 73 6 $10+6$
పదునెనిమిది 42 7 ($10+8$
పందొమ్మిది 24 14 $0+9$
యిరువైనాలుగు 24 20 $2\times10+4$
యాభైయారు 24 11 $5\times10+6$
అరువైనాలుగు 42 9 $6\times10+4$)
డబ్బైరెండు 2 16 ($7\times10+2$
యెనభైనాలుగు 24 15 $8\times10+4$
తొంభైతొమ్మిది 24 10 $9\times10+19$
నూటయిరువై 37 10 $100+2\times10$
వెయ్యింన్నూట యిరువై 10 8 $1000+100+2\times10$)
వెయిన్నేనూరు 8 24 22 } ($1000+5\times100$
వెయ్యింనేనూరు 37 4 }

18 సముచ్చయంతో కూడిన వెయిన్ అనేది విశేషణరూపం అలాగే వెయ్యిన్ కూడా వెయ్యి అనేది ఇకారాంతం కాబట్టి ఇక్కడ సముచ్చయ ప్రత్యయం ఉన్ > ఇన్ గా రూపాంతరం చెందుతుంది

రెండువేలుంన్నెనమన్నూరు 64 16 $2\times1000+8\times100$
లక్షాయిరవైవేలు 31 9 $100000+2\times10\times1000$
లక్షాయాభైవేలు (37 4 $100000+5\times10\times1000$

గుణకారం

ఇరవై 24 7 /
యిరువై 31 9 / } ($2\times10$
యిరవై 1 4
ముప్పై 39 4 /
ముప్పై 54 22 / } $3\times10$
ముప్పై 31 10
నలభై 29 11 $4\times10$
యాభై 31 14 /
యాభై 37 4 } $5\times10$
అరువై 115 /
అరవై 60 21 } $6\times10$
డెబ్బై 3 5 /
డెబ్బై 42 7 / } $7\times10$
డబ్బై 2 16
యెనభై 24 15 /
యెనభై 29 12 } $8\times10$
తొంభై 24 10 $9\times10$
మున్నూరు 11 5 $3\times100$
నన్నూరు 53 6 $4\times100$
యేనూరు 53-౦ $5\times100$
అర్నూరు 11 1 $6\times100$)
ఎనమంన్నూరు (64 16 $8\times100$
రెండు వేలు 24 23 $2\times1000$
పం|డెండు వేలు 24 25 $10+2\times1000$
యిరువైనాలుగు వేలు 24 ౘ9 ($2\times10+4\times1000$

ముప్పైవేలు 65 20 3×10×1000
యెనభై వేలు 59 26 8×10×1000
మూడు లక్షలు 37 4 3× 00000
నాలుగు లక్షలు 24 24 4×100000
అయిదు లక్షలు 37 11 5×100000
నాలుగు కోట్లు 24 11 4×10000000
ఆరు కోట్లు 24 12 6× 0000000

ఈ సంకలన గుణకారాంతో నిష్పన్నమైన సంఖ్యా వాచకాల్లో [ింది విలక్షణతలు గోచరిస్తాయి

పదికి విశేషణ రూపాలు ఈ క్రింది విధంగా ఉంటాయి

| | |
|---|---|
| రెండుతో | పండ్ /పన్ |
| నాలుగుతో | పదు |
| ఏనుతో | పది |
| ఆరుతో | పద |
| ఎనిమిదితో | పదున్ |
| తొమ్మిదితో | పం |

పన్ కి రెండు చేరినపుడు ండ్ అనేది సంధ్యక్షరంగా వస్తుంది

పది + రెండు > పం(డెండు (24 25

ఏను ఆరు చేరినపుడు హకారం ఆగమంగా వస్తుంది

పది + ఏను > పదిహేను 45 23 < పదియేను
పది + ఆరు > పదహారు (52 19 < పదియారు
c పయిది > పహిది

సమాసపదంలో ఏను పూర్వపదంగాన ఉత్తర పదంగాను ఉంటుంది

యేమారు 53 6
పదిహేను 45 23

ప్రాథమిక సంఖ్యా వాచకాలపై పదికి ఈ క్రింది రూపాంతరాలు కని పిస్తున్నాయి

| | | |
|---|---|---|
| రెండు, అరు | పై | వై |
| మూడు | పై | ప్పై/ ప్పై/ ఫై |
| నాలుగు, అయిదు, ఎనిమిది, తొమ్మిది | పై | బై / బై |
| ఏడు పై | | బ్బై/ బ్బై |

పదితో కలిసినపుడు ప్రాథమిక సంఖ్యా వాచకాల విశేషణ రూపాలు ఇలా ఉన్నాయి

| | |
|---|---|
| రెండుకి | ఇరు /ఇర |
| మూడుకి | ము |
| నాలుగుకి | నల |
| అయిదుకి | యా |
| ఆరుకి | అరు /అర |
| ఏడుకి | డె /డ |
| ఎనిమిదికి | యెన |
| తొమ్మిదికి | తొం |

నూరుతో కలిసినపుడు

| | |
|---|---|
| మూడుకి | మున్ |
| నాలుగకి | నన్ |
| అయిదుకి | యే |
| ఆరుకి | అర్ |
| ఎనిమిదికి | ఎనమన్ |

నూరు విశేషణరూపం నూట

వెయ్యింన్నూట యిరువై యేండ్ల పీద చెల్లే (10 8

మున్నూట అరవైయేండ్లు 11 2

లక్ష విశేషణంగా ప్రయుక్తమైనపుడు తుదివర్ణం దీర్ఘమవుతుంది
లక్షా యాభై వేలు 37 4
వేయి బహువచన ప్రత్యయాన్ని గ్రహించినపుడు తుదివర్ణం లోపిస్తుంది
వేయి +లు>వేలు 37 4
సమాసంలో అజాది సంఖ్యా వాచకం పరపదంగా వచ్చినపుడు యదాగమం వస్తుంది
యాభై యారు 24 14
మారు అనేది ఉత్తరపదంగా ఉన్నపుడు రెండు మూడు అనే రూపాలు ఇన్ మున్ అనే రూపాంతరాలను ప్రదర్శిస్తున్నాయి
ఇనుమారు 23 18 మమ్మారు 23 19

## 2 మనుష్యవాచక సంఖ్యాపదాలు

వీటిలో మహన్మతి భేదం ఉంది ఇవి సాధారణంగా అమనుష సంఖ్యా వాచక విశేషణ రూపాలకు లింగ వచన ప్రత్యయాలు చేర్చడం వల్ల ఏర్పడుతాయి

మహద్వాచకం

ఏ వ ఒక>వొక డు 53 26
పూజార్థంలో వొక రు (33 13

మహతీవాచకం

ప్రత్యయం తె /కొమార్తె 75 22 ఇది ఇతి/తి ప్రత్యయ రూపాంతరం
ఏ వ లో మాత్రమే మహన్మహతీ భేదం ఉంటుంది బ వ లో మహద్వాచకంతో కలిసిపోతుంది ఈ భాషలోని లింగ విధానాన్ని బట్టి మనుష వాచక బహువచన రూప నిర్మాణంలో వచ్చే ప్రత్యయాలు ఈ క్రింది పర్యాయ రూపాలను కలిగి ఉన్నాయి

---

19 ఇక్కడ వెయ్యి - మూల రూపం వే అని కూడా భాషా వేత్తల అభిప్రాయం

రు నాలుగుతో
దరు రెండుతో
గురు మిగతాచోట్ల వస్తాయి

ఈ ప్రత్యయాలకు ముందు సంఖ్యావాచకాలు ఈ క్రింది రూపాలతో ఉంటాయి

| | | | | |
|---|---|---|---|---|
| రెండు | ఇర్ + ద > ఇద్ద | యిద్దరు | 49 19 |
| మూడు | ము | ముగ్గురు | 40 22 |
| నాలుగు | నలు | నలుగురు | 13 2 |
| ఆరు | అర్ | అర్గురు | 16 13 |

సామూహికార్థంలో మనుష్య వాచకాలకు పరిగణన Coun ng లో మూడు నుంచి మంది చేరుతుంది కాని రా వా లో మంది తో కూడిన ప్రయోగాలు లేకపోవడం ఒక వైలక్షణ ం అమహద్వాచక సంఖ్యా వాచక విశేషణాలే మనుష్య వాచకాలకూ ప్రయుక్తమయాయి

ముప్పై నృపతులు 7 22 రెండు మనిషి నిలువున 54 14
లక్ష మనిషి ఇంట్లు 30 18 నాలుగు మనుము ల నిలు ్న 54 17

3 పూరణార్థక సంఖ్యావాచక పదాలు

రా వా లో పూరణార్థక ప్రత్యయంగా ఓ కనిపిస్తుంది ఇది చారిత్రక కాలంలో అగు అన్న క్రియ నుండి పరిణమించింది

అగు > అవు > అవ > ఓ

కావ్య భాషలోని అవ ప్రత్యయమే వ్యావహారిక భాషలో ఓ గా మారుతుంది ఇది 12వ శతాబ్దం నుంచి శాసనాల్లో కనిపిస్తుంది 0

మొదలు రూపానికి టి అనే పూరణార్థక ప్రత్యయం చేరి మొదటి అవుతుంది త ్నవన్నీ ఓ అనే ప్రత్యయాన్ని పొందుతాయి

20 చూ కందప్పచెట్టి ఎం శాసనభాషా పరిణామం తె భా చ 1979 పు 139

మొదటి దొర 39 12
రెండో తేప 10 23 రెండ్డో పర్యాయము 34 3
మూడో నగరా 59 10

విభాజక సంఖ్యావాచకం (D bu ve Numera

ప్రత యాలు ఏ <చేసి వంతున లెక్క/లెఖ్ఖ

ఏశ యేనుగ వఖ్ఖ్యంటికి రోజా వెయే శిఫెట్ల లెక్క 24 21
రోజా గుర్రం వొఖ్ఖంటిం నూరేశి ఫెట్ల లెక్క 24 8
బంటు ఒక్కంటికి నెలకు ఫుట్టి రెండే వరాల లెక్క 24 23

వంతున గుర్రములు వెయి ంటి లక్ష ఫుట్లవంతున 24 19

లెఖ్ఖ పీథికి నన్నూరు యేనూరు లెఖ్ఖ పడసారి యీరీతి నాలుగు పీథులను వేయి గుర్రాలున్ను అన్ని రౌతులున్ను దావకట్టుగా బడగా 53 6

ఇంకా రా వా భాషలో ఈ క్రింది విశేష ప్రయోగాలు చూడవచ్చు బలహీనులు అన్న అర్థంలో పేద అన్న పదానికి అర 1/2 కాలు 1/4 అనే సంఖ్యా వాచక పదాలు చేర్చి ప్రయోగించడం జరిగింది

"అరపేద కాలుపేద మనుష లైన వారి పోనురాను శక్యమా అని" 42 27 ఈ అర కాలు అనేవి సంఖ్యావాచకాలకు చేరినపుడు ఉన్ అనే సముచ్చయ ప్రత్యయం వస్తుంది ఇకారాంత సంఖా వాచకాలకు చేరినపుడు ఉన్ ఇన్ గా మారుతుంది

పకటిన్నర దినం 64 5
మూడుం ముక్కాలు ఘడియ 40 22

ప్రథమేతర రూపంలో సంఖ్యావాచకాలకు టి అనే ఔపవిభక్తిక ప్రత్యయం చేరుతుంది

"రోజా గుర్రం వొఖ్ఖంటికి నూరేసి ఫెట్లలెక్క గుర్రములు వెయ్యిం టికి లక్ష ఫట్ల వంతున గుర్రాలు యిరువై నాలుగు వేలింటికి యిరువైనాలుగు లక్షలున్ను యేనుగ వఖ్ఖ్యంటికి రోజా వెయ్యేశి ఫెట్లలెక్క యేనుగులు

మూట యిరువై యింటి పం(డెండు లక్షలకును యేనుగలు వెయి న్నేనూరు బంటు ఒక్కంటికి నెలకు పుట్టి రెండేసి వరాల లెక్క బంట్లు వెయ్యింటికి రెండ వేల వంతున" 24

ఒక అనే సంఖ్యా వాచక పదం నుండి ఏర్పడిన వొంటి అనే రూపం కూడా రా వా లో కనిపిస్తుంది

"పక్కరే కోట వెలుపట వొంటిగాపోగా" 26 25

సమాసంలో పూర్వపదంగా యేక అనే రూపం కనిస్తుంది

యేకదేశాన 26 24 యేకాలోచనపరులై 37 3

యేక(గీవమై 36 23 యేకచ(క్రముగాను 42 10)

## విశేషణాలు

నామవాచకాల గుణ విశేషాలను తెలియజేసేవి విశేషణాలు

తెలుగులో వా ్రప్తిని బట్టి నిర్మాణాన్ని బట్టి రెండు తరగతులుగా వర్గీకరించవచ్చు

1 సహజ విశేషణాలు Pr mary Ad ec ve

2 నిష్పన్న విశేషణాలు Der ved Ad ec ve

**సహజ విశేషణాలు**

వీటిని వా ప్తినిబట్టి ఎనిమిది తరగతులుగా పేర్కొనవచ్చు [21]

1 గుణ వాచక విశేషణాలు Qua a ve Ad ect ve

2 నిర్దేశాత్మక విశేషణాలు (Demon a ve Ad ect ve

3 (ప్రశ్నార్థక విశేషణాలు n e roga ve Ad ec ve

4 సంఖ్యావాచక విశేషణాలు Numera Ad ec ve

5 పరిమాణార్థక విశేషణాలు Quan a ve Ad ec ves

6 (ప్రకారార్థక విశేషణాలు Manner Ad ec ve

7 పరిగణనార్థక విశేషణాలు Ad ec ves of To a y

8 అనిశ్చిత విశేషణాలు nde n e Ad ect ve

21 అనంతరామశాస్త్రి నేతి శ్రీనాథ భాషాపరిశీలన 1982 పుట 160

సమాసాల్లో వచ్చే విశేషణాలు ఎక్కువగా పూర్వపదాలుగా ఉంటాయి జంటపదాల్లో విశేషణ విశేష భావం ద్యోతకం కాదు రెండూ విశేష్యాలే అవుతాయి

ఉదా అవధి అటంకములు 3 12 ఎన్నపెద్దలు 25 22
కలిమిబలిములు 21 2 రేయిపగలు 8 11

గుణవాచక విశేషణాలు

ఇవి గుణ స్థాన కాల ఆకార దశ వర్ణాది భేదాలతో అనేక రకాలుగా ఉంటాయి

గుణం పరమాన్నము 5 1
బంగారు ఎట 49 26
పయిడు బియ్యము 68 9
స్థానం ముందర దివాణం 32 22 వెనకదిక్కు 65 14
వెలిదావళ్ళు 39 14 నడిమి మంటపము 79 3
కాలం మునుపటివారు 57 19
వెనుకటివారు 57 20
ఆకారం చతురశ్రమమైన భూమి 9 5
దశ అర పేద కాలు పేద
మనుషులు 42 20
వర్ణం కపిల కామధేనువు 3 13 పీతాంబరం 12 8
నీలిదట్టి 6 27 నల్లవణలు 31 3

నిర్దేశాత్మక విశేషణాలు

దూరవర్తి ఆ ఇందిరాదేవి 8 16 సమీపవర్తి యీ కొండ 9 17
ఆ స్తంభము (10 16 యీ వార్తలు (27 15

ప్రశ్నార్థక విశేషణాలు

యెక్కడ (9 9 ఏ రీతు 12 20
యెవరు (19 12) యేలాగు (32 5)

సంఖ్యావాచక విశేషణాలు

ఉదా మూడామడ 49 10

ముమ్మారు 23 18

పరిమాణాత్మక విశేషణాలు

అంత అంతేసి కార్యాలు 51 6

అంతమేర 64 22

ఇ యింతటి యింతటి కారము 27 18

ఇ యింత యింత కార్యము 27 17

ఇంత ఆలోచన 35 20

యింతరస్తు 63 11

కొంత కొంత దూరము 26 23

కొంత పాయదళము 39 26

ప్రకారార్థక విశేషణాలు

అట్టి అట్టి కార్యము 27 10

అట్టి దుర్గాలు 65 12

ఇట్టి ఇట్టి వట్ల 57 14

పరిగణనార్థక విశేషణాలు

మహద్వాచకాలు & మహతీవాచకాలు } అందరు 32 3, కొందరు 69 9

అనిశ్చిత విశేషణాలు

అమహద్వాచకాలు

అన్ని అన్ని కారములున్ను 6 25

ఇన్ని ఇన్నాళ్ళు 45 13

ఎన్ని ఎన్ని లక్షలు 23 20

నిష్పన్న విశేషణాలు Der ved Ad ec ve )

ఇవి ప్రాథమిక విశేషణాల న డి నామ ప్రాతిపదికల నుండి ( యా ధాతువుల నుండి అనేక రీతులుగా ఏర్పడుతాయి

స్థానాన్నిబట్టి విశేష్యాలే విశేషణాలుగా ప్రవర్తిస్తాయి

నిండ్లేరు 62 27 యేరు నీరు 60 26

విదురనీతి 2 10 నీతికార్యం 3 3

నామవాచకాలనుండి ప్రత్యయాలు చేరగా ఏర్పడిన విశేషణాలు

అ వచ్చుతోరణము 3 26

రత్న కంబళి 2 14

ఇ నడిమి మంటపము 78 3 మాని కొమ్మ 54 17

మొదటి దొర 30 12

టి వాకిటి పారు పత్యము 36 18

నేటి జయం (6 19

దీవటి కొలువు 69 10

పు అమరపు యేనుగులు 37 9

సింహ్వాపు ఎల్లలు 60 9

వ విణ పు + విణ అ ఇనువగుదియలు 39 1

నామ ప్రాతిపదికకు అగుధాతు నిష్పన్నమైన అయిన/ఐన అన్నపదం చేరడం వల్ల విశేషణత్వం కలుగుతుంది

ఐన అపూర్వ్యమైన మనుష్యులు 31 2

అన్యోన్యమైన మాట పలుకులు 76 23

క్రియాధాతువుల నుండి ఏర్పడిన క్రియాజన్య విశేషణాలు

భూతకాలిక విశేషణం

ఇన వచ్చినవారు 66 2

నడచిన వర్తమానములు 35 19

కన్నకార్యములు 44 9 < కనిన

విన్నవార్తలు 44 9 < వినిన

తద్ధర్మార్థక విశేషణం

ఏ యేలేదొరలు 30 3

వచ్చేవేళ 53 10

జయించేయత్నం 71 15

భవిష్యత్కాలిక విశేషణం

-గల అన్నంతం పై) కాయంగల విన్నపం 2 5

## లింగం (Gender

ఇతర ద్రావిడ భాషల్లో ఉన్నట్టుగానే తెలుగులో కూడా రెండు లింగాలు ఉన్నాయి అవి మహత్తు అమహత్తు స్త్రీ తిర గ్గద భిన్నమైనవి మహత్తులు అమహత్తుల్లో స్త్రీని బోధించేవి మహతీవాచకాలు తెలుగులో శబ్దం యొక్క అర్థాన్ని బట్టి సంస్కృతంలో శబ్ద స్వరూపాన్ని బట్టి లింగభేదం ఉంటుంది ముండాభాషలో లింగభేదం ప్రాణివాచకాలు an ma es అప్రాణివాచకాలు nan ma es అన్న భేదంతో ఏర్పడింది హిందీ భాషలో పుంలింగం స్త్రీలింగమని రెండే లింగాలు ఉన్నాయి ఈ విధంగా ఈ లింగ భేదం ఒక్కో భాషలో ఒక్కో విధంగా ఉంటుంది

తెలుగు వైయాకరణులు డు ము వు లను ప్రథమా విభక్తి ప్రత్యయాలుగా పేర్కొన్నారు ఇవి కేవలం తత్సమ పదాలకు మాత్రమే వస్తాయి దేశ్యపదాల్లో ఎక్కువ భాగం సహజనామ ప్రాతిపదికలే లింగబోధ కతను కలిగి ఉంటాయి

రా వా లో ఈ క్రింది నామవాచకాలు పులింగ బోధకాలుగా వ్యవహరిస్తున్నాయి

అన్న ముక్కుతిమ్మన్న 61 19
అల్లసాని పెద్దన్న (61 25
కంవన్న 63 12

అయ ధర్మాసనం ధర్మయ్య 3 8
రాయసం రామచంద్రయ 11 14)
ముక్కుతిమ్మయ 16 25
అల్లసాని పెద్దయ్య 80 4

అప్ప ఇది కన్నడ భాషనుండి తెలుగులో ప్రవేశించిన నామపద ప్రత్యయం
బోయి రామప్ప 44 17
కొమార తిమ్మప (44 19

పూజార్థక రూపాలు

అరసు ఇది రాజు అనే పదంనుండి కన్నడంలో ఏర్పడిన పదం ఈ పదాల్లో నామానుబంధంగా కనిపిస్తుంది

అయ్యమరసు 11 12

కొండమరసు 11 12

తిమ్మరసు 26 13

జీ ఇది మరాఠిభాష నుండి వచ్చిన గౌరవ వాచక ప్రత్యయం

వేగల గోపోజీ 38 4

పక్కిరి గోపోజీ 42 19

మహారాష్ట్రి గుజ్జరి గర్జోజీ 42 25

పంత్ ఇది కూడా మరాఠి భాషనుండి తెలుగులో ప్రవేశించిన ప్రత్యయం తెలుగులో ఇది గౌరవ బ వ ప్రత్యయం లు తోనే వ్యవహరింపబడుతుంది

అప్పుపురం వారి అనంత్రోజీ పంత్తులు 49 15

ఢిల్లి సురతాణివారి ధాకోజీ పంత్తులు 49 17

బెదదకోటవారి బేకోజీ పంత్తులు 49 18

గోలకొండ వారి గోపోజీ పంత్తులు 49 19

పండితులు దొండో పండితులు 32 22

ముకుంద పండితులు (32 24

బిరుదువాచక శబ్దాలు నామవాచకాలపై చేరేవి

వీటిలో కొన్ని జాతి బోధకాలుగా స్థిరపడ్డాయి

నాయడు అక్కప్పనాయడు 44 21

కృష్ణప్ప నాయడు 44 21

కొటికం విశ్వనాథ నాయడు (44 20)

నాయకుండు నరసనాయకుండు 34 30

యీశ్వర నాయకుండు 34 20

గౌరవార్థంలో లు తో

రఘునాయకులు 6 2

జగన్నాయకులు (53 9

ఎళ ఇది తమిళ ఎళై శబ్దం నుండి వచ్చింది

అప్పరఎళ 11 14

మన్నారుఎళ్ళు 11 14

కుప్పరఎళ్ళు 44 19

భట్టు/భట్లు భట్టు శబ్దానికి పూజార్థంలో లు చేరుతుంది

సింగ్గిరిభట్టు 6 21

శింగిరిభట్లు 7 16

రాజు సాళువ మేకరాజు 11 16

అర్వీటి బుక్కరాజు 11 6

రామూరి తిమ్మరాజు 11 18

రావు శి వంత్ లతోపాటు ఇది కూడా మరాఠీ పదమే

అంకుశరావు 45 16

మలకరావు 47 14

గంగారావు 58 12

రెడ్డి నాగారెడ్డి 44 23

బసువారెడ్డి 44 24)

బొమ్మిరెడ్డి 44 24

పాత్రుడు అఖండ పాత్రుడు 66-20

అశనీ పాత్రుడు 66 21

ఖానుడు అంకుశఖానుండు 44 16

చితాపుఖానుడు 65 6

రా వా లో స్త్రీ నపుంసక లింగాల్లో చెప్పుకోదగ్గ విశేషాలేమీ లేవు

## వచనం Number

తెలుగు భాషలో ఏక వచనం బహు వచనమని రెండే వచనాలు ఏక వచన రూపానికి ఎలాంటి ప్రత్యయాలూ చేరవు నామ ప్రాతిపదిక రూపమే సహజంగా ఏక వచనాన్ని బోధిస్తుంది ఈ ఏకవచన రూపానికి బ వ ప్రత్యయం లు చేరడంవల్ల బ వ రూప మేర్పడుతుంది

లు రు ము అనేవి బహువచన ప్రత్యయాలు కొన్ని పదాలు నిత్యైక వచనాలుగాను కొన్ని నిత్య బహువచనాలుగాను ఉంటాయి

బ వ ప్రత్యయం చేరినపుడు ఈ క్రింది నామవాచక ప్రాతిపదికల్లో కొన్ని మార్పులు కలుగుతాయి

బ వ ప్రత్యయం లు చేరినపుడు ఇకారాంత పదాలు స్వరసామ్యం వల్ల ఉకారాన్ని పొందుతాయి

తిరుపతి + లు > తిరుపతులు 2 15
ప్రధాని + లు > ప్రధానులు 4 8
సన్యాసి + లు > సన్యాసులు 5 9
నది + లు > నదులు 12 5

విడిది సామగ్రి అన్న పదాలు విడుదులు సామగ్రులు అని కావలసి ఉండగా కొన్ని త్య్యాదేశ్య పదాల సామ్యంవల్ల రా వా లో విడిదీలు 50 4 సామగ్రీలు 41. 5 అని దీర్ఘాలతో కనిపిస్తున్నాయి

బ వ ప్రత్యయం పరమైనపుడు కొన్ని పదాల్లో చివరి అచ్చు లోపి స్తుంది

తలారి + లు > తలార్లు 3 24
చీటి + లు > చీట్లు 26 18
బంటు + లు > బంట్లు (28 26
వాండు + లు > వాండ్లు 59 15

కొన్ని డుమంత శబ్దాలకు బ వ ప్రత్యయం లు చేరినపుడు తుది అక్షరం లోపిస్తుంది

ఉదా శిష్యుడు + లు > శిష్యులు 10 24
నృపాలుడు + లు > నృపాలులు 56 14)
బ్రాహ్మణుడు + లు > బ్రాహ్మణులు 78 21

బ్రాహ్మణ శబ్దానికి బ్రాంహ్మలు (33 23 బ్రాహ్మలు (36 16 అనే రూపాలు కూడా ఉన్నాయి

అల్లుండ్లు 4 11 యేండ్లు 10 8 అనే బహువచన రూపాలు అల్లుండు ఏండు అనే ప్రాచీన ఏకవచన రూపాలనుండి ఏర్పడ్డాయి

ల్లు అంత శబ్దాలకు బ వ ప్రత్యయం పరమైనపుడు ండ్ ఆదేశంగా వస్తుంది

విల్లు + లు > విండ్లు 18 2
ఇల్లు + లు > ఇండ్లు 23 5

పదాంత ద ల రలతో బ వ లు ప్రత్యయం చేరినపుడు వర్ణ సమీకరణం జరిగి ళకారాదేశం వస్తుంది

పది + లు > పళు 17 7
తాడు + లు > తాళు 59 12
కాలు + లు > కాళు 39 3
పూరు + లు > పూళు (59 4

రాయి శబ్దానిక్కూడా ళకారాదేశం వస్తుంది

రాయి + లు > రాళు 35 9

వేయి శబ్దానికి అంత్యాక్షరం లోపిస్తుంది

వేయి + లు > వేలు (31 10

త్రిమాత్ర పరిమాణం గల యికారాంత శబ్దాలకు బ వ ప్రత్యయం పరమైనపుడు తకారమాదేశంగా వస్తుంది

చేయి/చెయ్యి + లు > చేతులు 56 11

వ్యావహారిక భాషలో మకారాంత శబ్దాలకు బ వ ప్రత్యయం పరమైనపుడు మకార లోపమూ పూర్వ స్వరదీర్ఘమూ వస్తాయి

గుర్రము + లు > గుర్రాలు 34 17
దినము + లు>దినాలు 38 17
దుర్గము + లు>దుర్గాలు 46 19

సర్వనామాలకు రు ము అనే బ వ ప్రత యాలు చేరుతాయి
సర్వనామాల్లో బ వ ప్రత్యయాన్ని రెండు విధాలుగా గుర్తించవచ్చు

ము మేము 28 8 Exc u ve]
మనము 35 3 [ nc u ve]
తాను తాము 8 12
రు మీరు 8 18
వీరు 52 9
వారు 42 14

ఏ వ సంఖ్యావాచకానికి పూజా ర్థంలో బ వ వత్యయం రు చేరుతుంది

వఖర 31 7
వొఖరు 32 14

ఇందులో మహన్మహతీ భేదం లేదు
పూజా ర్థంలో నామవాచకాలకు బ వ ప్రత యం లు చేరుతుంది

విద్యారణ లు 4 25
జ్ఞానేంద్ర సరస్వతులు 4 25
వేదవ్యాసులు 6 25
ప్రభాకర శాస్త్రుల్లు 11 22
రామాదీక్షితులు 11 20
దొండ్డో పండితులు 34 7
శింగిరిభట్లు 7 16

ఇంకా అతిశయ పూజ్యార్థంలో వారు అనే అనుబంధ పదం చేరుతుంది

వీర నృసింహ్మరాయలవారు (2-6
కృష్ణరాయలవారు 11 9
గజపతి వారు (66 15

రా వా లో రాయలకు వారు తోపాటు దేవ శబ్దం కూడా ప్రయోగింపబడింది ఉదా రాయలదేవునివారు 22 18) తిక్కన మహతీ వాచకానికి కూడా దేవులు అని ప్రయోగించాడు

వీరు కుంతీ మహాదేవులు ఆది 7 239

ఇలాంటి రూపాలు శాసనాల్లో కూడా కనిపిస్తాయి [22]

సాధువులైనవారి పేర్లకు శ్రీపాదులు అనే అనుబంధం పూజ్యార్థంలో చేర్చబడుతుంది నేడు కూడా పూజ్యపాదులు తీర్థపాదులు అని సంబోధించడం కద్దు

విద్యారణ్య శ్రీపాదాలు (4 20

ప్రాచీన తెలుగు శాసనాల్లో గౌరవ వాచకమైన కాలు అనే అనుబంధ పదం సంస్కృత పాద శబ్దానికి అనువాదంగా కనిపిస్తుంది

రేవణకాలు కలమళ్ళ శాసనం

పుద్దణ కాలు పొట్లదుర్తి మాలెపాడు శాసనం

కుఙ్జి కాళ్ళు ఎర్రగుడిపాడు శాసనం

కొన్ని శబ్దాలు నిత్యైకవచనాలుగాను కొన్ని నిత్య బహువచనాలుగాను ప్రయోగింపబడుతాయి

నిత్యైకవచనాలు

ఉదా బియ్యము (73 15

స్నానం 52 18

కోపం (5 11

స్నాన, కోప శబ్దాలు స్నానాలు కోపాలు అని బహువచనాంతాలుగా కూడా కనిపిస్తాయి

నిత్య బహువచనం

నీళు 42 16

సమూహార్థ బోధకంగా కొంత శబ్ద ప్రయోగం ఈ క్రింది ఉదాహరణాల్లో విలక్షణంగా కనిపిస్తుంది

కొంత గుర్రం 58 4 అశ్వదళం అన్న అర్థంలో

కొంత రూక 78 11 డబ్బు అన్న అర్థంలో

---

22 Mahadeva sa r K H s or ca Grammar of Te ugu PP 304 326 330

ఈ క్రింది ఏకవచనాంత రూపాలు గమనించదగ్గవి

రెండామడ 25 25
మూడామడ 59 1
త్రిరాత్రి 78 23

జంట పదాల్లో బ వ ప్ర చేరక పోవడం

రేయి పగలు 8 11 శుచి రుచి 49 23
అహర్నిశము 8 13 పోటువాటు 55 12

దీనికి సంస్కృత భాషా ప్రభావం కారణం కావచ్చు

## విభక్తి (Case)

నామవాచక ప్రాతిపదికలపై చేరే ప్రత యాలను నామ విభక్తి ప్రత్య యాలని వ వహరిస్తారు ఇవి నామ ప్రాతిపదికకు ప్రత క్షంగా గాని పరోక్షంగా ఔప విభక్తి ప్రత్యయాలు చేరిన తర్వాత గాని చేరడంవల్ల ద్వితీయా విభక్తి రూపాలు ఏర్పడుతాయి

తెలుగు భాషలోని పదాలను ద్వితీయాది విభక్త్యంగ స్వరూపాన్ని బట్టి ఔపవిభక్తికాలు అనౌపవిభక్తికాలని రెండు విధాలుగా వర్గీకరించవచ్చు నామ ప్రాతిపదికలకు విభక్తి ప్రత్యయాలకు మధ్య కొన్ని ప్రత యాలు చేరుతాయి వీటినే ఔపవిభక్తికా లంటారు

మన సంప్రదాయ వైయాకరణులు ఇ టి / ంటి తి అనేవాటిని ఔప విభక్తిక ప్రత్యయాలుగా పేర్కొన్నారు [23] ఇంకా బహువచన రూపాలపై వచ్చే అ ను కూడా ఔపవిభక్తిక ప్రత్యయంగా గుర్తించవచ్చు ఇ అ అనేవి అంత్యాచ్చుకు ఆదేశంగాను టి / ంటి తి అనేవి అంత్యాక్షరానికి ఆదేశంగాను వస్తాయి తర్వాత వీటిపై విభక్తి ప్రత యాలు చేరుతాయి

ఇ అచ్చటికి 7 5 వారిని 34 10
నగరికి (27 6 అందరినిన్ని 57 20
వార్లకు 3 7 వాళ్ళతో 57 21
దిక్కుల నుంచి (4 7 దొరలకు (57 5

23 చూ చిన్నయసూరి పరవస్తు బాలవ్యాకరణము అచ్చిక సూ 28

-టి- కుందేటిని 9 8 యేట్లో 61 6
వాకిటి- 32 21 యేటికి 62 5
నూటికి 32 12 కొండ్లపీటికి 63 15
-ంటి వోరుగంటికి 46 17
-తి చేతికి 62 27

తెలుగులో దేశ్య శబ్దాలకు ప్రథమా విభక్తిలో ఎలాంటి ప్రత్యయాలూ చేరవు సంస్కృత పదాలు తెలుగులో ప్రవేశించినపుడు డు ము వు లు అనే ప్రత్యయాలను గ్రహిస్తాయి

**ద్వితీయాది విభక్త్యంగ నిర్మాణం**

ద్వితీయాది విభక్తులు చేరినపుడు నామవాచకానికి ఔప విభక్తిక ప్రత్యయం చేరుతుంది అప్పుడది ద్వితీయాది విభక్త్యంగ రూపమవుతుంది

**ద్వితీయా విభక్తి**

ప్రత్యయాలు ని ను ϕ

ని/న్ని కుందేటిని 9 8 సన్యాసిని జూచి 7 13
వాస్తు పురుషుని 10 2 లక్ష్మీదేవిని 8 16
నంబివాణ్ని 26 1 గుర్రాంన్ని 53 20

ను శింగిరిభట్లను బ్రహ్మరాక్షస్సుగా యెంచి 6 15
పంపానదీ తీరానకు వచ్చి పంపా విరుపాక్షులను సేవించి 9 4
సాదువులైన వార్లను యెవరు బాధజేశిరో 19 12

కొన్నిచోట్ల ద్వితీయా విభక్తి ప్రత్యయాలు రాకపోయినా ప్రథమా విభక్తి రూపాలే ద్వితీయా విభక్త్యర్థాన్ని బోధిస్తాయి

ϕ ధర్మము ఆర్జించేదేరీతు 12 21 ధర్మమును
గిలుకు పావాలు మెట్టి (12 12 గిలుకు పావాలను

కొన్ని చోట్ల బహువచన లకారంపై కూడా ద్వితీయా విభక్తి ప్రత్యయాలు చేరవు

శత్రువుల జయించేదేరీతు (12 12 శత్రువులను
మిత్రువుల పోషించేదేరీతు 12 23 (మిత్రువులను)
ఆశ్రితజనుల పాలించేదేరీతు (12 23 ఆశ్రితజనులను

తృతీయా విభక్తి

ప్రత్యయాలు తోడట్టు చేత/దాత తో

రా వా భాషలో అనేకచోట్ల 30 పర్యాయాలు కనిపించే తోడట్టు ప్రయోగం సాహిత్యంలో కన్పించదు ఇది తోడ + అట్టు కలిసి ఏర్పడిన రూపం కావచ్చు ఇది రా వా లో సహార్థంలో ప్రయుక్తమవుతుంది

తోడట్టు వినయము తోడట్టు 3 17 పరమాన్నము తోడట్టు 5 16
అతివైభవముల తోడట్టు 3 25 ఇష్ట సంపదల తోడట్టు 6 13

చేత భ్రమరము వాయువుచేత పువ్వుల వాసన నెరిగినట్లు 18 12
యెండ్ల చేతను దన్నిన యేనుగలు 60 24
యీటెలచేత కుమ్మి 60 10

తో యీటెలతోనన్ను పంద్ది బల్లెములతోనున్ను గుచ్చి 60 12
పక్కిరులతో కూడా పట్టం వెళి వచ్చి 42 15
రఘునాయకులు మాతో పలకరించగా 6 2

న అనే ప్రత్యయం కూడా రా వా లో అనేక చోట్ల తృతీయార్థంలో ప్రయుక్తమైంది

పదివన్నె బంగారున నూరు శేరుల శేయించ్చిన పళె రమ్మును 50 12 బంగారుతో

బహవేగాన గుర్రాన్ని యెక్కుకొని 53 20 బహువేగంతో

భుజబల పరాక్రమాన యీ క్షోణి చక్రము యేలుబడికి వచ్చును 65 27 భుజబల పరాక్రమంతో

చతుర్థి విభక్తి

ప్రత్యయాలు కొరకు కొఱ + కు కై కు + అయి

కొరకు సూదువిప్పె కొరకు ప్లేచులయిన తురకలను పీగతోలి 66 10
బహుమానముల కొరకు వారివారితో ఆడుకొన్న వార్తలున్ను 72 10

మేము ప్రతాపము కొరకు వచ్చినవార మింత్రెకాని రాజ్యాపేక్ష కొరకు వచ్చినవారము గాము 74 24

ఇది నేడు తెలంగాణా మాండలికంలో ఎక్కువగా వాడుకలో విలిచి ఉంది.

కొరకై అన్న ప్రత్యయం కూడా రా వా లో కనిఎస్తుంది
సేతుయాత్ర కొరకై కంచి కాళహస్తి 66 3

కై బెల్లంకొండకై నడవగా 64 9
గజపతి రాజ్యానికై నడవగా 64 23

పంచమీవిభక్తి

ప్రత్యయాలు వలన/ వల్ల నుండ్డి/ నుండి నుంచ్చి/నుంచి వట్టి

వలన ప్రజలకు మృతు వువలన తస్కరులవలన అనావృష్టి దోషము
నకు భయము లేకుండా 20 7
దారులవలన ఆయాదేశములున్ను 21 1

వల్ల దేవరవారి ప్రతాపాతిశయం వల్ల 2.73
కస్తిబడి జేసిన దోషము వల్ల 11 1
తాము జేసిన అదృష్టము వల్ల 40 9
జగన్నాథుల కృపవల్ల 72 5

నుండ్డి భాగీరథి నుండ్డిన్ని రామధనుష్కోటికి వచ్చి 42.15

నుండ్డి దిక్కులనుండ్డి వచ్చిన కమ్మ కాగితములు 39 22

—నుండి యెక్కడి నుండి వస్తున్నావు 38 10
విజయనగరమున నుండిన్ని తరలినదారభ్యం 380 6
జగన్నాథమున నుండి బెదద కోట వర ంత్రం 40 14
సింధు దేశము నుండి గోదావరీ వర ంత్రమున్ను 40 12
దొరనుండి తమ ప్రాణాలకు హానియై 36 22
ఇక్కడ దొరవల్ల అని కూడా చెప్పుకోవచ్చు

నుంచి నూట యెనిమిది తిరుపతుల నుంచిన్ని 2 15

నుంచ్చి ఆయా స్థలాంతరాల నుంచ్చిన్ని వచ్చిన అయ ంగార్లనున్ను (2 15

—వట్టి అరువై యేండ్లుబట్టిన్ని అవనికి అధిపతులు లేకుండ్డగ (40.10

షష్ఠీ విభక్తి

ఇది సంబంధార్థాన్ని తెలియజేస్తుంది దీన్ని శేష షష్ఠి అంటారు ఈ శేషషష్ఠిలో యొక్క అనే ప్రత్యయాన్ని కూడా వా కరణ కర్తలు చేర్చారు కాని దీనికి సాహిత్యంలో గాని వ్యవహారంలోగాని ప్రయోగం

లేదు [24] రా వా లో నిర్దేశ సర్వనామ విశేషణాలపై కొన్నిచోట్ల యొక్క ప్రయుక్తమవుతుంది

ప్రత్యయాలు కి కు

-కి రామధనుష్కోటికి 4 15
సంబివానికి 56 11
ప్రవిల్లి పుత్తూరికి వచ్చి 77 26
కు అయనకు 7 17 కాసుకు 59 5
విడిదికొంపకు 2 33 రోజుకు 20 26

యొక్క ఆ యొక్క యుద్ధంబు జేయగల సమయాన 9 14
ఆ యొక్క స్థలమహాత్మ్యము 9 10

వ్యవహారంలో ఇటువంటి రూపాలు ఇప్పటికి కనిపిస్తాయి

సప్తమీ విభక్తి

ప్రత్యయాలు అందు అందలి అ/ఆ -న ని లో లోన లోపం

అందు విద్యానగరమందు వీర నృసింహ్మరాయలవారు బ్రాహ్మ ముహూర్తాన లేచి 2_6
మధ్యాహ్నకాలమందు గంగాతీరానకు వచ్చి 7 2
పూర్వమందు కిష్కింధలో వాలి సుగ్రీవులుందురు 9 13
ద్వాపర యుగమందు 19 2
అందు కి అందలి అనేది మరో రూపం

అందలి శుభముహూర్తమందలి కృష్ణరాయల వారికి మంగళస్నానం చేయించి (11 23
యీ సమయమందలి తురకలు నాలుగువేల గుర్రాల వారున్ను చుట్టుకొందామని యోచనచేసి 52 23
పూర్వద్వారమందలి వుభయ పార్శ్వములా తిరుమలదేవి చిన్నాదేవి సహితంగా వుండేటట్టుగా (77 12
ఆకాశగంగ యందలి స్నానంచేసి (78 7

---

24 సుబ్రహ్మణ్యం ఎ యస్ ద్రావిడ భాషలు (1977) పు 289

ఆ　పాడుగోడలకు యిరుగడల దిగవేశేదిన్ని 39 3

ఆ　పూర్వదారమందలి పుణయ పార్శ్వములా 77 12
న　కర్నాటకాన పట్టణగరం కానున్నది 7 18
మంచిముహూర్తాన శంకుస్థాపనంజేశి 10 2

ని న + ఇ　కలియుగాదిని పరీక్షిత్తు మహారాజు రాజ్యాభిషిక్తుండై 19 2
యీ పాళ్యాన యిటువంటి పీధిని యీ శ్రేణిలో 12 9
స్వామిసన్నిధిని గణపతివారికి తీర్థం ప్రసాదించ్చేవ్వేళ 56 10

ను　సరదు దుర్గాలను రస్తు సామ్రాగ్రిలు వేయించి 34 16
అయా దుర్గాలను మన తెగ తాంణ ములు వుంస్తే 62 14
పీధికి నన్నూరు యేనూరు లెఖ్ఖ్వపదసారి యీ రీతి నాలుగు
పీధులను 53 6

లో　భాగీరథిలో స్నానము జేశి 7 26
గోవుల మందలోనున్న శునకాన్ని పర్వత గుహలోనున్న
కుందేలు తరుమగా 9 7
పూర్వమందు షిక్కింధలో వాలి సుగ్రీవులుందురు 9 12

లోన　మణికర్ణికలోన స్నానముజేశి 7 3　నిండు సభలోన 79 20
లోన అనేది నేడు రాయలసీమ మాండలికంలో మాత్రమే
నిలిచి ఉంది
లోన లోపల ప్రత్యయాలపై మరలా కి ప్రత్యయం చేరు
తుంది

ఆ పట్టంలోనికిపోయి వెలిపాళ్యములు జూచి 38 11
కోటలోనికి పొయ్యేటప్పుడు యెరుకగలవారు వచ్చి 38 12

లోపల　కొలువులోపలను కరణీకుల పిలువనంప 23 19
కొలువులోపల యిష్టకథా వినోదమైన నగరి నియోగులున్ను
79 19
రాయలదేవునివారు కొలువుదీరి నగరిలోపలికి పోయిన క్షణమే
22 22

కాలక్రమంలో విభక్తుల్లో కూడ మార్పులు కనిపిస్తాయి అప్పుడు ఒక విభక్తికి మరొక విభక్తి ప్రయుక్తమవుతుంది ఇలా ఒక విభక్తికి మరొక విభక్తి రావడాన్నే విభక్తి విపర్యయ మంటారు [25] రా వా లో కొన్ని విభక్తుల్లో మార్పులను గమనించ వచ్చు

| | |
|---|---|
| ద్వితీయకు ప్రథమ | యీతని పురాతన పుణ్య ఫలము తప్పింపరాదు 5 18 <పుణ్య ఫలమును |
| | ధర్మము ఆర్జించేదేరీతు 2 2 <ధర్మమును |
| ద్వితీయకు తృతీయ | సుగ్రీవుడు వాలితో యెదురించి యుద్ధము సేయలేక 9 15 <వాలిని |
| ద్వితీయకు షష్ఠి | పరిజనులకు నడిపించేదేరీతు 12 21 <పరిజనులను |
| | అమ్మవారికి సేవించ్చక 78 13 <అమ్మవారిని |
| తృతీయకు ద్వితీయ | లగ్నం తప్పస్తావ స్త్రిరో అని జ్ఞాన దృష్టిని జూచి 10 25 <జ్ఞానదృష్టితో |
| | మెదబలిమిని దినాలు క్రమిస్తా వుంట్టిమి 40 6 <మెదబలిమితో |
| తృతీయకు చతుర్థి | ఢిల్లి సురధాణి చాతను ప్రతాపరుద్రుండ్డు తగిలెను 15 26 <ఢిల్లి సురధాణితో |
| తృతీయకు సప్తమి | పది వన్నె బంగ్గారున నూరు శేరుల శేయింవ్చిన వశె రమున్ను 50 12 <బంగారుతో |
| | అటువంటి దుర్ఘటనములనింన్ని నేర్పున గడచి (38 21 <నేర్పుతో |
| | రంపాన మనుష్యుల గోసేదిన్ని 38 23 <రంపంతో |
| | బహువేగాన గుర్రాంన్ని యెక్కుకొని 53 20 (<బహు వేగంతో |

25 అనంతరామశాస్త్రి నేతి శ్రీనాథ భాషా పరిశీలన (1982 పు 206

పంచమికి తృతీయ — యెండ్ల చేతను దస్సిన యేనుగలు 60 24 <యెండ్ల వల్ల)
చల్లగాలి చేత కాలుజారి 60 25 <చల్లగాలివల్ల

షష్ఠికి ద్వితీయ — పదునెనిమిది కప్పణాలవారినిన్ని నగరవిందు బెట్టించి 57 13 <కప్పణాల వారికి
ఒక పట్టం గావించి హరి హరులపేరిట వార్లను పట్టము గట్టి 6 13 < వార్లకు

షష్ఠికి తృతీయ — రాయల దేవునితో రాజనీతులు విన్నవంజేసినది (13 5 (< రాయల దేవునికి

ఇంకా ఈ క్రింది ప్రత యాలు విభక్తి ప్రత్యయాల్లాగా ప్రయుక్త మవుతాయి

వెలుపట — కోట వెలుపట వొంటిగా పోగా 26 25
అదేరీతికి కరణాలు వెలుపటికి వచ్చి 29 19

ముందర — దేవపూజా గృహం ముంద్దర లక్ష్మీదావడిలో 49 25

వెనుక — నాలుగార్లు దినముల వెనుక 36 5
కైజీతం కట్టిన వెనుక 45 5

వద్ద — హజారమువద్ద కాచివుండి 22 22
గణపతివారి వద్దకిరాగా 53 15

మీద — తురకాణ ంమీద కార్యం శేయవలెనని 3౦-1)
యీ కార్యం ధైర్యం మీద నడిపేదో 36 2

—(౦)—

## క్రియలు (Verbs)

వ్యాపారాన్ని బోధించేవి క్రియలు ఇవి భౌతికం కావచ్చు మానసికం కావచ్చు ఏ భాషలోనైనా క్రియలు సమాపక క్రియలు F n e Verbs అసమాపక క్రియ Non F n e verb )లని రెండు రకాలు తెలుగులో సమాపక క్రియలో ధాతు ప్రాతిపదిక Ve b em కు కాల భావ బోధక ప్రత్యయం Ten e mode Su x పురుష ప్రత్యయం (Pe sona Su x చేరుతాయి అసమాపక క్రియలో పురుష ప్రత్యయం చేరదు సమాపక క్రియల్లో పురుష బోధక ప్రత్యయాలు చివర చేరడంవల్ల వాక్యం సమాప్తమవుతుంది కర్తృ బోధక క్రియా విభక్తులు కొన్ని క్రియల్లో లేకపోయినా సమాపక క్రియల్ని గుర్తు పట్టవచ్చు

తెలుగులోని క్ర యా ధాతువుల్ని మూడు విధాలుగా వర్గీకరించవచ్చు

1 సామాన్య ధాతువులు S mp e Verb

ఇవి కేవలం అచ్చిక ధాతువులు తెలుగు భాషకివి సహజమైనవి ఈ ధాతువులకు నేరుగా కాలబోధక ప్రత య యాలు చేరుతాయి

ఉదా వచ్చు ఎ ను > వచ్చెను 46 21
వచ్చు ఉ ను > వచ్చును 70 19
చూచు తి మి > చూస్తిమి 55 3
చేయు సు ను > చేసును 22 7

2 సంశ్లిష్ట ధాతువులు (Comp ex Verb

ఇంచుప్రత్యయాదులు అనుబంధంగా చేరడంవల్ల సంశ్లిష్ట ధాతువులేర్పడుతాయి

— ఇంచు అనేది తెలుగులో ధాత్వీకరణ ప్రత యం Ve ba z ng Su ix గా కనిపిస్తుంది అంటే ఇంచు చేరడంవల్ల కొన్ని ధాతు రూపాలు సిద్ధిస్తాయి

అచ్చిక ధాతు రూపాలు వలకరించు 21 27) అర్థగించు 71 8
తత్సమ ధాతువులు ప్రతిష్ఠించు 10 16 పరామరి ంచు (22-15

కొన్ని ధాతువులు ఇల్లు అనే ప్రత్యయాన్ని పొందుతాయి
తారశిల్లు 47 14 ఎక్కటిల్లు 58 6

3 సంయుక్త ధాతువులు (Compound verbs

సహాయక క్రియలు అనుబంధంగా చేరడంవల్ల సంయుక్త ధాతువులేర్పడుతాయి వీటినే శబ్ద పల్లవ క్రియ లని కూడా వ్యవహరిస్తారు

సంయుక్త ధాతువులు అనేక విధాలుగా ఏర్పడుతాయి

నామం + న క్రి ధాతు రూపం + న క్రి

ఉదా ప్రార్థన చేయు 8 16 అడుకొను 35 16

యుద్ధము చేయు 9 15 తిరుగాడు 51 11

క్రియార్థకం+న క్రి అన్నంతం+న క్రి

పారిపోవు 53 8 పొడగను 3 17

కదలిపోవు 62 10 చేరబోవు 5 24

ప్రేరణార్థకం+న క్రి ధ్వన్యనుకరణం+న క్రి

అంపించుకొను 8 14 గలిబిలి అగు 69 8

రప్పించుక 4 10)(క<కొని

సంయుక్త క్రియా రూపాల్లో పూర్వరూపం అన్యదేశ్యం కూడా కావచ్చు

సలాము చేయు 39 11 కుర్నిసులు చేయు 76 16

మోర్చా వేయు 58 23 భేటి చేసుకొను 77 16

క్రియల్లో కర్మను అపేక్షించేవి సకర్మక క్రియలు Tran ve Ve b కర్మను అపేక్షించనివి అకర్మకక్రియలు n ran ve Ve b ఇంచుగాది ప్రత్యయాలు చేరేవి ప్రేరణార్థకాలు Cau a ve Ve b కొన్ని అకర్మక క్రియలు సకర్మక క్రియలుగాను కొన్ని సకర్మక క్రియలు ప్రేరణార్థక క్రియలు గాను మారుతాయి

డువర్ణాంత అకర్మక ధాతువులు సకర్మకమైనపుడు చువర్ణ మాదేశంగా వస్తుంది

ఏర్పడు ఏర్పరచు 10 4

ఉండు ఉంచు 5 5

చువర్ణాంత అకర్మక ధాతువులు సకర్మకమైనపుడు పువర్ణ మాదేశంగా వస్తుంది

నడచు నడుపు 3 7

నిలుచు నిలుపు 35 10

చూచు చూపు (35 10

తిరుగు అనే అకర్మక ధాతువు సకర్మకమైనపుడు వర్ణవ్యత్యయం జరుగుతుంది

తిరుగు త్రిప్పు 68 5

కొన్ని అకర్మక ధాతువులు సకర్మకాలైనపుడు రూపాంతరాలను పొందుతాయి

అగు కావించు 8 18

వచ్చు రప్పించు 57 8

సకర్మక ధాతువులకు ఇంచు చేరినపుడు ప్రేరణార్థక ధాతువు లేర్పడుతాయి

నడపు నడిపించు 59 20

చూపు చూపించు 35 10)

చువర్ణాంత సకర్మక ధాతువులకు ప్రేరణార్థక ప్రత యం ఇంచు చేరినపుడు పకారాదేశం వస్తుంది

తెచ్చు తెప్పించు 12 3

ఎలుచు ఎలుపించు 57 6

అన్వాదులైన ధాతువులకు కూడా ఇంచు చేరినపుడు పకారాదేశం వస్తుంది

కను కనిపించు 20 1

విను వినుపించు (4 8

ఇక్కడ స్వర సమీకరణంవల్ల వినిపించు కావడం సహజమైనరూపం

తెలుగులోని క్రియలను స్థూలంగా రెండు వర్గాలుగా విభజించవచ్చు

1 భావ క్రియలు Pos ve Verb

2 వ్యతిరేక క్రియలు Nega ve Ve bs

## భావక్రియలు

సమాపక క్రియలు (F n e Verb

కాలబోధక ప్రత్యయాలు

రా వా భాషలో గ్రాంథిక వ్యావహారిక క్రియారూపాలు రెండూ కని పిస్తాయి దీనికి వ్యవహార ప్రాబల్యం కారణమని చెప్పవచ్చు వ్యావహారిక ప్రాబల్యంవల్ల వ్యావహారిక రూపాలు కావ్యాల్లో చోటు చేసుకున్నట్లే కొన్ని గ్రాంథిక రూపాలుకూడా శైలీ రూపాలు S y zed orms గా వ్యావహారిక భాషలో నిలిచి ఉంటాయి

**భూతకాలం Past Ten e**

ప్రత్యయాలు ఇనా ఇన ఇన్ నా న ఇతి తి టి ఎ / అ

| | | | |
|---|---|---|---|
| ఇనా | అంప్పినారు 27 14 | ఇన | తెలిశినది 7 14 |
| | వచ్చినారు 32 16 | | పలి కది 27 24 |
| ఇన్ | హెచ్చింది 32 7 | నా | అన్నారు 31 23 |
| | | | వున్నారు 43 24 |
| న | వున్నది 27 14 | ఇతి | బ్రతికితిమి 59 20 |
| | విన్నది 35 17 | | అంటితిమి 73 1) |
| తి | వ్రాయిస్తిమి 30 23 | టి | వింటిమి 28 19 |
| | చూస్తిమి 55 3 | | అంటిమి 34 2 |
| ఎ | ఆయెను 19 7 | అ | అయను 31 5 |
| | తగిలెను 45 27 | | వచ్చను 69 7 |
| | వచ్చెను 46 21 | | |

ఇక్కడ అయ వచ్చ లలో కనిపించే అ ఎ>అ మాండలిక వైవిధ మని చెప్పవచ్చు ఈనాటి రాయలసీమ మాండలిక భాషలో కూడా నిమ్నీకృత స్వరముంది

**భవిష్యత్కాలం Fu ure Tense**

ప్రత్యయాలు ఏ <ఎద ఈ ని <ఎది ని

ఏ– ఉదా ఆ తీరున్నె మీ యభీష్ట కార ములున్ను నెరవేర్చేము 6 20
< నెరవేర్చెదము

మీకు కరతలామలకముగ దెలిపేను 6 22 < తెలిపెదను
మా వద్దకి వస్తేను అన్ని కార్యములున్ను జెప్పేను 6 25
< చెప్పెదను)

–ఈ(ని వారి దరిశనం యేరీతున కలిగీని 6 16 <కలిగెదిని
మీ వంటి పెద్దలు వుండగా అట్టి కార్యములున్ను యాల వచ్చీని
27 21 <వచ్చెదిని
స్వామివారి ప్రతాపమువల్ల అన్ని కార్యములున్ను అమరిక
అయ్యీని (28 15 <అయె దిని

ఈ ని తో కూడిన రూపాలు నేటి రాయలసీమ మాండలికంలో అక్కడక్కడ కనిపిస్తాయి కావ్య భాషలో ఇలాంటి రూపాలు కనిపించవు

వర్తమాన కాలం P e ent ten e

ప్రత యాలు చున్నా తున్నా తావున్నా తావున్న టావున్నా టావున్

చున్నా ఏలుచున్నారు 29 13

తున్నా అంపుతున్నాను 80 10

వస్తున్నావు 38 13

తావున్నా నడుపుతావున్నారు 3 1

తావున్న నడుస్తావున్నది 3 2

రెండు హ్రస్వాక్షరాలతో కూడిన నకారాంత ధాతువులకు తకారాది ప్రత్యయం పరమైనపుడు టకారం ఆదేశంగా వస్తుంది

టావున్నా కనిపించుకొంటావున్నారో 41 7

టావున్ వింట్టా వుందురు 23 8

తద్ధర్మార్థకం Aor t

ప్రత్యయాలు ఉ దు

ఉ భూమిన్ని బహువుగా పలించును (18 16

నగరివారికి అధిక శ్రేయస్సున్ను కలుగును 18 17

అవని ప్రజలకు అవధిన్ని వచ్చును 70 19

దు వార్తలు విందురు 36 4

విచార పడుదురు 36 16

యకారాంత దాతువులకు తద్ధర్మార్థక ప్రత యం 'ఉ చేరినపుడు సకారాదేశం వస్తుంది

భూత భవిష్యద్వర్తమానములన్నియు దెలుసును 6.6

సకల కార్యములున్ను విన్నవం జేసును 22 7)

నెల మూడు వానలున్ను గురుసును 18 15

చకారాంత ధాతువులకు విలక్షణంగా కొన్ని చోట్ల యకారాంత ధాతువులకు తకారాదేశం వస్తుంది

చూతురు 55 13
బయలు మెరశివత్తురు 22 27
ఉత్తరింతురు 47 23
ఏమి శేతును 5 13
ఆరీతిని వ్రాతురు 55 13

విధ్యర్థకం mpera ve

ప్రత యాలు ము/ మూ అండా/ అండ్డా/ ండ్డా/ డా

—ము అజ్ఞశేయమని 27 19
నడచుకొమ్మని 21 20
పరామరి ంచి రమ్మని 22 14
చదవమని 23 19
—మూ చూడుమూ 45 8

అండా/ఆడా కట్టడిశేయండా 5121
నడవండ్డా 59 25
తర్లడా 58 2
ండ్డా/డా నడిపించుకొండ్డా 71 21
శేయుడా 68 12

అండా/ ండాతో కూడిన రూపాలు మాండలికంగా నేటికి వినిపిస్తాయి

ఉభయ ప్రార్థనం Hor a ve

ప్రత్యయాలు తా ద్దా / దా
తా నడిపింతామని 25 7
ద్దా / దా నడిపించుకొంద్దాము 41 22
చుట్టుకొందామని 52 21

సందేహార్థకం Dub a ve

ప్రత యాలు ఏమో ఓ
ఏమో శంఖం పూరించినది యేమో 10 23)
యీ స్థల మహిమ యేమో 9 9
త్రిపురాలకు వచ్చినట్టు వచ్చునేమో (42 13)
ఓ యెవ్వరు విన్నవించినారో 22 15

ప్రశ్నార్థకం n e roga ve
ప్రత యాలు ఆ ఓ
ఆ వేగర్లు కమ్మ కాకితములు తెచ్చినారా 38 2
స్వామివారు యీ రీతిని రావచ్చునా 27 18
ఇక్కడ రావచ్చునా అన్నది అనుమత్యర్థకంపై ప్రశ్నార్థకం
చేర్చగా ఏర్పడిన రూపం
ఓ లగ్నం తప్పె స్తావ స్తిరో 10 24
రాయలవారు పుష్పోదయమైనారో 26 4
ఇక్కడ ఓ అనే ప్రత యం మాండలికంగా కనిపిస్తుంది
సామర్థ్యార్థకం Ab a ve
ప్రత యం గల
తృణాన్ని బట్టితే మేరువు జేయగలరు 27 21
అయిన అపాయానకు తగ్గ ఉపాయం చింతించగలరు
69 16

నిశ్చయార్థకం Ob ga ve
ప్రత యాలు వలయు వలెను
వలయు (ను యెరుగవలయు 13 22
తెలియవలయు (13 23
వలెను అ ర్వాదము జేసుక ఉండవలెను 8 14
స్వామివారిని పొడగన వలెను 20 20
కిలార్థకం A er ve Part c e
ప్రత యాలు కద్దా / గదా కా <కదా) / గా <గదా
కద్దా అప్పాజి సాళువ తిమ్మరసయ లవలె నియ్యోగులు కద్దా
30 14
గదా మీరు శింగిరిభట్లు దెలువగా గదా మా స్వరూపం ధ్యేద్దిరి
7 15
ఏలినవారి ప్రతాపమువల్లనే గదా కొలిచినవారు ఘన్నఘాట
(28 4

కా దిక్కుల వార్తలు విన్నారేకా 57 5
నడచిన కారా లన్నింన్ని వింన్నారేకా 66 25

గా గోలకొండ్ధవార్తలున్ను వింట్టిరేగా 43 5
శీశివచ్చినట్లయితే ప్రభుత్వానకు కొదవగా 47 21

అసమాపక క్రియలు Non F n e Verbs

ఒకటికన్నా ఎక్కువ క్రియలున్న తెలుగు వాక్యంలో చివరి క్రియ సమాపక రూపంలోను మిగతా క్రియలు అసమాపక రూపంలోను ఉంటాయి చూ వాక విభాగం

క్త్వార్థకం Pa Par c p e

సమాపక క్రియా వ్యాపారంకన్నా ముందు జరగటానికి ఉద్దేశించిన వ్యాపారాన్ని సూచించేవాటిని క్త్వార్థకా లని వ్యవహరిస్తారు

ప్రత్యయం ఇ

తలారి జంగమయ్య వచ్చి రాయలవారి సముఖానకు అడ్డబడి చేతులు కట్టుకొని నిలిచి 3 21

దళనాయకులు విని రాయలవారికి విన్నవంజేసి (3 27

శత్రర్థకం (Pre en Par c p e

సమాపక క్రియా వ్యాపారంతో పాటే జరిగే వ్యాపారాన్ని సూచించే వాటిని శత్రర్థకా లని వ్యవహరిస్తారు

ప్రత్యయాలు చు తా

చు కానుక కప్పములు కొంచుబోయి 33 24
ఉడుగర బహుమానం వక్కలాకులున్ను నడుపుచు 47 7)

తా కన్నీరుతోడట్టు చింతింపుతావుండగా 19 11
వారిమాటమీద నామజాదులు అంపుతా 36 20

చేదర్థకం Cond ona

రా వా లో చేదర్థక ప్రత్యయాల్లో అనేక పర్యాయరూపాలు కనిపిస్తాయి ఇక్కడ భూతకాలిక క్రియపై చేదర్థకం రావడం విశేషం ఒకేసారి రెండు ప్రత్యయాలు తే+అయనా రావడం కూడా రా వా లో కనిపిస్తుంది

ప్రత్యయాలు భూతకాలిక క్రియ + ఆయనా తే + ఆయనా తే/ ఇతే టే
అయితే

భూ కా క్రి + ఆయనా నేజెప్పినట్టు నడిపిస్తిరాయనా 6 10
యెదుటివారు హస్మత్తుగా నిల్చి నట్టాయనా 47 17
మ్లేచ్ఛుల రాజ్యానకు కదలిపొయ్యినట్టాయనా 62 10

తే ఆయనా రాజులైనవారలు అనువైన పురుషరత్నాన్ని సంతరిస్తే ఆయనా 31 24

తే నగరికి పైకం ఇస్తే ప్రాణాలతో విడుతురు 39 7
ధర్మం తప్పక నడిస్తే నెల మూడు వానలున్ను గురుసును 18 15

—ఇతే తృణాన్ని బట్టితే మేరువు కాయగలరు 27 21
వారు వచ్చి దిగితే వారలతో పోరాడేది దుర్ఘటమై వుండును 39 27

—టే ఇక్కడ వుంట్టే మోసం వచ్చును 53 19
యీ రాత్రి అందుకైన కారం కంట్టే కంన్నట్టు 70 6
స్వామివారు కృతులంద్దుకొంట్టే కీర్తి ప్రతాపములు శాశ్వతముగా నిలుచును 80 1

—అయితే పరామరిం చక వున్నట్టయితే హాని కద్దా 19 17
మాట పలుకులు నడిపించినట్టయితే 43 11

అన్నంతం n n ve

ప్రత్యయం అన్/ అ

అన్ ధర్మాసనం ధర్మయ్యను ఎలువనంపగా 3 8
రాయలవారు వినవధరించి 3 16

అ ఆయనను చేరబోయి 5 24
కర్నాటకం వారిని పారదోలి (67 19

ఆత్మార్థకం

తెలుగులో ధాతువుకు కొను అనే సహాయక క్రియను చేర్పడంవల్ల ఆత్మార్థకో క్రియ ఏర్పడుతుంది

ప్రత్యయాలు కొను క (<కొను

కొను చేతులు కట్టుకొని 3 22
వేషం వేసుకొని 7 11
తీర్థప్రసాదములున్ను పుచ్చుకొని 56 7
ఆ కాగితం గజపతివారు చదువుకొని 73 24
కార్యం జయం చేసుకొని 77 1
యజమానుండ్ని చేపట్టుగా పట్టుకొని 77 7

క సకల సామాజికులను రప్పించుక 4 10
రెండు పాదములున్ను కన్నుల నొత్తుక 7 12
కట్టడ శేయమని మనవిజేసుక 8 12
షోడశపాత్రులవల్ల తప్పితంలేదని విచారించ్చుక 75 3

ఫ కాచి వుండగా 7 10 కాచుకొని ఉండగా అని కావాలి

రా వా భాషలో ఆత్మార్థకంలో కొన్ని విలక్షణప్రయోగాలు కనిపిస్తాయి
రత్నకంబళిమీద కూచ్చుండుకొని 12 14
లగ్నం తప్పకుండ నిరీక్షించుకొని 10 19
రాజ్యమును యేలుకొని 25 6

అప్యర్థకం Add ve part c e

ప్రత యాలు ఇనా నా

ఇనా ఎంత బలవంతుడు వచ్చినా నిర్వాహకశక్తిలేక 9 22
యెవరు యెదురు తాకినా యేమని తలంచేవారులేక 2 24
వాగ్ఘోషములున్ను యేమి కలిగినా అవి యెల్ల మనసున వుంచ్చుక 65 16

నా దునేదారులు విన్నాన్ను అవకీర్తి 27 16
ఇక ద Empha s కోసం సముచ్చయ ను వర్ణం వచ్చింది

ఏవార్థకం Empha c Par c e

ప్రత్యయ ఏ/ ఎ

ఏ ఉదయాననే లేచి 22 1
బొక్కసాననే రొక్క రూపాయలు ఇమ్మని కట్టడజేశి 43 9

ఎ అమటన ఘటనా సామర్థ్యము మీకె గలదు 30 5 •
దమామి ధ్వని విన్న క్షణాన్నే ఆస్థలంలవారు వెళ్ళిపోయిరి 63 3)

క్రియా విశేషణం Adve b a Par c e

ప్రత్యయం ంగా/ గా

ంగా కోపగించుకోంగా (5 11
వెంబడించ్చుక రాంగా 53 18
క్షణే క్షణే వచ్చి విన్నవంశాయంగా 64 1
ంగా తో కూడిన రూపాలు నేడు రాయలసీమలో శిష్టేతర భాషలో ఎక్కువగా వినిఎస్తాయి

గా ప్రసాద పదార్థములు తెప్పించుక అరగించి 26 3
డాలుదమామి టోకించ్చగా 52 25
యెదుట నిలిచి జగదమియ గా 64 15

## వ్యతిరేక క్రియలు (Negat ve verbs)

సమాపకక్రియలు

భూతకాలం లేదు

లెఖ్కయేమిన్ని చదువలేదని 25 13
రాయలవారు నగర శోధనకు పోయినట్టే యింకా రాలేదు 26 7
అచ్చట కలిమిబలములున్ను యెక్కడా చూచిందిలేదు 55 25
ఇక్కడ చూదలేదు అనటానకి చూచిందిలేదు అని భావార్థక నామంపై లేదు చేర్చి ప్రయోగించబడింది

భవిష్యత్కాలం అ

కుందేలు ఘనకాన్ని తరిమేది యెక్కడ జూదము (9 9
పానము జేసినంత పొద్దున్ను తమ దేహములు తాము యెరుగరు 36 13
ఇది వర్తమాన కాలానికి కూడా వర్తిస్తుంది

తద్ధర్మార్థకం

కొనసాగదు 28 22

తెలియదు 42 13

నిలువదు 69 16

విధ్యర్థకం వలదు

ముట్టవలదు 50 18

సామర్థ్యార్థకం లే కా

లే దేవదానవులు సహా శేయలేరు 55 4

దగదవ్వలకు తాళి వాండ్లు నిలువలేర 59 15

కా వారితో పోరాడేది శక ముకాదు 46 8

నిశ్చయార్థకం రాదు

కాలు నిలువరాదు 19 9

వూరకే వుండరాదు 41 10

నిషేధార్థకం కూడదు

దుర్బలుల హింసించ కూడదు 9 2

రాకూడదు 28 2

నిలువకూడదు 61 9

అసమాపక క్రియలు

| | | | |
|---|---|---|---|
| క్త్వార్థకం | అక | భావార్థకం | అమి |
| | చలింపక 5 6 | | యెరుంగమి 14 20 |
| | సంకోచపడక 7 4 | | రక్షింపమి 14 22 |
| | తిరిగిచూడక 9 1 | | కాయమి 14 21 |

శత్రర్థకం అకుండా/ అకుండ లేకుండా/ కుండా

అకుండా రక్షించకుండ్డా 50 16

అకుండ మొక్కకుండ 9 17

లేకుండా కుంద్దకం లేకుండా 45 6

యేమిన్ని లేకుండా 55 16

ఈ కుండా మన దండ్డుకు రస్తు సామగ్రిలు రానీకుండా 62 3

చేదర్థకం ః అకపోతే

నడచిన కార్యములలో బలదుర్బలములు తెలువకపోతే 22 9

ఆత్మార్థకం కోక కోకుండా

కనిపించుకోక 27 2

విచారించుకోక 70 4

కలుపుకోకుండా 50 15

నిషేధార్థకం కూడక

యుద్ధము శేయకూడక 9 20

తనకు రాకూడక 23 2

కాలు నిలువకూడక 65 16

అనుమత్యర్థకం Perm s ve ఇయ్యక

రానియ క 72 3

పోనియ్యక 72 3

క్రియాధాతువుల్లో కలిగే మార్పులు

కాలబోధక ప్రత్యయాలు చేరినపుడు ధాతువులు కొన్ని మార్పులు పొందుతాయి

చకార యకారాంత ధాతువులకు తకారాది ప్రత యం గాని అకాది ప్రత్యయంగాని పరమైనపుడు సకారాదేశం వస్తుంది

చూచు + తా > చూస్తా 26 15

వచ్చు + తే > వస్తే 52 9

చేయు + తే > చేస్తే/శేస్తే 68 2

చేయు + ఇ > చేసి > చేశి 3 27

అగు వచ్చు చొచ్చు చూచు ధాతువులకు కాలబోధక ప్రత్యయాలు చేరినపుడు కా రా చొర చూడు లాదేశంగా వస్తాయి

అగు>కా కావించు 4 21

కావలెనని 5 11

వచ్చు>రా రాగా 2 18

రప్పించుక (4 8

చొచ్చు>చొర చొరబడి 64 14

చూచు>చూడు చూడవలెను (20. 8



అగు ధాతువు అయ్ ఆయ్ అన్న రూపాంతరాలను కూడా పొందుతుంది

అయి 3 13

ఆయె 74 16

పోవు ధాతువుకు పో పొయ్య అనే రెండు పర్యాయ రూపాలున్నాయి

పో పోయి 64 2 పొయ్ పొయ్యేది 65 1

పోయె 69 22 పొయ్యేటప్పుడు 66 4

ఇచ్చు ధాతువు ఇయ్ / ఈ అనే రూపాంతరాన్ని పొందుతుంది

తెచ్చియియ గా 54 5 కూతలింగ్గా 77 3

కొను ధాతువుకు శత్రర్థక ప్రత్యయం చు చేరినపుడు నకారం అనుస్వారంగా మారుతుంది

పరిహరించుకొంచున్ను 8 6

కొంచుబోయి 33 24

కొన్ని దకారాది క్రియా రూపాలు ప్రాఙ్నన్నయ యుగంలోనే దకారాది రూపాలుగా మారిపోయాయి కాని రా వా లో దకారాది రూపాలు ప్రాచీన రూపాలుగా నిలిచిపోయాయి

డిగ్గి 26 22

దన్నిన 60 24

రా వా లో కొన్ని క్రియా రూపాలు విలక్షణంగా కనిపిస్తాయి

యెదురుకొను 2 17 ఎదురేగు

పలకరించు 7 17 చెప్పు

త్రిపురుషించు 10 14 మంత్రించు

చలనము వచ్చు 10 26 ఆటంకం కలుగు

అప్పనం తీయు 18 16) కప్పం చెల్లించు

పరాకుచేయు 18 25 నిర్లక్ష్యం చేయు

అహంకరించు 21 18 గర్వించు

పరామరించు 22 16) విచారించు

పుష్పోదయం కాయు 26 8 మేల్కొను

— (•) —

# స మా సా లు

సమర్థవంతమైన పదాలు కలిసి ఏకపద స్ఫూర్తిని కలిగిస్తాయి ఈ ఏక పద స్ఫూర్తిని కలిగించడం సమాస లక్షణం తెలుగులో సమాసాలు అనేక విధాలుగా ఏర్పడుతాయి కొన్ని సందర్భాల్లో సమాసాలు భిన్నార్థ బోధకాలూ కావచ్చు ఈ భిన్నార్థ బోధకత సమాసంలో ్రయా విభక్తులు నామ విభక్తులు లోపించడంవల్ల ఏర్పడుతుంది సమాస నిర్మాణంలో పదాల మధ్య సంబంధం స్పష్టమవుతుంది

ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు వాక్యంలోని పదాం మధ ఉన్న అన్వయ క్రమాన్ని బట్టి నామ క్రియలనే భేదం లేకుండా నిర్మాణ రీతుల దృష్ట్యా సమాసంలో మూడు రకాలను చెబుతున్నారు

1 Endo cen r c Con ruc ons

2 Exo cen c Con ruc on

3 Co ord na e Cons uc on

వీటినే జా స్త్రి సూర్యనారాయణగారు వరుసగా—

1 తత్పురుషం

2 బహువ్రీహి

3 ద్వంద్వం అని గుర్తిందారు 2

తెలుగులోని సమాసాలను రెండు దృష్టులతో చూడవచ్చు

1 శబ్దదృష్టి

2 అర్థదృష్టి

శబ్దదృష్టితో తెలుగు వైయాకరణులు సమాసాలను మూడు విధాలుగా విభజించారు 6

---

24 Hocke C F A Cou e n Modern L ngu c PP 184 185

25 Suryanarayana J A S udy o Te ugu Compound P 22

26 ఒన్నయసూరి పరవస్తు బాలవ్యాకరణము సమాస సూ 2

1 సాంస్కృతికం

2 అచ్చికం

3 మిశ్రమం

సాంస్కృతిక సమాసాలు మరలా సిద్ధసమాసాలు సాధ సమాసాలని రెండు రకాలు సంస్కృత పదాలతో ఏర్పడేవి సాంస్కృతిక సిద్ధసమాసాలు సంస్కృత పదాలు తత్సమాలై సమసిస్తే అవి సాంస్కృతిక సాధ్యసమాసాలవుతాయి అచ్చ తెలుగు పదాలతో ఏర్పడేవి అచ్చికాలు మిశ్రమపదఘటిత సమాసాలు మిశ్రమాలు

అర్థదృష్టితో సమాసాలను ఆరు విధాలుగా వర్గీకరించారు

1 కర్మధారయం 2 తత్పురుషం 3 ద్విగువు

4 ద్వంద్వం 5 బహువ్రీహి 6 అవ యీభావం

శబ్ద దృష్టితో రా వా లోని సమాస రూపాలను ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు

| తత్సమం + తత్సమం | దేశ్యం + దేశ్యం |
|---|---|
| గిరిదుర్గం 3 17 | కావడి కుండలు 6 26 |
| పుణ్యఫలము 5 18 | చిగురు విల్లు 18 11 |

సమాసంలో భిన్న భాషా పదాలు పూర్వ పదంగా గాని ఉత్తరపదంగా గాని వస్తాయి

| తత్సమం + దేశ్యం | దేశ్యం + తత్సమం |
|---|---|
| నగరవిందు 57 13 | కాలు ధూళి 63 16 |
| నిత్య శేవ 77 12 | బంగారు ఎరము 11 24 |
| తత్సమం + అన్యదేశ్యం | అన్యదేశ్యం + తత్సమం |
| అంకుశఖానుడు 44 15 | సరదు స్థలం 41 15 |
| లక్ష్మీదావడి 49 25 | ముల్లా శాస్త్రం 42 1 |
| దేశ్యం + అన్యదేశ్యం | అన్యదేశ్యం + దేశ్యం |
| తోలుకుల్లాయి 6 26 | గడి కనుమలు 67 6 |
| కమ్మకాగితములు 39 22 | డెరిజా ఠాళ్ళు 59 12 |

తద్భవం+తత్సమం అన్యదేశ్యం+తద్భవం
చౌషష్టి 18 5 ప్రా త్రైజీతం 30 8 <సం జీవితమ్
చవు/చఉ<సం చతు
దేశ్యం+తద్భవం
చేవకంభము 10 16

**అర్థదృష్టి**

అర్థదృష్టితో సమాస విభజనను ఈ క్రింది విధంగా చూపవచ్చు

అర్థప్రధానం



కర్మధారయం

సాధారణంగా కర్మధారయ సమాసంలో విశేషణం పూర్వపదంగా ఉంటుంది ఉత్తరపదంగా కూడా ఉండవచ్చు విశేషణం యొక్క స్థానాన్ని బట్టి ఇది విశేషణ పూర్వపద కర్మధారయం విశేషణోత్తరపద కర్మధారయ మని రెండురకాలు ఆ విధంగానే ఉపమానం యొక్క స్థానాన్నిబట్టి కూడా ఉపమాన పూర్వపద కర్మధారయం ఉపమానోత్తరపద కర్మధారయమని వర్గీకరించడం జరిగింది

విశేషణ పూర్వపద కర్మధారయం

నిండు కొలువు 4 9 నిండైన కొలువు

మంచివేళ 11 11 మంచిదైన వేళ

విశేషణోత్తరపద కర్మధారయం

ప్రతాపాతిశయము 2 2 అతిశయమైన ప్రతాపము

బ్రాహ్మణోత్తములు 48 26 ఉత్తములైన బ్రాహ్మణులు

ఉపమాన పూర్వపద కర్మధారయం

అమృతాన్నం 6 11 అమృతం వంటి అన్నం

ఉపమానోత్తరపదకర్మధారయం

పాదపద్మములు 2 3 పద్మముల వంటి పాదములు

పాదారవిందములు 80 10 అరవిందములవంటి పాదములు

తత్పురుషం

ఇది ఉత్తర పదార్థ ప్రధానమైనది ద్వితీయాది భేదాలతో ఆరు విధాలుగా చెప్పబడుతుంది

ద్వితీయా తత్పురుషం

గోహింసకులు 34 10 గోవులను హింసించేవారు

మద్యపానులు 34 9 మద్యమును పానము చేసేవారు

నవరత్న పరీక్షితుడు[27] నవరత్నాలను పరీక్షించేవాడు

---

27 పరీక్షకుడు అనే శబ్దాన్ని ఇలా వాడి ఉండాలని సందర్భం తెలుస్తోంది

తృతీయా తత్పురుషం

తేగె నారి 18 3 తిగెతో చేసిన నారి
తిగెవిల్లు (18 1 తిగెతో చేసిన విల్లు)
రాతికట్నం[28] 78 2 రాతితో కట్టిన కట్టడం

చతుర్థీ తత్పురుషం

భిక్షాటనము (10 20 భిక్షం కొరకు అటనము
రాజ్యాపేక్ష 74 24 (రాజ్యం కొరకు అపేక్ష

పంచమీ తత్పురుషం

రణభీతి 68 6 (రణం వలనభీతి ఇక్కడ షష్ఠ్యర్థంకూడా చెప్పుకోవచ్చు
షష్ఠీ తత్పురుషం ఇది సంబంధార్థాన్ని సూచిస్తుంది

| | |
|---|---|
| బ్రా ప్రదక్షణము (5 21 | యమదూతలు 42 21 |
| కన్నీరు 19 11 | ఢమామి ధ్వని (63 13 |
| శిరోభారము 26 8 | సూర్యరశ్మి (63 17 |
| లక్ష్మీకటాక్షము 37 14 | ఎరంగ్గి నాదం 64 8 |
| మనుష యత్నము 51 10 | రాజచిహ్నాలు 67 18 |

సప్తమీ తత్పురుషం

ఇది నిర్ధారణార్థంలోను వైషయికార్థంలోను వస్తుంది
పురుష రత్నము 31 23 పురుషులలో రత్నం
విద్యాప్రవీణులు 18 5 విద్యయందు ప్రవీణులు

ద్విగువు

సాధారణంగా సంఖ్యావిశేషణం పూర్వపదంగా ఉంటుంది తత్సమ పదాలు సమసించినపుడు ఉత్తరపదంగా కూడా ఉంటుంది

నాలుగు దిక్కులు (9 5) ధర్మత్రయం (15 4

28 ఇక్కడ కట్టడం అన్నపదాన్ని కట్నంగా ప్రయోగించడం జరిగింది

ద్వంద్వం

ఇది ఉభయ పదార్థ ప్రధానమై ఉంటుంది

కలిమి బలములు 21 2
వల్ల్యపట్టణములు 21 3
పండిత పామరులు 21 4
పిన్న పెద్దలు 25 22
మదమాత్సర్యములు 36 17
వక్కలాకులు 43 17
బహుమాన సంమ్మానములు 43 21
సరస సల్లాపములు (44 1

అర్థం సరిగా తెలియని కొన్ని పదాలు రెండో పదంగా వచ్చి ద్వంద్వ సమాసం లాగా ప్రయుక్తమవుతాయి

కావలికట్లు 3 18
కత్తికట్టలాలు 54 22
కోకతాకలు 75 15

బహువ్రీహి

ఇది అన్య పదార్థ ప్రధానమైనది సమాస పదాల అర్థం కంటె భిన్నార్థాన్ని బోధిస్తుంది

నరపతి 7 22 రాజు

అలుమేలుమంగ (77 9 (పద్మావతి

చూడుకొదుత్తునాచ్చ్యారు 77 26) గోదాదేవి

అవ్యయీభావం

దినప్రతి (51 27 ప్రతి దినం

——

## సముచ్చయ ప్రత్యయాలు

మూల ద్రావిడ భాషలో సముచ్చయ ప్రత్యయంగా ఉమ్ అనేది కని ఎస్తుంది ఇది తెలుగులో ఉన్ గా మారింది తమిళం హ గన్నడాల్లో మాత్రం ఉమ్ గానే నిలిచి ఉంది నడుగన్నడంలోను హొసగన్నడంలోను తెలుగులో లాగే పరిణత చెందిన రూపాలు కనిపిస్తాయి

తెలుగులో కావ భాషలో ఈ ఉన్ ప్రత యం యకారాగమ నగాగ మాలను పొంది యున్ నున్ అనే రూపాంతరాలను పొందింది కొన్నిచోట్ల యునున్ యున్ + ఉన్ గాను కొన్నిచోట్ల యు నులు గాను కనిపిస్తుంది

వ్యావహారిక భాషలో సముచ్చయ ప్రత యం పదాంతాచ్చు ననుసరించి మార్పులను పొందింది ఇకారాంతాలపై న్ని/ ంన్ని నిలు గాను ఉకారాంతాలపై న్ను/ ంన్ను నులుగాను అకారాంతంపై అను గాను కనిపిస్తుంది దీర్ఘాంతాలపై కూడా కొన్నిచోట్ల ను ప్రత్యయం కనిపిస్తుంది రా వా లో ఈ సముచ్చయ ప్రత యాలన్నీ ప్రయుక్తమయాయి

—న్ని నూట యెనిమిది తిరుపతులనుంచిన్ని తీర్థప్రసాదములున్ను 2 15
స్థలాంతరాల నుంచ్చిన్ని వచ్చిన అయ్యంగార్లనున్ను 2 18

—ంన్ని కాశీ విశ్వనాథులనున్ను విశాలాక్షినింన్ని దర్శించి 7 26

స్వామి వారు యేవా శ రాచ కారానకు ఉద్యుక్తులై కదలుదురు అనిన్ని చిత్తం వచ్చినప్పుడు గణుటెబెట కరణీకులకు ఉత్తరువు యిచ్చి వారు వచ్చి గణుతి పెట్టినప్పటికిన్ని 45 1

—ని మేము అగ్రహబడి ఆ రీతిని యీ రీతిని అనతిచ్చినవారము గాము 43 23

న్ను యిప్పుడు ఆ రాజ ములున్ను దుర్గములున్ను దేశములున్ను కోటకొత్తళములున్ను విష్ణుస్థలములున్ను పుణ్యభూములున్ను సామంత సరదు రాజ ములున్ను జూచిరాలె ని
20 14 16

ఒన్ను మీరు కాశికి బోయిన సమయాన వేదవాసులు కావడి కుండలతో మధువున్ను ఖజాన వుంచుకొని 6 26

ఆశ్రితులై విద్వజ్జనులున్ను ఆ వర్ణన పూర్వకముగా ఇచ్చిన విభూతి గంధాక్షత నారికేళ లకుచ ఫలాదులు గజపతివారు రెండు చేతులా అందుకొని శిరసావహించి వారలకున్ను స్థానాపతులకున్ను జగన్నాయక ప్రసాదపదార్థములు వక్కలాకులున్ను యిప్పించి 50 1 4

ను వాకిటి గొల్లలతోను గజపతివారి తెగ సుబుద్ధి మొదలయిన నియోగ్యులు యెవరు వచ్చినా యేకాంతమని చెప్ప 72 1

అ + ను వరదునే దాల్లణ స్థానాపతులయిన అముపురంవారి అనంతజోటి పంతులున్ను మానశింగ్గువారి మాధవయ్యాను దాందువారి చెన్న గిరయ్యాను కటకంవారి కరుణాకరయ్యాను వోరగంటి వారి వోబళయ్యాను ఢిల్లీ సురతాణివారి ఢాకోజి పంతులున్ను 49 14 17

-యు మరియు నాస్తిక్యంబు అప్రపాదంబు అనర్థకంబు క్రోధంబు దీర్ఘచింత దీర్ఘసూత్రతయు యెరుకగలవారి యెరుంగమియు విషయంబుల తగులుటయు ననంబరగిన పదునాలుగు రాజ దోషంబులు పరిహరించి 14 20

— ० —

# వాక్యవిభాగం

తెలుగులో ప్రాచీనకాలం నుండి నేటిదాక వాక  నిర్మాణంలో అనేక మార్పులు వచ్చాయి అవి కేవలం కర్త కర్మ క్రియల్లో వచ్చిన మార్పులు కావు వాక్యనిర్మాణంలో నామక్రియా రూపాల ప్రయోగంలోను కారకాల్లోను అనుబంధ ప్రత యాల్లోను వాక్యానుసంధాన విధానంలోను వచ్చిన మార్పులని గుర్తించాలి

తెలుగులో వాకా లను మూడు విధాలుగా వర్గీకరించారు

అవి 1 సామాన్య వాక్యాలు 2 సంశ్లిష్ట వాక్యాలు 3 సంయుక్త వాకా లు

సామాన వాక ంలో ఒకే ఒక ఆఖా తపదం Pred ca e ఉంటుంది ఇవి క్రియారహితంగా కూడా ఉంటాయి క్రియా రహిత వాకా ల్లో కొన్ని సహజంగా క్రియ లేనివి మరికొన్ని క్రియ లోపించినవి ఒక వాక ంలో నిర్దిష్ట స్థానంలో ఇంకొక వాకా న్ని చేరిస్తే సంశ్లిష్ట వాక మేర్పడుతుంది ఒక వాక ంలో ఇంకొక వాక్యాన్ని చేరిస్తే సంయుక్త వాక ం ఏర్పడుతుంది

రా వా లోని వాక్యాలు ఒకదానితో ఒకటి గొలుసులాగా ముడిపడి ఉంటాయి ఇక్కడ వాక విరామాన్ని గుర్తించడం కష్టం వాక్యాల మధ తెగిపోని సంబంధం గోచరిస్తుంది

ఉదా విద్యానగరమందు వీర నృసింహ్మ రాయలవారు బ్రాంహ్మ ముహూర్తాన లేచి ఆరాధ్యుల నామావళులున్ను అధా త్మ సంకీర్తనలున్ను పాండవగీతలు భ్రమరగీతలు గజేంద్రమోక్షం భారత సావిత్రి దధి వామన స్తోత్రము గంగావతరణమున్ను నదిస్తోత్రమున్ను భారతం భాగవతం రామా

---

రామారావు చేకూరి తెలుగువాక ం పు

యణం ముచుకుందస్తుతి ఆ కూరస్తుతి భీష్మస్తుతి సంజ్ఞయుని నీతి విదుర నీతి చాణూరనతి పద నీతి ఇది మొదలైనవిన్ని నీతి వైరాగ శతకం పురాణ శ్రవణమున్ను రాజనీతులన్నియు విని దర్పణావలోకానంతరం కన కామణుల కపల కామధేనువనుస్పర నంబు జేసి విప్రవరుల దర నంబు జేసిన ఎంమ్మట దంత ధావన ముఖమజ్జన నామతీర్థమై విభూతి ధరియించి పేరోలగంబై కూర్చుండగాను నూట యనిమిది తిరువతుల నుంచిన్ని తీర్థప్రసాదములున్ను దెబ్బై రెండు దేవ స్థలాలనుంచి విభూతిగంధ ప్రసాదములున్ను రాగా యెదురుకొని ప్రతు ద్ధానముజేశి అంజలిచేసందుకొని శిరసావహించి స్థలాంతరాల నుంచ్చిన్ని వచ్చిన అయ ంగార్ల నున్ను ఆరాధ ఎతం వారలనున్ను వుచితాసనముల యందు కూర్చుండ నియమించి అష్టస్వయం వ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలం సాలగ్రామం తోతాద్రి నైమిశారణ్యం పుష్కర క్షేత్రం ఇది మొదలయిన స్థలాలకు సురక్షితము గలవా అని అడిగినందులకు దేవరవారి ప్రతాపాతిశయమువల్ల ఆయా స్థలాంతరముల వున్న ముద్ర కర్తలు వొకటి కొకటి కొదవలేకుండా నడుపుతా వున్నారు నూట యెనిమిది తిరువతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తావున్నది అని అయ్యంగార్లున్ను పలుకగా విన్నపం జేసినారు (పు 2 3లు

ఇలా అనేక వాక్యాలు కలిసిన మహా వాక్యాలే ఎక్కువగా కనిపిస్తాయి చిన్న చిన్న వాకా లు చాల తక్కువ రా వా లో కొన్ని క్రియారహిత వాకా లు కూడా కనిపిస్తాయి క్రియారహిత వాకా ల్లో రెండు నామబంధాలు Noun Phra e ఉంటాయి అందులో ఒకటి ఉద్దేశ్యం Head ఇంకొకటి విధేయం A r bu e ఇవి రెండూ ఏకవస్తుబోధకాలై ఉంటాయి

ఉదా మ్లేచ్ఛులు గోహింసకులు 34 10 ఇక్కడ మ్లేచ్ఛులు ఉద్దేశ్యనామం గోహింసకులు విధేయనామం విధేయనామం ఉద్దేశ నామం గురించి ఏదో ఒక విశేషాన్ని బోధిస్తుంది

క్రియ లోపించిన వాక్యాలు సహజంగా అంతర్నిర్మాణం Deep ruc ure లో క్రియ ఉండి ప్రయోగంలో అంటే బాహ్యనిర్మాణం Su ace S uc u e లో కొన్ని సందర్భాల్లో లోపిస్తుంది

ఉదా ఆ రాజ ములో గిరిదుర్గ స్థలదుర్గ వ˘దుర్గ జలదుర్గములు యెన్ని 23 22

కోటలు యెన్ని నగరములు గ్రామ భూములు యెన్ని 23 23

ఈ పై వాక్యాల్లో ఉంచు అనే అస్తర్థక క్రియ లోపించింది

**క్రియాసహిత వాక్యాలు** ఇందులో సకర్మక క్రియాబోధక వాక్యాలు అకర్మక క్రియాబోధక వాక్యాలు అనే భేదం ఉంది

**సకర్మక క్రియాబోధక వాక్యాలు** ఇక్కడి క్రియ కర్మాపేక్షమై ఉంటుంది

ఉదా ఇప్పుడు స్వామివారు లెఖ్ఖలు వరామరిక జేస్తున్నారు 24 5

ఇక్కడ వరామరిక జేస్తున్నారు అనే క్రియ లెఖ్ఖలు అనే కర్మను అపేక్షిస్తుంది కాబట్టి ఇది సకర్మక బోధకం

**అకర్మక క్రియాబోధక వాక్యాలు** ఈ వాక్యాల్లో క్రియ కర్మ నిరపేక్షమై ఉంటుంది

ఉదా పూర్వమందు కిష్కింధలో వాలిసుగ్రీవులుందురు 9 13

ఇక్కడ ఉందురు అనే క్రియ కర్మాపేక్షకం కాదు కాబట్టి ఇది అకర్మక బోధకం

వాక్యంలోని క్రియ లింగవచన భేదాన్నిబట్టి తద్బోధకమైన ప్రత్యయాన్ని గ్రహిస్తుంది కాని రావా లో కొన్ని వాక్యాల్లోని యల్లో పురుష బోధక ప్రత్యయం లోపించింది

**ఉత్తమ పురుష బోధక ప్రత్యయ లోపం**

మన పాలింట్టి జగన్నాథుల కృపవల్ల మునకలుగా హెచ్చరిక వడిరి 74 5 వడిరిమి

**ప్రథమ పురుష బోధక ప్రత్యయ లోపం**

మీకున్ను కార్యసాధకములున్ను కలిగిని అని వలకరించె 6 19 వలకరించెను

నేను నిద్రపొయ్యేటప్పుడు చూడుమూ అని చెప్పి అంపె (46 8 (అంపెను

ఆ మానికొమ్మను తన చేరి మర్దాఖండాన తెగవేశె 54 14 తెగవేశెను)

వ్యతిరేక అన్వయార్థక ధాతువు

ఇది ఉత్తమ మధ్యమ ప్రథమ పురుష ఏకవచన బహువచనాల్లో వరుసగా కాను కాము కావు కారు కాదు కారు అనే రూపాలను కలిగి ఉంటుంది మహతీ ఏకవచనంలోను అమనుష ఏకవచనంలోను కాదు అనే రూపం వస్తుంది అంతేకాక ఈ కాదు అనే రూపం వ్యావహారిక భాషలో అన్నిటి రావచ్చు రా వా లో ఉత్తమ ప్రథమ పురుషల్లో ఏకవచన బహువచనాలకు ఆయా రూపాలతో ప్రయోగాలు ఉన్నాయి కాని ఒకచోట మాత్రం ప్రథమ పురుష బహువచనానికి కాదు అనేది ప్రయుక్తమైంది

యీ శరీరానకు కావలెనని యిచ్చేతను అడిగినవాడను గాను 5 12

మేము రాజ్యాపేక్షకొరకు వచ్చినవారము గాము 74 25

వీర నృసింహరాయలవారు లెక్కపక్కలు అడిగి పరామరిశించిన వారుకారు 24 6)

యీ వరకు కర్నాటకం వారు మనశీమలోనికి వచ్చినవారుకాదు 66 1

ప్రత్యక్షానుకృతి D rec peech లో నేను తానుగాను మేము తాముగాను ప్రయోగించడం

ఉదా తాను అర్జున పౌత్రుడు అభిమన్యు పుత్రుండు పరీక్షిత్తుండను వాడను అభిదానం చెప్పగా 19 23

తాను ధర్మదేవతను అని తన నిజస్వరూపము కనిపించి 9 2

కృష్ణరాయలవారు తాము పెద్దలమైతిమి తమ మర్యాదగా రాజ్యపరిపాలనం జేసేటందులకు పట్టాభిషేకం అధిష్ఠాన కర్తలు చేయమని 11 9

తాము వయడు బియ్యమువారు మిగిలిన బొక్కసం భండారానవుండ్డే రొక్కరొజనాలు శిమభూములు మొదలుగా గల భాగ్యం మీదిన్ని 68 9

నామవాచక క్రియాన్వయం తెలుగు భాషలో నామవాచకానికి క్రియకు సమన్వయం Agreemen ఉంటుంది కాని రా వా లో కొన్ని చోట్ల అది పాటించలేదు బహువచన నామవాచక రూపానికి క్రియలో ఏకవచనం ప్రయోగింపబడింది

నూటయెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తావున్నది 3 2

ఉదా సామంత రాచకార్యములు విశేషములుగా లేదు 3 20

నిన్నుండి అయే ప్రయోజనము లేమి యున్నది 19 14

ఆ రాజ్యములోను దేవాదాయం బ్రంహ్మదాయం పుణ్య తీర్థములు నదులు పుష్కరిణులు గలిగివున్నది 33 21

**విశేష్యం బహువచనం (పూజ్యార్థం) లోను క్రియ ఏకవచనంలోను ప్రయోగించడం**

ఉదా గజపతివారు గుఱ్ఱాల తోడట్టు గోదావరి స్నానానకు వచ్చినారని 52 22

**సంఖ్యావాచక విశేషణం ఏ వ లో ఉంటే విశేష్యం బ వ లో ఉండడం**

వీరి నుండి పక కార్యములు వస్తే మేమే నేరస్తుల మనిన్ని 38 13 పక కార ము

**పరిమాణార్థక సర్వనామ విశేషణం తర్వాత వచ్చే విశేష్యాన్ని బ వ లో ప్రయోగించడం**

మొదట స్థలం వద్ద దిగిసందువల్ల వారికిన్ని ఆలోచన బుద్ధి యింత కార్యాలకు తెగవేసినారు 70 5 యింత కారా నికి

**సాముదాయిక విశేష్య Co ec ve Noun నికి మనుష్య వాచక బ వ తో కూడిన క్రియ వాడడం**

ఉదయమైతే గజపతివారి పాళం మనపాళం మీద వడుతావున్నారనిన్ని 69 12

**ఒక విభక్తికి మరొక విభక్తి వాడడం**

ధర్మం తప్పక నడిస్తే నెల మూడు వానలు గురుసును (18 15 నెలన్ నెలకు

సగం రెడ్డు పాళ్ళు యేటివడద పోయిరి 61 7 వరదన్ వరదలో

యేదుల సాహా కుతుపన షలక నిజాం శాహా వారు ముగ్గురున్ను నిలువలేక తిరిగి స్థలాలు వచ్చిరి 65 24 స్థలాలకు

కారకంలో కొన్నిచోట్ల ద్వితీయావిభక్తి ప్రత్యయమై న లోపిస్తుంది

గజపతివారి పొదగనగా 66 23 గజపతి వారిని

తురకల మటుపెట్ట వలెనని 28 2 తురకలను

ద్వితీయా విభక్తిలో న ప్రత్యయం కొన్నిచోట్ల ప్రయుక్తమైంది

తంమున స్వతంత్రులుగా తెచ్చిరి ఆ రీతున్నే నడిపించుడా అని 28 6

జగడంలో రౌతు రౌతున చంక్కనిడుకొని అమాంత ముగా గొంచు పోదురు 55 10

గజపతివారు ఆదియందు మమ్మున నాడిన మాటలున్ను నడపించ్చు మరా దలున్ను 72 8

**అమహద్వాచక విశేషణాన్ని మహద్వాచకానికి కూడా వాడడం**

బలవంతములైన జంతవులైన మనుషు లయినా యీ దిక్కు బలవంతపు వని చేయబడదు 9 18

ఇక్కడ మనుష్య అమనుష వాచకాలకు ఒకేరకమైన విశేషణం వాడ బడింది

**సంఖ్యావాచక విశేషణాలను విశేష్యం స్థానంలో ప్రయోగించడం**

రోజు గుర్రం వొఖ్కంటి నూరేశి పొల్ల లెక్క గుర్రములు వెయ్యింటికి లక్ష పుట్లవంతున గుర్రాలు యిరువైనాలుగు వేలింటికి యిరువైనాలుగు లక్ష లున్ను 24 18 నల్ల ప్రజలు లక్షకున్ను నెలనెలకు తప్పక సంబళం దిద్దుమని 3 3

**యత్తదర్థక ప్రయోగాలు** ఇవి తెలుగు భాషకు సహజం కాదు సంస్కృతభాషా ప్రభావంతో తెలుగులో ప్రవేశించాయి

**ఎన్నాళు అన్నాళు**

మీరు అక్కడ యెన్నాళు వాసముగా వుండురో అన్నాళ్ళున్ను ఆ పట్టములో గల ప్రజలందరున్ను సుఖస్థితిని వుండవలెను 8 9

**ఎంత అంత**

ఆ పట్టం యెంత్తమేరో అంత మేరానున్న వెలిపాళ్యాలున్ను దున్నించి 4 22

ఏయే ఆయా

యేయే లెఖ్ఖలు విన్నపం శాయమన్నారో ఆయా లెఖ్ఖలు శేకరించి 24 5

కర్మణి ప్రయోగాలు ఇవి కూడా సంస్కృత భాషా ప్రభావంతో తెలుగులోకి వచ్చాయి

ఆదారణ ం బలవంతములైన ఐంకువులైన మనుష్యులయినా యీ దిక్కు బలవంతపు పని శేయబడదు 9 9

క్రియ అధ్యాహారం కావడం

లోకములోన ఉ కం పందేచని తరిమేడిగాను కుందేలు ఉ క్కాన్ని తరి మేది యెక్కడ జూడము 9 8

ఇక్కడ పూర్వ వాక్యంలో క్రియ లోపించింది

అస్త్యర్థక క్రియ లోపించడం

ఆ రాజ్యంలో వుండే స్వామి కదను రాజ్యములో పెద్దలు బుద్ధిశాలులు బ్రాంహ్మలు సమర్పించి వస్తావున్నారు 3 23

ఈ వాక్యంలో కదమరాజ్యములో ఉండే అనే అస్త్యర్థక ధాతువు లోపించింది

తులనాత్మక వాక్య నిర్మాణంలో కన్నా ప్రత్యయం ప్రయోగించడం

వీరనరసింహ్మ రాయల వారున్ను యేలినందుకన్నా కృష్ణరాయల వారు యేలేది యెమన్నది 34 2 యేలినదానికంటె

యెదులసాహాంం దొరతనముకన్నా మీ దొరతనం పూర్వమైనది అని విందుము 45 7 దొరతనము కంటె

ఈ కన్నా ప్రత్యయం కన్నడ భాషా ప్రభావంతో వచ్చింది

మహద్వాచకాల జాబితా ఇచ్చినపుడు చివర అమహద్వాచక పర్యాయం ప్రయోగించడం

"నగరి అల్లుండ్లు కొమాళ్ళు దొరమన్నీలు ప్రభువులు పాళ్యగార్లు అమర నాయకులు ఆప్తులు ఆశ్రితులు విద్వాంసులు పురోహితులు ఆచార్య పురుషులు జియ్యంగార్లు యతీశ్వరులు దైవజ్ఞులు భేషజులు రౌతులు

మావుతులు చేర్వగార్లు రాజులు వంది వైతాళికులు పాఠకులు పతాణి
కులు శాస్త్రజ్ఞులు నాటకాలంకారులు విషాధికులు వీణాధరులు ఇవి మొదలు
గాగల డెబ్బైరెండు వినియోగాలవారున్ను 4 6 వీరు మొదలుగాగల

నామ్నీకరణం Nom na za on ఒక వాక్యాన్ని మరో వాక్యంలో నామంగా ప్రవర్తించేటట్టు చెయ్యటానికి జరిగే వ్యాకరణ ప్రక్రియా విశేషాన్ని నామ్నీకరణం అని వ్యవహరిస్తారు

భావార్థక నామ్నీకరణం ఇది రా వా లో ఏది అన్న ప్రత్యయంతో ఏర్పడుతుంది ప్రమాణ మాండలికంలో అటం/ అడం అనే ప్రత్యయంతో ఉంటుంది ఏది అన్న ప్రత్యయంతో కూడిన భావార్థక నామ్నీకరణం నేడు రా సీ మాండలికంలో ఎక్కువగా కనిపిస్తుంది

రాయలవారు తిమ్మరుసు వచ్చేది గని వచ్చ్రశము నిండారుగా గవ్వ్రాని
26-26

తొంమ్మిది పద్దెల గోతాం మూసిని చెయ్యెత్తు పొడుగువాడిని యెత్తేసిన్ని పైబడ తోసుకొనేదిన్నిగాక గోతాం తొడల నిడుగని 55 7

నామవాచకం + అగు ధాతుప్రయోగం

నామవాచకంపై అగు ధాతువుయొక్క అసమాపక క్రియారూపాన్ని వాడి వాక్యాన్ని ప్రయోగించడం రా వా లో ఎక్కువగా కనిపిస్తుంది

ఎమ్మట దంతధావన ముఖమజ్జన నామ ర్థమై విభూతి ధరియించి పేరోలగంబై కూర్చుండగాను 2 14

నామతీర్థం + అగు > నామతీర్థమగు > నామతీర్థమై

సంక్షేప రామాయణం పారాయణం అయిన తర్వాత వస్త్రాలంకారులై పేరోలగంబై ఒకలమయిన వారును నగరి వాకిట కూర్చుండి వుండగా
50 21

2 రామారావు చేకూరి తెలుగు వెలుగులు పు 104

కన్నాట-కాధీశ్వరులు కార ముఖానకు నడిచేవారై చతురంగ బల మును బలకేసుక బైలుమెరని సరమలకు వచ్చి కనిపెంమ్ముకునేవారై వున్నారు 51 1

**వేదర్థకంలో అప్పటికి అయిన ఆయనా ప్రత్యయాలు**

యీ రాత్రి అందుకైన కార ం కంట్టే కన్నట్టు కానవ్పటికి అందరి కిన్ని యుగం తృంగిగట్టు అపును 70 6 కానవ్పటిం లాంటి ప్రయోగాలు నేడూ వినిపిస్తాయి

గజపతివారు శిక ఆలోచనవల్ల తమకు ప్రాణహానిన్ని మానభంగ మున్ను అయిన అవని ప్రజలకు అవధిన్ని వచ్చును 70 18

నే జెప్పినట్టు నడిపిస్తి రాయనా నాయభీష్ట కార ములున్ను నెరవేరును 6 8

**ప్రశ్నార్థక ప్రత్యయాలుగా ఆ ఎ ఓల వాడుక**

ప్రశ్నార్థకం కొన్ని పదాలతోను కొన్ని ప్రత యాలతోను అభివ క్త మవుతుంది ఏమి ఎవరు ఎప్పుడు ఎక్కడ ఎందుకు ఎన్ని ఎంత అనేవి పదాలతో కూడుకొన్నవి ఏ ఓ అనేవి ప్రత యాలతో కూడుకొన్నవి

ఆ రాజయోగ్యమైన అన్నము దేవచ్చునా 5 0
స్వామివారు యీ రీత న రావచ్చునా 27 15

ఎ మీరు కర్నాటకాధిపతులతో సరియగుగునె 34 7

ఓ సాళువ తిమ్మరుసుగారు గరికి వచ్చి రాయలవారు పుష్పోదయ మైనారో అని వరామరశించగా 26 4

రా వా లో కాలబోధలో కొన్నిచోట్ల వ త స్తం గోచరిస్తుంది

**భూతకాలానికి తద్ధర్మం**

యిన్నాళు న్ను సీతి పద ము పిందుము 28 18 పిండిమి

**భవిష్యత్తుకు భూతకాలం**

నేజేప్పినట్టు నడిపిస్తిరాయగా నా యభీష్ట కార్యములున్ను నెరవేరును 6 18 (నడిపిస్తే

సుముహూర్తమందు మేము శంఖవాదము చేసినారము ఆ సమయమందు స్థాపించమనేటట్టుగా శిష్యులతో పలకరించి 10 18 చేస్తాము

భవిష్యత్తుకు వర్తమానం

తర్వాత నడుమ సమాచారములకు వెంబడిగా విన్నవించ్చి అంప్పుతన్నాను 80 10 అంపుతాను

భూతకాలిక సమాపక క్రియపై గా ప్రత్యయం

వేగర్లు వచ్చి కాకితములు యిచ్చినారుగా రాయలవారు తామే కాకితములు చదివి జూచకొని 68 26 కదా>గదా>గా

మొత్తం To a అని చెప్పడానికి అంతు అని ప్రయోగించడం

అలిశి నిలిచిన నాలుగు గుర్రాలవారును సరాశంపోయి వచ్చిన యెనిమిది గుర్రాలవారున్ను అంతు పండ్రెండు గుర్రాలవారున్ను గూడి 53 4 < అంతా)

పదక్రమం తెలుగు వాక్యంలో పదాల క్రమం కర్త కర్మ క్రియల వరుసలో ఉంటుంది ఈ క్రమం ముందు వెనకలైనా అర్థభేదం కలుగదు ఒక్కొసారి ఊనిక Empha s కోసం వీటి స్థానం మార్చబడుతుంది

వారు స్వాయత్తులుగారు పరాయత్తులుగాని స్వామివారు ఉభయాయత్తులు 37 1 వారు పరాయత్తులుగాని స్వాయత్తులుగారు

మనిషి మాత్రంవారు కారు 66 11 వారు మనిషి మాత్రం కారు

— ౦ —

# అర్థవిభాగం

భాష సంకేతమయం సంకేతం S gn రెండంశాలను బంధిస్తుంది ఒకటి అర్థం S gni ed మరొకటి శబ్దం S gn f can ఈ రెండింటి సమన్వయ రూపమే భాష

భాషా నిర్మాణంలో శబ్దార్థ సంబంధం యాదృచ్ఛికం Arb rary సంకేతాలేర్పడడంలో శబ్దార్థాల మధ్య ఎలాంటి నిమిత్త నైమిత్తిక భావమూ Mo va on లేదు కొన్ని ధ్వన్యనుకరణ లేదా శబ్దానుకృతితో ఏర్పడ్డ పదాలమధ్య మాత్రం శబ్దార్థ సంబంధం గోచరిస్తుంది

భాషలోని శబ్దార్థాలను పరిశీలించడంలో సస్యూరు మూడంశాలను గుర్తించాడు

1 భావం S gn ca on ఒక శబ్దానికి ఒక వస్తువుతో గల నిత్య సంబంధం

2 వైశిష్ట్యం Va ue ఒక శబ్దానికి ఇతర శబ్ద ప్రపంచంతో గల సంబంధ వైవిధ్యాల వల్ల కలిగే ప్రత్యేకత

3 అర్థం Con en భావవైశిష్ట్యాల సమాహారం

అర్థవిజ్ఞాని Seman ) ఒక భాషలోని పదాలను అర్థం దృష్ట్యా రెండు విధాలుగా పరిశీలించవచ్చు

1 వర్ణనాత్మక అర్థవిజ్ఞానం De cr p ve Semantics)

2 చారిత్రక అర్థవిజ్ఞానం H or ca Seman c

---

1 రెడ్డి టి ఎన్ అర్థపరిణామం తె భా చ పు 427

2 Sau sure Ferd nand de Cour e de L ngu c gene ra e (1915 r Wade Ba ken Pe er Owen PP 158 162

ఒక కాలానికి సంబంధించిన భాషలోని పదాల అర్థ స్వరూపాన్ని వివరించి చెప్పేది వర్ణనాత్మక అర్థవిజ్ఞానం వివిధ కాలాల్లో ఒక భాషలోని పదాల్లో జరిగిన అర్థ పరిణామాలను కాలక్రమ పద్ధతిలో చారిత్రక దృష్టితో వివరించి చెప్పేది చారిత్రక అర్థవిజ్ఞానం

రా వా భాషను పై రెండు విధాలుగా పరి లించి చూసినపుడు పదాల అర్థ స్వరూపం అర్థపరిణామం ద్ తకమవుతుంది

భాషలో మౌలిక పదాల సంఖ Pr mary wo ds పరిమితంగానే ఉంటుంది ఈ మౌలిక పదాలకు కొన్ని ప్రత్యయాలు చేరడంవల్ల భిన్నార్థాలు కలిగిన పదాలు పదబంధాలు అనేకం ఏర్పడుతాయి అలా ఏర్పడినవే కృదంత తద్ధిత రూపాలు

కొన్ని క్రియా ధాతువులు ఎలాంటి ప్రత యాలు చేరకనే నామ రూపాలుగా కూడా ప్రయోగింపబడతాయి

ఉదా పలుకు 75 6 చదువు 69 27

బ్రతుకు 59 23

ధ్వన్యనుకరణ శబ్దాలు

నామవాచకాలు మేక 59 4

దమామి 63 13

క్రియలు ఉస్సురను 17 16

ఎక్కటిల్లు 58 6

పటాపంచలగు 59 13

ఆమ్రేడిత రూపం గుసగుస 69 9

శబ్దపల్లవాలు నామవాచకాలకుగాని క్రియారూపాలకు గాని సహాయక క్రియలు చేరడంవల్ల విశేషార్థం సిద్ధిస్తుంది

మేలుగాంచు 26 2 నిద్రలేచు

మట్టుబెట్టు 28 21 చంపు

కట్టిబెట్టు 5 1 విడుచు

ద్విరుక్తరూపాలు ఒక పదాన్ని అవ్యవహితంగా పునరుక్తి చేయడం వల్ల కూడా విశిష్టార్థం వస్తుంది

వీధివీధుల 23 3 ప్రతివీధి
క్షణక్షణే 23 13 ప్రతిక్షణం
మాటిమాటికి 30 23 ప్రతిసారి

జంటపదాలు రెండు పదాల కలయికవల్ల ఏర్పడేపదం జంటపదం ఇందులో ఒకేపదం రెండుసార్లు ఆవృత్తి కాదు రెండు భిన్నపదాలుంటాయి ఆ రెండు పదాలకు అవినాభావ సంబంధం ఉంటుంది ఒక పదంతో కాక రెండు పదాలతో చెప్పడంవల్ల చెప్పదలచుకొన్న అర్థానికి బలం వస్తుంది ఒంటి పదంతో చెబితే తేలిపోయే అర్థం జంటపదంవల్ల బరువును సంతరించు కొంటుంది 3

ఈ జంట పదాలను మూడు రకాలుగా వింగడించవచ్చు

1 సమానార్థక పదాలు
2 భిన్నార్థక పదాలు
3 వ్యతిరేకార్థక పదాలు

1 సమానార్థక పదాలు ఒక భావాన్ని స్పష్టంగా ఎదుటివాని గుండెకు హత్తుకొనేలా చెప్పడానికి సమానార్థం గల రెండు పదాలు అవ ప ధానంగా ప్రయోగింపబడుతాయి

రా వా లో సమానార్థాన్ని బోధించే రెండు పదాలూ భిన్న భాషా పదాలుగా కనిపిస్తాయి ఇవి వ్యవహార రూఢివల్ల ఏర్పడ్డాయి

బొక్కస భండారములు 8 8 యాది హెచ్చరికలు 4 17
వస్తు సామగ్రీలు 4 15 రొక్క రూపాయిలు 43 22

కొన్ని జంట పదాలు ఒకే అర్థాన్ని బోధించవు మొదలైనవి అన్న అర్థంలో కొన్ని శబ్దాలుకాని ప్రతిధ్వనిత శబ్దాలుకాని కూడి జంటపదాలవు తాయి సూక్ష్మంగా పరిశీలిస్తే అర్థభేదం స్ఫురిస్తుంది 4

---

3 శ్రీనివాసరెడ్డి ఎ యల్ తెలుగులో జంటపదాలు తెలుగువాణి 1985 పుట 25

4 "స్థూలంగా చూసినపుడు రెండు పదాలు ఏకార్థ బోధకాలే అని అందులో ఒక పదం వ్యర్థమని అనిపిస్తుంది రెండు పదాల్లో ఒక పదం యొక్క అత్యంత సూక్ష్మాతి సూక్ష్మమైన అర్థభేదం గురించి పూర్తిగా తెలియనందువల్ల అంటున్నమాట యిది రెండువదాల అర్థమూ సమగ్రంగా అవగాహనకు వస్తే ఈ అభిప్రాయాన్ని మార్చుకోవలసి వస్తుంది " శ్రీనివాసరెడ్డి ఎ యల్ తెలుగులో జంటపదాలు తెలుగు వాణి (1985) పు 25

కోకతాకలు 75 15    కత్తి కట్టలాలు 54 22

2 **భిన్నార్థక పదాలు** రెండు పదాలకు అర్థాలు వేరుగా ఉండి ద్వంద్వ సమాసంలాగా ప్రయుక్తమవుతాయి

సరస సల్లాపములు 44 1    ఆశపాశలు 59 2

యోగ క్షేమాలు 45 1    ప్రియ ప్రయాసములు 70 23

పక లాకులు 50 4    బహుమాన సమ్మానములు 75 14

వా వ ప్రయప్రయాసములు 70 23 <వ య ప్రయాసములు

రా వా లో కొన్ని పదాలమధ్య అవినాభావ సంబంధం లేకపోయినా జంట పదాలుగా కూర్చబడినాయి

దరన స్నానములు 7 27    పూజా నమస్కారములు 5 ?

ప్రసాద ప్రభావములు 49 6    కీర్తి ప్రతాపములు 80 1

ప్రదక్షిణ నమస్కారములు 49 13

3 **వ్యతిరేకార్థక పదాలు** వ్యతిరేకార్థాన్నిచ్చే రెండు పదాలు జంట పదాలుగా కూర్చబడుతాయి ఈ పదాల మధ్య కూడా అవినాభావ సంబంధం వ్యతిరేకార్థంలో గోచరిస్తుంది

రేయిపగలు (8 11    నేర్పు నేరములు[5] 68 15

ఉత్తర దక్షిణాలు 10 13    ఆగ్రహ నిగ్రహములు 68 15

తూర్పు పడమరలు 10 14)    అవుగాములు 73 9)

ముందు వెనుకలు 47 27    పిన్న పెద్దలు 74 11

కీర్తి అపకీర్తులు 68 117

**పర్యాయ పదాలు** Synonym

రా వా లో ఒకే అర్థంలో అనేక పదాలు వాడబడినాయి ఈ పదాలు ఆనాటి వ్యవహారాన్ని తెలియజేస్తాయి

---

5 నేర్పు అన్న పదానికి వ్యతిరేక రూపంగా నేరమి అని వాడబడింది

వార్తలు నదవదికెలు 21 5 ప్రవర్తమానములు 22 6 వర్తమానములు 23 4 ప్రవర్తకములు 41 22

పర్యాయము మాట 3 18 తేప 50 4 సారి 50 15

విధం తీరు 34 24 రీతు 60 14 తెరంగు 46 8

తర్వాత ఎంమ్మట 2 4 /ఎమ్మట 30 9 మరివెనుక 28 2 వెనుక 36 5

ముహూర్తం లగ్నము 10 19 మంచివేళ 11

చెప్పు పలుకు 7 23 ఆనతిచ్చు 8 25 మందలించు 19 4

బయలుదేరు వెడలు 2) 25 బయలు మెరయు 5 12

డబ్బు రొక్కం 8 18 ద్రవం 2 4 రూకలు 29 13

అనేకార్థ పదాలు Po y emy

కొన్ని పదాలు అనేకార్థాల్లో ప్రయుక్తమవుతాయి

చింతించు ఇది ఆలోచించు బాధించు బాధపడు అన్న అర్థాల్లో ప్రయోగింపబడింది

అప్పాజీ చెప్పినట్టు వింటే ఆయన అపాయానకు తగ్గ ఉపాయం చింతించ్చ గలడనిపిన్ని 69 26 ఆలోచించగలడు

కాలు నిలువలేక కన్నీరుతోడట్టు చింతింపుతా వుండగా 19 11 బాధపడుతూ

అందరికిన్ని యింత కారం వచ్చునని ప్రజలు చింత్రపడుతా వుండ్డంగ్గ 69 7 విచారిస్తూ

ఆనతిచ్చు ఇది చెప్పు అన్న అర్థంలో కేవలం నియత సన్నివేశంలో రాజుకు రాయలకు మాత్రమే ప్రయోగింపబడింది

లెఖ్ఖ్కవ్రాసి తెచ్చి చదవమని తొంమ్మిది సంవత్సరమన్న ఎయిఎంచి ఆనతిచ్చిరి 24 1

అఘటన ఘటనా సామర్థ్యములు మీకే గలవు" అని ఆనతిచ్చినందుకు (27 23

**మాండలిక పదాలు**

భాష ఒకటే అయినా ఒక ప్రాంతంలో మాట్లాడే భాషకు మరొ ప్రాంతంలో మాట్లాడే భాషకు తేడాలుంటాయి వీటినే మాండలిక భేదాలు అంటారు రా వా లోని ఈ క్రింది ప్రయోగాలు మాండలిక భేదాన్ని సూచిస్తాయి

తావు దీని స్థలం అని అర్థం ఇది నేడు రాయలసీమ వాడుక భాషలో ఎక్కువగా వినిపిస్తుంది

శింగిరిభట్లు వున్న తావునకు వచ్చి 8 1

ఇది మునీశ్వరుల మహిమగల తావు 9 26

రేయిపగలు రాత్రి యొక్క వ్యావహారిక రూపమే రేయి/రేయు ఈ జంట పదంలో బహువచన ప్రత్యయం లేకపోవడం కన్నడ భాషా ప్రభావం క హగలు రాత్రి

అవ్వారిగా రేయివగలు అన్నదానము జేసేటట్టు కట్టడి శేయమని 8 11

లెఖ్కవఖ్కలు జాగ్రత్తగా రేయివగలు వ్రాసి శేఖరించి (24 8

యుద్ధము శేయకూడక ఇక్కడ వ్యతిరేకార్థక ప్రత్యయంగా కూడక ప్రయుక్తమయింది ఇది కూడ ఆనాటి మాండలికతను సూచిస్తుంది

సుగ్రీవుడు వాలితో యుద్ధము శేయ కూడక (9 20

వద్యసీతి చంద్రయ్య తనకు రాకూడక తన కుమారుని నగరికి అంపగా 23 9

లగ్నము ఇది నేడు రా సీ లో వివాహం అన్న అర్థంలో కూడా వాడబడుతుంది రా వా లో ఇది శుభసమయం/ముహూర్తం అనే అర్థంలో ప్రయుక్తమైంది

లగ్నము తప్పకుండ నిరీక్షించుకొని వుండగా 10 19

లగ్నం తప్పె స్తావ స్తిరో అని జ్ఞానదృష్టిని జూచి (10 25)

తడవు ఇది కన్నడభాషా పదం నేడు అనంతపురం సరిహద్దు ప్రాంతంలో ఎక్కువగా వినిపిస్తుంది ఇది రా వా లో సమయం సేపు అన్న అర్థంలో వాడబడింది

కొంతదడవు యేకాంతపు కొలువుగానుండి 4 9

అరుణోదయానికి నగిటకివచ్చి కొంతతడవు వవ్వళించి 22 2

నిలువ ఇది నిలుచు అన్న ధాతువునుండి వ అనే నిష్పన్న ప్రత్యయం చేరగా ఏర్పడిన నామరూపం ఇది రా వా లో పూర్వ పదంగాను ఉత్తర పదంగాను వస్తుంది

స్థాపించి వుంచిన నిక్షేపములకున్ను మమబియ గార్లమీద వెల్లు నిలువకున్ను 23 25

వారివారిమీది రొక్కనిలువలు లెఖ్ఖజూచి తోడుతోనె నిలువ రూకలు హరువు కాయమని నిరుత్తరువుగా అనటిచ్చిరి 29 18

అమరగార్లమీది లువ రొఖ్ఖమునకు అక్షణమందే వొవ్వజెవ్వమనగా 29 22

యోచన/యోచనచేయు ఇది కన్నడ భాషా ప్రభావంతో రా సీ లో సరిహద్దుల్లో ఎక్కువగా వినిపిస్తుంది

మనస్సున చూర యోచన యెంచి 25 23

సరదు స్థలాలు స్తోమ శుద్ధిగా యోచనకాయగా పనిలేదు 51 5

యాల ఎందుకు ఇది రా సీ లో అంతటా వినిపిస్తుంది

మీరు యిచ్చటికి యాల వస్తిరి 27 2

మీవంటి పెద్దలు వుండగా అట్టి కార ములు యాల వచ్చిని 27 20

పూసికె ఒక్కడ ఇకె ప్రత్యయం కన్నడ భాషా ప్రభావంతో వచ్చింది

సకల కార్యభారములన్ను మామీద పూసికెజేసి నడిపించగా 27 25

అలాగే నడపడికెలు

కోట కొత్త మల యందలి నడవడికెలు తెలిశి 2 5

ఆడుకొను మాట్లాడుకొను ఇది అనంతపురం సరిహద్దుప్రాంతంలో కన్నడ భాషా సాహచర్యంవల్ల ఇలా వ్యవహరింపబడుతోంది

నగరశోధనగా పాళ్యాలు చూస్తారాగా వారువార్లు ఆడుకొనే వార్తలు 69 11

వెనుక ఇది తర్వాత అన్న అర్థంలో ప్రయుక్తమైంది రా సీ లో ఇది అనాక / నాక <అ వెనుక అని వాడబడుతుంది

నాలుగార్లు దినములు వెనుక 36 5

కై జీతం కట్టిన వెనక 4 55

యెరుకజేయు ఇది రా వా లో తెలియజేయు అన్న అర్థంలో ఎక్కువగా ప్రయుక్తమైంది నన్నయ భ రతంలో జ్ఞానం/వివేకం అన్న అర్థంలో నామవాచకంగా వాడబడింది

యెద్దాని వినిన నెఱుక సమగ్రంబై యుండు ఆది 1 30

యెఱుకగలరె మగువలెందు ఆది 2 33

ఇది నేడు తెలంగాణా ప్రాంతంలో ఎక్కువగా వాడుకలో నిలిచి ఉంది

మొదటి పారుబత్యగానితో యెరుకజేసి 38 18

జగడము శేశినవారు తమతో యెరుకశేయక 54 7

లగ్నం నిశ్చయించ్చక రాయలవారికి యెరుకశేయగా 7 10

తట్టు పార్శ్వం వైపు ప్రక్క ఇది రా సీ లొ నేటికి ఎక్కువగా వాడుకలో ఉంది

యథాయథలుగా చెడి విరిగి పారిపోయి వఖతట్టు నిలిచివుండ్డగా 53 8

ఎల్లా/యెల్ల ఇది కన్నడంలో అన్ని అందరు అన్న అర్థాల్లో మహదమహద్భేదం లేకుండా వాడబడుతుంది రా వా లో కూడా ఆ అర్థాల్లోనే ప్రయుక్తమైంది

దుర్గములో వుండే వాల్లెల్లా జతనమైవున్నారని విన్నవం శేయంగా (59 6

యివి యెల్ల మనస్సున వుంచ్చక 68 16

వెయ్యారులు కన్నడంలో నూరు వెయ్యి సంఖ్యావాచకాలకు అతిశయార్థంలో అరు అనే ప్రత్యయం చేరి నూరారు సాఁరారు అనే రూపా

లేర్పడుతాయి ఆ ప్రభావంతోనే రా వా లో వెయ్యారులు అనే రూపం ప్రయుక్తమైంది

జగన్నాయకులను పూజించే అర్చకులకు వెయారులు లంచమిచ్చి ప్ర56 6

రా సీ లో నేటికీ ఈ రూపం బాగా వాడుకలో వినిపిస్తుంది

అవమర్యాద అగౌరవం ఇది రా సీ లోని కన్నడ సరిహద్దు ప్రాంతంలో వినిపిస్తుంది ఇది బహుశా అవకానం అన్న రూపసామ్యంతో ఏర్పడి ఉండవచ్చు కన్నడంలో ఈ రూపాలు ప్రసిద్ధం

వౌళవు రహసం అన్న అర్థంలో ప్రయుక్తమైంది కన్నడంలో కూడా వౌళవు అంటే రహస మనే అర్థం కాబట్టి ఇది కన్నడ ప్రభావంతో వచ్చిందని చెప్పవచ్చు

ఆ కాకితం గజపతివారు చదువుకాని ఆ తీరుననే యిక్కడివారికి వౌళ వియ్యగా 73 24

తోలుకవచ్చు తోడ్కొనివచ్చు ఇది రా సీ లో నేటి ఎక్కువగా ప్రచారంలో ఉంది

అందరినిన్ని చెరలు తోలుకవచ్చేమనిన్ని 67 26

**జాతీయాలు/పలుకుబడు**

ప్రతి భాషలోను కొన్ని మాటలు సమూహంగా ఉంటాయి వాటిని ప్రయోగించినపుడు ప్రత్యేకమైన అర్థం వస్తుంది అలాంటి మాటలనే జాతీయాలు/పలుకుబడు అంటారు ఇవి ఏ భాష కాభాషకు ప్రత్యేకంగా ఉండి అనుకరణ కసాధ్యమై ఉంటాయి

పలుకుబడులు సాధారణంగా జన సామాన్యంలోనుంచే వస్తాయి ఇవి పాండిత్యం వల్ల ఏర్పడినవి కావు

రా వా లో ప్రయుక్తమైన జాతీయాలు

కరతలామలకము దీనికి అరచేతిలోని ఉసిరికాయ అని వాచ్యార్థం కాని ఇది చాల సులభంగాను స్పష్టంగాను అన్న అర్థంలో వాడబడింది

మీకు కరగలాడ ముగ దెలిపేను అని వలకరించగా 6 21

గోదోహనమాత్రం దీని పాల ఎతకడానికి పట్టేకాలం అని అర్థం ఇది రా వా లో అతి స్వల్పకాలమనే అర్థంలో ప్రయుక్తమవు తుంది

మణికర్ణికలోన స్నానముజేసి గట్టుకువచ్చి గోదోహన మాత్రం వెలపల వచ్చి నిలిచివుండరు 7 3

ఇలాంటి ప్రయోగాలు నేటి భాషా వ్యవహారంలో లేవు

విల్లుబెట్టుమేరకు ఇది కూడా దూర ప్రమాణ సూచకంగా వాడినట్లు తెలుస్తుంది

తిమ్మరసయ గారు కూడాను విల్లుబెట్టుమేరకు అందలముదిగ్గి 26 22

గ్రామైక రాత్రము ఏనైకభుక్తం గ్రామైకరాత్రం అని శాస్త్రం సాధువులైనవారు రోజుకొకసారి భుజించి ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క రాత్రి గడిపేవారు రా వా లో జ్ఞానేంద్ర సరస్వతులు విద్యారణ్యలకు ఆశ్రమ స్వీకారమిచ్చి కఠోర నియమాలను ఉపదేస్తూ గ్రామైక రాత్రముగా చరింపుమని చెప్పారు

మూకాంబిక యందు జ్ఞానేంద్ర సరస్వతులు విద్యారణ్యులకు ఆశ్రమ స్వీకారమిచ్చి జ్ఞానోపదేశంజేసి సన్యాసాశ్రమమునకు సముకాంచ లోమండై కామక్రోధములు కట్టిబెట్టి మదమాత్సర ములు విడిచి శత్రువుల మిత్రువులుగా జూచి తిట్టినవారల దీవించిన వారముగా యెంచి భూమియే పర్యంకముగా శయనించి భిక్షాన్నమె అమృతాన్నమని తృప్తుండై కాషాయవస్త్రములు గట్టి నియత బ్రహ్మధ్యాననిపుణతను ఏకాంగుడై మౌనముతోడను గ్రామైక రాత్రముగా చరింపుమని ఉపదేశించిన ప్రకారానకు చలింపక సంచరింపగా" (5 5

సమరమిచ్చు ఇది రా వా లో యుద్ధం చేయు అన్న అర్థంలో ప్రయోగింపబడింది ఇక్కడ ఇచ్చు అనే సహాయక క్రియతో ప్రయో గించడంవల్ల విలక్షణత ఏర్పడింది

యీ పట్టు బలము కోనున్న విపరంపీద సమరమిస్తేను 37 12

నాలుగు గుర్రాలవారున్ను యెదురుగాపోయి సమరమిచ్చినారు 5 31

తురకలు గుఱ్ఱాలనిగని సమరమియ్యగా 53 10

అలాగే జగడమిచ్చు కూడా

కోటలోని గుఱ్ఱాలవారు వెళివచ్చి యెదుట నిలిచి జగడమియ్యగా (64 15

తాము పదార్గురముంన్ను జగడమిచ్చిన కర్నాటకం వారిని పారదోలి 67 19

దాపకట్టుగాబడు కుప్పగా కూలిపోవడానికి ఈ పలుకుబడి ప్రయోగింపబడింది ఇలాంటి ప్రయోగాలు 15 16వ శతాబ్దపు సాహిత్యంలో అనేకచోట్ల కనిపిస్తాయి

దాపకట్టుపడం గూలిన కాశీ 6 223

మన వృక్షములు దాపకట్టుగా బడగ రుక్మాం పుట 118

రా వా లో ఇది చాల చోట్ల ప్రయుక్తమైంది

పీధికి నన్నూరు యేనూరు లెఖ్కవడసారి యీరీతి నాలుగు పీదులను వేయి గుఱ్ఱాలున్ను అంన్ని రౌతులున్ను దాపకట్టుగా బడగా 53 7

అప్పుడు నాలుగువేల గుఱ్ఱం దాపకట్టుగా బడగా 60 15 ఇక్కడ గుఱ్ఱం అంటే గుఱ్ఱపుదండు గుఱ్ఱపుదళం అని అర్థం

మూడుం ముక్కాల మడియలలోగా రెండు వేలుంన్నెనమన్నూరు గుఱ్ఱాలున్ను అంన్నియు రౌతులున్ను దాపకట్టుగా మృతంబొంద్దిరి 64 17)

కత్తికట్టు ఇది యుద్ధంచేయు అన్న అర్థంలో ప్రయోగింపబడింది

యిఖను మనం రాయలదేవునితో యెదరించ్చి కత్తికట్టేది కార్యంకాదు 76 1

నిర్నామం చేయు సమూలంగా నాశనం చేయు అన్న అర్థంలో ప్రయుక్తమైంది పూళ్ళు పల్లెలు కాల్చేదిన్ని పసలం ప్రాయలు మేకలు గొఱ్ఱెలు గుఱ్ఱాలున్ను పట్టుకవచ్చి కాసుకు పకటిగా అమ్మేది యీరీతిగా నిర్నామం శేశేదింన్ని 59 6

పటాపంచలై పోవు చెల్లాచదరై పోవు అన్న అర్థంలో వాడబడుతుంది

తురకలు గుఱ్ఱాలను గని సమరమియ్యగా నిలువలేక పటాపంచ్చలై పారిపోయిన వారున్ను 53 11

తురకలు మూడు తెగలవారున్ను పటాపంచలైరి విరిగి యధాయథలై 59 13

**తొక్కిచూచు** పరిశీలించిచూచు అన్న అర్థంలో ప్రయోగింపబడింది పూర్వం రాజులు పట్టాభిషిక్తులైన తర్వాత స్వయంగా రాజ్యాన్ని పరిశీలించి చూసేవారు అలాగే కృష్ణదేవరాయలు కూడా రాజైన తర్వాత పెద్దలు ఏలిన రాజ్యాన్ని తొక్కి చూడవలెనని నిశ్చయించాడు

పెద్దలు ఏలిన రాజ్యములు తొక్కిచూడవలెను 20 8)

**నిపాతం చేయు** నాశనం చేయు అన్న అర్థంలో వాడబడింది

యేలుబడియైన మలాదరంత్రం నిపాతం శేస్తావున్నారు 63 22

గజపతివారి సీమాదరంత్రం నిపాతం శేసుకపోయి 6౦ 2

**కంపోలం చేయు** అల్లకల్లోలం సృష్టించు ఇలాంటి రూపాలు నేడు ఎక్కడా వినిపించవు

వెలిపాళ్యాలు చొరబడి చెరకొల్లబట్టి చాలా కంపోలం శేయంగా 64 14

మూడు తెగల తురకల రాజ్యమంతా కంపోలం శేశి 64 24

**యిడియకొట్టించు** కొల్లగొట్టించు అన్న అర్థంలో వాడబడింది

గనక రాయలవారు ఆ కోట యిడియకొట్టించి 64 21

**వేటారు తునకలుగా నరుకు** ముక్కముక్కలుగా నరుకు

యుద్ధరంగమందు వేటారుతునకలుగా నరికే జనిన్ని 67 23

**కాళు చేతులాడక** ఇది దిక్కు తోచక అన్న అర్థంలో నేడి వ్యవహరింపబడుతోంది

రిబబీలిని పణకెత్తి యెవ్వరున్ను శరీరాలు తెలియక విస్మృతి బొంద్ది కాళు చెతులాడక యెక్కడివారక్కడనె నిలిచివుందురు 68 7

**లెక్కపక్కలు** లెక్కలు వగైరా ఆ దానికి ఊతపద సహితంగా ప్రయోగింపబడింది ఊతపదాల్లో కూడా లక్ష్యార్థాలే చెప్పాలంటారు 6

6 బ్రహ్మానంద హెచ్ ఎస్ పరికల్పనము లక్షణ వ్యంజన సూత్రము 198 పుట 296

యీ వరకున్ను వీరన్రసింహరాయలవారు లెఖ పత్ర_లు అడిగి పరామరి ౦చిన వారు కారు 24 3

లెఖ్ఖ పత్ర లు జాగ్రత్తగా రేయు పగలు వ్రాసి శేఖ ౦చి 24 7

నిరుత్తరువు దీనికి తిరుగులేని ఆజ్ఞ అని అర్థం పూర్వ ౦ రాజుకు దే ఎదరు ఉండేదికాదు ఏమి చెప్పినా అది జరుగవలసిందే ఇలాంటి ఆజ్ఞ లను నేడు S and ng orde అని చెప్పుకోవచ్చు

వారివారి మీది రొక్క నిలువు లెఖ్ఖజూచి తోడుతోనే నిలువ రూకలు హరువుకాయమని నిరుత్తరువుగా అనతిచ్చిరి 29 19

నానాటి చెల్లువెచ్చానకు బొక్కసాన యిమ్మనేటట్టుగా నిరుత్తరువు జేసి 3 2

రాజు ఏమి చెప్పినా అది ఆజ్ఞగా పరిగణింపబడేది అందువల్లనే రా వా లో అంతటా ప్రభువైన కృష్ణరాయలకు అనతిచ్చు అనే క్రియ ప్రత్యేకంగా ప్రయోగింపబడింది

శీఘ్రగతిగా ఇది వేగంగా/త్వరగా అన్న అర్థంలో వాడబడింది ఈ అర్థంలోనే శీఘ్రతిగా అనేది కూడా ప్రయోగింపబడింది

దొరమన్నీల అందరినిన్ని తమతమ స్తోమముతోడట్టు శీఘ్రగతిగా సాగిరమ్మని చీట్లు అంపించి 27 12

మీ స్తోమముం తోడట్టు శీఘ్రగతిగా రమ్మని అందరి చీట్లు వ్రాయించి 26 8

అవ్వారిగా ఇది అమితంగా అన్న అర్థంలో వాడినట్లు తెలుస్తుంది

స్వామి సన్నిధిని షోడశ మహాదానములున్ను శేశి అవ్వారిగా సత్రము లున్ను గలుగజేశి 77 18

తోడుతోనె వెనువెంటనే

తోడుతోనె దొరమన్నెవార్లను అమరనాయకంవార్లను కొలువుకు రమ్మని 29 3

వా వారి మీది రొక్కనిలువలు లెఖ్ఖజూచి తోడుకోనె నిలువ రూకలు హరవు కాయమని 29 8

నానాటి సమాచారములు తోడుతోనె వచ్చి తమతో దెలుపమని 3ు 12

**ఉపమానాలు**

ఒక వస్తువునుగాని భావాన్ని గాని మరొక వస్తువుతోనో భావంతోనో పోల్చి చెప్పడం ఉపమాన లక్షణం ఉపమాన ఉపమేయములు కలసి వక్త చెప్పదలచిన భావాన్ని భంగ్యంతరంగా చెప్పదలిస్తే లక్షణమవుతుంది ఉపమానాలను చెప్పడం వల్ల చెప్పదలచిన విషయానికి స్పష్టత నిశితత్వం కలుగుతాయి రా వా లో అయాచోట్ల అనేక ఉపమానాలు చోటు చేసుకొన్నాయి

శైలతటమునకు లంఘించు సింహ్వాపు ఎల్లల చందాన సైన్యాన్ని పోల్చడం తురకలపై దాడి జరిపినపుడు రాయలసైన్యం సింహపు ఎల్లల రీతి శత్రుసైన్యంపైకురికిందని చెప్పబడింది

రామలింగమనాయుడు తురకల పాళెం వారి సమీపానకు పోగానే గుర్రాన్ని కత్తి కేడం తీసుకొని యేనుగుల బారుమీద శైలతటమునకు లంఘించు సింహ్వాపు ఎల్లల చందాన తొక్కి నడిచి 60 9

ఇక్కడ తురకల సైన్యాన్ని యేనుగులబారుతోను రాయలసైన్యాన్ని సింహ్వాపు ఎల్లలతోను పోల్చడం వల్ల రాయలసైన్యానిదే విజయమని భంగ్యంతరంగా తెలుస్తుంది

దోసకాయల చందాన వే తునకలుగా శత్రువులను నరకడం దోసకాయలు సున్నితంగా ఉంటాయి వీటిని సునాయసంగా కత్తితో ముక్కలు ముక్కలుగా చేయవచ్చు అలాగే తురకల సైన్యాన్ని రాయలసైన్యం వేగారు తునకలుగా నరికిందని చెప్పడానికి ది ప్రయోగింపబడింది అముక్తమాల్యదలోను ఇలాంటి ప్రయోగం కనిపిస్తుంది [8]

మదహస్తుల తొండముల ఖండములుగా నరికి మావటీలను యీటెల చేత కుమ్మి త్రోయగా యేనుగుల వారి మీందికి నడవగలవారు గుర్రాల పక్కెర లెత్తి కరుచ యీటెలతోనున్ను ఎడి యీటెలతోనున్ను వండ్డిబల్లెములతో

---

7 బ్రహ్మానంద హెచ్ ఎస్ పొడుపుకథల్లో అంతర్నిర్మాణాలు భాష జానపదం 1980

8 శ్రీకృష్ణదేవరాయలు అముక్తమాల్యద 90

మున్ను నచ్చితో శేదిన్ని దోసాయల చంద్దాన వేటూరు తునకలుగా నరికేదిన్ని యీరీతి నొప్పించగా 60 3

**చిత్రవాన కురిసినట్లు** చిత్రకార్తెలో వాన ఎటుబడితే అటు కుండ పోతగా కురుస్తుంది అలాగే చిలాపుఖాను సైన్యం శత్రుసైన్యంపై చిత్రవాన కురిసినట్లు అమ్ముల వర్షాన్ని కురిపించిందని ఉపమించబడింది అందే అమ్ములను అంత వేగంగా ప్రయోగించేవారని అర్థమవుతుంది

చిలాపుఖానుడనేవాడు అరవై వేల శింగ్గాణి రౌతుల తోడట్టు కనుమ మా [illegible] పెయ్యే రౌతురాజువ మీద చిత్రవాన గురిసేరీతి అమ్ముల గురియించ్చగా 65 8

**చెరుకుల నరికినట్లు** చెరుకును వాడియైన కొడవలితో చకచకా నరకవచ్చు ఆ విధంగానే శత్రుసైన్యాలను చెరుకుల నరికినట్లు నరుకుతామని షోడశపాత్రులు గజపతితో చెప్పుకున్నది ప్రయోగింపబడింది

యుద్ధరంగమందు వేటూరు తునకలుగా నరికేమనిన్ని దహత్తుం తొండ్లములతో కూడా కొమ్ములు ఖండించేమనిన్ని చెరుకుల నరికినట్లు కాల్బలములనన్ను వాల్లచే ఖండములనున్ను ఖండించేమనిన్ని 67 25

**అరటిబొందె నరికినట్లు** అరటిబొందెలు చాల సుకుమారంగా ఉంటాయి వాటిని నరకడానికి ఎక్కువగా కష్టపడనక్కరలేదు షోడశ పాత్రులు కఠినమైన చింత చేవకంబాలను సయితం చాల సులభంగా నరికేవారని చెప్పబడింది

రాజువాలో షోడశపాత్రులు చింత చేవకంబాలను అరటిబొందెలను నరికినట్లు నరుకుతున్నారని చెప్పనందువల్ల వారు చాల బలవంతులని విదితమవుతుంది

చింతచేవ కంబాలు ఆ ఖడ్గం చేత అరటిబొండ్దె నరికినట్టు నరుకుతా వున్నారు 53 17

**సముద్రం పొంగివచ్చే రీతి** సముద్రం పొంగినప్పుడు నీరు అంతటా వ్యాపించి ఉరకలతో మహోధృతగా ప్రవహిస్తుంది అదేవిధంగా ఎటుచూసినా సైన్యం ఉప్పెనలా కదలివస్తుందని చెప్పడానికిది ప్రయుక్తమైంది

దుర్గ్రామంలో నున్నవూడెములవారు సముద్రం పొంగివచ్చే రీతిని సేనా సముద్రం కదిలివచ్చేదిగని 63 16

యుగం తప్పంగినట్లు ఘోర విపత్తు సంభవిస్తుందని చెప్పడాని ది వాడబడింది రాయలసైన్యం గజపతిపై దండెత్తి వచ్చినపుడు అతిశక్తివంతులైన షోడశ పాత్రులను భేదోపాయంతో జయించే ఉపాయం ఆలోచించకపోతే ఘోర విపత్తు వాటిల్లుతుందని చెప్పినప్పుడిది ప్రయోగింపబడింది

యీ రాత్రి అందుకైన కార్యంకంటే కంప్పట్టు కానవప్పటి అందరి న్ని యుగం తప్పంగినట్టు అవును 70 7

**అతిశయోక్తులు**

ఒక విషయాన్ని ప్రశంసిస్తూ చెప్పినపుడు భాషలో అతిశయోక్తులు చోటు చేసుకుంటాయి రా వా లో అక్కడక్కడ కొన్ని అతిశయోక్తులు చోటు చేసుకున్నాయి

**సైన్యం మూకుమ్మడిగా కదలివచ్చినపుడు**

దుర్గ్రామంలో నున్న వూడెములవారు సముద్రం పొంగి వచ్చే రీతిని సేనా సముద్రం కదలివచ్చేదిగని కాలి దూళి మిన్నుముట్టి సూర్యరశ్మి గప్పినగని 63 17

**శ్రీ జగన్నాథస్వామి మహిమను వర్ణించినపుడు**

శ్రీ తారక బ్రంహ్మమైన జగన్నాథుల మహిమను ఆ స్థలం వర్తమానములున్ను ప్రసాద ప్రభావములున్ను వనిగాంవ వెయ్యి శిరస్సులున్ను రెండువేల జింహ్మలున్ను ల ఆదిశేషునికైన లెక్కింపనలవి గావు అన్నట్టుగా తోచును 49 7

**శ్రీకృష్ణదేవరాయలు సాళువ తిమ్మరుసును ప్రశంసించినపుడు**

సింహాసన వరభారకం వహించే మీవంటి పెద్దలు వుండగా అట్టి కార్యములు యాలవచ్చెని మీరు తృణాన్ని బట్టితే మేరువు శాయగలరు ఆ మేరువునే తృణముగా నడిపించగలరు అఘటన ఘటనా సామర్థ్యములు మీకు గలవు 27 21

అర్థపరిణామం

చారిత్రకంగా భాషలో కొన్ని పదాలు మరుగై పోయి క్రొత్తపదాలేర్పడి నట్లుగానే పదాల అర్థాలు కూడా మారిపోవడం సహజం అన్య దేశ్యపదాలు చేరినపుడు కూడా శాబ్దికమైన మార్పులే కాకుండా అర్థభేదం కూడా స్వీకృత భాషలో కలగడం అసహజం కాదు 9

ఆధునిక భాషాదృష్టితో చూసినపుడు రా వా లోని కొన్ని పదాల అర్థాలు మారిపోయాయని తెలుస్తుంది

స్థితి ఇది రా వా లో ఖర్చు అనే అర్థంలోను పన్ను tax అనే అర్థంలోను వాడినట్లు తోస్తుంది నేడు స్థితి అంటే పరిస్థితి Position అన్న అర్థమేగాని వేరుకాదు

గుర్రాలు యిరువైనాలుగు వేలు యేనుగ ఘట్టాలు నూటయిరువై కాల్బలము రెండు లక్షలు ఇందులకు స్థితి నెల వొకంటికి నలభై లక్షలు పంతున సంవత్సరానికి నాలుగు కోట్లు యెనభై లక్షలకు అమరనాయకానకు భూమలు ఏలుచున్నారు 29 11

తెలవు/శలవు ఇది కూడా ఖర్చు అనే అర్థంలో వాడబడింది కాని నేడు విరామదినం అన్న అర్థంలో వాడబడుతూంది

అవిగాక యీవరకున్ను సింహాసనస్తులు సింహాసనమున్ను నడుపుకొని తెలవు శిద్దాయాలు పోగా బొక్కసాన వుంచినది పందొమ్మిది కోట్ల యాభై యెరు లక్షల ద్రవ్యం 24 13

దుర్గములలోనివారు తమ చేతనైనట్టు సమరం శేశి మంద్దుగుండ్ల శలవై నిర్వహించలేక కౌలిచ్చినారు 6 39

తనకు తెలవులకు యిమ్మనగా రాయలవారు చాలా సంతోషపడి రామలింగ్గమనాయనికి పట్టీలు ఇచ్చి అంపగా 59 6

---

9 రెడ్డి జి యస్ అర్థపరిణామం తె భా చ 1974 పు 435

తాళిచౌకట్లు ప్రాచీన కాలంలో స్త్రీలు పురుషులు తాళి చౌకట్లను ధరించేవారు కాని నేడు స్త్రీలు వివాహానికి గుర్తుగా తాళిని ధరిస్తారు చౌకట్లను నేటి పల్లె ప్రాంతాల్లో కొందరు పురుషులు ధరించడం చూడవచ్చు పూర్వం రాజులైనవారు ఆయా సందర్భాల్లో కవులకు పండితులకు మంత్రులకు సేనాధిపతులకు ఇంకా అర్హులైన వారికి బహుమానంగా తాళిచౌకట్లు దట్టి కుళాయి కబాయి పకలాకు లివ్వడం సంప్రదాయంగా ఉండేది రా వా లో రాయలు అనేక సందర్భాల్లో తన మంత్రులను వివిధ బహుమానాలతో సత్కరించినట్లు కనిపిస్తుంది

అప్పాజిని రత్న కంబ్బలియందు కూర్చుండబెట్టి రత్నాభిషేకం స్వర్ణాభిషేకం చేశి నాలుగు నగల కోకతాకలున్నుయిచ్చి చైసరాలున్ను పచ్చల కడియాలు తాళిచౌకట్లు పచ్చలవొంట్లు ముత్యాలతురాయి వజ్రాల కంఠసరం కెంపుల వుంగ్గరములు యివి మొదలైన భూషణములున్ను యిచ్చి గంధ కస్తూరి తట్టు పునుగు జవ్వాజి మొదలైన పరిమెళముల దాత లెప్పాయిగా బహుమానములు శే 79 5-10

ముక్కు తిమ్మయ అల్లసాని పెద్దయ్య మాదనగారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతులందుకోవలెనని కవితా నాయకులతో పలుకరించ్చి ఆ తీరున అయానిని అనంగా కుళాయి కబ్బాయి తాళి చౌకట్లు చేసిరి పేరులు కోక తాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను మనుచరిత్రాను చెప్పుమని అనతిచ్చినారు 80 3 8

పక్కీరు ఇది రా వా లో సాధువు అనే అర్థంలో వాడబడింది ఇది నేడు అప్రయోజకుడు అన్న అర్థంలో కూడా ప్రయోగింపబడుతూంది బహుశా సాధువులు లౌకిక జీవితానికి దూరమైనందువల్ల ఈ అర్థ విస్తృతి కలిగి ఉండవచ్చు

కృష్ణరాయలు తురకారణం మీద దళమెత్తివచ్చి అనిమొనల కారణం పూని నడిపించే యెడల జయాపజయములు యెవ కని దైవజ్ఞులయిన బ్రాంహ్మలనున్ను ముల్లాశాస్త్ర ప్రవీణులయిన ప్కరులనున్ను భూత భవిష ద్వర్తమానములు తెలిశిన శకునజ్ఞలనున్ను పిలుపించ్చి అడుగగా 42 2

కొంప ఇది రా వా లో ఇల్లు అన్న అర్థంలో వాడబడింది నేడు ప్రత్యేక సందర్భాల్లో కోపం వచ్చినపుడు మాత్రమే కొంప అని వాడబడుతుంది

రాయలవారు నగరు శోధనజేసి లీరుగా నగరు ప్రవేశం ఆయే వరకున్ను వీధివీధుల వెంబడినే తిరిగిమరిగి తన విడిది కొంపకు పోవును 23 3

మందలించు ఇది నేడు తిట్టు అన్న అర్థంలో వాడబడుతూంది రా వా లో అనేకచోట్ల ఇది చెప్పు అన్న అర్థంలో ప్రయుక్తమైంది

విజయాపురం కోట కొత్తళములున్ను లెస్సగా తీర్చి రస్తు సామగ్రీలు వేయించమని మందలించగా 35 7

షోడశ పాత్రులలోనున్ను యాది హెచ్చరికలు కలిగి వుండ్డమని మండ్దలించ్పగా 51 25

గజపతివారు అన్నిందింన్ని ప్ర పాలిటి జగన్నాయకులు వున్నారు అని మండ్దలించినందుంకు 51 16

కమ్మకాగితములు ఇది జంటపదం రా వా లో ఇది జాబు లేఖ అనే అర్థంలో వాడబడింది తెలుగులో నేడు ఆ అర్థం వాడుకలోలేదు కన్నడంలో మాత్రం కాగద అనే పదం నేటికి జాబు అనేఅర్థంలో వాడబడుతూంది కమ్మ అంటే తెలుగులో చెవిపోగు కర్ణాభరణం అనే అర్థం నేడు వాడుకలో స్థిరబడింది

సింహాసనస్థులైనవారు శేశినసంబ్రశం సారికెలు యిప్పించ్చి దిక్కుల స్థానాపతులతోదట్టు కొలువుకువస్తే కమ్మకాగితములు కలిగితేను 43 15

విజయనగరాన నుండిన్ని కా తములు వ్రాశి వచ్చెను 33 4

నిజాం శాహువారున్ను కుతుపనములకవారున్ను విజయనగరాన నుండి కాకితములు వ్రానివచ్చినది విని ఆలోచనపరులై 34 25

కార్యం ఇది రా వా లో పని అనే అర్థంలో వాడబడింది ఇది నేడు కార్యక్రమాలు అన్నసమస్త రూపంలోనే ఎక్కువగా నిలిచి ఉంది

ముందర నడిపించతగ్గ కార ములకు ఆలోచన యేమని అడిగినందుంకు 25 14

రాయలవారు నిత కృత ములున్ను రాత్రి కొలువు తీసిన తర్వాత "గరు శోధనకు విచ్చే శి సకల కార ములున్ను తెలుసుక 22 1

రా వా లోనే కరం అనే పదం దాడి అనే అర్థంలో కూడా వాడబడింది

తురణం మీద కారం శేయవలెనని 36

త్యాగం ఇది రా వా లో దానం అనే అర్థంలో వాడబడింది అదిగాక గజపతివారి యెవ్వరికి త్యాగమిచ్చినా యేనుగ గుర్రం తాశి చౌకట్ల దట్టి కుళ్లాయి కబాయి వక్కలాకులు యిచ్చె దింతెగాని యీ దేశంవలె వుద గరల వక్కలాకులు మాత్రం యిచ్చి అంపేది లేదు 55 25

గ్రాసం ఇది రా వా లో ఆహారం అన్న అర్థంలో వాడబడింది

యెంద్దరు వచ్చినా వార్లకు గ్రాసం కట్టడజేశివుండ్డును గనక వారలకు గ్రాసం యిప్పించ్చి 39 21

పరిశోధకుడు ఇది నేటి అర్థంలోకాక బోధకుడు అనే అర్థంలో రా వా లో ప్రయుక్తమైంది

వారిలో పరిశోధకుండైన గూఢచారుడు వచ్చి సాళువ తిమ్మరుసుగారితో పట్టానకు రెండామడ దూరానకు ఉత్తరముగాను పశి కొండ రంగనాధ స్వామి సన్నిధికి ఏకాంతముగా విచ్చేశి 26 12

చలనం/చెలనం ఇది విఘ్నం/అటంకం అనే అర్థంలో వాడబడింది నేడు ఇది కదలిక అన్న అర్థంలో మాత్రమే స్థిరపడింది

నరపతి రాజా నకు పరోపకారముగ పురం గావించవలెనని యెన్నటి కిన్ని చెలనం లేకుండా వుండేటట్టు మంచి ముహూర్తాన శంకుస్థాపనం జేశి వాస్తు పురుమని నిలిప 0 1

జంగమువాండు శుభనాదము చేసినట్టుగా దెలిసి చలనము వచ్చెనని విదా రణు లు జూచి 10 26

రూక రా వా లో ఈ పదం డబ్బు అన్న అర్థంలో ప్రయోగింప బడింది నేడు రూక అంటే నాణెం coin అని అర్థం

కాలిపట పురానకువచ్చి కాంత్తమతి సమేతముగా వేణువనేశ్వరస్వామిని దర్శనం శేశి తామ్ర సభ కట్టించేటంద్దుకు కొంత్త రూక యిచ్చి కృష్ణరాయ సముద్రమని తన పేర అగ్రహారము గావించ్చి 78 11

పొడవు ఇది దూరం అనే అర్థంలో ప్రయుక్తమైంది

గజపతివారు యేడెనిమిది ఆమడ పొడవు ఉత్తరంగా పారిపోయిరి 74 8

న్యాయములు ఇది వార్తా విశేషాలు అన్న అర్థంలో కూడా వాడ బడింది

నడచిన కార్యములలో బలదుర్బలములు తెలువకపోతే యీ ప్రాక్యాన యిటువంటి పీధిని యీ యీ శ్రేణిలో ఇంన్నో యింటివద్ద రాత్రి నడచిన న్యాయములు తెలిసినవాడవు గావు 22 10

కట్టిపెట్టు ఇది త జించు అన్న అర్థంలో వాడబడింది

కామక్రోధములు కట్టిపెట్టి మదమాత్సర ములు విడిచి 5 1

ఈ విధంగా రా వా లో కొన్ని పదాల్లో అర్థ పరిణామం గోచరిస్తుంది

— ० —

# కన్నడ భాషా ప్రభావం

ఆంధ్ర కర్నాటక ప్రాంతాలు భౌగోళికంగా దగ్గరగా ఉండడంచేతను చారిత్రక కాలంలో అప్పుడప్పుడూ ఒకే రాజు అధిపత్యంలో ఉమ్మడిగా ఉన్నందువల్లను తెలుగు కన్నడ భాషలు రెండూ ద్రావిడ భాషా కుటుంబా నికి చెందినవై సాన్నిహిత్యాన్ని కలిగి ఉండడంచేతను రాజకీయ సాంఘిక ధార్మిక సాంస్కృతికపరంగా సాన్నిహిత్యం ఉన్నందువల్లను తెలుగు కన్నడ భాషా సాహిత్యాలమధ్య అవినాభావ సంబంధం ఏర్పడి పరస్పర ఆదాన ప్రదానాలకు మంచి అవకాశం ఏర్పడింది

సాహిత్యంలో తెలుగు కన్నడ భాషల చారిత్రక సన్నివేశం నన్నయ గారితో మొదలవుతుంది నన్నయ ఆంధ్ర మహా భారతాన్ని వ్రాసినప్పుడు తన కాలం నాటికి శ్రేష్ఠ సారస్వతంతో ఒప్పుతున్న కన్నడ సారస్వతంనుండి ప్రశస్తమైన లక్షణాలను స్వీకరించడమే కాకుండా ఆదికవి పంప భారతం వల్ల కూడా ప్రభావితుడయాడు

నన్నయ తర్వాత రాజ కవియైన నన్నెచోడుడు తన కుమార సంభవం లో కన్నడ కవితా సంప్రదాయాలను హెచ్చుగా అనుసరించడమే కాక కన్నడ సాహిత్య ప్రభావం వల్ల మొట్ట మొదట దేశి మార్గ కవితలు వస్తు కవిత మొదలైనవి ప్రయోగించాడని పండితాభిప్రాయం

క్రీ శ 12వ శతాబ్దంలోనే కర్నాటక శివశరణుల ప్రభావం ఆంధ్ర శివ కవులమీద ప్రగాఢంగా సోకింది ఇక్కడే భాషకు తోడుగా మత ప్రభావం ప్రధానంగా కనబడుతుంది

---

1 వెంకటరావు నిడుదవోలు తెలుగు కన్నడముల పరస్పర సంబంధము తెలుగు విజ్ఞాన సర్వస్వము VI పు 633

కర్నాటకలో బసవణ్ణ నాయకత్వం వహిస్తే ఆంధ్రదేశంలో మల్లికార్జున పండితారాధ్యుడు నాయకత్వం వహించాడు అప్పుడే పండితారాధ్యుడు తన శివతత్వసారాన్ని కన్నడంలోనికి కూడా అనువదించాడు తర్వాత బహుభాషా పండితుడైన పాల్కురికి సోమనాథుడు తెలుగు కన్నడ సంస్కృత భాషలలో అనేక గ్రంథాలు వ్రాసి వీరశైవ మతాన్ని బహుళ ప్రచారం చేశాడు ఇతడు తెలుగులో వ్రాసిన బసవపురాణం పండితారాధ చరిత్ర వృషాధిప శతకం మొ నవి చాల ప్రసిద్ధం శివశరణులను గూర్చి కావ్యాలుగా వ్రాసిన వారిలో మొట్టమొదటివాడు పాల్కురికి సోమనాథుడు ఇతడు కన్నడ భాషలో కూడా కావ్యాలు వ్రాసి కర్నాటకలో కూడా ఖ్యాతి గడించాడు

తిక్కన భారతంలో అనేకచోట్ల ఆది పురాణ ప్రభావం ఉన్నట్లు గోచరిస్తుంది ఎర్రన నయితం పంప భారతాన్ని అనుసరించినట్లు విద్వాంసులు అభిప్రాయపడ్డారు 2

తిక్కన సమకాలికుడైన కేతన కన్నడంలో రెండవ నాగవర్మ రచించిన కర్నాటక భాషాభూషణం అనే లక్షణ గ్రంథం ప్రభావంతో ఆంధ్ర భాషాభూషణం అనే గ్రంథాన్ని రచించాడు అలాగే కేతన వ్రాసిన దశకుమార చరిత్ర ప్రభావంతో కన్నడంలో చౌడరస కవి అభినవ దశకుమార చరితె ను వ్రాశాడు

కన్నడ జనప్రియ కవి కుమారవ్యాసుడు భామినీ షట్పదిలో వ్రాసిన "కుమార వ్యాస భారత" అనే కావ్యప్రభావం శ్రీనాథ పోతనాది సమకాలీన కవుల మీద బాగా ప్రసరించింది

విజయనగర రాజులలో ప్రసిద్ధుడైన శ్రీకృష్ణదేవరాయలు క్రీ శ 1509 30 తెలుగు కన్నడ తమిళ సంస్కృత భాషలలోని పలువురు కవులను పోషించడమేకాక తానుకూడా కవియై ఆముక్తమాల్యద అనే ప్రబంధ

---

2 వెంకటరావు నిడుదవోలు తెలుగు కన్నడముల పరస్పర సంబంధము విజ్ఞాన సర్వస్వము V పు 634

కావ్యాన్ని రచించాడు ఇతని ఆస్థానంలో తెలుగు కవులేకాక కన్నడ కవులు కూడా ఉండేవారు[3] తెలుగులో నంది తిమ్మన పారిజాతాపహరణం అనే కావ్యానికి కన్నడకవి రుద్రభట్టు క్రీశ 1180 జగన్నాథ విజయం కావ ప్రేరణ ఉంది విజయనగర కాలంలో తెలుగు కన్నడ భాషా సాహితా ల మధ్యగల సంబంధం మరింత గట్టిపడింది

సాహిత ప్రక్రియల్లో కూడా తెలుగు కన్నడ భాషల్లో పరస్పర ప్రభావం గోచరిస్తుంది కన్నడంలో అచ్చకన్నడ కావ్యాలు వెలసినట్టుగానే తెలుగులో అచ్చతెనుగు కావ్యాలు వెలిశాయి వచన సాహిత్యంలో కూడా వీటి మధ్య సామ ం కనిపిస్తుంది

కర్నాటక సంగీత పితామహుడైన పురందరదాసు కీర్తనలమీద ఆంధ్ర పదకవితాపితామహుడైన అన్నమాచార్యుల కీర్తనల ప్రభావం ఉంది ఆ తర్వాత తెలుగులో ప్రసిద్ధుడైన త్యాగరాజుపై పురందరదాసు ప్రభావం సోకింది ఈ విధంగా ప్రాచీనకాలంనుండి తెలుగు కన్నడ భాషలమధ అత్యంత సాన్నిహిత్యం కనిపిస్తుంది

రా వా విజయనగరంలో వెలువడినందువల్ల దానిపై కన్నడ భాషా ప్రభావం ఎక్కువగా పడింది విజయనగరంలో ఆనాడు తెలుగు కన్నడ భాషలు రెండూ బాగా వ్యవహారంలో ఉన్నట్లు మనకు శాసనాలవల్ల తెలుస్తుంది[4] ఒకే శాసనంలో తెలుగు కన్నడ భాషల్ని వాడడం కూడా చూడవచ్చు రా వా కర్తకు కన్నడ భాషలో కూడా అభినివేశం ఉన్నట్లు రా వా భాషవల్ల తెలుస్తోంది రా వా భాషలో ఉచ్చారణలోను పదజాలంలోను పదబంధాల్లోను సర్వనామాల్లోను వాక్య నిర్మాణంలోను కన్నడ భాషా ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది

---

3 వెంకటరామప్ప కె శ్రీకృష్ణదేవరాయనకాలద కర్నాటాంధ్ర సాహిత సమీక్షె 1974 పు 2

4 విజయనగర శాసనములు పు 139 - 150 లు

**ఉచ్చారణ**

రా వా లొ కొన్నిపదాల్లో కన్నడ భాషోచ్చారణ ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది సాధారణంగా కన్నడ పదాల్లో ణ ళలు ఉంటే తెలుగు సారూప్య పదాల్లో న లలు ఉంటాయి అలాంటప్పుడు తెలుగులో ణ ళలు ఉన్నాయంటే అది కన్నడ భాషా ప్రభావమని నిశ్చితంగా చెప్పవచ్చు

ఉదా అణ్ణగర్లు 26.6 / అణ్ణగళులు 27 7 మళయాళం 3 11 కళ్యాణ 11 21 స్థళం 67 21

ణ ళలు ప్రయుక్తమైన కన్నడపదాలు న లలు ప్రయుక్తమైన తెలుగు సారూప పదాలు కొన్నిటిని ఈ క్రింద ఉదాహరణప్రాయంగా చూడవచ్చు

| ణ | ళ |
|---|---|
| క అణ్ణ తె అన్న | క గాళి తె గాలి |
| క కణ్ణు తె కన్ను | క చళి తె చలి |
| క చిణ్ణ తె చిన్న | క ఉళి తె ఉలి |
| క కాణికె తె కానుక | క ముళు తె ముల్లు |

నడవడికెలు సంబళం సాటికెలు అన్నప్పుడు బహువచన లు వర్ణానికి ముందున్న ఎత్వం కన్నడ భాషా ప్రభావమని స్పష్టంగా తెలుస్తుంది

**పదజాలం**

అప్ప కన్నడంలో ఇది నామాంత్యపదంగాను నాన్న అన్న అర్థంలోను పూజార్థంలోను వాడబడుతుంది కన్నడ సరిహద్దు ప్రాంతంలోని వ్యవహర్తల్లో నేటికీ ఈ అర్థాల్లోనే ప్రయుక్తమవుతోంది రాయలకు తిమ్మరుసు యెడల పితృవాత్సల్యం ఉన్నందువల్ల రాయలు తిమ్మరుసును అప్పాజీ అని పిలిచేవాడు ఇక్కడ గౌరవ సూచకంగా జీ అనే మరాఠి ప్రత్యయం చేర్పబడింది మహారాష్ట్రలో మరాఠీ పేర్ల చివర ఎక్కువగా ఈ జీ/జి అనే ప్రత్యయం కనిపిస్తుంది రా వా లో కొంతమంది స్థానాపతుల పేర్ల చివర ఈ ప్రత్యయం కనిపిస్తుంది [5]

ఉదా అప్పుడు అప్పాజి మాటలు వినక వచ్చినందుకు ఇంత కార్యం వచ్చెను 69 2

5 రాయవాచకము పు 40

అప్పాజీ రాయలవారు వచ్చేది జూచి 69 19

అప్ప అనేది వ్యక్తి నామాంత్య పదంగా కూడా రా వా లో వాడ బడింది

ఉదా బోయి రామప్ప 44 17 కొమార తిమ్మప్ప 44 10

కాను ఇది కన్నడంలో ఎక్కువగా వాడుకలో ఉంది తెలుగులో కన్నడ సరిహద్దు ప్రాంతంలో మాండలికంగా కానింత కానిన్ని అన్న రూపాల్లో నిలిచిఉంది

ఉదా నాకూ కానింత ఇస్తావా? నాకూ కొద్దిగా ఇస్తావా?
కానిన్ని నీళు ఇస్తావా? కొన్ని నీళు ఇస్తావా

ఇంకా ఇది కాసుల సరం లాంటి పదబంధంలోను నిలిచి ఉంది

రా వా లో అతి తక్కువ ద్రవ పరిమాణానికి బదులుగా కాసు అనే పదం ప్రయోగింపబడింది

వసలం ప్రాయలు మేకలు గొర్రెలు గుర్రాలున్ను పట్టుకవచ్చి కానుకు వకటి అమ్మేది 59 4

స్తోమము కన్నడంలో జనస్తోమ అనే పదబంధం జనులగుంపు జనబలం అనే అర్థాల్లో నేటికి వాడుకలో ఉంది రా వా లో స్తోమము అన్న పదం సైన్యం అన్న అర్థంలో కూడా ప్రయుక్తమైంది

దొరమన్నీల అందరినిన్ని తమతమ స్తోమములు తోడట్టుకొశీఘ్రగతిగా రమ్మని చీట్లు అంపించి 27 12

ఆ కనుమల్లో ముప్పై వేల స్తోమాన్ని ఠాణ ం వుంచ్చి 65 20

తెలుగులో వాడుకలోఉన్న స్తోమత అన్న పదం కూడా జనబలం అన్న అర్థం నుండే పరిణమించింది

పదబంధాలు

వీటిలో జంటపదాలే ఎక్కువగా కనిపిస్తాయి ఇవి కన్నడ బదబంధాల సామ్యంతో ఏర్పడ్డాయి

అంకపంకలు ఇది కన్నడంలో అక్కపక్క అని వాడబడు తోంది దీనికి ఇరుగుపొరుగు అని అర్థం

అక్కపక్కదవరు చన్నాగిద్దారా? ఇరుగుపొరుగువారు బాగున్నారా?

రా వా లో ఇది అనునాసిక సహితంగా ప్రయోగింపబడింది దీనికి సమీపం సన్నిధి దగ్గర అన్న అర్థాలు చెప్పుకోవచ్చు

రాయలవారు తన దొరతనమేమి అనంగా యేంది తన అంకృవంకృలకు యెవరు వచ్చేరు రాని వారిని మేము యేమి జెప్పేము 28 8

కడ్డికవళములు ఇది కన్నడంలో కడికవళ అని నేడు అతి విరళంగా ప్రయుక్త మవుతోంది కబళం అన్నపదమే కవళం గా వాడబడింది వబయోరభేద కవళం అంటే ఆహారం అని అర్థం కడి అన్నా కబళం అని నైఘంటికార్థం ఈ కడియే కడ్డి అయి ఉండవచ్చు రా వా లో గుర్రాలకు పెట్టే ఆహారానికి కడ్డి కవళములు అని ప్రయోగింపబడింది

ఆయా లాయం గుర్రాలకు కడ్డికవళములు పరామరశించేటట్టు 30 26

కానుక కప్పములు సామంతరాజులు రాజులకొసంగే పన్ను మరియు కానుకలకు కన్నడంలో కప్పకాణికెగళు అని ప్రయోగిస్తారు రా వా లో ఇది కానుక కప్పములు అని తారుమారు చేసి ప్రయోగింపబడింది

ఆ రాజ్యంలో వుండే స్వామికి కడమ రాజ ములో పెద్దలు బుద్ధిశాలులు బ్రాంహ్మలు యతీశ్వరులు మఠాధిపతులు రాజులు మొదలైన వారలందరున్ను కానుక కప్పములు కొంచుబోయి స్వామికి సమర్పించి వస్తావున్నారు 33 24

ఇక్కడ దేవునికి సమర్పించే కానుకలు అన్న అర్థంలో కానుక కప్పములు అని ప్రయోగింపబడింది

ధాన్యదవనములు కన్నడంలో దవస మందే ఆహారానికి ఉపయోగించే బియ్యం రాగులు జొన్నలు సజ్జలు మొదలగునవి ధాన్య మందే పప్పుదినుసులు కందులు మినుములు మొ న నవ ధాన్యాలు తెలుగులో ధాన్య మందే వరిధాన ం మాత్రమేకాక నవధాన్యాలను కూడా తెలుగు నిఘంటువులు పేర్కొంటున్నాయి తెలుగులో నేడు దవసం అన్న పదం వినిపించదు అందువల్ల ధాన్య మన్న పదమే విస్తృతార్థంలో వాడబడుతోంది రా వా లో కన్నడంలోని అర్థంలోనే వాడినట్లు తెలుస్తుంది

వారి శీమలో మన తెగలవార్లు లోజొచ్చి మూడామడకు మూడామడ వుండ్డే గ్రామాదులు కొళ బెట్టేదిన్ని పాతరలు శోధించి ధాన్య దవనములు యెత్తేదిన్ని 59 2

**మాటపలుకులు** ఇది కన్నడంలో మాతుకతె అన్న పదబంధ సామ్యంతో ఏర్పడింది దీని సంభాషణ/మాట్లాడు అని అర్థం కన్నడంలో నిశ్చయం అన్న అర్థంలో కూడా మాతుకతె అన్న పదబంధాన్ని వాడు తారు నన్న మగన మదువె విషయదల్లి మాతకతె ఆయితు నా కూతురు పెళ్లి విషయంలో నిశ్చయం అయింది కాని తెలుగులో ఈ అర్థంలో మంచి మాట అన్న పదబంధాన్ని వాడుతారు

నూటి వక బంటున్ను వెయి ంటికి వక వండితుడున్ను లక్షకు వకడు వక్తుండై సభాస్థలిని మాటపలుకు లాడును 32 13

**వంబళం సారికెలు** కన్నడంలో సంబళ మందే జీతం అని సారిగె అందే రవాణా ఖర్చు అని అర్థం రా వా లో జీతభత్యా లు అన్న అర్థంలో పై పదబంధం ప్రయుక్తమైంది సారిగె అన్న పదం సారికె గా వ్రాయబడింది

అయా గుర్రాల రౌతులకు మావటీలకున్ను వంబళం సారికెలు కట్టడ జేసి 30 28

**కోటకొత్తళములు** కన్నడంలో కొత్తళ అందే బురుజు అని అర్థం తెలుగులో ఈ కొత్తళ మనే మాట వాడుకలో లేదు రా వా లో కన్నడ ప్రభావంతో కోటకొత్తళములు అని ప్రయోగింపబడింది

మంచిముహూర్తాన శంకుస్థాపనం జేశి వాస్తు పురుషుని నిలిప నగరికి స్థలం యేర్పరచి నగరున్ను దేవళమున్ను కోటకొత్తళములున్ను నవ ద్వారములున్ను ఏర్పరచి 10 3

**సర్వనామాలు**

కన్నడంలో అత అనేది దూరవర్తిని నిర్దేశించే ప్రథమ పురుష సర్వనామం ఈత అనేది సమీపవర్తిని నిర్దేశించే సర్వనామం తెలుగులో ఆది దీర్ఘం హ్రస్వమై డు ప్రత్యయం చేరి అతడు ఇతడు అన్న రూపాలు ఏర్పడుతాయి కాని రా వా లోని యాతండు అతగాడు అనేవి కన్నడ భాషా ప్రభావంతో వచ్చినవిగా శంకించవచ్చు

యీతండు మా స్వరూపం తెలిసినది యెట్టు అని జ్ఞాన దృష్టిని చూచి 7 13

ఆయన వద్ద గిండ్డి బెట్టుకవుండ్డగా అతగానికి యెదురులాహ అనే పేరు వచ్చెను 46 21

సంఖ్యావాచకాలు

సంఖా వాచకాల్లో కాలు ముక్కాలు అనే పదాలు కన్నడ ప్రభావంతో తెలుగులోకి వచ్చాయి సాధారణంగా ఇవి జడ వాచకాలకు మాత్రమే వాడు తారు కాని రా వా లో కాలు అనేది మనుష వాచక విశేషణంగా ప్రయుక్తమైంది

అర పేద కాలుపేద మనుమ లయినవారికి పోను రాను శక మా అని 42 26

పంద్రెండ్డు యేండ్లకు వౌళసారి మూడు ముక్కాలు ఘడియ 40 22

నూడు అనే పదం ప్రాచీన కాలం నుండి తెలుగులో ఉన్నా దీనికి బహు వచన సంఖ్యావాచక వి షణం చేరినపుడు బహు వచన ప్రత యం లు రాకపోవడం కన్నడ భాషా ప్రభావమని చెప్పవచ్చు

మున్నూరు 11 5 అర్నూరేండ్లు 1 1 యేనూరు యేనుగులు 3 5

తెలుగులో సంఖా వాచక విశేషణం బహువచనంలో ఉన్నప్పుడు దానికి సంబంధించిన నామవాచకం విశేష ం కూడా బహువచనంలో ఉంటుంది కాని రా వా లో ఏకవచనమే ప్రయుక్తం కావడం కన్నడ భాషా ప్రభావమే

షోదశ పాత్రలున్ను తామున్ను నిత్యసారిగా రెండామడ మూడామడ దూరం పోయి 49 10

కన్నడంలో నాల్కారు హత్తారు నూరారు సావిరారు అన్న ప్రయోగాలు చాల ప్రసిద్ధంగా ఉన్నాయి రా వా లో కూడా నాలుగారు ఘడియలు నాలుగార్లు దినములు వెయ్యారులు అని ప్రయోగించడం కన్నడ భాషా ప్రభావమే

నాలుగారు ఘడియలు ఆలోచన చేయగా (28 12

నాలుగార్లు దినములు వెనుక సరుదు స్థలాలు చూచే నిమిత్యముగా 36 5

జగన్నాయకులను పూజించ్చే అర్చకులకు వెయ్యాశరులు లంచ్చమిచ్చి 56 6

కారక ప్రయోగాలు

అపాదాన కారకంలో నుంచి అనే ప్రత యం కన్నడంలోని యింద ప్రత యం సామ్యంతో వచ్చింది

నిన్నుంచి కర్నాటకాన వళ నగరం కానున్నది 7 18 క నిన్నింద

మమ్మమంచి నీకు అయ్యే ప్రయోజనమున్ను 19 16 క నమ్మింద

సంప్రదాన కారకంలో కు ప్రత్యయం చేరినపుడు నగాగమం రాక పోవడం కన్నడ భాషా ప్రభావమని చెప్పవచ్చు

ఆ ఎమ్మట నిండు కొలువుకు వచ్చిన వారై 4 9 క ఓలగక్కె

విన్న కార ములన్నియు మనస్సుకు దెచ్చుకొని 22 5 క మనస్సిగె

సేతువుకు బోయి రామనాథుల దరిశించి 42 8 క సేతువిగె

కన్నడంలోని అల్లి అనే అధికరణార్థక ప్రత య సామ్యంతో రా వా లో అందు అనే ప్రత యం వాడబడింది

వళనాటి యంద్దున విశేషమైన బుద్ధిమార్గములుగా 28 18 క ఒందు దినదల్లి

అందునుండి శ్రీరంగపట్టం కోటకై చీలి 58 4 క అల్లింద

క్రియా రూపాలు

రా వా లో కొన్ని క్రియారూపాల్లో కూడా కన్నడ భాషా ప్రభావాన్ని స్పష్టంగా చూడవచ్చు కొన్నిచోట్ల ప్రధానక్రియలోను కొన్నిచోట్ల సహాయక క్రియలోను ఈ ప్రభావం పాక్షికంగా కనిపిస్తుంది కొన్ని క్రియా ప్రయోగాల్లో సామ్యత కనిపిస్తుంది

మించివచ్చు అధిగమించివచ్చు ఇక్కడ ప్రధానక్రియలో కన్నడ ప్రభావం కనిపిస్తుంది

అంతలో ఆ మొగలాయి గుర్రాలు ఆ మట్టున నిలువక వెంబడించ్చుక రాంగా గజపతివారు జూచి గుర్రాలు మించి వచ్చెను (53 18)

ఇడుకొను ఇది ఉంచుకొను పెట్టుకొను అన్న అర్థాలో ప్రయుక్తమైంది

జగడములో రౌతు రౌతున చంక్క నిడుకొని 55 10

గుర్రాని తొడల నిడుకొని 54 20

తిరుగాడు ఇక్కడ సహాయక క్రియలో కన్నడ భాషా ప్రభావం గోచరిస్తుంది

మనిషి సంచారం లేక తిరుగాడుతా ఉండేటందులకు 52 11

ఇక్కడ ఆడు అన్న సహాయక క్రియ కన్నడ భాషలో బాగా ప్రచారంలో ఉంది ఇది నేడు కన్నడ సరిహద్దు ప్రాంతంలోని తెలుగులో మాత్రమే వాడుకలో ఉంది

చేయు ఈ సహాయక క్రియ కన్నడభాషలోని మాడు అన్న సహాయక క్రియ సామ్యంతో ఏర్పడింది

విప్రవరుల దర్శనంబుజేసిన ఎంమ్మట 2 13 క దర నమాడి

రాయలవారికి విన్నపంజేసి 3 27 క బిన్నహంమాడి

త్రిరాత్రుళ్ళు వానముజేసి 77 26 క వానమాడి

కొన్ని అకర్మక క్రియల్లో కనిపించే కొను అన్న ప్రత్యయం కన్నడ భాషా ప్రభావంతో సామ్యం కారణంగా వచ్చిచేరింది

కృష్ణరాయలు రత్నకంబళిమీద కూర్చుండుకొని 12 14 క కూత్కొండు

బహువేగాన గురాన్ని యెక్కుకొని 53 20 క హత్తికొండు

కాలబోధలో శత్రర్థకంలో వచ్చే తా అనే ప్రత్యయం కన్నడ భాషా ప్రభావంతో తెలుగులో చోటు చేసుకుంది

ముద్రకర్తలు వొకటికొకటి కొదవలేకుండా నడుపుతావున్నారు 3 1

నూట యెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తావున్నది 3 2

క్రియావిశేషణాలు

కొన్ని క్రియా విశేషణాల్లో కన్నడ ప్రభావం కనిపిస్తుంది

వొంటిగా ఒంటరిగా ఇది నేటికీ రాయలసీమలోను తెలంగాణాలోని కొన్ని ప్రాంతాల్లో కన్నడ భాషా స్పర్శ ఉన్నచోట్ల వ్యవహరింపబడుతోంది

కోట వెలుపట వొంటిగాపోగా 26 25 క ఒంటియాగి)

యథావత్తుగా యథాతథంగా ఇది నేటి తెలుగులో ఎక్కడా వినిపించదు కన్నడంలో బాగా వాడుకలో ఉంది

స్వామివారు నిన్న రాత్రి నగరు శోధనకు బయలు వెరిసినట్టే యిచ్చ టికి విచ్చేసిన మార్గము తెలియక యథావత్తుగా నగరికిపోయి 27 6 క యథావత్తాగి

వాక్యనిర్మాణం

రా వా లో వాక నిర్మాణంలో సయితం కొన్నిచోట్ల కన్నడ భాషా ప్రభావం కనిపించడం విశేషం

తెలుగులో నామవాచకాల కనుగుణంగా క్రియల్లో కూడా ఏకవచన బహువచన బోధకత లింగప్రత్యయాలద్వారా వ్యక్తమవుతుంది ఇది వ్యతి రేకార్థంలో కూడా క్రియల్లో ప్రతిఫలిస్తుంది కాని కన్నడంలో ఇల్ల అనే వ్యతిరేకార్థక క్రియాప్రత్యయం లింగభేదం లేకుండా నామవాచకాలన్నిటికి చేరుతుంది ఈ ప్రభావం రా వా లో కొన్నిచోట్ల కనిపిస్తుంది

సామంత రాచకార్యములు విశేషములుగా లేదు 3 20 లేవు అని ఉండాలి

అలాగే పరిమాణార్థంలో కన్నడంలోని ఎల్లా అంతా అన్నీ అన్న ప్రత్యయ సామ్యంతో రా వా లో అంతా అన్న ప్రత్యయం ప్రయుక్త మైంది

ఆ నీతులంతా అప్పాజీ మొదలయిన వారల చేత లెస్సగా విని 20 11 ఆ నీతులన్నీ అని ఉండాలి

ఎల్లా అన్న కన్నడ ప్రత్యయమే రా వా లో సమస్తం అన్న అర్థంలో అనేకచోట్ల ప్రయోగింపబడింది

దుర్గములలో వుండే వాళ్లెల్లా జతనమై వున్నారనిన్ని విన్నపం చేయంగా 59 6 వారందరూ వారంతా

తనతో కూడ నడిచేవారెల్లా నడవండ్డా త క్కన వారెల్లా బారులో నిలువుడా 59 25 వారందరూ వారంతా

అభిప్రాయ ప్రకటనలో సరి అనే పదం కన్నడ ప్రభావంతో వచ్చింది

స్వామివారు ఆనతిచ్చిన కార్యం ఉచితమే సరి పెద్దలు ఏలిన రాజ ములు తొక్కి చూడవలెను 20 18

ఈ విధంగా రా వా లో అనేకాంశాల్లో కన్నడ భాషా ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది

— ० —

లిపికారులు మూలహస్త ప్రతులను ప్రతి చేస్తున్నపుడు కంటి తప్పు వల్లనో చేతి తప్పువల్లనో అప్రయత్నంగా ఎన్నో పొరపాట్లు చేస్తారు ఒక్కొక్కసారి గ్రంథం విలువ పెంచాలని పద్యాలు చేర్చడం గ్రంథాన్ని భక్తి భావంతో అందరూ చదివి ప్రయోజనం పొందాలని గంథ ప్రయోజనాన్ని సూచించడం మధ్య మధ్య ఆసక్తికరమైన కథలు కల్పనలు శ్లోకాలు ప్రక్షిప్తం చేయడం సహజమే అలాంటప్పుడు మూల ప్రతి స్వరూపమేదో ప్రక్షిప్త భాగాలేవో తెలుసుకోవడం కష్టమవుతుంది అప్పుడు మూలపాఠాన్ని కనుక్కోవడంలో గ్రంథ సంపాదనా శాస్త్రం చాల తోడ్పడుతుంది కాల క్రమంలో దోషభూయిష్ఠమైన ఒక గ్రంథాన్ని లబ్ధ సామగ్రి నుపయోగించి శాస్త్రీయంగా సంపాదించి దాని పరిశుద్ధ రూపాన్ని అంటే గ్రంథకర్త మూల పాఠ స్వరూపాన్ని పునర్నిర్మించడం గ్రంథ సంపాదన ముఖోద్దేశం"

—గ్రంథ సంపాదన శాస్త్రం

# రాయవాచకం–గ్రంథ సంపాదన దృష్టి

తెలుగులో నేటికీ అనేక గ్రంథాలు తాళపత్రాలపైనో కాగితపు హస్త ప్రతుల్లోనో దర నమిస్తాయి వాటిని శాస్త్రీయంగా పరిష్కరించి ప్రకటించడం గ్రంథ సంపాదన* ముఖోద్దేశం దాదాపు రెండు మూడు దశాబ్దాలకు పూర్వం గ్రంథ పరిష్కరణ అంటే కొంతమంది పండితులకు మాత్రమే తెలిసిన విషయంగా పరిగణింపబడేది కాని ఈ నాడు గ్రంథ పరిష్కరణ ఒక ప్రత్యేక మైన అధ్యయనాంశంగా గుర్తింపబడుతోంది ఇప్పటికీ గ్రంథ సంపాదనా పద్ధతులమీద శాస్త్రీయమైన చర్చ తెలుగులో జరగలేదనే చెప్పాలి కన్నడంలో మొట్టమొదట ఈ విషయాన్ని గురించి సవివరంగా పుస్తకరూపంలో లోకానికి పరిచయం చేసినవారు ఆచార్య డి ఎల్ నరసింహాచార్ గారు [1] ఈయన కృషి తర్వాత చాల మందికి స్ఫూర్తినిచ్చింది తత్ఫలితంగా అనేక గ్రంథాలు వెలువడి గ్రంథ పరిష్కరణకు సంబంధించిన శాస్త్రీయ విషయాలను సుబోధకం చేశాయి [2]

తెలుగులో గ్రంథ పరిష్కరణ దృష్టితో శాస్త్రీయంగా రచితమైన గ్రంథం ఒకటి కూడా ఇంతవరకు వెలువడలేదు జరిగిన కృషి కూడా

---

* ఇక్కడ సంపాదన అన్న పదం కూడా పరిష్కరణ అన్న అర్థంలో వాడబడింది

1 నరసింహాచార్ డి ఎల్ కన్నడ గ్రంథ సంపాదనె 1964

2 కలబుర్గి ఎం ఎం కన్నడ గ్రంథ సంపాదన శాస్త్ర 1972
లక్ష్మీనారాయణభట్ ఎన్ ఎస్ భారతీయ గ్రంథ సంపాదనె
సీతారామ జాగీర్దార్ కన్నడ సంపాదనె
కత్రె ఎస్ ఎం ఇండియన్ టెక్స్చ్యువల్ క్రిటిసిజమ్ ఇంగ్లీషు
సీతారామయ్య ఎం వి & శేషశాస్త్రి ఆర్ సం మణిహ 1982
హస్తప్రతిశాస్త్ర 1982 బి యం శ్రీ స్మారక ప్రతిష్ఠాన్ బెంగుళూరు నుండి

స్వల్పమే కాబట్టి గ్రంథ విషయాలను ప్రస్తావిస్తూ రాయవాచకాన్ని ఆ దృష్టితో పరిశీలించడం ఇక్కడ అప్రస్తుతం కానేరదు

పూర్వం గ్రంథ పరిష్కరణ అంటే అప్రకటితమైన ఒక గ్రంథానికి సంబంధించి లభ్యమైన హస్తప్రతులను ఒకచోట ప్రోగుచేసి వాటిలో తమకు తోచిన ఉత్తమమైన హస్తప్రతి నుండి ముద్రితప్రతిని తయారు చేసి దానికి ఇతర ప్రతుల నుండి దొరికిన పాఠాంతరాలను గుర్తించి ఉత్తమ పాఠాన్ని ఎన్నుకొని తక్కిన వాటిని అధస్సూచిక Foo No e లో ఇచ్చి గ్రంథ పరిష్కరణ భారాన్ని తగ్గించుకొనేవారు తర్వాత గ్రంథ సంపాదన అనేది ఒక శాస్త్రంగా పరిణమించింది హస్తప్రతులను వివిధ దృక్కోణాల నుంచి సునిశితంగా పరిశీలించి పరిష్కరించి ప్రకటించడానికి అనువైన మార్గమేర్పడింది

గ్రంథ సంపాదనకు గ్రంథకర్త స్వహస్తాక్షరప్రతి దొరికితే సంపాదకత్వం చాల సులభమవుతుంది కవి లేక గ్రంథకర్త స్వహస్తాక్షర ప్రతులు దొరకడం చాల అరుదు అలాంటప్పుడు లిపికారు Copy నికి కవి స్వహస్తలిపి సంపూర్ణంగా అర్థం కాకపోవచ్చు అప్పుడు కవి స్వహస్తప్రతికి లిపికారుని ప్రతికి మధ్య కొన్ని వ్యత్యాసాలు కలగటానికి అవకాశమేర్పడుతుంది ఈ వ్యత్యాసాల్లో లిపికారులు తమకు తెలియకుండా చేసేవి కొన్నయితే తెలిసి చేసేవి మరికొన్ని కవి భావించిన అర్థాన్ని గ్రహించక తాము ఊహించి మార్పులు చేయడం లిపికారులు ప్రధానంగా చేసే పొరపాటు తాళపత్రాలు బాగా దెబ్బతిన్నప్పుడు అనివార్యంగా కొన్ని మార్పులు చేయవలసి వస్తుంది ఇలాంటి సందర్భాల్లో సంపాదకుడు నిశిత దృష్టితో పరిశీలించి ఇతర ప్రతుల సహాయంతో పోల్చి చూసి సరియైన పాఠాన్ని నిర్ణయించి భిన్నపాఠాంతరాలను అక్కడికక్కడే అధస్సూచికలో ప్రదర్శిస్తూ పరిష్కరించడం శ్రేయస్కరం "ప్రతి నుండి ప్రతికి లిపికారుల మూలంగా వ్యత్యాసాలు ఏర్పడి పాఠం చెడిపోతుందనే విషయాన్ని మన ప్రాచీనులు గుర్తించారు ఆ వ్యత్యాసాలను దిద్ది సరిచేయవలసిన ఆవశ్యకతను కూడా వారు గుర్తించారు "3

3 చూ కన్నడ గ్రంథసంపాదనె (1964 పు 6

గ్రంథ సంపాదకుడు తాను గ్రంథ సంపాదనకు తీసుకొన్న గ్రంథానికి సంబంధించిన హస్త ప్రతులను బాగా పరిశీలించి పాఠాంతరాలను నమోదు చేయాలి అక్షరాల్లోను పదాల్లోను పంక్తుల్లోను కనిపించే వ్యత్యాసాలను అక్కడికక్కడే ఇవ్వాలి లుప్త ప్రక్షిప్త భాగాలు కూడా గమనించాలి ప్రక్షిప్త భాగాలేమైనా ఉంటే వాటిని అనుబంధంలో ఇవ్వడం మంచిది అక్కడొక పద్యం ఇక్కడొక పద్యం ఏదైనా అధికంగా ఉంటే అధస్సూచికలో ఇవ్వాలి "నాలుగు హస్తప్రతులు మన ఎదుట ఉండి పాఠ భేదాలున్నపుడు కవి స్వహస్త ప్రతి ఏదీ దొరకనప్పుడు కవి పాఠానికి సమీపమైన మాతృకను పాఠాంతరాల సహాయంతో పునర్నిర్మాణం చేయవచ్చు పాఠాంతరాలు లేకుండ పాఠదోషముందని తెలిసినపుడు ఆ దోషం లిపికారుని చేతి తప్పు వల్ల సంభవించిందని నిర్ధారించడం చేతను వ్యాకరణ ఛందశాస్త్ర పరిజ్ఞానంతోను సరియైన పాఠాన్ని ఊహ ద్వారా కనుక్కోవడం గ్రంథ సంపాదకుని ధర్మమని ఆధునిక గ్రంథ సంపాదన శాస్త్రం అంగీకరిస్తుంది "4 గ్రంథ సంపాదన ఇప్పుడు ఒక ఖచ్చితమైన శాస్త్రంగా పరిణమించింది ఆ శాస్త్ర నియమాలను కట్టుదిట్టంగా అనుసరించి మూలపాఠాన్ని చాలవరకు శుద్ధంగా నిర్ణయించడం సుసాధ్యం 5

ఏ గ్రంథానికైనా మూల మాతృక అయిన స్వహస్తాక్షర ప్రతి ఒకటి ఉంటుంది ఈ ప్రతికి కాలక్రమంలో అనేక నకలు ప్రతులు తయారవుతాయి ఈ నకలు ప్రతులకు మూలకర్త స్వహస్తాక్షర ప్రతికి చాల దూరపు సంబంధం ఉంటుంది మూలకర్త విరచిత మూలప్రతి నుండి రూపొందిన అనేక నకలు ప్రతుల పరంపరలో ఏదో ఒక ప్రతి ఆధారంగా మనకు దొరికిన ప్రతి లిఖితమై ఉండవచ్చు అప్పుడు లభ్యమైన హస్తప్రతుల ఆధారంతో వాటి మూలభూతమైన మాతృక స్వరూపాన్ని పునరచించడం అత్యవసరం

4 సీతారామయ్య ఎం వి కన్నడ గ్రంథ సంపాదనిగె బి ఎం శ్రీ యవర కొడిగె శ్రీ కంఠతీర్థ 1976 పు 190

5 బి ఎం శ్రీ నంబియణ్ణనరగళె (1946

హస్తప్రతుల స్వరూపాన్ని ఈ క్రింది విధంగా వర్గీకరించవచ్చు [6]

1 మూలప్రతి Au og aph

ఇది మూలకవి స్వహస్తాక్షరప్రతి ఇటీవలి కవుల స్వహస్తాక్షర ప్రతులు దొరకడం సులభం కాని ప్రాచీన కవుల స్వహస్తాక్షరప్రతులు దొరకడం చాలా కష్టం అప్పుడు మూలప్రతుల కివ్వవలసిన విలువను నకలు ప్రతులకే ఇవ్వవలసివస్తుంది ఈ నకలు ప్రతులాధారంగా మూలప్రతి స్వరూపాన్ని సిద్ధం చేయడానికి ప్రయత్నం జరుగుతుంది

2 ఏకైక హస్తప్రతి codex un cu

కొన్ని కావ్యాలకు అనేక హస్తప్రతులు దొరకకపోవచ్చు ఒక్కొక్కటి మాత్రమే దొరకవచ్చు ఇలాంటి సందర్భాల్లో దొరి న ప్రతి అయినా కవి స్వహస్తాక్షర ప్రతి కాకపోవచ్చు ఇది పరంపరాగత ప్రతులలో ఏదో ఒకటై ఉండవచ్చు అశుద్ధమైన ఇలాంటి ప్రతి ఆధారంగా గ్రంథ సంపాదన చేయడం చాల కష్టం దొరికిన ఒక్క ప్రతి కూడా నష్టం కాకుండా వెంటనే దాన్ని ముద్రించే ప్రయత్నం చేయాలి లేకపోతే దానికి కృత్రిమమైన ప్రతిని సిద్ధం చేసుకోవాలి పరంపరాగతమైన ఏకైక ప్రతులను సంరక్షించుకోడానికి ఈ రెండు మార్గాలు అనువైనవి వీటిలో సంపాదించి ప్రకటించడం ఉత్తమమైన మార్గం

3 మాతృక Exemp ar

మూల ప్రతి అలబ్ధమైనపుడు దానినుండి రూపొందిన అనేక లబ్ధ ప్రతులను పరిశీలించి వాటిమధ్య సంబంధాన్ని గుర్తించవలసి ఉంటుంది ఒక గ్రంథానికి అ ఇ ఉ అనే మూడు హస్తప్రతులు దొరికాయనుకొందాం అవి స్వతంత్రంగా మూలమాతృక నకలులై ఉండవచ్చు అలబ్ధ మాతృకను క అని భావిద్దాం అప్పుడు వాటిమధ్య సంబంధాన్ని ఈ క్రింది విధంగా చూపవచ్చు

---

6 నరసింహాచార్ డి ఎల్ కన్నడ గ్రంథ సంపాదనె 1964 పు 58

క

అ ఇ ఉ

క అనే మాతృక అలభ్యమైనపుడు దొరికిన మూడు ప్రతుల సహాయంతో మూల మాతృకను పునారచించడం సుసాధ్యం నకలు ప్రతులు ఈ విధంగా ఉండవచ్చు అ → ఇ → ఉ అంటే అ ప్రతి నకలు ఇ ఇ ప్రతినకలు ఉ సంపాదకునకు ఇ ఉ ప్రతులకంటె అ ప్రతి చాల ఉపయోగపడుతుంది అప్పుడు అ ప్రతి లబ్ధమాతృక క ప్రతి అలబ్ధ మాతృక హస్తప్రతుల పాఠవరిలనవల్ల వీటిమధ్య సంబంధం వ క్రమవుతుంది

4 పరంపరాగత ప్రతులు T an m ed ex

సాధారణంగా ఒక గ్రంథపు లభ్య హస్త ప్రతులన్నీ ఈ వర్గానికి చేరుతాయి ఒక ప్రతికి ఇంకొక ప్రతికి సంబంధం ఉండవచ్చు ఉండక పోవచ్చు అవి మూలప్రతికి సంబంధించిన వివిధ శాఖలకు చేరినవై ఉండవచ్చు వానిలో పాఠభేదాలను గుర్తించినపుడు ఒక నిర్ధారణకు రావడం జరుగుతుంది వివిధ వర్గాలకు చెందిన స్ఖాలిత్యాల సంఖ్య అత్యల్ప ప్రమాణంలో ఉంటే అవి గ్రంథకర్త స్వహస్తాక్షర ప్రతినుండి చాల దూరం ప్రయాణించలేదని చెప్పవచ్చు స్ఖాలిత్యాల సంఖ్య అధికంగా ఉంటే అవి ఇటీవల రచితమైనట్లు భావించవచ్చు అంటే గ్రంథకర్త స్వహస్తాక్షర ప్రతికి వీటికి మధ్య కాల వ్యవధి ఎక్కువ అని తెలుస్తుంది ప్రతినుండి ప్రతికి స్ఖాలిత్యాల సంఖ్య పరంపరాగతంగా పెరుగుతూ వస్తుంది ఇవి ఏవిధంగా చోటు చేసుకొంటాయన్నది తెలుసుకోదగిన విషయం స్ఖాలిత్యాలకు చాలవరకు లిపికారులే బాధ్యులైనప్పటికీ పాఠాంతరాలన్నిటికి వారే బాధ్యులు కారు దీనికి అనేక కారణాలున్నాయి 7

7 నరసింహాచార్ డి ఎల్ కన్నడ గ్రంథ సంపాదనె పు 63

4 మిశ్రమప్రతులు (Misch cod ces or con a ed ex

గ్రంథకర్త స్వహస్తాక్షర ప్రతినుండి నేరుగానో పరంపరాగతంగానో నకలైన ప్రతియొక్కప్రతి ఇటీవలి కాలంలో లిఖితమైన ఇతర ప్రతులకు మూల ప్రతిగా పరిణమిస్తుంది ఒక్కొక్కటి ఒక్కొక్క శాఖను నిర్మించవచ్చు ఒక శాఖకు చెందిన ఏదో ఒక ప్రతిని ఇంకొక శాఖకు చెందిన ఏదో ఇంకొక ప్రతితో పోల్చిచూసి ఒక లిపికారుడు రెండింటి పాఠాల్లో అక్కడ ఒకటి ఇక్కడి ఒకటి తీసుకొని అన్నీ చేర్చి మరొక ప్రతిని సిద్ధం చేయవచ్చు అప్పుడు అది మిశ్రమ ప్రతి అవుతుంది అయితే లిపికారునికి ఇలా చేయడం చాల కష్టం అందువల్ల మిశ్రమ ప్రతులన్నీ ఈ విధంగానే వచ్చి ఉండవు ఒక ప్రతిలోని కొన్ని పుటలనో కొన్ని భాగాలనో ప్రతి చేసి తర్వాత ఇంకొక ప్రతిలోని కొన్ని పుటలను కొన్ని భాగాలను చేర్చి వేరొక ప్రతిని సిద్ధం చేయడం సులభం ఈ విధంగా కూడా మిశ్రమ ప్రతులు తయారవుతాయి ఇంకా ఇవి అనేక విధాలుగా రూపొందవచ్చు

కాలక్రమంలో దోష భూయిష్ఠమైన ఒక గ్రంథాన్ని లబ్ధ సామగ్రి నుపయోగించి శాస్త్రీయంగా సంపాదించి దాని పరిశుద్ధ రూపాన్ని అంటే గ్రంథకర్త మూలపాఠ స్వరూపాన్ని పునర్నిర్మించడం గ్రంథ సంపాదన ముఖ్యోద్దేశం ఒకవేళ మూలపాఠ స్వరూపాన్ని యథాతథంగా పునర్నిర్మించడం సాధ్యపడకపోతే కనీసం మూల పాఠానికి దగ్గరగానైనా తీసుకుపోవచ్చు [8]

గ్రంథ సంపాదకుడు మూల పాఠాన్ని రచించడానికి చేసే కృషి చాలా అమూల్యమైనది అది కొంతవరకు మన సంస్కృతిని సంరక్షించే దృష్టితోను భవిష్యత్తులో ఇంకా ఎక్కువగా పాఠనష్టం కలుగకుండా చూసే దృష్టితోను కూడుకొని ఉంటుంది అతని కృషి సాహిత్య విమర్శకులకు అలంకార శాస్త్ర నిపుణులకు వైయాకరణులకు భాషావిజ్ఞానులకు నిఘంటు నిర్మాతలకు చాల ఉపయోగపడుతుంది

8 నరసింహాచార్ డి ఎల్ కన్నడ గ్రంథ సంపాదనె పు 67

రాయవాచకం చారిత్రక వచనగ్రంథం ఇది చారిత్రక పరిశోధకులకు భాషా శాస్త్రజ్ఞులకు అతి ముఖ్యమైన సాహిత్యాధారం దీని చారిత్రక ప్రాధాన్యతను భాషా వైవిధ్యాన్ని గుర్తించి శ్రీ జయంతి రామయ్య పంతులుగారు సంపాదించి ప్రకటించి మహోపకారం చేశారు తర్వాత ఇటీవల సి వి రామ చంద్రరావు గారు సంపాదించి సుదీర్ఘమైన పీఠిక వ్రాసి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తరపున ప్రకటించారు

ప్రాచీన కాలంలో ముద్రణా సౌకర్యాలు లేనందువల్ల లిపికారులు కవుల స్వహస్తాక్షరప్రతులను సంరక్షించే దృష్టితో వాటిని తాళపత్రాలమీద ప్రతిచేసి భావితరాల వారికి కానుక గా అందించేవారు ముద్రణా సౌకర్యాలు ఏర్పడిన తర్వాత తాళపత్రాలను సంపాదించి ప్రకటిస్తూ వచ్చారు ఇలా చేయడం వారికి ఆ గ్రంథంపై గల గౌరవాన్ని ఆసక్తిని గ్రంథ ప్రాధాన్యతను సూచిస్తుంది

లిపికారులు మూలహస్తప్రతులను ప్రతి చేస్తున్నపుడు కంటి తప్పువల్లనో చేతి తప్పువల్లనో అప్రయత్నంగా ఎన్నో పొరపాట్లు చేస్తారు ఒక్కొక్కసారి గ్రంథం విలువ పెంచాలని పద్యాలు చేర్చడం గ్రంథాన్ని భక్తిభావంతో అందరూ చదివి ప్రయోజనం పొందాలని గ్రంథప్రయోజనాన్ని సూచించడం మధ్య మధ్య ఆసక్తికరమైన కథలు కల్పనలు శ్లోకాలు ప్రక్షిప్తం చేయడం సహజమే అలాంటప్పుడు మూలప్రతి స్వరూపమేదో ప్రక్షిప్త భాగాలేవో తెలుసుకోవడం కష్టమవుతుంది అప్పుడు మూలపాఠాన్ని కనుక్కోవడంలో గ్రంథ సంపాదనా శాస్త్రం చాల తోడ్పడుతుంది

రా వానికి రెండు హస్తప్రతులున్నాయి [9] ఒకటి సంపూర్ణం ఇంకొకటి అసంపూర్ణం ఈ హస్త ప్రతులాధారంగా మొట్టమొదటిసారిగా జయంతి

---

9 ఇవి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు గవర్నమెంటు మ్యూజియం & పరిశోధనాగారంలో భద్రపరచబడి ఉన్నాయి సంపూర్ణ ప్రతి నెం 380 అసంపూర్ణ ప్రతి నెం 112

రామయ్య పంతులుగారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో 1914 లో ధారా వాహికగా ప్రకటించారు అనంతరం వీరే 1933 లో ఆంధ్ర సాహిత పరిషత్ప్రచురణగా పుస్తకరూపంలో ప్రకటించారు వీరు హస్తప్రతుల్లోని లిపని ఆధునీకరణం చేసి ముద్రించారు ఎక్కడ సవరించింది సూచించలేదు అంతే గాక ఉన్నదున్నట్లే ప్రకటిస్తున్నామని ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో పేర్కొన్నారు [0] విరామ చిహ్నాలు వీరే చేర్చారు విషయానుకూలంగా శీర్షిక లను నమోదు  చారు ఇంకా అక్కడక్కడ అనేకచోట్ల సవ ంచినట్లు తాళపత్ర ప్రతులను ముద్రిత ప్రతులను చూస్తే తెలుస్తుంది ఉదాహరణకు రెండు హస్త ప్రతుల్లోను గోశ్రీలమంద అని ఉంటే జయంతి రామయ పంతులు గారు గోవులమంద అని సవరించారు

పూర్వ కాలంలో గోవులను ధనంగా భావించేవారు శ్రీ అంటే ధన మని కూడా అర్థముంది ఒక వ క్తి అంతస్థును లెక్క కట్టవలసివచ్చినపుడు ముఖ్యంగా గోవులను పరిగణనలోకి తీసుకొనేవారు అందువల్లనే గోధనం అన్న అర్థంలో గోశ్రీ అని ప్రయోగించేవారేమో

ఇక సి పి రామచంద్రరావు గారు జయంతి వారి పాఠాన్నే మూలప్రతి Vu ga e) గా గ్రహించానని పీఠికలో పేర్కొన్నారు

౦ వా న్ని గ్రంథ సంపాదనా శాస్త్ర దృష్టితో చూసినపుడు మూల పాఠ స్వరూపం ఎలా మార్పులు చేర్పులకు గురయిందో తెలియగలదు ఇక్కడ రా వా న్ని నాలుగు కాండాల* క్రింద పరి లించడం జ గింది

1 హస్తప్రతికాండం  2 సంపాదనకాండం
3 స్థాలిత కాండం  4 లేఖనకాండం

---

10 ఆంధ్ర సాహిత పరిషత్పత్రిక (1924 మూడవ సంపుటం పు 11

* ఇక్కడ కాండం అన్న పదం కన్నడ గ్రంథ సంపాదన శాస్త్ర అన్న గ్రంథం నుండి స్వీకరించబడింది కాండం అంటే విభాగం అనే అరంలో ప్రయోగించబడింది

1 హస్తప్రతికాండం మనకు దొరకిన రా వా హస్తప్రతులు గ్రంథ కర్త స్వహస్తాక్షర ప్రతులు కావు ఇవి మూలకర్త స్వహస్తాక్షర ప్రతినో లేదా దాని నకలు ప్రతినో చూసి ప్రతిచేయబడ్డాయి సాధారణంగా ప్రతి చేస్తున్నపుడు లిపికారులు కొన్నిటిని ఉద్దేశపూర్వకంగా చేరుస్తారు కొన్నిటిని తప్పుగా గ్రహించి చేరుస్తారు కొన్ని భాగాలను విడిచిపెడతారు ఇలాంటివన్నీ మనకు రా వా లోను కనిపిస్తాయి

ప్రాచీన కాలంలో లిపికారులు తమవల్ల ఏదైనా పొరపాటు జరిగితే క్షమించమని సహృదయ పాఠకులను యాచించేవారు. తాను చూసిన విషయాన్ని తప్పులు లేకుండా వ్రాశానని తప్పులేమైనా ఉంటే అవి తనవికావని చెప్పుకొనేవారు [2] తాను కష్టపడి వ్రాసినదాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలని పడిన కష్టాలను వివరించేవారు అంతేగాక వ్రాసిన ప్రతిని ఎలా రక్షించుకోవాలో కూడా సూచించేవారు

ఒకే హస్తప్రతిని ఒకరు లేక అంతకంటె ఎక్కువ మంది ప్రతి చేసినపుడు ఒక్కొక్క ప్రతిలో దొర్లిన తప్పుల వైవిధ్యాన్నిబట్టి భిన్న పాఠ సంప్రదాయా లేర్పడుతాయి ఈవిధంగా భిన్న పాఠ సంప్రదాయాలు పొందిన హస్త ప్రతులు దొరికినప్పుడు మూల పాఠమేదై ఉండవచ్చనే సంశయం

---

11 బిందు దుర్లిఖిత విసర్గ పీఠికా శృంగవర్జిత పరభేద దూషణం
హస్తవేగ జవబుద్ధి పూర్వకం క్షంతుమర్హతి సమీక్ష్య సజ్జనా

12 యాదృశం పుస్తకం దృష్టం తాదృశం లిఖితం మయా
అబద్ధోవా సుబద్ధోవా మమ దోషో న విద తే

13 భగ్నపృష్ఠ కటిగ్రీవా బద్ధదృష్టిరధోముఖం
కష్టేన లిఖితం శాస్త్రం యత్నేన పరిపాలయ

14 పుస్తకం వనితావిత్తం పరహస్తం గతం గతం
అథవా పునరాయాతం జీర్ణం భ్రష్టాచ ఖండశ
తైలాద్రక్షేజ్జలాద్రక్షేత్ రక్షేచ్ఛిథిల బంధనాత్
మూర్ఖహస్తేన దాతవ్యమేవం వదతి పుస్తకం

సహజంగా కలుగుతుంది అప్పుడు సంపాదకులైనవారు వీటినన్నిటిని పరిశీలించి సంపాదనా శాస్త్రరీత్యా మూల పాఠ పునా రచనకుపక్రమించాలి రా వా హస్త ప్రతులను నిశిత దృష్టితో తులనాత్మకంగా పరిశీలిస్తే ఆ రెండింటి మధ్య లిపి or hography) లో కొన్ని వ్యత్యాసాలు కనిపిస్తాయి కాని వాటి మధ పాఠాంతరాలు అంతగా కనిపించవు ఈ రెండు హస్తప్రతులు ఒకే చోట దొరికినందువల్ల ఇవి రెండూ నూటిం తొంభై తొమ్మిది పాళ్ళు సాదృశ్యాన్ని కలిగినందువల్ల ఇవి ఒకే మాతృకను చూసి ప్రతి చేసుకొన్నవైనా కావాలి లేదా సంపూర్ణ పాఠం గల హస్త ప్రతిని చూసి అసంపూర్ణ హస్త ప్రతి లిఖితమై ఉండాలి ఈ హస్త ప్రతి ఎందుకు అసంపూర్ణంగా ఉందనేది ప్రశ్న కాదు హస్త ప్రతికారునకు పూర్తి చేసే ఆసక్తి ఉత్సాహం లేకపోయి ఉండ వచ్చు లేకపోతే ఏదో ఇలాంటి కారణమే అయి ఉంటుంది

మనకు రా వా నికి సంబంధించి వేరే హస్త ప్రతులు దొరకనందున ఏకైక హస్త ప్రతి ఆధారంగా ఈ కృతిని సంపాదించడం జరిగింది ఒక కృతికి కొన్ని హస్త ప్రతులే దొరకడానికి అది జనప్రియం కాకపోవడం సుల భంగా లభ ం కాకపోవడం ముఖ కారణాలుగా చెప్పకోవచ్చు వీటిలో రెండో కారణం రా వా నికి అన్వయిస్తుంది ఇప్పుడు దొరికిన ఈ ఏక మాత్ర హస్త ప్రతి మూల ప్రతి కాక శుద్ధ ప్రతి పరంపరాగత ప్రతి అయినా కావచ్చు లేకపోతే అశుద్ధ ప్రతి పరంపరాగత ప్రతి అయినా కావచ్చు కొన్ని ఏక మాత్ర హస్త ప్రతుల్ని శుద్ధ ప్రతి పరంపరాగత ప్రతులని అభ్యాస బలం చేత చెప్పవలసి వస్తుంది అయినా వీటిలో అనివార్య లేఖన స్ఖాలిత్యాలు అక్కడక్కడ ఉంటాయి

ఏకైక హస్తప్రతులు ఆధారంగా గ్రంథ సంపాదన చేయడం సాక్షులు లేని ఆత్మసాక్షి బలంచేత తీర్మానించేటువంటి ఒక బాధ్యతాయుత కార్యం ఈ అనిదారా ప్రతానికి వెరచి సంపాదనా కార్యక్రమాన్ని వదలివేస్తే ఉన్న ఒక హస్తప్రతి కూడా నష్టమైపోతుంది అందువల్ల దానిలోని భాషైక దోషా లను మాత్రం సరిదిద్ది క్లిష్టమైన పాఠాలను యథాతథంగా ఉంచి ముద్రించడం క్షేమకరం ఈ దృష్టితో చూసినపుడు శ్రీ జయంతి రామయ్య పంతులుగారి ప్రయత్నం మిక్కిలి ప్రశంసనీయం పంతులుగారి తర్వాత ఈ గ్రంథాన్ని

ప్రకటించిన డా సి వి రామచంద్రరావుగారు ఒక విద్వత్పూర్వకమైన పీఠిక వ్రాశారే తప్ప గ్రంథ సంపాదనలో మిక్కిలి శ్రద్ధ చూపలేకపోయారు వీరిద్దరూ గ్రంథ సంపాదన కార భారాన్ని శాస్త్రీయ దృష్టితో చూడలేదని చెప్పవచ్చు

ఇటీవల రా వా నికి కన్నడానువాదమని చెప్పబడుతున్న శ్రీకృష్ణ దేవరాయన దినచరి అనే గ్రంథాన్ని ఆచార్య ఎం వి సీతారామయ్యగారు బి యం శ్రీ స్మారక ప్రతిష్ఠాన్ తరపున 1983లో వెలుగులోకి తెచ్చారు

శ్రీకృష్ణదేవరాయన దినచరి రెండు విధాల మహత్వ పూర్వకమైన ప్రకటన

1 ముఖ్యంగా రా వా మూల పాఠ స్వరూపాన్ని తెలుసుకోవడంలోను రా వా హస్తప్రతుల మాతృక సంప్రదాయాన్ని గుర్తించడంలోను మనకు ఆధారమవుతుంది

2 తెలుగు కన్నడ కృతుల ఆదాన ప్రదాన ప్రక్రియను వివరించడంలో కూడా ముఖ్యాధారమైంది విజయనగర సామ్రాజ్యం కర్నాటక ఆంధ్ర రాష్ట్రాల మధుర బాంధవ్యానికి భద్రమైన పునాది వేసింది విజయనగర రాజులు కూడా ఏ ఒక్క భాషవైపు పక్షపాతం చూపనందువల్ల రెండు భాషలు మాట్లాడే ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నారు ఈ అభిమానమే తెలుగుకృతి కన్నడానువాదానికి కారణమైందంటే అతిశయోక్తి కాదు

కన్నడ శ్రీకృష్ణదేవరాయన దినచరిని రా వా తో పోల్చి చూసినప్పుడు రెంటి మధ్య ఉన్న వ్యత్యాసాలను తాత్త్విక దృష్టితో రెండు విధాలుగా గుర్తించవచ్చు

1 అనువాదం చేస్తున్నపుడు అనువాదకుడు చేసిన సంక్షిప్తం లేదా సంగ్రహానువాదం

2 అనువాదకుడు తన అనువాదానికి ఉపయోగించుకొన్న హస్తప్రతుల పాఠస్వరూపం

